రామచంద్రరావు, తేకుమళ్ల

క్షమార్పణము (సాంసారికనవల)

పిఠాపురము, 1926

Record no. 218

**SUNDARAYYA VIGNANA KENDRAM**
1-8-1/B/25/A, Bagh Lingampalli
Hyderabad – 500 044, Andhra Pradesh, India

## Bibliographic Record Target

రామచంద్రరావు, తేకుమళ్ల.

క్షమార్పణము (సాంసారికనవల) / తేకుమళ్ల రామచంద్రరావు గారిచే రచింపఁబడినది.- 1. కూర్పు.- పిఠాపురము : వేంకట పార్వతీశ్వరకవులు, 1926.

(4), 2, 299, (3) p. ;20 cm.

Record no. 218

Rāmacandrarāvu, Tēkumaḷḷa.

Kṣamārpaṇamu ( sāṃsārikanavala) / Tēkumaḷḷa Rāmacandrarāvu gāricē racimpam̐baḍinadi.- 1. kūrpu.- Piṭhāpuramu : Vēṅkaṭa
Pārvatīśvarakavulu, 1926.

(4), 2, 299, (3) p. ;20 cm.

Record no. 218

35 mm microfilm

Image placement: IA (IIA) IB IIB          Date filming began:

ప్రచారిణీగ్రంథమాల, ౪౪.

# క్షమార్పణము

(సాంసారికనవల.)

తేకుమళ్ల రామచంద్రరావు (బి. ఏ. [illegible]) గారిచే

రచింపఁబడినది.





మొదటికూర్పు.

ప్రకాశకులు

శ్రీ వేంకట పార్వతీశ్వరకవులు.

ఆంధ్రప్రచారిణీగ్రంథనిలయము,

పిఠాపురము.

[గ్రంథస్వామ్యసంకలితము] 1926. [వెల ౧-౮-౦.

పి ఠా పు ర ము.

శ్రీ విద్వజ్జన మనోరంజనీ ముద్రాక్షరశాల.

**1926.**

# ప్రధానపోషకులు.

మ. రా. శ్రీ పోతాప్రగడ బ్రహ్మానందరావుపంతులుగారు, ప్రొప్రయిటరు, సుజనరంజనీ ముద్రాక్షరశాల, కాకినాడ.

# రాజపోషకులు.

మ. రా. శ్రీ శ్రీమంతు శ్రీరాజా యార్లగడ్డ అంకినీడు ప్రసాద్ బహద్దరు బి. ఏ. గారు, చల్లపల్లిరాజాగారు, చల్లపల్లి.

" శ్రీరాజా యినుగంటి వేంకటసూర్యప్రకాశరావుగారు,

" శ్రీ కలిదిండి వేంకటరామరాజుగారు, భీమవరము.

" శ్రీ కొవ్వూరి సూర్యనారాయణరెడ్డిగారు, జమీందారు, కాకినాడ.

" శ్రీ కర్రి చినవేంకటరెడ్డిగారు, మర్చంటు, కాకినాడ.

" శ్రీ కొనాల చినవేంకటరెడ్డిగారు, ఆరవల్లి.

" శ్రీ ముత్యాల సుబ్రహ్మణ్యముగారు, రంగూన్.

" శ్రీ వనచర్ల సత్తెయ్యగారు, రంగూన్.

" శ్రీ బత్తుల బసవయ్యగారు, రాజమండ్రి.

" శ్రీ ఆకెళ్ల సూర్యనారాయణరావు పంతులుగారు, వకీలు, విశాఖపట్టణము.

" శ్రీ ఆకారపు వెంకన్నగారు, వర్తకులు, ఒరంగల్లు.

" శ్రీ ఆకారపు చెన్నయ్యగారు, వర్తకులు, ఒరంగల్లు.

" శ్రీ వెలగల గోవిందరాజుగారి కుమారులు వేంకటరె[illegible]గారు, ఇతిహాసతరంగిణీ గ్రంథమాలా సంపాదకులు, ఆరవిల్లి.

## రాజపోషకులు.

మ. రా. శ్రీ శ్రీరాజా వత్సవాయి వేంకట సుభద్రయ్యమ్మ జగపతి బహద్దరు జమీందారిణీవారు, తుని.

---

## పోషకులు.

మ.రా.శ్రీ దివాన్‌బహద్దరు కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తి నాయఁడుగారు, కాకినాడ.

,, శ్రీ వాడ్రేవు వేంకటరత్నము పంతులుగారు, పిఠాపురము.

,, శ్రీ ద్వారంపూడి రామారెడ్డిగారు, అనపర్తి.

,, శ్రీ ద్రోణంరాజు వేంకటరమణారావుపంతులుగారు, షా ఖాసాదారు, తణుకు.

,, శ్రీ సారంగు సోమసుందరరావుపంతులుగారు, బి.ఏ.ప్లీడరు, నరసాపురము.

,, శ్రీ మల్లెల శివరామకృష్ణయ్యగారు, ప్రొప్రయిటరు, రాయపూడి.

,, శ్రీ బందా సూర్యనారాయణపంతులుగారు బి.ఏ.యల్.టి. తణుకు.

,, శ్రీ పంచ్రాజు వీర్రాజుగారు, కాకినాడ.

,, శ్రీ కొప్పూర్వారి వేంకటరెడ్డిసోదరులు, పిట్టలవేమవరము.

,, శ్రీ కర్రి పల్లారెడ్డిగారు, మారుటేరు.

,, శ్రీ తేతల గంగిరెడ్డిసోదరులు, పెనుగొండ.

## పోషకులు.

మ.రా.శ్రీ దివాన్‌బహద్దరు పి. పరాంకుశము నాయఁడుగారు, రిటైర్డుస్పెషల్‌పోలీసుకమీషనరువారు, చెన్నపురి.

,, శ్రీ అగ్గి పెంటయ్యగారు, నరసాపురము.

,, శ్రీ టి. యల్. నరసింహారావుగారు, మారుటేరు.

,, శ్రీ చిర్ల అమ్మిరెడ్డిగారు, రంగూన్.

,, శ్రీ పులగం వేంకన్నగారు, మారుటేరు.

---

## సహాయులు.

మ.రా.రా.శ్రీ ఉదయరాజు వేంకటరంగారావు పంతులుగారు, దేశముఖ్ పర్ దేశపాండ్యా మటేవాడ, ఒరంగల్లు. (దక్కన్)

,, శ్రీ నేరెళ్ల నరసింహారాములుగారు, కలపవర్తకులు, ఒరంగల్లు, (దక్కన్.)

,, శ్రీ యాదగిరిశ అండు కంపెనీవారు, పుస్తకములవర్తకులు. ఒరంగల్లు, (దక్కన్.)

,, శ్రీ గుండా పుల్లయ్యగారు, వర్తకులు, ఒరంగల్లు, (దక్కన్)

,, శ్రీ ద్వారంపూడి వేంకటరెడ్డిగారు, అనపర్తి.

,, శ్రీ పాళ్యపు వేంకటాచలపండితులుగారు, ప్రొప్రయిటరు, శ్రీ సీతారాఘవవైద్యశాల, మైసూరు.

,, శ్రీ పింజల సుబ్రహ్మణ్యంచెట్టిగారు, వర్తకులు, నె 91. అన్నపిళ్లేవీథి, జి. టి., మదరాసు.

,, శ్రీ గంధి హనుమంతరావుగారి కుమారులు రామారావుగారు, వర్తకులు, అనకాపల్లి.

# అంకితము.

ఆంధ్రవిద్యాచతురులును

సంఘసంస్కరణాభిలాషులును

ఉన్నతవిద్యాపారీణులును

మా తండ్రిగారును

అగు

మహారాజశ్రీ తేకుమళ్ల రాజగోపాలరావు

బి. ఏ., ఎల్. టి., ఆర్. ఏ. ఎస్. గారికి

నాయీప్రథమనవలను

భక్తిపూర్వకముగ

నంకితమొనర్చుచున్నాను.

తేకుమళ్ల రామచంద్రరావు.

# ఉపోద్ఘాతము.

క్షమార్పణ మనునీనవల మదరాసుక్రిస్టియనుకళాశాలయందు దేశభాషాప్రబోధనాధికారులగు మ. రా. రా. శ్రీ తేకుమళ్ల రాజగోపాలరావు పంతులుగారి కుమారులును, కవితాసంపన్నులు నగు రామచంద్రరావుగారిచే రచింపఁబడినది. వీరు వయసుచే చిన్నవారయ్యును, వరణీయవిషయవివేకాదిసుగుణగణంబులచే నగ్రిగణ్యులై యాంధ్రభాషావిశారదులగు నాధునికకవిపండితుల యాదరాశీర్వాదప్రోత్సాహము బడఁబాత్రులైనారు. వీరు బి. యే. హానర్సుపరీక్షకుఁ జదువుచున్న విద్యార్థులైనను కవితారచనమునందలియుత్సాహము పురికొల్పుటచే నవనవోన్మేషవిలసితంబు లగు సహజభావములతో నీనవలను రచించియున్నారు.

ఇది రెండుమూఁడు కుటుంబములతో సంబంధించిన చరిత్రము. సంసారములలోఁ దఱచుగ సంభవించుచుండు సామాన్యపరివర్తనములే యిందు చక్కఁగఁ బొందుపఱుపఁబడియున్నవి. ఇందలిపాత్రముల భిన్నస్వభావములును, భిన్నగుణశీలవర్తనంబులును యథోచితముగ వర్ణింపఁబడినవి. దేశకాలపాత్రానురూపంబులగు ప్రవర్తనంబులును, పరివర్తనంబులును నిందు సమంజసముగ సమన్వయింపఁబడినవి. కవి చిన్నవాఁడయ్యును, మిగులలోకానుభవముగల ప్రాజ్ఞునివలె నిందలికథాభాగమును సక్రమముగఁ బచరింపఁజేసియున్నాఁడు.

ఈతఁ డిందు భాషావిషయంబునఁ బ్రాచీనగ్రాంథికపద్ధతిని మీఱియు, నాధునికవ్యావహారికపద్ధతికి జాఱక మాధ్యస్థ్యమును వహించి

యుండెను. ఇందు కవివచనములు చాలవఱకు గ్రాంథికములుగను, పాత్రసంభాషణములు కేవలము వ్యావహారికములుగను వ్రాయఁబడి యుండుటచే నిక్కవి యనురూపభాషారచనావసరంబున శ్రీ వేదము వేంకటరాయశాస్త్రిలవారు, కీ. శే. వీరేశలింగముపంతులుగారు మొదల్గువారి మతముల నవలంబించియుండె నని తోఁచుచున్నది. భాషావిషయమున నభిప్రాయభేదములమాట యెట్లున్నను స్వభావోచితవర్ణనావిలసితం బగునీగ్రంథము సర్వజనాదరణీయంబు గాక మానదని మాయభిప్రాయము.

శ్రీ తేకుమళ్లరామచంద్రరావుగారీగ్రంథమును రచించి మా యుద్యమమునందలి యభిమానముచే నీ "క్షమార్పణము" ను మా ఆంధ్రప్రచారిణీగ్రంథనిలయమునకు సర్వస్వాతంత్ర్యములతో నొసంగి మాకుఁ బ్రోత్సాహముం గూర్చినందులకు వారికి మేమెంతయుఁ గృతజ్ఞులమై యున్నాము. ఆంగ్లేయవిద్యార్థులయ్యును, మాతృభాషాభిమానధురీణులగు వీరింకను నిట్లే తమకవితావల్లికలను దిగంతవ్యాప్తములుగఁ జేయుచు భాషాసేవ యొనరించుటకై పరమేశ్వరుఁడు వీరికిఁ జిరాయురారోగ్యభాగ్యములం బ్రసాదించుఁగాక!

వేంకటపార్వతీశ్వరకవులు.

ఓం పరబ్రహ్మణే నమః.

# క్షమార్పణము

## మొదటి ప్రకరణము.

అది నవవసంతమునఁ బ్రాతఃకాలము. ఏలూరునం దొకవిశాలసౌధము వెనుక నున్న విశాలారామమునం దానవవసంతప్రభాత మత్యధికరమణీయమై యుండెను. భూమి కించుమించుగఁ బదునాఱుగుల యెత్తుననున్న వృక్షాగ్రములనుండి కాకులు కావుకావుమని సంభాషించుకొనుచుండెను. పిచ్చుకలు కొలకొలఁ గూయుచుఁ బరిపక్వఫలభాగములను బొడిచి పొడిచి ముక్కుల నింపుకొని కులాయములందలి తమతమపిల్లలకుఁ బెట్టుచుండెను. బాలభానుఁడు చెట్లసందులనుండి తన పసిండికిరణములను భూదేవికి నమస్కారబాణములో యనునట్లు సమర్పించుచుండెను. ప్రభాతమారుతము మెల్లఁగఁ జల్లఁగ వీచి శరీరములకును, హృదయములకును శాంతిని సౌఖ్యమును ప్రసాదించుచుండెను. తొలికులుకుల నిలుకడ యగుపచ్చిక నిశారమణి కానుకగా నొసంగిన క్రొమ్మించుబిందువులహారములతో నరుణకిరణముల నందందుఁ బ్రతిబింబించుచుండెను. ఫుల్లాంబుజమందిరములందు రేయెల్ల రేయనించి భాస్కరకరకాండవిఘట్టితము లయినయాసుమమందిరము లందలిపుష్పాసవములతో, గంధర్వకామినీబృందవిపంచికానాదంబుల నతిశ

యిల్లుజయఘోషములతో, నళినీసందోహము విజృంభించుచుండెను. సృష్టి యంతయు సుఖమయమై యున్నట్లు పొడకట్టుచుండెను. ప్రకృతి రామణీయక మంతయు నావిశాలారామమునందే మూర్తీభవించినట్లుండెను. ప్రకృతిరామణీయకము—ప్రభాతము—నవవసంతము—ఆనందము—ఇతరములగు నాలోచనల కక్కడ నెడ మేది ?

సృష్టి కంతకును నాయకుఁడు పురుషుఁడు; నాయకురాలు స్త్రీ. సృష్టివైచిత్ర్యమునందు మానవజాతికిఁ దావు లేకున్నచో సృష్టికిఁ బేరు లేదు. ఊరును లేదు. ప్రకృతిరామణీయకము దృక్శ్రవణప్రధానము. కాని మానవజాతిమనఃపరిభావప్రధానము. మానవుని యూహాలు, తలంపులు, ఆలోచనలు—ఇవి యన్నియు, ప్రకృతిరామణీకమునకు సంస్తవనీయము లగుపదార్థములు. మానవునియం దెవ్వని కిచ్ఛయుం డదో, మానవునిహృన్మానసముల నెవ్వఁడు సన్మానింపఁడో, సృష్టివైచిత్ర్యములందు మానవసృష్టి కెవ్వఁ డగ్రస్థానము నీయఁడో, ఇంతేల, మానవునిపలుకులయందు, వేషమునందు, నటనయందు, శాంతియందు, సుఖమునందు, దుఃఖమునందు ఎవ్వఁడు భగవంతునిబుద్ధిపరిభావముయొక్కప్రతిబింబమును జూడఁడో, వాఁడు సృష్టిలో దేనినిగూడఁ బ్రేమింపఁజాలఁడు. వానిజీవితము కాననసుమము; సముద్రశుక్తికము.

అట్టైన మన యీప్రకృతప్రకృతిసౌందర్యమున నెవ్వరిజీవితము మిళితమై యున్నది ? ఎవ్వరిసుఖదుఃఖాదులయందు మనము పాల్గొనవలయును ? పాఠకమహాశయా ! అటు చూడుము. ఈతోఁటచివరఁ గ్రొత్తగఁ జిగుర్చుచున్న యాబాలరసాలమునకు నిన్నసాయంతనము తోటమాలి కట్టినకుదుటిదగ్గఱఁ గుర్చీపైఁ గూర్చుండి పుస్తకమును జదువుచున్న యాబాలికను జూడుము. ఆచిన్నదానిపేరు హైమవతి;



వయస్సు పదునొకండుసంవత్సరములు. కడచినసాయంతనమే ఆమె జనని తల దువ్వి, జడ వైచి, మల్లెపూవులదండ నునిచినది. రాత్రి నలఁగిపోయి కురులు చదునుగ లేకున్నను చూచువారికి హృదయాకర్షకములై యుండెను. తెల్లనితెలుపు, గుండ్రనినెమ్మొగము, ముద్దుమూటగట్టు నెన్నుదురు. తెల్లనిపరికిణీయు, తెల్లనిచొక్కాయును దొడిగికొని హైమవతి సాక్షాత్కరించిన తదారామదేవతవలె నుండెను.

చేరువనున్న పంపరపనసచెట్టుక్రిందికొమ్మపైఁ గాళ్లాడించుచు హైమవతిని దదేకదృష్టితోఁ జూచుచు కృష్ణరావను నొకబాలుఁడు కూర్చుండి యుండెను. ఆతనివయస్సు సుమారు పదునేడేండ్లు. ఆకుపచ్చని నల్లగళ్ళలాగు, తెల్లనిచొక్కా, క్రాపు చేసి ప్రొద్దుననే దువ్విన జుట్టు, చామనిచాయరంగు, సాధారణపుటొడ్డుపొడుగులు గలశరీరము; ఇది యాపిల్లవానిరూపు. తదేకదృష్టితో, ఆలోచనాపూర్వకములైన కన్నులతో, హైమవతివంకనే యాతఁ డెడతెగక చూచుచుండెను.

ఏలూరునందు పేరెన్నికఁ గన్నవారిలో వెంకటప్పయ్యగారు, ఒకరు. ఆయనకొమార్తె హైమవతి. హైమవతితల్లి సుందరమ్మ. ఈమెనుగూర్చి చెప్పవలసినది యిఁక ముందు విస్తారముండుటచేత, నీమె చాలచెడ్డదనియు, నెఱజాణ యనియు, మందులమారి యనియు మాత్రమే ప్రస్తుతము చెప్పెదను. హైమవతి కొకయక్క కలదు. ఆమెపేరు వీరమ్మ. ఆమెకు జరుగవలసినకార్యము లన్నియు జరిగినవి గాని "అంగట్లో అన్నీఉన్నాయి అల్లుడినోట్లో శనుంది" అనునట్లు, ఆమెభర్త దేశాంతరగామియై పోవుట తటస్థించెను. అప్పటినుండియు నామె పుట్టినింటనే యుండి తనతల్లి నేర్పినదుర్విద్య లన్నియు నామూలాగ్రముగా నభ్యసించి తల్లికన్న నేకుమడుఁగు లత్యధికయే యనిపించుకొనుచుండెను. ఇది వెంకటప్పయ్యగారిసంసారము.

వెంకటప్పయ్యగారి కొక్కతే చెల్లెలు కలదు. ఆమెపేరు శేషమ్మ. ఆమెయత్తవారియూరు కాకినాడ. ఆమెభర్తపేరు నాగభూషణముగారు. నవీనాచారము ననుసరించువారిపై ఆయనకుఁ గొంతవఱకు సానుభూతి లేకపోలేదు. కాని, పూర్వాచారపారీణులలో నగ్రస్థానము నలంకరింపఁబడగిన మహానుభావుఁడు. అయినను శాస్త్రానుభవప్రసిద్ధములు కాని పిచ్చినమ్మకము లాయనవద్ద లేవు. ఈదంపతులకు, ఒక్కఁడే కుమారుఁడు. కూఁతుండ్రు లేరు. ఆకుమారుఁడే కృష్ణరావు. అతనికిఁ బదునేడువత్సరములవయస్సు. ఇంటర్మీడియేటుతరగతియందు కాకినాడలోనే చదువుచుండెను. ప్రస్తుతము శేషమ్మయు, కృష్ణరావును వేసంగిసెలవులలో, ఏలూరునకు వచ్చి యుండిరి.

చిన్నప్పటినుండియు, కృష్ణరావునకు హైమవతిపై ననురాగముండెడిది. కాని, కృష్ణరావునకుఁ బదునాఱవయేఁడు వచ్చువఱకును, నీయనురాగము మోహముగఁ బరిణమింపలేదు. చిన్నప్పుడు వారిద్దఱును గలసి మాటలాడుకొనెడివారు. దొడ్డిలోనిపెద్దరుద్రాక్షచెట్టుకొమ్మకు, ఉయ్యాల వేసికొని హైమవతి కృష్ణరావులు, ఊఁగెడువారు. హైమవతి పడిపోకుండునట్లు కృష్ణుఁడు జాగ్రత్త తీసికొనెడివాఁడు. హైమవతిశరీరమునకు నొప్పి కలుగకుండు మంచిస్థానమును హైమవతి కిచ్చి నొప్పిపెట్టుస్థలమునఁ దాను కూర్చుండి ఉయ్యాలపై నూఁగుచుండెడివాఁడు. తాను నొప్పికిఁ దాళలేనప్పుడు హైమవతిని దనయొడిలోఁ గూర్చుండఁబెట్టుకొని యూఁగెడివాఁడు. ఇది యంతయు కృష్ణరావునకుఁ బన్రెండవయేఁట జరిగినసంగతి.

హైమవతి బొమ్మరిండ్లు కట్టుకొనునప్పుడు, ‘‘అబ్బే, నీచెయ్యంతా మట్టవుతుందే, హైమా! నేను కట్టిపెడతానుండవే’’ అని కృష్ణరావు బొమ్మరిండ్లు కట్టిపెట్టెడువాఁడు. తోడిబాలికలు కట్టుబొమ్మరిండ్లకన్న కృష్ణరావుబొమ్మరిల్లే సొంపుగా నుండెడిది. వారిని జూచి హైమ పరిహాసము చేసెడిది. ‘‘మాబావబొమ్మరిల్లేబాగుంది. ఇదుగో! ఇక్కడ మేడ. ఇవి మెట్లు. ఇలా ఎక్కి మేడమీఁది కెళ్ళి పడుకుంటాం — కాదుబావా? మనమిద్దరం మేడమీఁదుందాం. వీళ్ల నెవళ్లనీ ఎక్కనియ్యొద్దు’’ అని హైమవతి తనకాలు మెల్లఁగా నెత్తి కట్టినబొమ్మరింటి మేడమీఁద పెట్టఁబోయెడిది. అప్పుడు కృష్ణరావు ‘‘హైమా! కాలు పెట్టకమ్మా. కాలు పెడితే అంతా విరిగిపోతుంది. కాలు తియ్యి’’ అనుచుండెడివాఁడు. హైమ యెత్తినకాలు భూమిమీఁదఁ బెట్టకుండఁగనే రెండవకాలిమీఁద గిఱ్ఱుగిఱ్ఱునఁ దిరుగుచు ‘‘బావ కట్టినబొమ్మరిల్లు బాగుంది. సుబ్బమ్మది బాగుండలేదు. సావిత్రిది బాగుండలేదు’’ అనుచు, పాటలు పాడుచుండెడిది. ఇంటిలోనికిఁ బోయి తనతల్లితోడను, తనతల్లితో రాచకార్యము చేయవచ్చిన యిరుగుపొరుగుస్త్రీలతోడను బావకట్టినబొమ్మరింటిసంగతి చెప్పి, వారిని దీసికొనివచ్చి చూపి యానందింపఁజేసెడిది.

మఱొకప్పుడు తనబలమును హైమకుఁ జూపుటకై కృష్ణరావు తనయెడమచేతిపై హైమను, కుడిచేతిపై నింకొకపిల్లను, ఎక్కించుకొని చేయి వంచకుండనే దొడ్డిచుట్టును ద్రిప్పెడువాఁడు. కృష్ణరావునకు హైమన్నిహితురాండ్రన్న నిష్టము లేదు. కాని తనబలము హైమకుఁ జూపు టెట్లు? అందువలనఁ దనయిష్టానిష్టములను బాటింపక చేతులపైఁ గూర్చుండఁబెట్టుకొని వారిని దొడ్డిచుట్టును కృష్ణరావు త్రిప్పెడివాఁడు.

వారు దాఁగిలిమూఁత లాడుకొన్నప్పుడు హైమ దొంగ యైనచోఁ దన్ను హైమ పట్టుకొనునట్లు చేసికొని కృష్ణరావు మరల హైమను బట్టుకొనక యేసుబ్బమ్మనో, సావిత్రినో, చంపకమునో పట్టుకొనెడివాఁడు. వారలకుఁ గనుపడకుండ హైమను దాఁచెడివాఁడు.

ఇంటియందు హైమ బావవిస్తరియందుతప్ప అన్నము తినెడిది కాదు. ఏమైనను, తినెడువస్తువు తన కిచ్చినచో "బావ కేదీ?" అని యడిగెడిది. ఇయ్యకపోయినయెడలఁ దనదానిలో, అధమము మూఁడవ వంతైనను బావ కిచ్చెడిది. పడుకొనునప్పుడు బావపరుపే తనకుఁ గావలయునని పంతము నెగ్గించుకొనెడిది. బావయుఁ దానును బండుకొనెడివారు.

బాలబాలికలవిధమును, వారినిష్కపటానురాగప్రదర్శనమును, గన్నులారఁ గాంచి యానందాంభోధినిమగ్నమానసులుగానివా రెవ్వరు? వారిని జూచినవారందఱును సీతారాము లనియు, పార్వతీపరమేశ్వరు లనియు, భామాకృష్ణు లనియు, సావిత్రీసత్యవంతు లనియు, సుభద్రార్జును లనియుఁ బరిపరివిధములఁ బలుకుచుండెడివారు. "వీళ్లిద్దరికీ ఈడూ జోడూను; అమ్మాయి అదృష్టవంతురాలైతే కృష్ణుణ్ణే చేసుకుంటుంది" అనునుడువులు వినని దినము వారిద్దరును గలసియున్నప్పుడెప్పుడును లేదు.

కాని, వారితల్లిదండ్రులయాలోచనలు వివాహమువిషయమునకు మరలనేలేదు. హైమవతి చిన్నపిల్లగ నున్నప్పుడు "ఏమోపెళ్లి ఈడు రానియ్యండి" అనియు, కొంచెము, ఎదిగినవెనుక "ఎవరిముఖమున నెట్లువ్రాసిన నట్లగు" ననియు, అడిగినవారికిఁ దల్లిదండ్రులు జవాబిచ్చువారు. వారివివాహమువిషయమై యెవ్వరును శ్రద్ధపుచ్చుకొనలేదు. మీఁదుమిక్కిలి యాలోచింపనులేదు. ఆలోచింపఁ బ్రయత్నింపనైన లేదు.

కాలచక్రము తిరుగుకొలఁదిని కృష్ణరావునకు హైమపై గాఢానురాగము కలుగఁజొచ్చెను. నిష్కపట మగునాతనిబాల్యప్రేమ క్రొత్తరూపమును దాల్పఁజొచ్చెను. హైమ యతనికి మునుపటిహైమ కా



దు. తనభవిష్యజ్జీవితమునకుఁ బడవవంటి దని యాతనిమనమునఁ దోఁచెను. హైమ యెవరు? కృష్ణరావునకు మేనమామకూఁతురు. లోకమునందుఁ బ్రధానాంశములలో మేనరిక మొక్కటి. అట్టిసమయమున హైమపై కృష్ణరావునకు పరిణయవాంఛ జనించుట విచిత్రము కాదు.

కృష్ణరావు, ఇంటర్మీడియేటుపరీక్షకుఁ జదివి వేసంగులకు, ఏలూరు వచ్చి యుండెను. వయసు పదునేడేండ్లు. మునుపటిపండ్రెండేండ్ల బాలుఁడు కాఁడు. హైమ యాఱేండ్లబాలికయుఁ గాదు. కొద్దికాలములోనే హైమవతికిఁ బెండ్లిచేయవలసియుండెను. వరనిర్దేశము కాలేదు. కృష్ణరావుమనోభావము లెవ్వరికిని దెలియవు. అతఁడు వ్యక్తీకరింపను లేదు. దానిమాటయే ప్రపంచమున నాతఁడుతప్ప నింకెవ్వరును దలఁచుచున్నట్లులేదు.

చిన్ననాఁటి ఉయ్యాలలు, బొమ్మరిండ్లు, ఇప్పుడు లేవు. వానికి బదులు చతురంగమనునాట హైమవతీకృష్ణరావు లాడుచుండిరి. ఒక్కచిటికలో కృష్ణరావు హైమవతియాట కట్టెడువాఁడు. కాని హైమ ఓటమిచే విచారించు ననియో, కోపముతో నాటను వదలివైచు ననియో భయమంది కృష్ణరావు, ఆటను పెంచుచుండెడివాఁడు. ఆటయాడునప్పు డాతనిదృష్టి యంతయు హైమపైనేయుండును. ఆమెముఖలావణ్యమును గ్రోలుటయందే యాతనిమనము లీనమై యుండును. ఆమెదరహాసరోచులుదయించుటకే యాతఁడు సదా నిరీక్షించుచుండును. ఆమె చంచలవిలోకనమాలికలకే యాతఁ డుత్సుకతతోఁ గాచుకొనియుండెడివాఁడు.

హైమవతికిఁ బదునొకొండవయేఁడే. పురుషులకన్న స్త్రీలు ముందుగ బుద్ధి, అనుభవము మున్నగునవి సంపాదింతురు. కాని స్త్రీలయందు పండ్రెండవయేఁటఁగాని బుద్ధి వికసింపనారంభింపదు. పదు

నొకొండేండ్లహైమకు బావపై ప్రీతియనురాగమే, నిష్కపటప్రేమ యే, గాని వేఱొండులేదు. ఆమెకన్నులకు కృష్ణరావు మునుపటిబావ యే. ఇరువురును కొంచెము పెరిఁగిరి గనుక మునుపటియాటలు మును పటిపాటలు గాక చతురంగము మున్నగుక్రొత్తయాటల నాడుకొను చున్నారు. ఇది హైమహృదయస్థితి.

పూర్వపుటాటపాటలకన్న వారిప్పుడు వేఱొకవిధముగఁ గాల మును గడపుటను నేర్చికొనిరి. ప్రతిదినము భోజనానంతరము పగలు చతురంగము, రాత్రి భోజనానంతరము బావకొఱకమర్పఁబడినపఱు పుపైఁ దానును బరుకొని, బావను కథలు చెప్పుమనుటయు, ఆవేసంగి సెలవులలో దినకృత్యము లైనవి. కథలు వినునప్పుడుతప్ప వేఱుసమ యములందు హైమ మునుపటివలె బావవద్ద పండుకొనుట మానివైచి నది. కృష్ణరావు షేక్స్పియర్ వ్రాసినకథలు, వివిధములైనగాథలు, అనేకము లాంగ్లాంధ్రభాషలయందు చదివియుండెను. ఆకథలను హైమ కాతఁడు చెప్పుచుండెను.

కృష్ణరావుచేసెడి పనులయందును, పలుకు మాటలయందును, హైమకుఁ దనపైఁ బ్రేమ గలుగునట్లు ప్రవర్తింపవలయు నని యుద్దే శించి యుండెను. కావున హైమ యాతనిఁ గథలు చెప్పుమన్నప్పుడు ప్రణయపీఠికపైఁ దమసర్వమును ధారపోసి పరాజితులై, యాశాభం గము నొందినవారికథలును మున్నగువాని నాతఁడు చెప్పుచుండెను. ఆకథలను వినినహైనఁ దనపై హైమ జాలిగొనునేమో యని యాతని తలంపు. నాలుగైదుదినములు కృష్ణరా విట్టికథలను హైమకుఁ జెప్పె ను. హైమ విని యూరకుండెనే కాని కృష్ణరావు కోరినభావములను మాత్రము చూపలేదు. ఆమెకాకథ లర్థము కాలేదా? కృష్ణరావు చెప్పుటలో లోపము లొనరించెనా? లేక యర్థమును గ్రహించియు,



హైమ కప్పిపుచ్చుచుండెనా? కృష్ణరావుహృదయము పలువిధములఁ బోఁజొచ్చెను. హైమసంగతి యతని కర్థము కాలేదు. తనకథ లామె కు రుచింపలేదా? ఈమాట నాతఁడు నమ్మలేదు. రుచింపకున్నఁ గథల నాపూర్వాగ్రముగ నామె వినియుండదు. కథలనన్నింటిని ఆమె యవ గాహన మొనరించుకొనియే యుండును. కృష్ణరా వీవిషయమై పూర్తి గ నాలోచించెను. ఎట్టకేలకు „నేఁటిరాత్రి ఈసంగతి కనుఁగొనెదను. హైమనే యడిగి తెలిసికొందు" నని యాతఁడు తలపోసి కథాసమయ మునకు నిరీక్షించుచుండెను.

రాత్రి భోజనము లైనవి. చేతులు కడిగికొని కృష్ణరావు తన పరుపుపైఁ బరుండెను. వెంటనే హైమయుఁ బరువెత్తుకొని వచ్చెను.

„బావా, నాకుఁగూడా చోటియ్యవూ" అనుచు సందు చేసి కొని హైమవతి పరుండెను. ఆమెవీపుపైఁ జేయివైచి జడకొసను జు ట్టుచు, కృష్ణరావు విషాదకర మగునొకకథను జెప్పెను. దానిసారాంశ ము ప్రణయభిక్షమును వేడునొకయువకుని నాతఁడుప్రేమించినస్త్రీ విస ర్జించుట. తనకున్నచమత్కృతి నంతను, ఉపయోగించి కృష్ణరావు కథ ను ముగించెను. హైమవతి యొక్కనవ్వు నవ్వెను. కాని, ఆముఖము నందు తానప్పుడు వినినకథానాయకునియవస్థపై జాలిగొన్నట్లు స్పష్టము గఁ దెలియుచుండెను.

కృష్ణరా వంతటితోఁ దృప్తినొందలేదు.

„హైమా! చూచావా? పాపం కథలో వసంతుఁ డెంతదుఃఖ పడ్డాడో?"

హైమ—ఎందుకూ దుఃఖపడ్డం? పనీ పాటా లేకపోతే సరి?

కృష్ణరావు కొంచెము నిర్విణ్ణుఁడయ్యెను.

కృష్ణ-హైమా, అయితే వసంతుణ్ణిచూస్తే నీకు జాలెయ్యలేదూ?

హైమ—జాలీ? జాలెందుకూ? మృణాళిని కిష్టం లేకపోయింది. తనకొద్దు పొమ్మంది.

కృష్ణ—అయితే, హైమా, వసంతుఁడు తప్పుచేశాఁడా?

హైమ—ఏంప్రశ్నలు, బావా, ఎవరన్నా వింటే నవ్వుతారు. ఇంకోకథ చెప్పవూ?

కృష్ణరావున కేమియు నర్థము కాలేదు. హైమ వసంతునియవస్థను జూచి దుఃఖించు ననుకొనెను. మృణాళిని రాతిగుండెగలయువతి యని హైమ తిట్టుననుకొనెను. కృష్ణునియూహల నన్నింటిని నొక్కచిటికలో హైమవతి తబ్బిబ్బులు చేసినది. హైమపైఁ దనకున్నగాఢానురాగ మావంతయైన నామెకుఁ దెలియునా? కథలనుబట్టి యామె కృష్ణునిహృదయదాహమును—హృదయాగ్నిని—గ్రహింపనేలేదా? కృష్ణున కిది యొకయాశాభంగము. కాని, హైమపలికిన చిట్టచివరిపలుకుల కర్థమేమి? ‹‹ఏంప్రశ్నలు, బావా; ఎవరన్నా వింటేనవ్వుతారు?›› ఈ మాటలను కృష్ణరావు మరలమరలఁ దలపోసెను. అవును; హైమ తనయర్థమును గ్రహించినది. కాని తగుజవాబీయలేదు. ఎందువలన? తనపై ననురాగము లేకయా? చెప్పుటకు సిగ్గుచేతనా? ఎవరైన విందురేమో యనుభయముచేతనా? అయ్యును, ఆమె చెప్పవలసిన దేమున్నది? వసంతునిపై సానుభూతి చూపుటలోఁ దప్పేమున్నది?

ఇట్లు కృష్ణరావాలోచించుచుండఁగా ‹‹నాకు నిద్రొస్తూంది, బావా, వెళ్లిపడుకుంటాను›› అని హైమ లేవఁబోయెను.

కృష్ణ—హైమా, ఇవ్వాళ నాదగ్గిర పడుకోవూ!

హైమ—అమ్మ ఏమన్నా అంటుంది. కోప్పడుతుంది.

కృష్ణరావు మాఱుమాటాడలేదు. భయపడుచు, గద్గదస్వరముతో, ఆశాభంగము కలుగు నని యెఱింగియే యాతఁడు హైమ నడిగెను. హైమ వెడలిపోవుచు కృష్ణరావును చెంపపై నొకచిన్నదెబ్బ కొట్టి, ‹‹నువ్వుశుద్ధపిచ్చిబావవి›› అని వెడలిపోయెను.

ఆచిన్నదెబ్బయే కృష్ణరావునకుఁ బదివేలవరహాలవలె నుండెను. హైమ మృదుకరస్పర్శచే తనచెంప పవిత్రీభూతమైన ట్లాతనికిఁ దోఁచెను. ‹‹హైమ నిశ్చయముగ నాయనురాగమును గ్రహించినది. కాని నాపై దానికిఁ బ్రేమ కలదా?›› ఈప్రశ్నకు కృష్ణరావు తగినసమాధాన మీయలేకుండెను. హైమ తనయభిప్రాయమును కృష్ణరావునకు వెలిబుచ్చకుండ మాయ చేసినది. ఆమెకును కృష్ణరావు కథలవలననో, వయోవిశేషముచేతనో, ప్రణయమన నేమో బోధపడుచుండెను. కృష్ణరావు చెప్పుకథలను దదేకహృదయముతో నామె మనఃకుహరమునందు భద్రపఱచుచుండెను. ప్రణయాంకురము లామెహృదయమునందును మొలక లెత్తినవి; చిగిర్చినవి.

కృష్ణరావున కారాత్రి చాలసేపటివఱకును నిద్రపట్టలేదు. హైమవతిమాట లాతని కర్థము కాలేదు. ఆతనియాలోచన లనేకవిధములుగఁ దిరిగెను. ఎట్టకేల కాతఁ డొకనిర్ణయమునకు వచ్చెను. ‹‹రేపు హైమను నేనడిగెదను. అది నన్ను మనఃపూర్వకముగఁ బ్రేమించుచున్నదో లేదో అడిగి తెలిసికొందును.›› ఈయాలోచనయును నతనికి సరిగాఁ దోఁచలేదు. హైమ ‹‹నిన్ను నేను ప్రేమింపను›› అనినయెడల కృష్ణునిగుండెలు వ్రక్కలు కావలసినదేనా? కృష్ణుఁడు మరల నాలోచించెను. ‹‹ఒకవేళ నన్నుఁ బ్రేమింపకున్నచో, నేనిప్పుడే తెలిసికొనుట మాయిద్దఱకును మంచిది›› అని కృష్ణుఁడు నిర్ధారణ చేసికొనెను.

మెల్లమెల్లఁగ నిద్ర యాతని నావరించెను. కృష్ణుఁడు నిద్రించి తెల్లవారి లేచెను. కాల్యకృత్యములను దీర్చికొని క్రొప్పు దువ్వుకొని తోఁటలోని కేఁగెను. అప్పటి కప్పుడే హైమవతి [illegible]

ర్చిపైఁ గూరుచుండి నవల నొకదానిని జదువుచుండెను. తననిర్ణయమును కార్యరూపముగఁ బరిణమింపఁజేయుట కిదియే సమయ మని కృష్ణుఁ డనుకొనెను. చెంత నెవ్వరును లేరు. ఆబాలిక, తాను—దొడ్డి నలుగెలంకులను కృష్ణుఁడు చూచెను. తోఁటమాలి సాయంతనము మూఁడుగంటలవఱకును రాఁడు. దొడ్డిలోనికిం కెవ్వరును వచ్చుపనియును లేదు. తననిర్ణయమును హైమవతికిఁ దెలుపుట కంతకన్న మంచిసమయము వేఱొకటి కలుగునా?

కృష్ణుఁడు హైమవద్దకుఁ బోఁబోయెను. కాని క్షణములో నాలోచన మానివైచెను. ఆతఁడు సాహసింపలేకపోయెను. చేరువనున్న పంపరపనసచెట్టుక్రిందికొమ్మపైఁ గూర్చుండి యాలోచనానిమగ్నుఁడై హైమవంక తదేకదృష్టితో ఱెప్పవాల్పక చూచుచుండెను. హైమ తననవలపైనే దృష్టియుంచి చెట్టుపైనున్న బావనుగూడఁ జూడకుండెను.

ఇట్లు సుమా రొకయరగంటసేపిరువురును గూర్చుండిరి. ఎట్టకేలకు, కృష్ణుఁడు "చల్లకు వచ్చి ముంత దాపనేల" యని సాహసించి మెల్లఁగ నడుగు లిడుచు హైమవద్దకు వచ్చెను. బావను జూచుటతోడనే హైమ పుస్తకమును మూసివైచెను. కృష్ణుఁడు హైమచేతిని దన యెడమచేతితోఁ బట్టుకొని కుడియరచేతితో నామెయరచేతిపైఁ దట్టుచుఁ జూపు లామెముఖమునఁ గాక నేలపైఁ బడునట్లు చూచుచుఁ గొంతతడవు నిలుచుండెను.

హైమ—ఈపుస్తకంలో కథేమిటో తెలుసా?

కృష్ణ—ఏంపుస్తకం అది?

హైమ-(పేరుచెప్పి కథయొక్క సారాంశమును చెప్పుచుండెను.)

కృష్ణ—(ఇంచుమించుగ సాంతముగా విని, హైమయరచేతిని బూర్వమువలెఁ దట్టుచు) హైమా! నిన్నొకపరీక్ష వేస్తాను. దానికి



జవాబు చెపుతావా?

హైమ—ఏమిటది, బావా?

కృష్ణ—(హైమముఖమువైపునకుఁ జూచి) జవాబు చెపుతానంటే అడుగుతాను.

హైమ—ఇదేమిటి, బావా! మరి నాకు తెలిస్తే కాదూ చెప్పడం?

కృష్ణ—నీకు తెలిసినా తెలియదంటావు.

హైమ—ఒట్టు పెట్టుకుంటానుగా! తెలిస్తే చెపుతాను.

కృష్ణ—నీకు తెలుసును.

హైమ—తెలిస్తే తప్పకుండా చెపుతాను.

కృష్ణుఁడు ప్రశ్న వేయఁబోయెను. "నీవు నన్ను ప్రేమింతువా?" అని యడుగఁబోయెను. ధైర్యము చేయలేకపోయెను... ఎట్టకేలకు "ఒకటి కాదు రెండుప్రశ్నలు వేస్తాను." అనెను.

హైమ—ఏమిటవి?

కృష్ణ—చెఱుకులోంచి పానకం ఎలా తీస్తారు?

హైమ—అమ్మా, బావా! దీనికేనా ఇంతసాగదీయుచున్నావు? మాపుస్తకంలో ఐదోపాఠం అది.

అని ఆమూలాగ్రముగ హైమ వివరించెను.

కాని కృష్ణునకుఁ గావలసిన దాజవాబు కాదు. హైమవతిహృదయమునందలి ప్రణయమకరందము నెట్లు చవిచూచుట? అని యాతనిప్రశ్న. హైమజవాబుకొఱ కాప్రశ్న నాతఁ డడుగలేదు. తనకుఁ దాను దగిలించుకొనినచిక్కునుండి విడిపించుకొనుట కాప్రశ్న నాతఁ డడిగెను.

ప్రత్యుత్తర మిచ్చినవెనుక హైమవతి బావవంకఁ జూచి

“బావా! ఇది చెప్పానుగదా! సరిగా చెప్పానా? మఱి రెండోపరీక్షేమిటి?”

కృష్ణ—రెండోపరీక్ష ఇప్పుడొద్దు. సాయంత్రం అడుగుతానులే.

హైమవతి “సరే” నని తననవలను మరలఁ జదువుకొనుటకారంభించెను.

కృష్ణరావు, ఇంటిలోని కరిగెను. ఆతనికేమియును దోఁచలేదు. చేతులారఁ దనపనిని దానే పాడుచేసికొనెను. అరచేతిలోని పాయసాన్నమును బారవైచినాఁడు. కృష్ణరావు తనధైర్యహీనతకుఁ దన్నుఁదాను నిందించుకొనెను. పగిలిపోయినపాలకుండ యేడ్చినమాత్రము వచ్చునా?” అని సమాధానము చెప్పికొని సాయంతన మైనను ధైర్యసాహసములను సమయస్ఫూర్తిని దనకు వశీకృతములుగఁ జేసికొనవలెనని ఖండితముగ నాలోచన చేసికొని సాయంతనమునకు నిరీక్షించుచుండెను.

సాయంతనము ఆఱుగంటలు కొట్టఁబోవుచుండెను. ఇంటిలోనివారు,ఎవరిపనులు వారు చేసికొనుచుండిరి. జడలువేసికొన్నవారు కొందఱును, వేసికొనఁబోవువారు కొందఱును, జడ నైచికొని యింటిపని చేసికొనువారు కొందఱుగ నింటిలోనిస్త్రీలును, రాచకార్యము చేయ వచ్చినయితరస్త్రీలును గూర్చుండి యుండిరి. హైమవతి జడవైచికొని ముఖమును సబ్బుతోఁ గడిగికొని దొడ్డివైపు చిన్నగదిలో కిటికీవద్ద నిలువఁబడి గడియారపుబల్లపై వేయుగుడ్డ నల్లుచుండెను.

కృష్ణరావునకు సమయము దొరకినది. ఎట్లైనను హైమవతిని ఆసంగతినిగూర్చి యడుగవలెను. కృష్ణరావు గదిలోఁ బ్రవేశించెను. అడుగులు చప్పుడు గాకుండ హైమ వెనుకవైపున కేఁగి నిలుచుండెను.



హైమ తిరిగి చూచెను.

హైమ—ఏం, బావా, నాకు తెలియకుండానే వద్దామనుకున్నావా?

కృష్ణ—నువ్వల్లుతూన్నది ఏమిటి?

హైమ—గడియారపుబల్లమీద వేసుకొనేగుడ్డ.

కొంతసే పిరువురును మాటలాడకయే యుండిరి. కృష్ణుఁడు తలుపునకుఁ జేరగిలఁబడెను. హైమ కిటికీదగ్గఱ గోడకుఁ జేరఁబడి కుట్టుచుండెను. రెండునిముషము లైనతరువాత,

కృష్ణ—ఇలాంటిగుడ్డే నేను మొన్నొకటి చూశాను, మా క్లాసులో ఒకబ్బాయిఇంట్లో. నాకియ్యమంటే ఇయ్యనన్నాడు. చూశావా హైమా, నన్నీప్రపంచకంలో ప్రేమించేవాళ్లు ఎవ్వళ్ళూ లేరు. ఒక్క పిట్టపురుగన్నా లేదు.

హైమ—నేనూ, అలాగే అనుకుంటూ ఉంటాను. నన్నుమాత్రం ఎవరు ప్రేమిస్తారు? ఎవ్వరూ ప్రేమించరు. ఒక్కపిట్టపురుగన్నా ప్రేమించదు.

కృష్ణ—అలా అనకు హైమా. నిన్నెవ్వరూ ప్రేమించరంటావేమిటి? నేను నిన్ను ప్రేమిస్తాను. నామనఃపూర్వకంగా నిన్ను నేను ప్రేమిస్తాను...... నన్నే ఎవ్వరూ ప్రేమించేవాళ్లు లేరు. ఈవిశాల ప్రపంచకంలో నేనొక్కణ్ణి. నన్నెవ్వరు ప్రేమిస్తారు?

హైమవతి కృష్ణరావును అనుకరించెను. “బావా, నేను నామనఃపూర్వకంగా నిన్ను ప్రేమిస్తాను.” అని యాబాలిక పలికెను.

కృష్ణరావు సంతోషించెను. కాని వారిమాటలు వారివారి హృదయములకు జరిగిన సంభాషణగాఁ దోఁచలేదు. హైమ ప్రేమింతునని చెప్పెనే గాని యామెభావము నిజముగ నదియే యని నిర్ధారణ

చేయుటకు వీలు లేకుండెను. ముఖము మనస్సునకు అద్దమువంటిది. మనస్సునందలిభావములు మనకుఁ దెలియకయే ముఖఫలకమునందుఁ జిత్రింపఁబడుచుండును. కాని ప్రస్తుతము హైమవతిముఖఫలకముపైఁ బ్రణయచిత్రములు తాండవమాడలేదు. ఆస్థితియందు మఱొకవరుఁ డైనచో నేమి జరుగునో మనకనావశ్యకము. కృష్ణరావునకుమాత్రము, ఆపలుకులు తాపోపశమనము లగునంతటిశక్తి గలిగినవిగాఁ గన్పట్టలేదు. తలుపునకుఁ జేరఁబడినకృష్ణరావు, అట్లే యుండెను. కిటికీప్రక్కనున్న గోడకుఁ జేరఁబడిన హైమవతియు నట్లే యుండెను. వారిరువురును రెండుమూఁడునిముషము లట్లే యుండిరి.

"కృష్ణా, కృష్ణా" అని యింతలో కృష్ణునితల్లి పిలిచెను. ఉస్సురని యొక్కనిట్టూర్పు పుచ్చి కృష్ణుఁడు బైటకు వెడలెను.

సాంధ్యరాగము దిక్కుల నలముకొనుచుండెను. వివిధారావములతోఁ బక్షులు కులాయములకుఁ బరువెత్తెను. ఆరామమందంతటను గాఢధ్వాంత మలముకొనెను. శీతాంశునికిరణము లాధ్వాంతము నంతగా ఛేదింపలేకపోయెను. ఆరామమునఁ జీకటి; చెట్లకొనలపై వెన్నెల. ప్రణయలక్ష్మి యారామమున నేమూల దాఁగియున్న నెవ్వరు కనుఁగొనఁగలరు?

## రెండవప్రకరణము.

వేంకటప్పయ్యగారిభార్య సుందరమ్మకుఁ దనపెనిమిటివంకబంధువు లెవ్వరును వచ్చుట సరిపడదు. వేంకటప్పయ్యగారి కంతముఖ్యులైన బంధువులు విస్తారముగ లేరు. ఆయనచెల్లె లగు శేషమ్మమాత్రి



మెప్పుడప్పుడు వేంకటప్పయ్యగారు పిలువఁగా వచ్చుచుండెడిది. వచ్చి నెల తిరుగకముందే సుందరమ్మపోరు పడఁజాలక వచ్చినత్రోవను కాకినాడకుఁ బయనమయ్యెడిది. ఇప్పుడాసుందరమ్మకుఁ గూఁతురువీరమ్మ సహాయురాలుగా దొరకెను. ఆమె కొక్కశేషమ్మయే గాదు; ఇంటి కెవ్వరు వచ్చి నాలుగుదినము లుండుటయుఁ గిట్టదు.

ఈమాఱు శేషమ్మ కృష్ణరావు లరుగుదెంచి యించుమించుగ నెల కావచ్చినది. ఇఁక వారిని వెడలనడుపవలెను. ఎట్లు? శేషమ్మ చేసిన ప్రతికార్యమందును సుందరమ్మ తప్పులు పట్టుచుండెను.

సుంద.—ఇదుగో, ఈగిన్నె చూడవమ్మా. మీయిళ్లల్లో ఇలాగేనా పనిచేసుకుంటారు?

శేష.—ఏమిటాగిన్నెకు?

సుంద.—ఏమిటిలాగే ఉందిబతుకు. ఇంకా ఏమిటంటావేమిటి? కనపడ్డం లేదూ మచ్చ? ఒహళ్లింటికొచ్చి తేరగా తినడంమరిగి—పనంటే ఎలా ఒళ్లొంగుతుంది?

శేష.—నాయిష్టమొచ్చినట్లు చేశాను? మాఅన్నయ్యయింటికి రావడానికి నీసాహంత్ర మేమిటి? బోడిసాహంత్రం?

సుంద.—(చేతులుత్రిప్పుచు) మీఅన్నయ్య! అయ్యోరవిళ్లి! మీఅన్నయ్యసొంపూ నీసొంపూ చెప్పాలి. కూటికిలేనిగతిమాలినవాళ్లందర్నీ ఇంట్లో చేర్చి ఇల్లు గుల్లచేయించడానికి మీఅన్నయ్య. అయ్యో ఇది సంసారము. ఇలా గడుపుకుందామన్నయావే లేదు. యాగాయిదెబ్బలాటకోరుమూకని ఇంటినిండా చేర్చారుమీఅన్నయ్య! ఇంకా సిగ్గులేక చెప్పొస్తావు.

శేషమ్మసుందరమ్మలపోట్లాటకు, ఇంటిపెంకు లెగిరిపోవుచుండెను. వీరమ్మకూడఁ బోట్లాట కందుకొనెను. వీరమ్మసుందరమ్మలనష

మ శేషమ్మ నిలువలేకపోయెను. ఒకరిమాటలొకరికి వినఁబడుటలేదు. మధ్య వినఁబడినయొకముక్కపై గుఱ్ఱిక్క త్రిప్పకుండ నుపన్యాసము లిచ్చుటలో సందఱును బట్టపరీక్షయం దుత్తీర్ణులైనవారే. వేంకటప్పయ్యగా రింటనున్నయెడలఁ బోట్లాట నెట్లైన సద్దెడువాఁడే. కాని, ఆయన యానాఁడింట లేఁడు. పోట్లాడి పోట్లాడి వారే యూఁకుండవలసినవారైరి. పోట్లాటలందు మూఁడుసోపానములు గలవు. మొదటిది ప్రచండఝుంకారము, రెండవది మైదునిముషముల కొక్కొక్క మా ఉత్తరప్రత్యుత్తరములను బడయుట, మూఁడవది పండ్లు బిగించుకొని యొకరితో నొకరు ప్రసంగింపక ముఖములు చిట్లించుకొనుచుఁ గూర్చుండుట. ఒక్కొక్కప్పుడు చతుర్థసోపానముగూడ నుండును. అది గొప్పగొప్పపోట్లాటలయందు—కొట్టుకొనుట, న్యాయస్థానముల కెక్కుట, గడ్డివాములు తగులఁబెట్టుకొనుట, చేతబడులు చేయుట, మొదలగునవి. కాని శేషమ్మసుందరమ్మవీరమ్మలచిల్లరపోట్లాటకు మూఁడుసోపానములే. మొదటిరెండుసోపానములను దాఁటి యిప్పుడు వారందఱును మూఁడవమెట్టుపై సేద దీర్చుకొనుచుండిరి.

వేంకటప్పయ్యగా రింటికి వచ్చిరి. ఆయనకు కాళ్లకునీళ్లిచ్చువారు లేరు. ఆయన వీరమ్మను బిలిచెను. ఎట్లో కాళ్లకు నీరుతెప్పించుకొని ‹‹వీరమ్మా, ఏమన్నా పోట్లాడుకున్నారా ఏమిటి? ఇవ్వాళ?››

వీర—గిన్నెనిండా మసి అట్టేపెట్టిందిఅత్త. ‹‹కొంచెమైనా మసితోమగూడదా?›› అని అన్నానేటప్పటికి పెనేసుకు పోట్లాట ఆరంభించిరి.

వేంక—కాస్సేపు ఊరుకోమంటే ఊరుకోరు. వాళ్లేం ఎల్లుండూరా పుట్టింటూరా? ఎప్పుడది వచ్చినా? ఏదో దుఃఖపెట్టి పంపిస్తారు. ఇంటిఆడపడుచు అలా కన్నీరు పెట్టగూడదే అంటే వినదు. దానికేం ఇల్లు లేక వచ్చిందా? వాకిలి లేక వచ్చిందా?



అని వేంకటప్పయ్యగారు కాళ్లు కడిగికొని తువాలుతోఁ దుడుచుకొనుచు ‹‹శేషమ్మా, ఏంజేస్తున్నావు? ఇలారా.›› అని చెల్లెలిని బిలిచెను.

శేషమ్మ తనయన్నయెదుటికి వచ్చెను.

వేంక—ఏం? మళ్లీ పోట్లాడుకున్నారూ? ఇవ్వాళ?

శేషమ్మ ప్రత్యుత్తర మీయలేదు. పైకుబికివచ్చుకన్నీరు పైకి రాకుండ లోలోన నణఁచికొనుచుండెను. ఎట్టకేలకు ‹‹నేనుండలేను. అన్నయ్యా, రేపుప్రొద్దున బండికి కాకినాడ వెళ్లిపోతాను›› అని శేషమ్మ గద్గదస్వరముతో ననెను.

వేంక—దానిమాటల కేంలే; పెట్టేవాణ్ణి నేనుండగా నీకు దాంతో ఎందుకు? వేసంగిశెలవులు వెళ్లిందాకా అబ్బాయీ నువ్వూ ఇక్కడుండి తరువాత వెళుదురుగాని.

శేషమ్మ ఒప్పుకొనలేదు. మఱునాఁడుదయమునకుఁ బ్రయాణము నిశ్చయింపఁబడెను. కృష్ణరావునకు గుండెలలోరాయి పడినట్లుండెను. కాని యాతఁ డేమియును మాటలాడలేదు. హైమవంకమాత్రము పలుసార్లు చూచెను. హైమ తన్నుఁ బ్రేమించుచున్నదని యాతఁడనుకొనెను—లేదు, తెలిసికొనెను. కాని హైమను, దన్ను వేఱుచేయుటకే యీజగడమును భగవంతుఁ డుద్దేశించినట్లు కృష్ణరావునకుఁ బొడకట్టెను. కృష్ణరా వేమిచేయఁగలఁడు?

మఱునాఁ డుదయమున నేడుగంటలకు శేషమ్మకృష్ణరావులు కలకత్తామెయిలులో నెక్కి కాకినాడకుఁ బయనమై వెడలిరి. వేంకటప్పయ్యగారికుటుంబముమాత్ర మింటనిలిచెను.

బయలుదేఱఁబోవునప్పు డొక్కమాఱు కృష్ణుఁడు హైమవంకఁ జూచెను. ఆదృష్టియందు ప్రేమ, దైన్యము, తీవ్రత—ఈమూఁడు

గలసి యుండెను. హైమ యాదృష్టియందే తనమనోభావములను లీనము చేసికొనెను. హైమ కేమియును దోఁచలేదు. కృష్ణుఁడు తన్నెన్ని విధముల నానందింపఁజేసెనో యామె కిప్పుడు మనస్సునకుఁ దట్టెను. ఆతఁడు ప్రణయాలాపములతో నెన్నిమాటలు తన్నుఁ బలుకరించెనో హైమకు జ్ఞాపకము వచ్చెను. తనకుఁ గథలను చెప్పి, కథయందలివసంతునివిషయమై తనయభిప్రాయమును దెలిసికొనఁగోరినయారాత్రి హైమకు బాగుగ జ్ఞాపకముండెను. ఆరాత్రి కృష్ణునిహృదయతాప మెట్లుండెనో హైమ యూహించుకొనుచుండెను. కృష్ణుఁడు—బావ—వెడలిపోయెను. మరల నాతఁ డెప్పుడు వచ్చును? మరల వేసంగులవఱకును రాఁడు. ఈతలఁ పుదయించుటతోడనే హైమనేత్రగోళములనుండి రెండుకన్నీటిబిందువులు చెక్కిళ్లపైనుండి జాఱెను. తీవ్రశోకానలతప్తమైనవిధమున నామెకు నోరెండిపోయెను. నోటినుండియు ముక్కులనుండియు వేడినిట్టూర్పులు వెలువడెను. ఎవ్వరికిని దెలియకుండ ముఖము కడిగికొని తోఁటలో నవలను జదువుచు హైమ కూర్చుండెను.

శేషమ్మకృష్ణరావులు వెడలిపోయినవారముదినములకే వేంకటప్పయ్యగారికి పక్షవాతము; కీళ్ళనొప్పులజాడ్యమును బట్టుకొనెను. ఇంక నాతఁడు భార్యపైని, బెద్దకూఁతురిపైని ఆధారపడవలసినవాఁడాయెను. తనజీవితశేష మింక వారియౌదార్యముపై నాధారపడవలసియుండెను. ఈసంగతి సుందరమ్మవీరమ్మలకు సంతోషప్రదముగనే యుండెను. వేంకటప్పయ్యగారిజాడ్యమునకు దుఃఖము, తమయవిచ్ఛిన్నస్వాతంత్ర్యారంభమునకు నానందము. ఇఁక వేంకటప్పయ్యగారిని దమచేతిబొంగరమువలెఁ ద్రిప్పవచ్చును. తమమాటనే నెగ్గించుకొనవచ్చును. వేంకటప్పయ్యగారిమాటను ద్రోసిరాజనవచ్చును. ఇఁక లేనిదేమున్నది?



హైమకుఁ బెండ్లియీడు వచ్చినది. వ్యక్తురాలగుకాలము మాసములలోనికి వచ్చినది. హైమకుఁ దప్పక యొకటిరెండుమాసములలో వివాహము జరిగితీరవలయును. వరనిశ్చయ మింకను గాలేదు. వేంకటప్పయ్య యసమర్థుఁడైనను వివాహవిషయమై శ్రద్ధయు స్వాతంత్ర్యమును దన కున్నదనుకొనుచుండెడివాఁడు. ఒకనాఁడు వేంకటప్పయ్య భార్యను బిలిచి యీప్రస్తావము నారంభించెను.

సుంద—ఊరికే పనీ పాటా లేక ఏదో ఆలోచిస్తూ ఉంటారు. పెళ్లిచెయ్యాలంటే, మీరు లేవగలరా తిరగగలరా? మేమంతా ఏం జేస్తున్నాం? హైమకు పెళ్లియీడని మాకుమాత్రం తెలియదూ? చేత గాకపోయినా ఊర్కే అనవసరపుఆలోచలు చెయ్యమంటే చెయ్యగలరు.

వేంక—అది గాదే. దీనికి తిరగడమెందుకు? చేతగాకపోవడమేముంది?

సుంద—తిరక్కుండా, అలవకుండా సొలవకుండా అమ్మాయిమొగుళ్లలా దొరుకుతా రనుకున్నారు? చేశారే వెదకి వీరమ్మకు పెళ్ళి!

వేంకటప్పయ్య వీరమ్మ పాపము మంచిసంబంధమునే తీసుకొని వచ్చెను. కొన్నిదినములు కూఁతురును, అల్లుఁడును సుఖముగనే కాలము గడపిరి. అల్లుఁడు దేశాంతరగామి యగుటకుఁ గారణ మెవ్వరికిని దెలియదు. కాని యావిషయము వేంకటప్పయ్యయూహలకుఁ గుతారమువంటిదయ్యెను. ముందు తానుచేసినవివాహము కష్టముకుఁ బుట్టినిల్లయ్యెను. అది వేంకటప్పయ్యగారి కొకకళంకము. ఈకళంకము గలవాఁడు హైమకు మంచిసంబంధమును దెచ్చునని యేమినిదర్శనము?

ఈవిషయ మంతయు సుందరమ్మ తనస్వాతంత్ర్యసంరంభమున

కై వినియోగింపఁదలంచెను. ఈసంగతి వేంకటప్పయ్యగారికి దెలియ
కపోలేదు. తెలిసిమాత్రి మాయన యేమిచేయఁగలఁడు? సుందరమ్మ
చెప్పినదెప్పనకు వేంకటప్పయ్య యిట్లు ప్రత్యుత్తరమిచ్చెను.

వేంక—అది గాదే, వెదకడం ఎందుకు? మనకృష్ణుఁ డున్నాఁ
డు గాదూ? మేనరికము. వాఁడికిచ్చి చేద్దాము. ఒకకార్డుముక్కతో
అంతా తీరిపోతుంది.

సుందరమ్మ గుడ్లురిమి చూచెను. ఆమె యేకాళికాశక్తియో
యైనచో వేంకటప్పయ్య నొక్కపెట్టున విఱుచుకొని తినియుండు నను
టకు సందియము లేదు. ఒక్కక్షణ మట్లుచూచి తీవ్రస్వరముతో,

సుంద—నిర్భాగ్యపుదిక్కుమాలినసంబంధాలు తెస్తారు. మేన
రిక మని పేరు పెట్టి పిల్లదానిగొంతుక కొయ్యడానికి!

వేంకటప్పయ్య నిర్విణ్ణుఁ డయ్యెను. ఈసంబంధము భార్య కిష్ట
ములేదని యాతఁ డెఱుంగును. కాని పైప్రచండప్రత్యుత్తరము వచ్చు
నని యాతఁ డనుకొనలేదు. మేనల్లునిమాట చెప్పకుండఁ బోనిచ్చుట
కంటె నొక్కమా టదికూడఁ జెప్పి, మొదటినుండియు నిరాశ చేసికొ
న్నయీమాటను వదలివేయుద మని తలంచెను.

వేంక—నిర్భాగ్యపుదిక్కుమాలినసంబంధము ఎలా అయింది?
సాలుకు వెయ్యిరూపాయ లొస్తాయి. కాకినాడలో ఒకఇల్లుంది. పిల్ల
వాఁడా ఇంటర్మీడియేటుపరీక్షఇచ్చాడు. మరోరెండేళ్లల్లో బిఏ ప్యాస
వుతాఁడు. మనమ్మాయి కేంలోపమూ జరగదు.

సుంద—ఆ. అడుక్కుతిన్నట్టేఉంది. జానెడుబెత్తెడుకొంప. సా
లుకు వెయ్యిరూపాయ లేమూలకు? గోచీకన్నా చాలవు? ఇస్తానన్నం
దుకు చెప్పాలి!

వేంక—ఏమీ ఆయింటికి? మనయీపెద్దఇంట్లో సగముంటుం



ది. మనము రెండెకరాలలో ఇల్లు కడితే అంతా అలాగే కడతారా
ఏమిటి?

సుంద—అందరూ అలా ఎందుకు కడతారూ? అరగజంమేల
లోనే సౌధాలు నిర్మిస్తారు.

వేంక—సాలుకు వెయ్యిరూపాయలంటే ఏం? కృష్ణుఁడు రేపు
సంపాదిస్తాడు. వాళ్లనాన్న నాగభూషణం నెలకు డెబ్బయిరూపాయలు
తెచ్చుకుంటున్నాడు. అంతాలోటులేకుండా జరుగుతుంది. మనపిల్ల
సుఖపడుతుంది.

సుంద—మనపిల్లసుఖమే నాకూ కావలిసింది. వంటినిండా వం
టెడునగలు పెట్టుకొని మహాలక్ష్మిలా వుంటే హైమ బాగుంటుంది.
మీచెల్లెలుగా రేంబెడతారు? ఏమీలేదు. పెళ్లంటే పెళ్లి. అయిందం
టే అయింది. అంతకంటే ఏముంది? ఏమీ లేదు. నగలూ లేవు నా
ణాలూ లేవు. అదృష్టం అంతకన్నా లేదు.

వేంక—ఎవరిఅదృష్టాని కెవరు కర్తలు? కలిసిన సమంధం.

సుంద—ఇప్పుడు చేసి ఏంబావుకున్నామో ఇహముందూ అం
తే. కలిసిన సమంధమని పిల్లదాన్ని చెడగొట్టడం నాకిష్టం లేదు. మీరీ
విషయమై మాట్లాడొద్దు. మాఅన్నయ్యకు వ్రాసి మంచిసమంధం ఏ
దన్నా చూడమంటాను. వాఁడు చూస్తాడు. పెళ్లిచేద్దాం. లేవలేక తిరగ
లేక మీరేంజేస్తారు? ఇవ్వాళే మాఅన్నయ్యకు వ్రాస్తాను. మీరూక్షే
ఆవిషయమై ప్రస్తాపించకండి.

వేంకటప్పయ్య యింకను గొంచెము మాటలాడవలెననుకొనె
ను. అతనిమనస్సు వెలవెలఁబోవుచుండెను.

వేంక—పోనీ, హైమనేఅడగరాదూ?

సుంద—చిన్నపిల్ల, దానికేం తెలుసు? మనం జూసిచెయ్యాలి

గాని, దాన్నడగడ మేమిటి? మనకంటే దాని కెక్కువబాగా తెలుస్తుం
దా ఏమిటి?

వేంక—దానిమన స్సెలా వుందో తెలుస్తుంది.

సుంద—వెఱ్ఱి కుదిరింది రోకలి తలకు చుట్టమన్నాట్ట. అవతల నాకు పనుంది వెళ్ళాలి. చేసేదీ లేదు చెందేదీ లేదు, ఏమిటో కబుర్లన్నీ చెపుతారు. నాకు చావొచ్చిపడ్డది. కని పారెయ్యడం దప్ప మాటా, మంచీ స్వతంత్రం అవి నాకేమీ అక్కర్లేదు కాబోలు? అంతామీదే రాజ్యం. శక్తి ఉడిగి, శౌర్య ముడిగి, అన్నీ ఉడిగి పడున్నా అధికారం తప్పలేదు. చేస్తూన్నకొద్దీ ఎక్కుతూ వుంటుందిఅధికారం. ఒకమూల పడుండక ప్రతిదాంట్లోను వుఱ్ఱచెయ్యొకటి పెడతారు. జరగవలసినకార్యాలు ఎలాగో జరుగుతయి. మీకేమీ మాట్లాడకండి.

వేంక—అది కాదే—

సుంద—మళ్ళీ ఏమిటి? చెప్పానుగానూ అప్రమేయం ఎత్తొద్దనీ. నాకామాత్రం సాహంత్రం లేకపోతే మిమ్మల్ని కూచోబెట్టి చాకిరీ చెయ్యడానికి నేనమ్మకడుపున పుట్టలేదూ? నేనుగనక చెయ్యానంటే కుదురుతుంది రోగం.

వేంకటప్పయ్య నిరుత్తరుఁడయ్యెను. ఆతనిజీవితశేషము సుందరమ్మచేతిలో నుండెను. ఆతనిస్వతంత్ర మంతరించెను. ఆతనిమరణకాలమువఱకును, ఒకరిచేతిగంజిని త్రాగుచుఁ బూర్వపుస్థితి నొక్కొక్కప్పుడు తలంచుకొనుచు, గ్రుక్క నీళ్లు గ్రుక్కికొనుచు, పెదవి కదల్పక కుక్కిమంచమునఁ గూర్చుండవలసినవాఁ డాయెను. ఆయన మాట లేదు. ఆయన పలుకు లేదు. ఆయనసామ్రాజ్య మస్తగిరి చేరుచుండెను. విషణ్ణహృదయుఁడై యాతఁడు జీవించుచుండెను.

ఆనాఁడే సుందరమ్మ రాజమహేంద్రవరమునందలితనయన్నగారికి



హైమవతికి శీఘ్రకాలములోనే పెండ్లి కావలయు ననియు, త్వరగా వరుని జూడవలసినదనియు, నుత్తరము వ్రాసెను.

సుందరమ్మ యన్నగారిపేరు కామేశ్వరరావు. ఆతఁడు తనచెల్లెలు నియమించినపనియం దప్రమత్తుఁడై తిరిగి తిరిగి రాజమహేంద్రవరమునందే యొకవరుని నిర్దేశించి చెల్లెలిపేర, ఏలూరున కొకయుత్తరము వ్రాసెను. అందలిసారాంశ మీక్రింద వివరించెదను.

రాజమహేంద్రవరమున మాచవరపు నరసయ్యగారు గొప్పస్థితిపరుఁడు. ఆయనకు సాలునకు మూఁడువేలరూప్యములకుఁ దక్కువగాని యాదాయము కలదు. ఆయన కొక్కఁడే కుమారుఁడు. అతనిపేరు కేశవరావు. అతఁడు ప్రకృతము స్కూలుఫైనలుపరీక్షయం దుత్తీర్ణుఁడై చదువుసాగించక భూమి పుట్రి మొదలగునవి చూచుకొనుచుండెను. వయస్సు పందొమ్మిదిసంవత్సరములు. అంతయందగాఁడు కాకున్నను, అందవికారముగలవాఁడు గాఁడు. చామనిచాయమేను, కోలమొగము, ఇప్పటియువకులవలె క్రాపుచేసినజుట్టు మొదలగునవి గలిగి సొంపుగనే యుండెను. ఈబాలునకుఁ బిల్లనిచ్చినచోఁ బిల్ల సుఖపడు ననియు, నిష్టమున్నచో మాటలాడెద ననియు, ప్రస్తుతము కట్నము మూఁడువేలు కోరుచున్నా రనియు, కామేశ్వరరావు చెల్లెలిపేర వ్రాసెను.

చెల్లెలు సమ్మతించి, సంతోషించెను. కట్నము రెండువేలకు నిర్ణయము చేసికొనిరి. వివాహము సిద్ధపరుపఁబడెను. శ్రావణశుద్ధదశమికి లగ్న మేర్పాటు చేయఁబడెను. ఏలూరునందు, ఆగంటి వేంకటప్పయ్యగారి స్వగృహమునందే యైదుదినములవివాహమును జరపుటకంతయు సిద్ధమయ్యెను. కామేశ్వరరావు పెండ్లిపనులు చేయించుచు, ఏలూరుపై నుండి క్రిందివఱకు, తెగతిరుగుచుండెను.

సుందరమ్మకును, వీరమ్మకును నత్యధికానందముగ నుండెను. తనచెల్లెలికి మంచిభర్త దొరకినాఁడనియు, పాపిష్ఠిమేనబావయు, మేనత్తయు నింకఁ దమ్ము బాధింప నవకాశ ముండదనియు వీరమ్మ సంతోషపడుచుండెను.

ఈపెండ్లిగొడవలో హైమవతిమాట కనుఁగొన్నవారే లేరు. ఆమె కావరునియం దిష్ట మున్నదా? లేదా? యని కనికరించి యడిగినవాఁ డొక్కఁడును లేఁడు. హైమకుమాత్రము కొంత విచారముగనే యుండెను. అయ్యును తలిదండ్రులమాటల కామె జవదాట నుంకింపలేదు. ఆమెమనోగోళమునం దెన్నియూహలు, ఎన్నియాలోచనలు పరువెత్తుచున్నవో యామెకే తెలియదు. చిన్ననాఁటినుండియుఁ దనతో నాటపాటలతోఁ బ్రొద్దుపుచ్చినమేనబావ, చిన్నప్పటినుండియుఁ దనతో నిరవధికశైశవానందము ననుభవించినబావ, చిటికలోఁ దనకు జీవితాంతమువఱకును దూరగుఁడై పోయెను. ప్రప్రథమమునఁ బురుషునియందు తన కిచ్ఛ గలిగించినది బావ. ప్రణయసౌధమునకుఁ బ్రథమసోపానములు నిర్మించినది బావ. రాత్రిలయందు తననిద్రనుకూడ మానివేయునంతచాకచక్యముగఁ బ్రణయకథామాలికను గ్రుచ్చినది బావ. "హైమా" యని బుజ్జగించుచు, వీఁపు తట్టుచుఁ బ్రేమతో నటించినది బావ. అట్టిబావను తాను విడువనై యుండెను. ప్రపంచమున నాబావకును దనకును సంబంధ మింక నెక్కడ? ఇఁక బావ వచ్చినయెడలఁ దనవద్దకు రానేరాఁడు. దూరముననుండి "హైమవతీ, బాగున్నావా?" అని యడిగిన నడుగును. అంతియే. ఎంతలో నెంతఘోరము! తనలో మొలకలెత్తినప్రణయాంకురముల నొక్కపెట్టున వ్రేళ్ళతోఁ జిగురుటాకులతో, మొగ్గలతోఁ ద్రెంపి పారవేయవలసియుండెను. హైమవతి ఇది బాగుగ గ్రహించెను. సిగ్గుపడిన నిఁక లాభము లేదు.



ఇఁకఁ జేయవలసిన దేమి? హైమవతి సంకోచించెను. తల్లివద్ద కేగి తన మనోభావములను వ్యక్తపఱచుద మని నిర్ధారణ చేసికొనెను.

అప్పుడు మధ్యాహ్నము రెండుగంటలు. తల్లియు, అక్కయుఁ గూరుచుండి పచ్చీసాడుచుండిరి. నాఁడేమియోగాని యెవ్వరును రాచకార్యమునకు రాలేదు. హైమ వారిదగ్గఱ కేగెను. తల్లిదగ్గఱగఁ గూరుచుండెను. కొంతసేపు, ఆట చూచుదానివలెఁ జూచుచు నేమేమో యాలోచించుకొనుచుండెను. తనమేనబావను, మేనయత్తను జూచినఁ దనతల్లికి సరిపడదని హైమకుఁ దెలియును. సంభాషణము నారంభించు టెట్లు? అక్కయైనఁ, దల్లియైనఁ దన్నుఁ బలుకరింతు రేమోయని కొంతవడి చూచెను. వారియాటధోరణిలో వారు హైమసంగతియే గమనింపలేదు. అప్పుడు మాటలాడుటకు సమయ మగునా కాదా యని హైమ శంకించెను. కాని, యాటయైనవెనుక సాధారణముగ నెల్లప్పుడును జరుగునట్లు తల్లియే యోడిపోయినయెడల రాత్రి భోజనానంతరమువఱకును సమయము చిక్కదు. కొంచెముసేపు నిదానించి తుట్టతుదకు హైమ యిట్లుమాటలాడెను.

హైమ—అమ్మా, నేనొకమాట చెపుతాను కోపంరాదుగదా?

సుంద—ఏమ్మాటమ్మా, కోప మేమిటి?, ఏమిటో చెప్పు.

హైమవతి భూమివంకఁ జూచుచుఁ దల్లితొడపైఁ జేతు లానించి చిన్నకాగితమును జింపుచు దానివంకఁ జూచుచుండెను.

"నాకీపెళ్ళి ఇష్టం లేదు." అని హైమ హఠాత్తుగా ననెను.

సుందరమ్మయు వీరమ్మయు నొక్కమా ఱామెవంకఁ జూచిరి. సుందరమ్మముఖఫలకమున నేదియో యొకభావము పొడకట్టెను. అది కోపము కాదు; ఆశ్చర్యము గాదు. మాతృప్రేమయును గాదు. ఈమూఁడుభావములయొక్కసమ్మేళనము బయాస్కోపువలె సుందరమ్మ

ముఖయవనికపై మూర్తీభవించియుండెను.

సుంద—ఏమీ? ఎందు కిష్టంలేదు. కురూపిఅనా? ముసలివాడనా? చదువులేనివాడనా? మామ అంత కష్టపడి నీకు మంచిసమంధం కుదిర్చాడు గదా? ఏంలోప ముందో చెప్పు మరి?

హైమ మాట్లాడలేదు.

వీర—ఎందుకో చెప్పవే మరి! పిల్లవాఁడు మంచివాఁడుగదా? భూమీపుట్రి ఉన్నాయి. దేశాంతరం బోయినా నీకేమీ లోటు లేదు.

సుంద—ఎందుకో చెప్పు. కురూపనా.

హైమ కాదని తలత్రిప్పెను.

సుంద—పేదవాఁడనా?

హైమ కాదని తలత్రిప్పెను.

సుంద—మరీ—ముసలివాడనా?

హైమ కాదని తలత్రిప్పెను.

సుంద—మరి ఎందుకని?

హైమ—ఎందుకనీ లేదు.

సుంద—అయితే మరి ఎందుకొద్దు?

హైమ—సంకోచించెను. "అంతకంటె మంచివాళ్లెవరూ ఉండరూ? బాగా చదువుకొనేవాళ్లుండరూ?" అనెను.

సుంద—మామ తిరిగి తిరిగి తెచ్చాడు సమంధం. ఇంతకంటే గొప్పచదువులు చదివి ఏంజెయ్యాలి? అలాంటివాళ్లుంటే మామ అలాంటిసమంధమే తెచ్చేవాఁడు.

వీర—అది గాదే. ఈపాపిష్టిదానికి కృష్ణుడిమీదికి బోయిందే మనసు. వెధవకోర్కెలన్నీ కోరుతుంది.



సుంద—ఛా, వెధవకృష్ణుడు. డబ్బూ లేదు. దగబూగలు లేదు. దరిద్రుణ్ణి కట్టుకు నువ్వేం సుఖపడతావు. ఇంతా యేడిస్తే మీ ఆయనకంటె ఒకక్లాసేగా ఎక్కువ?

హైమకు మనస్సు చిటుక్కుమనెను. ఇంకను పెండ్లి కాలేదు. తన కిష్టము లేదు. అప్పుడే తల్లి "మీఆయన" అని మాటలాడు చుండెను. కృష్ణుఁడు దరిద్రుఁడఁట. తల్లి చెప్పునంతభాగ్యహీనుఁడు గాఁడని హైమకుఁ దెలియును. హైమ తల్లి కిట్లు ప్రత్యుత్తరమిచ్చెను.

హైమ—ఒకక్లాసైతే, బావ చదువు మానెయ్యలేదుగా?

సుందరమ్మ మాతృప్రేమ యిఁక నోపిక పట్టఁజాలకపోయెను. ఏకుటుంబమును జాలకాలమునుండియుఁ గోపసంతప్తహృదయముతోఁ జూచుచుండెనో, ఏకుటుంబముతోఁ గలయిక తనమానసమునకు హాలహలమువలెఁ దోఁచుచుండెనో, ఆదరిద్రకుటుంబము తనకూఁతురగు హైమకు నత్తిల్లగుట యామెకు దుర్భర మగునాలోచనగ నుండెను. ముఖము చిట్లించి సుందరమ్మ తీక్ష్ణమగు నొకదృగ్జ్వాలను హైమపైఁ బఱపెను.

సుంద—హైమా, నువ్వు చిన్నదానివి. నీకు లోకానుభవం లేదు. నీసుఖంకోసం మేమెన్నిచేసినా మాట దక్కనియ్యవు. నీమేలుకోసం బాధల కోర్చి నేనూ నావాళ్ళూ నీకోసం ఎంతచేసినా ఏదో ఒకటిపెట్టుకు చక్కావస్తావు. ఇక నేనేమీ చెయ్యలేను. ఆ ముదనష్టపు కృష్ణుడిమాట నాయెదుట ఎత్తొద్దు. నోరు మూసుకొని పెద్దవాళ్ళు చెప్పేలాగు చెయ్యి. తక్కినమాట నీకెందుకు? ఇంతున్నావో లేవో పెద్దవాళ్ళవిషయంలో జోక్యం కలిగించుకోకు.

హైమవతి మాఱుమాటాడలేదు. పైకిఁ బొంగివచ్చుదుఃఖము నాఁపుకొనుటకుఁ బ్రయత్నము చేయుచుండెను; రెండుక్షణము లైన

వెనుక నాఁపుకొనఁజాలకపోయెను; తల్లియెదుట నేడ్చిన నేమనునో యని భయము వైచెను; దిగ్గన లేచి దొడ్డిలోని కరిగెను; అచ్చట గోడచాఁటున నిలువఁబడి పరికిణీచెంగుతోఁ గన్నీటిని దుడిచికొని వేఱొకద్వారమున నింటిలోఁ బ్రవేశించెను.

ఏమి చేయుటకును హైమకుఁ దోఁచలేదు. పందిరిమంచముపైఁ బరుండి యోచనానిమగ్న యయ్యెను. తలలోనుండియుఁ జెవులలోనుండియు వేఁడియావిరులు వచ్చుచుండెను. ఇఁక హైమకు దిక్కెవ్వరు? బావ కుత్తరము వ్రాయుటయా? హైమ యాలోచించెను. బావ కేమిస్వతంత్రము న్నది? ఆతఁడును దల్లిదండ్రులపోషణలోనే యున్నవాఁడు. తనతల్లికి వారికుటుంబముపై నెంతయనిష్టమో వారికిని ఆగంటివారికుటుంబముపై నట్లే యుండవచ్చును. మీఁదుమిక్కిలి యుత్తరములు వ్రాయుట దొంగజవాబులు తెప్పించుకొనుట, అంతఃపురములలోని సాధ్వీమతల్లుల చరిత్రకవిషయమైనది. హైమ యాపనికిఁ బూనుకొనలేదు. పోనీ మామతోఁ జెప్పి సంబంధమును దప్పించుటయా? కాదు. మామమాత్రము తనమాట వినునా? మీఁదు మిక్కిలి యతఁడే సంబంధము కుదిర్చినవాఁడు. తాను కుదిర్చినసంబంధము లోకానుభవములేని యొకపిచ్చిపిల్ల యనిష్టమును సూచించినంతమాత్రమున విడఁగొట్టునా? ఇంకెట్లు? అమ్మవద్దకే పోయి మరల బ్రతిమాలుటయా? కాదు. ఇంతవఱకుఁ గోపము బిగఁబట్టిన తనజననికోపాగ్నికి హైమ తప్పక యాహుతి కావలసివచ్చును. ఏమైన సంబంధము తప్పించుటకుఁ గొంచెము వీలున్నను, ఆయాసను శకలీభూతము గావించుకొనుట యగును. తండ్రివద్ద కేఁగి యెందుకు మొఱపెట్టుకొనఁగూడదు? పక్షవాతముచే నెంతయప్రయోజకుఁ డైనను, భార్యకు, ఎంతలొంగవలసి యున్నను తనకొమార్తెయోగక్షేమ



ములనుగూర్చి కొంచెమువిచారించి సాహాయ్యము చేయకుండునా? సాహాయ్యము చేయకున్నను, ఒక్కయుపాయమైనను జెప్పకుండునా?

హైమకుఁ దోఁచినయాలోచన లన్నిటికంటె నీచిట్టచివరియాలోచన బాగుండెను. వెంటనే పందిరిమంచమునుండి లేచి హైమవతి తండ్రియుండు నాగదిలోనికిఁ బోయెను. ఆగదిలోనే యొకకుర్చీపై వీరమ్మకూడఁ గూర్చుండి యుండెను. హైమముఖము తెలతెలబోయెను. కొంచె మాఁగఁబోయి, యాఁగకయే వేఱొకద్వారమునుండి వంటయింటివైపున కేఁగెను.

వీరమ్మ నాఁటిసాయంతన మచ్చటఁ గూర్చుండుటకుఁ గారణము లేకపోలేదు. పచ్చీసు ఆడునప్పుడు హైమకును సుందరమ్మకును జరిగినసంభాషణమే దానికిఁ గారణము. హైమ వారిని వదలి దొడ్డిలోనికిఁ బోయిన వెనుక వీరమ్మ తల్లితో నిట్లనెను.

వీర—అమ్మా, ఇది గయ్యాళిదిలా వుంది. నాన్నతో చెప్పి ఏమన్నా దొంగతంత్రం పన్నుతుందేమో?

సుంద—ఔనే, నిజమే. దీని కెలా సాధనం?

వీర—ఏమీ లేదు. నువ్వు వంటచేస్తూ ఉంటావా? అప్పుడు నేను నాన్నగదిలో కూచుంటాను. హైమ వచ్చినా నన్ను చూసి జంకుతుంది. ఒకవేళ మొండితనం చేసి నాన్నతో చెప్పినా నాన్న నన్ను చూసి మాట్లాడడం మానేస్తాడు. అలా కాకపోయినా, నీకు చాకిరీ చెయ్యం అలా అని బెదిరిస్తే చెప్పినమాట వింటాడు.

సుందరమ్మ తనకుమార్తె యగువీరమ్మబుద్ధికుశలతను వేనోళ్ళఁ బ్రశంసించెను. తెలివియనఁగా వీరమ్మదిగాని, తెలివి లోకములో నింకెవ్వరివద్ద నుండును? ఈసంభాషణఫలితము వీరమ్మ తండ్రివద్ద కాపలా

కాయుట. దొంగలనుబంధించి రక్షకభటులు కాపలా యుండునట్లు ఆగంటి వేంకటప్పయ్యగారిపై వీరమ్మ రక్షకభటత్వమును దాల్చెను. ఆమెచూపులు వేంకటప్పయ్యగారికి శృంఖలములు, ఆమెమాట రక్షకభటునియాజ్ఞాహుంకారము. వేంకటప్పయ్యగారి కిది కఠినశిక్ష—కఠిన నరకము.

హైమ యెప్పుడు తండ్రిని సమీపింపఁబోయినను జననియో సోదరియో కనిపెట్టుకొని యుండెడువారు. హైమవతికి జనకుని జూచు భాగ్యమే కలుగలేదు. కాని యింటిలోఁ దిరుగుచుఁ దనకార్యసాఫల్య మార్గాన్వేషిణియగుహైమ కొకప్పుడైనను సమయము చిక్కకుండునా?

మానవునకు మొదటనున్నపట్టు కొంతసేపైనవెనుక నుండదు. దీనికి, ఆరంభశూరత్వము దగ్గఱచుట్టము. అట్లే మొదటిరెండుదినములును, క్షణమైన విడువక కాఁచియున్నపట్టుదల మూఁడవనాఁటికిఁ గొంచెము సడలు టారంభించెను. హైమవతి దీనిని గనిపెట్టెను. సందుదొరకఁగనే తండ్రివద్దకుఁ బరువెత్తెను. ఆలోచనకును మాటలయల్లికకును నచ్చుట కాలము లేదు. తనహృదయమునందలియూహను, విచారమును, తల్లియాలోచనను, వివాహనిర్ణయమును దండ్రితో రెండుముక్కలలోఁ జెప్పివైచెను. తన కాలోచన చెప్పుమని తొందరగ నడిగెను.

వేంకటప్పయ్యగారికెదురుగ ద్వారమునందు సుందరమ్మ యగపడెను. హైమవతివీఁపుద్వారమువైపు నుండుటచేతఁ దల్లిని జూడలేదు. వేంకటప్పయ్యగా రిప్పు డాలోచన చెప్పుస్థితిలో లేఁడు. సుందరమ్మయెదుటనే యున్నది. పెదవికదపినచోఁ దనభవిష్యద్గతి యధోగతి కావలసినదే. వేంకటప్పయ్య సుందరమ్మకు వినఁబడునట్లు "హైమా! పెద్దవాళ్లమాటలు తిరస్కరింపఁగూడదు. మీఅమ్మచెప్పినవిధంగా చెయ్యడమే నాకూ సంతోషం" అనెను.



హైమ ప్రాణములు పైనే యెగిరిపోయెను. తనదుఃఖసాగరమీఁదుటకుఁ దండ్రి యొకగాలితిత్తివంటివాఁడగునని యాశ ప్రేరేపింపగా కనిపెట్టి వచ్చెను. వచ్చినందుకుఁ దండ్రియుఁ దనశత్రుకోటిలోనివాఁడై పోయెనని యామె తలంచెను. పాపము తల్లిని హైమచూడలేదు. చూచియున్నచోఁ దండ్రిమాట లాతనిహృదయవినిర్గతములు కావని యామె తెలిసికొని యుండును. ఇప్పుడామె తనతండ్రినిగూడ శత్రుకోటిలోనే చేర్చివైచెను. సుందరమ్మ తలుపుచాటున కేఁగెను. హైమ యశ్రుపూరితనేత్రయై ప్రక్కపంచాదియందలి పందిరిమంచముపైఁ బరుండి తనయూహాసాగరమున మునిఁగిపోయెను.

కొంతవడికి హైమ తెప్పిరిల్లి యాలోచనాపరంపరల నవ్వలకుఁ ద్రోచివైచెను. పెద్దలమాట, అందు జననీజనకులమాట, త్రోసిపుచ్చరాదని శాస్త్రము లుద్ఘోషించుచున్నవి. పితృవాక్యపరిపాలనకై రాముఁ డరణ్యమున కేఁగెను. పరశురాముఁడు తనతల్లిని రెండుముక్కలుగ తెగనఱకెను. హైమవతి జననీజనకులయాజ్ఞాపరిపాలనకై తనసుఖమును దూరము చేసికొనఁజాలదా? తాను నవలలోఁ జదివినశ్వేతకన్య యట్లు చేయఁజాలకపోవచ్చును. అంతఃపురవాసిను లగురాజకన్యలట్లు చేయఁజాలకపోవచ్చును. తా నీకన్యలవలెఁ బ్రవర్తించుటయేల? ఇంతయే కాదు. తల్లి, తండ్రి, మామ—వీరు ముప్వురును లోకానుభవము కలవారు. తానో లోకానుభవము లేనిది. తనకుఁ దెలియనప్పు డొకరు చెప్పిన వినవలెను. బాల్యమునుండే స్వాతంత్ర్యము కూడదు. ఈముప్వురుపెద్దలకును దనపై నసూయగాని కోపముగాని కలనైన లేదు. తాను సుఖపడుట వారికిని సంతోషమే. అట్టైన వారిమాట నెందులకు జవదాఁటవలెను?

ఇట్టి యాలోచనలతో నామె ప్రణయాంకురములను ఛేదింపనెం

చెను. కాని యది ఛేదింపఁబడలేదు. ఏబాలరసాలమునో పెరుగనీయకుండ జెముడుకంచెలను నాఁటువిధమున బావ నంటిపెట్టుకొనిన ప్రథమప్రేమాంకురము, పెద్దలయాజ్ఞలను జెముడుకంచెలతోఁ గప్పివేయఁబడెను.

హైమకు బావ మరలఁ దలఁపునకు వచ్చెను. ఆతలఁపు నొక్కవిసురున హైమ పారఁదోలెను. కొంచెమైనఁ దావిచ్చినచోఁ దానప్పుడే చేసికొన్ననిర్ధారణ భగ్నమైపోవును. లోకులు నిందింతురు. తనహృదయశాంతికి భంగము కలుగును. అప్పటినుండియు బావమాట తలఁపునకు వచ్చినప్పుడెల్ల నేదియో యొకవిధమున హైమ యట్టితలంపును జయించెడిది. తానొక్కతెయు నొకచోఁ గూర్చున్నచో బావ తలంపునకు వచ్చునని తల్లితోడనో, అక్కతోడనో, ఏదియో సంభాషించుచుండెడిది. ఎంతవిచిత్రము ! ఎంతఘోరము !! హైమబ్రదుకెంతలో నెట్లు మాఱినది !!!

---

## మూఁడవ ప్రకరణము.

---

పైప్రకరణములోని విషయములు జరిగిన కొలఁదికాలమునకు సర్పవరపు నాగభూషణముగారికి హైమవతీవివాహమహోత్సవాహ్వానపత్రిక యొకటి వచ్చెను. ఆశుభలేఖను, ఆమూలాగ్రముగఁజదివి నాగభూషణము భార్యచేతికిచ్చెను. భార్య దానిని మొదటశ్రీమొదలు చివరి



శ్రీవఱకును జదివి భర్తచేతి కాశుభలేఖ నిచ్చివైచెను.

శేష—మాచారపు నరసయ్యగా రెవరు ?

భర్త బంధుత్వముల నన్నిటిని దిరుగఁబెట్టి, తమబంధుకోటిలో వేయిమందిపేళ్లు చెప్పి మాచారపు నరసయ్యకుఁ దమకు ఏదో దూరపు బంధుత్వము స్థిరపఱచి భార్యకు వివరించి చెప్పెను.

ఆశుభలేఖ చూచినప్పటినుండియు నాగభూషణమునకుఁ గొంచెము కోపముగ నుండెను. ఈడు, జోడునై కలసిన మేనఱికమును ఆగంటివారు వదలివైచి రని యాతనికిఁ గొంచెము మనఃక్లేశము కలిగెను. అట్టిచింత శేషమ్మకు కలుగకపోలేదు. కాని వారెప్పుడును "మీపిల్లను మాఅబ్బాయి కియ్యండి" అని మాటవరుసకైన ననుగలేదు. "మాపిల్లను కృష్ణుడికి చేసుకోండి" అని వేంకటప్పయ్య గాని, సుందరమ్మ గాని అనియుండలేదు. హైమాకృష్ణుల వివాహమునుగూర్చి యెవ్వరి హృదయమునందును తలంపే లేకుండెను. అట్టితఱి శుభలేఖను జూచి కోపము చెందుట కంతగఁ గారణము లేదు. శేషమ్మకును నాగభూషణమునకును నిది క్రొత్తసంగతి కాదు. కావుననే వారు సాధారణముగ నట్టిసమయములందు మానవు లేభావహావవికారములను వెలిబుచ్చెదరో, అట్టివికారములను జూపలేదు. కొలఁదిగ నేమూలనో యంటిపెట్టుకొని నాలుగుకోపపుచుక్కలుమాత్రము ముండెను.

నాగ—పెళ్లికి వెడతావా ?

శేష—మాఅన్నయ్యకు పక్షవాతం వచ్చి రెండునెల లైంది. అప్పు డెప్పుడూ చూడ్డాని కవకాశం లేకపోయింది. ఇప్పుడు వెడితే పెళ్లికి వెళ్లినట్టూ ఉంటుంది. మాఅన్నయ్యను చూసినట్టూ ఉంటుంది.

నాగ—మీవాళ్లు మేనఱికముండగా వదలిపెట్టి ఊళ్లో ఎవడికో పిల్లనిస్తున్నా రెందుకూ ?

శేష—మొదటినించీ మన మడగా లేదు నుడగా లేదు. వాళ్ల మనసు. వాళ్లపిల్లని వాళ్లిష్టమొచ్చినచోట ఇచ్చుకుంటారు.

నాగ—ఇందులో మీఅన్నయ్యకేమీ జోక్యమున్నట్లు కన బడదు.

శేష—ఏమో, వాళ్లు మొగుడూపెళ్లాం ఏమాలోచించుకున్నా రో! ఎలా చేసుకున్నారో!

నాగ—మరి, అయినమేనరికము వదిలిపెట్టడం నాకు బాగుం డలేదు. పోనీ అడిగి లేదనిపించుకుంటేఅన్నా బాగా వుండేది.

శేష—అడిగితే, చేసుకోము అని ఎందుకంటాము? అంతమా త్రం వాళ్లకు తెలియదా ఏమిటి?

నాగ—అయితే, ఇంతనిర్లక్ష్యం చేసినా పెళ్లికి వెడతానంటా వా? వెళ్లడం అవసరమా?

శేష—పెళ్లికోసం గాదు. నేను ముఖ్యంగా మాఅన్నయ్యను చూడ్డానికి వెళ్లాలి. జబ్బుపడ్డాక వెళ్లలేదు. పెళ్లికి నేను వస్తానని గం పెడాశతో ఉంటాడు. వాడికైపు ఒక్కదాన్ని ఒక్కచుట్టాన్ని నేను. ఇప్పుడుతప్పితే వాళ్లింటికిహ మనం వెళ్లవలసినఅవకాశంఏముంటుంది?

నాగ—అయితే ఎప్పుడు బయలుదేరుతావు?

శేష—మీరుగూడా రారా?

నాగ—నేనుగూడా ఎందుకు? నువ్వొక్కతెవీ వెడితేచాలదూ?

శేష—ఎవరూ మొగవాళ్లసహాయం లేకుండా నేనువెళ్లగలనా?

నాగ—అటునుంచి అబ్బాయి వస్తాడు గాదూ?

ఇంటర్మీడియేటుపరీక్షయందుఁ గృతార్థుఁడై కృష్ణుఁడు చెన్నప ట్టణమునందు ప్రస్తుతము బి. ఏ. తరగతియందు చదువుచుండెను.



అతఁడు కాకినాడను వదలి యించుమించుగ నొకమాసమైయుండెను. పాప మాతనికి హైమవతివివాహమునుగూర్చి ఏమియును తెలియదు.

శేష—ఏమో, వాడిచదువూ అదీని మరి. రావడానికి వీలవు తుందో కాదో.

నాగ—ఐతే, నీతో నన్ను రమ్మంటూ వున్నమాట?

శేష—ఇంకా 'అన్నమాట'ఏమిటి? వెడదాము.

నాగ—సరే. అబ్బాయిమాటేమిటి?

శేష—అబ్బాయిమాటేముంది? ఇవ్వాళ కార్డు రాసెయ్యండి. రేపు వాడికందుతుంది.

నాగ—మనబ్బాయి కియ్యకుండా ఇంకెవరికో హైమ నిస్తాం టే, మనఅబ్బాయి పెళ్లికెళ్ళడం ఏమిటి?

శేష—వారివ్వకపోతే మనఅబ్బాయికి పెళ్లిల్లేవుంటుందా ఏమి టి? వాడూ వాళ్లమామను చూస్తాడు. జబ్బుపడ్డాక వాడూ చూడలే దాయెను!

నాగ—ఏమో ఆపద్ధతి నాకంత బాగా తోచలేదు. వాడికి వ్రాస్తాను. వీలైతే, వాడే ఆలోచించుకుంటాడు. ఏదో కొంచెం పెద్ద వాడైనాడు గదా?

శేష—పిల్లవాణ్ణి చూసి రేపటికి సరిగా నెల అవుతుంది. మళ్లీ ఇప్పుడన్నా పిల్లాణ్ణి ఒహమాటు చూడాలని ఉంది. దూరదేశంలో ఉ న్నాడు. ఎక్కడి చెన్నాపట్నం? ఎక్కడి కాకినాడ? తప్పకుండా రమ్మని వ్రాయండి.

నాగ—మళ్లీ 'తప్పకుండా' ఏమిటి? వాడే ఆలోచించుకుంటా డని చెప్పాను గానూ?

శేష—ఆలోచనలూ, సాలోచనలూ వాడి కేందెలుసు? మనమే ఏదో ఆలోచించి వ్రాస్తే వాడిచదువు చెడిపోకుండా చూసుకువస్తాడు.

నాగ—అయితే, మీఅమ్మ నిన్ను చూడాలనిగూడా అనుకుంటూ ఉంది. తప్పకుండా రమ్మని వ్రాసేదా?

శేష—ఆఁ. అలాగే వ్రాయండి.

నాగ—కాకినాడకు రమ్మని వ్రాసేదా? అక్కడనుంచి అలాగే ఏలూరికే రమ్మని వ్రాసేదా?

శేష—మీమనసు. మీరెల్లా వ్రాసినా సరే.

నాగ—ఏకాఏకీని ఏలూరికే రమ్మంటాను. మళ్లీ ఇక్కడికొచ్చి అక్కడికెళ్లీ హైరానంతా ఎందుకు?

శేష—సరే. అలాగే వ్రాయండి.

నాఁటిమధ్యాహ్నము సర్పవరపు నాగభూషణముగారు చెన్నపట్టణములోనికుమారునిపేర నొకయుత్తరము వ్రాసిరి. అందు హైమవతివివాహమునుగూర్చియు, వేంకటప్పయ్యగారిజబ్బునుగూర్చియు, శేషమ్మ తనకుమారుని జూడవలయునన్నకోరికనుగూర్చియు విశదముగాఁ దెలుపఁబడెను.

మఱునాఁడు సాయంతనము నాలుగుగంటలకు కృష్ణరావు తన గదికి వచ్చెను. గదిలోఁ దలుపు తెఱవఁగనే టపాబంట్రోతు పడవైచిన పై యుత్తరము కనఁబడెను. తనతండ్రివ్రాసినపై విలాసమును జూచెను. అంతకుఁ గ్రిందటిదినమే యొకజాబు తండ్రిదగ్గఱనుండి కృష్ణరావునకు వచ్చి యుండెను. మరల మఱునాఁడే జాబు వచ్చుట కతనికి అవసరము కనఁబడలేదు. తనతల్లియగు శేషమ్మకు, ఏమైన జబ్బు చేసినదా? కారణము తెలియలేదు. కృష్ణుఁడు పుస్తకములను బల్లపైఁ బారవైచి యుత్తరమును జింపి చూచుకొనెను.



"అందఱును క్షేమం" అంతవఱకు బాగుగనే యున్నది. తన తల్లి సుఖమై యున్నది. ఉత్తరము వచ్చుటకుఁ గారణ మేమి?

చూచుచుండఁగనే కృష్ణునకుఁ గన్నుల నీరుగ్రమ్మెను. ఱెప్పల నార్పుచుఁ గొంత సందుచేసికొని యుత్తర మంతయును సాంతముగఁ జదివెను. హైమవివాహమునుగూర్చి వ్రాసినభాగము మరల నింకొకమాఱు చదివెను. హైమావివాహము నిర్ణయింపఁబడినది. వరుఁ డెవరు? తాను కాఁడు. తానెన్నఁడు నెఱుఁగనియొకఁడు. అతనిహృదయ మంతయు నొక్కనిమిషములో దుఃఖపూరిత మయ్యెను. అతని కాలోచనలు తోఁచుట లేదు. "హైమవివాహము జరుగనున్నది. అవును. జరుగును. జరుగనిమ్ము. జరిగిన నేమి? హైమవివాహమే కాదు. ఇతరొకరివివాహముగూడ జరుగుచున్నది. కాదు. ఇద్దఱివిని కలిపి ఒకటే వివాహము" అని బుద్ధిమాంద్యము గలిగినవానివిధమున కృష్ణుఁడు తనలోఁ దాననుకొనెను. చేయవలసినపనిని నిర్ణయించుకొనుట లేదు. చేయవలసినపద్ధతినిగూర్చి యాలోచించుకొనుట లేదు. అతనిశరీరమానసములు రెంటను జడస్థితిలో నుండెను. పిచ్చివానివిధమునఁ జెదవులను తెఱచి ప్రయత్నపూర్వక మగుదరహాసమును దెచ్చిపెట్టుకొని బొమలు ముడివైచుచుఁ, గన్నులు మూసికొనుచు, ఱెప్పలార్పుచు, చేతులు త్రిప్పుచు, కాలెగురవైచుచు, ముక్కురంధ్రములను జిన్నవిగను బెద్దవిగను జేయుచు "హైమవివాహము, హైమవివాహం" అని యొకమాఱు గట్టిగను, ఒక్కొక్కమాఱు తనలోపలను బలికికొనుచుండెను.

ఇంతలోఁ దాను పిచ్చివాఁడు కాఁడని యొక్కనిమిషములోఁ దెలియవచ్చెను. "ఏమి నాపిచ్చితనము! ఎవరూ చూడలేదుగదా!"

అని నలుదెసలఁ జూచి, యెవ్వరును లేనందులకు సంతసించి యొక్కనిట్టూర్పు పుచ్చి కృష్ణరావు కుర్చీపైఁ బడెను. రెండుకాళ్ళను బల్లపైఁ బెట్టెను. రెండుచేతులతోడను రెండుచెక్కిళ్ళను నొక్కుచు మోచేతులను దొడలపైఁ బెట్టి, రెండుకన్నులను విశాలముగఁ దెఱచి యెదుటి గోడవంకఁ జూచుచుండెను. కాని యాతనిమనస్సులోని కొక్కభావమును రాలేదు. ఒక్కయాలోచనయుఁ దోఁచలేదు. హైమవివాహవిషయమై యేదైన నొకయుపాయము పన్నవలె ననిమాత్ర మొకయూహ యతనిమనస్సునం దుండెను. అంతకు మించి యాతనిశూన్యహృదయమున నేమియును లేదు. ఏదియో యర్థముగానికల్లోల మొక్కటి సముద్రమునందలి తుపానువలె, నాతని సంక్షోభింపఁజేసెను.

కొంతతడ విట్లు కూర్చుండి లాభము లేదని కృష్ణరావులేచెను. గదిబైటికి వచ్చి తనగదికిఁ దాళమువైచి కాఫీహోటలునకుఁ బయనమయ్యెను. ఎవ్వరితోడను మాటలాడక యేదో తెప్పించుకొని కాఫీతో ముగించి యీవలికి వచ్చెను. త్రోవలో నెవరో యేమోయనుగగా "నాకుఁ దెలియదు. ఇంకెవరినన్నా కనుక్కోండి." అని జవాబు చెప్పెను. మరల నంతశీఘ్రముగఁ దనగదికిఁ బోవుట కతని కిష్టము లేదు. గదియంతయు జీకటికోణమువలె నాతనిమనస్సునకుఁ దట్టెను. అచ్చటి కేఁగిన దన కేయాలోచనయుఁ దోఁచ దని యాతఁ డనుకొనెను. ఇంక నెక్కడకుఁ బోవుట? ఎక్కడైనను ఎక్కువవెలుఁగుండుచోటునకుఁ బోవలయును. కృష్ణరావు తిరువల్లికేణి సముద్రతీరమునకు దారితీసెను.

అతఁడు పోవుదారిలో హైమవివాహమునుగూర్చినసమస్యయొక్కటియే యాతనిహృదయమునం దుండెను. కాని యాలోచనమాత్రము పారలేదు. తనవలెనే పెక్కండ్రు సముద్రమునకు వచ్చుచుఁ బోవుచు నుండిరి. వీరిమాటల యల్లకల్లోలము కృష్ణరావునకు దుర్భరముగా నుండెను. ఎక్కడఁ జీమ చిటుక్కు మన్నను, కృష్ణరావు సహింపఁజాలకుండెను. అట్టిభావము లాతనిముఖమునందు స్పష్టముగఁ గనఁబడుచుండెను. కాని, యింతకు ముందు గదియం దాతఁడు ప్రవర్తించిన పిచ్చితనపువిధముమాత్ర మిప్పు డాతనివద్దఁ గానరాదు. తనమనస్సులోని విషయ మితరుల కెవ్వరికిని దెలియఁగూడదని యాతఁ డుద్దేశించెను. త్రోవలో నొకస్నేహితుఁ డగపడెను.



స్నేహి—ఏమోయ్ కృష్ణరావు, సముద్రానికి వెళుతున్నావా? ఏమిటి?

కృష్ణరావు, ఆఁగెను. ఒకరు తన్నుఁ బలుకరించుట నాతఁడు సహింపఁజాలకుండెను. అయినను సాధారణముగ మాటలాడువిధముననే. "అవును, అక్కడికే వెళుతున్నాను." అనియెను.

స్నేహితునకు కృష్ణుఁ డేదో మాఱినట్లు కనఁబడెను. "ఏమిటి? ఏమో మాఱినట్టున్నావు? కారణ మేమిటి?

కృష్ణ—నేను, మాఱిన ట్లున్నానా? ఏమో? నాకు తెలియదు. నాకు మామూలుగానే కనబడుతూఉంది.

స్నేహి—మొహమంతా నల్లబడ్డది. ఏదో ఒహమోస్తరుగా ఉన్నావు. మామూల్గా లేవు.

స్నేహితుఁడు చెప్పినవిషయమై యాలోచించుచున్నట్లు కృష్ణరావభినయించెను. తరువాత రెండుమూఁడుమాటలాడి స్నేహితుఁడు వెడలిపోయెను.

ఇంకఁ గొంతదూరమున సత్యనారాయణ, సోమయాజులునను నిద్దఱుస్నేహితులు కనఁబడిరి. వారిలో నొకఁడు కృష్ణరావు నుద్దేశించి,

స్నేహి—ఎందాకా?

కృష్ణరావు (వారివంకఁ జూచుచు) సముద్రానికి.

స్నేహి—ఇంతపెందరాడే బయలుదేరావేమిటి?

కృష్ణ—చదువుకోబోతే ఏంతోచిందికాదు బయలుదేరాను.

స్నేహి—అయితే పద, మేంగూడా వస్తాం.

కృష్ణరావు తానొక్కఁడు నొకచోటఁ గూర్చుండి యాలోచించుకొనవలెనని తలంచి యుండెను. ఇప్పుడు స్నేహితులు తనతో వచ్చెద మనుచుండిరి. వారిని దప్పించుకొనుటెట్లు? కృష్ణరావు కొన్నియబద్ధము లాడవలసి యుండెను.

కృష్ణ—నాతో వస్తే, ఈరోడ్డుచివర మిమ్మల్ని వదిలిపెట్టాల్సొస్తుంది.

స్నేహి—ఏమన్నా పనుందా?

కృష్ణ—ఒకచిన్నపనొక టుంది.

"ఏంపని?" అని యడిగినచో కృష్ణరావు పప్పులోఁ గాలు వెట్టెడివాఁడే. కాని స్నేహితు లంతటితో కృష్ణరావును వదలి ముందునకు సాగిరి. వారేవైపునకుఁ దిరిగెదరో యని కృష్ణరావు చూచి వారు కుడివైపునకుఁ దిరుగుటఁ జూచి, తాను కుడివైపునకుఁ దిరిగి విశ్వవిద్వన్మందిరపుతూర్పునీడలు సముద్రపుటిసుకలపైఁ బడుచోట చుట్టుప్రక్కల రెండుమూఁడువందలగజములదూరమువఱకును, మనుష్యు లెవ్వరును లేనిచోటఁ గూర్చుండెను.

ఇంతవఱకు కృష్ణునిహృదయచరిత్రమున రెండుప్రకరణము లైనవి. మొదటిది బుద్ధిమాంద్యము, పిచ్చితనము, దుఃఖనిఘాతహతి; రెండవది భావశూన్యత, ఆలోచనాహీనత, హృదయతాపము నితరులకుఁ గనఁబడకుండఁ గప్పిపుచ్చుట. ఆశ్రావణసాయంతనమున నాయిసుకతిన్నెలపైఁ గూరుచున్నప్పు డాతనిహృచ్చారిత్రమున మూఁడవప్రకరణము ప్రారంభ మయ్యెను. ఆతనిహృదయ మింతకుముందువలె మాంద్యముగ నుండలేదు. వేలకొలఁదియాలోచన లొక్కపెట్టున నాతనికిఁ దట్టెను. ఇంతవఱకును నాలోచనలు లేనందులకు సంతాపము; ఇప్పు డాలోచనాపరంపరలు పెల్లుబ్బుటకు సంతాపము.



ఎట్టకేలకుఁ గృష్ణుఁడు తనహృదయావస్థను స్తిమితపఱచుకొనెను. ప్రస్తుతకార్యమునుగూర్చి యాలోచించెను.

"హైమా? హైమా? నీవు నాదాన వనుకొంటిని. ఎప్పటికైనను నీవు నన్నే చెట్టపట్టుదు వని దృఢముగ నమ్మి యుంటిని. అనేకవిధములఁ జిన్ననాఁటినుండియు నీహృదయమును నావైపునకు మరల్చుటకుఁ బ్రయత్నించితిని. నేను జయించితి ననుకొంటిని. కాని నేను మొగ మిటు త్రిప్పుటతోనే నాప్రణయసంరంభ మంతయు జీట్లపేకతోఁ గట్టిన మేడవలె నొక్కగాలి కెగిరిపోయినది."

"ఈవివాహనిర్ణయము హైమ యిష్టముమీఁదనే జరిగెనా? తల్లిదండ్రులు దాని నడిగి తెలిసికొనకుండనే దాని కిష్టములేనికార్యము చేయఁదలపెట్టుదురా? అట్లు కాదు. హైమ నడిగియే యుందురు. హైమ ఒప్పుకొని యుండును. నన్ను ప్రేమింతు నని చెప్పినది గదా హైమ? ఇప్పుడు వేఱువిధముగఁ జెప్పి యుండునా? ఏమో? నేను దాని యెదుటఁ గాక యిక్క డెక్కడనో పడియుంటిని. నన్ను మఱచిపోయినదేమో? అప్పుడు నన్ను ప్రేమింతు నన్నప్పుడు నిజమే చెప్పినదో, అబద్ధమే చెప్పినదో? అప్పుడు దానికిఁ బ్రేమ యనఁగా నర్థము తెలిసి చెప్పినదో, తెలియకయే చెప్పినదో? ఎట్లైన నేమి? ఇంకొకవరనిశ్చయమైనది. ఇప్పుడు చేయవలసిన దేమి?

"ఇప్పుడు నేను పెండ్లికి వెడలుటయా? మానుటయా? నాప్రమేయము, నాపిలుపు, నాతలఁపు లేనిపెండ్లికి నేనెందుకు? హైమ మ

ఒకని బెండ్లి చేసికొని సుఖముగ నున్న నంతియే చాలును.......
ఛీ, ఛీ, హైమను మఱొకఁడు నేను చూచుచుండఁగనే తీసికొనిపోవుట
యా? నాహక్కులను నేను మంటలోఁ గలపుకొనుటయా? నాహక్కు
లు! నాకు హక్కులేమున్నవి. మేనబావను దప్పక చేసికొనవలె నని
యన్యాయశాసనమునం దున్నది? అయిన నాకు హక్కేమున్నది?"

"ఏది యెట్లున్నను, నేను పెండ్లికిఁ బోవుట బాగుగ లేదు.
నేను పోయి హైమను, ఒప్పించి వివాహము కాకుండఁ జూడఁగలుగు
దునన్నయాశ లేదు. హైమను, ఒప్పించినను, ధనము లేదు. నన్ను
రక్షించువారు లేరు. నాపోషణభారము వహించువారులేరు. నాతల్లి
దండ్రులు నాకు సాహాయ్యము చేయరు. పోనిమ్మని యూరకుందురా
రే గాని పట్టుపట్టువారు కారు. నేను పట్టుపట్టినను, వలయుధనబలము
గాని, బుద్ధిబలము గాని నాపక్షమున నాతల్లిదండ్రు లేమాత్రమును వి
నియోగింపరు. నాకునేనొక్కఁడను సాహాయ్యము చేసికొనవలెను.
లేదా మాటలాడక యూరకుండవలెను. ఇంతేగాక, పిల్ల మైనరు. దా
నిని దీసికొనివచ్చితినేని దానితల్లిదండ్రులు నన్ను కోర్టులచుట్టు త్రిప్పు
దురు. దానికి ధనములేదు. చదువు నష్టము. ఇంతటితోఁ బోయినను
మేలే, నాహైమ, నాముద్దులహైమయైనను నాకు దొరకును. అట్లుకూ
డ జరుగదు. హైమను నేను దీసికొనివచ్చినయుత్తరక్షణములో పోలీసు
వారు నాహైమనుగూడ నాకు దక్కనీయకుండఁ దీసికొనిపోవుదురు.
నన్ను నమ్మినందులకు దానిని పోలీసుస్టేషనుల కప్పగించి యిందుస
నందునఁ జెందకుండఁ జేయవలసివచ్చును."

"సరి, హైమను విడిచి నేను జీవింపలేను. ఈసముద్రములోనో,
రైలుక్రిందనో పడి, ఆత్మహత్య గావించుకొందునా?......ఛీ,ఛీ,ఛీ,
అది నీచునిపని. ప్రపంచకములోఁ, గొంతవిద్యనేర్చి, కష్టములనుజ



యించు తెలివిలేనిపిఱికిపందలకు, ఆత్మహత్య శరణ్యము. నాకన్న నెన్ని
యోమడుఁగు లెక్కువకష్టములు పడినవారందఱును, ఆత్మహత్య చేసి
కొనిరా? భగవంతుఁడు ప్రతిమానవుని నొకపనికి, లేక కొన్నిపనులకు
సృష్టించి యున్నాఁడు. ఆపనులలో నేపని నేను చేయవలసియున్నదో
దానిని నిర్వహింపవలెను. కష్టములు వచ్చినను చలింపనివాఁడే ప్రపం
చమున ఖ్యాతి గాంచును. ప్రతి చిన్నకష్టమును హృదయవిదారకముగ
నెంచువాఁడు, అధోగతిపా లగును. వాఁడొకయరటోలికన్నను గొఱ
గాఁడు."

"కాని—ఈనాకష్టము హృదయవిదారకము కాదా? చిన్ననాఁ
టినుండియుఁ దన్నుఁ బ్రేమించినకన్య తనను మఱచి మఱొకని వరిం
చుటకన్న హృదయవిదారకమైనవిషయము ప్రణయచారిత్రమున నిం
కేమున్నది? దీనికి నేనొకప్రతిక్రియ యాలోచింపవలెను. ఆత్మహత్య
కొఱగానిమానవులకు శరణ్యము."

ఇట్టితలంపులు కృష్ణునిహృదయమున మహావేగముతోఁ బరుగు
లెత్తుచుండెను. కొంతసేపటికి సముద్రతీరమంతయు నిర్జన మయ్యెను.
కృష్ణుఁడుతప్ప వేఱెవ్వరును నక్కడ లేరు. కాని, కృష్ణరావునకావిషయ
ము తెలియనే తెలియదు. ఎట్టకేల కాతఁ డొకనిర్ధారణకు వచ్చెను.
"నేను మాతండ్రివ్రాసినట్లు, పెండ్లికిఁ బోయెదను. హైమతో నేకాం
తముగ మాటలాడుటకు సమయము చిక్కించుకొందును. నన్నుఁజూచి
నవెంటనే నాపై హైమకు ననురాగముకలుగుసనినాయాస. హైమతో
మాటలాడుదును; అడుగుదును; అనురాగభిక్షమునకై యాచించెదను.
అప్పటికైనను, దానిహృదయము మెత్తపడకుండునా? తరువాత, నప్ప
టిస్థితిగతులను బట్టి యాలోచించుకొందును. హైమకు నాపై ననురాగ
ము లేదన్నపక్షమున నేనేమియు బలాత్కరింపను. పెండ్లికిమాత్ర మ

చ్చుట నుండి ఛారింపఁజాలను. తిరిగి వచ్చివేసెదను" అని కృష్ణరావాలోచించుకొనెను.

అప్పటికి సుమారు, ఏడున్నరగంటలై యుండును. కృష్ణరావు పూటకూటియింటివైపునకుఁ బాదములు త్రిప్పెను. భోజనసమయమునఁగూడ, నాతనికిఁ దెలియకయే యాలోచన లాతనిహృదయమున నల్లిబిల్లిగఁ దిరుగుచుండెను. గదికిఁ బోయినతరువాత నతఁడు విద్యుద్దీపమును వెలిఁగించి పుస్తకమును దీయఁబోయెను. కాని క్షణములో నాతలంపు నవ్వేలకుఁ దోసివైచెను. పరుపు వైచికొని విద్యుద్దీపము నార్పి పరుండెను. అప్పటికిని, నాతనియాలోచనల కంతము గానరాలేదు. తలయంతయు వేఁడియావిరులమయమై యుండెను. దేహమునందలిప్రతిరంధ్రమునుండియు, వేఁడియావిరులు పైకుబుకుచుండెను. ముందెన్నఁడును గనివిని యెఱుంగనిచెమ్మటలు గ్రమ్మెను. కృష్ణరావు తన పరుపును జుట్టి యారుబైటికిఁ దెచ్చి వైచికొని పరుండెను. కాని యాతనికి నిద్ర పట్టలేదు. ఆలోచనలింకను నాతనిమనోవీథియందు సంక్షోభము గలిగించుచుండెను. కృష్ణరా విట్లాలోచించెను.

"హేమ యొప్పుకొను ననుకొందము. అప్పుడు తక్కినవిషయములు జరుపుట యెట్లు? వెంటనే మాయిద్దఱివివాహమును జరిగితీరవలెను. మాతండ్రిదగ్గఱనుండి యెట్లైన ధనము గ్రహింతు ననుకొనుము. పెండ్లి జరుగుట యెట్లు? దానిలో మైనరుపిల్లవిషయమున నాకెవ్వరు సహాయము చేయుదురు? అట్లైన హేమకు నాపై నిప్పు డనురాగము కలిగింపఁబూనుట, ఇప్పుడు కాఁబోవుభార్యాభర్తలయనురాగప్రవాహమున కడ్డగట్టుటవంటిది. నాకు లాభము లేకపోవుటయేగాక హేమయొక్కభవిష్యత్సౌఖ్యమునకు భంగకరమగునాయాలోచన ప్రశంసార్హము కాదు."



"ప్రశంసార్హము కాకపోవచ్చును. నాకు లేనిసౌఖ్య మితరుల కెందుకుండవలెను? హేమ నాదైనప్పుడు దానిసౌఖ్యమే నాముఖ్యవిషయము. హేమను నేనంటక, తాకక, దూరమున నిలిచి 'హేమవతిగారూ' అని పిలువవలసినస్థితి వచ్చినప్పుడుకూడ నాకసహ్యమగు దంపతులసౌఖ్యము నాకుఁ బ్రధానకార్య మెట్లగును? అట్లు చేయుట గొప్పమహాత్ముల లక్షణము. కొట్టవచ్చినవారినిఁ బ్రేమించుట, తన్నుఁ జంపుచున్నవారిని రక్షింపుమని భగవంతునకుఁ మ్రొక్కుట మహాత్ములు చేయుపని; ఏసుక్రీస్తు చేసినపని. తమసమస్తమును నితరులకు ధారపోసి యడవులపాలైన హరిశ్చంద్ర పాండవాగ్రజులపని. ప్రాణము పోయినను దెగించి యితరులకు సాహాయ్యము చేయుకర్ణదధీచుల పని. నేను వారివంటిమహాత్ముఁడను గాను. అట్టిమాహాత్మ్యమున కిది నాకుఁ గాలముగను దోఁచలేదు."

ఏదైన నొకనిర్ణయమునకు వచ్చుట యవసరమని కృష్ణరావు తలపోసెను. రాత్రి పండ్రెండుగంటలప్రాంతములకుఁ దాను పెండ్లికి రెండుదినములు ముందుగ—అనఁగా సప్తమినాఁడు బయలుదేఱి అష్టమినాఁడు—ఏలూరు చేరునట్లు తీర్మానించుకొనెను. అప్పటికి కృష్ణుని తల్లిదండ్రు లచ్చటికి వచ్చి యుండరు. వారు దశమినాఁ డుదయమున నచ్చటికిఁ జేరుదు రనియు రాత్రి లగ్నమనియు నాగభూషణముగారు వ్రాసినజాబునం దుండెను. అష్టమినాఁడో నవమినాఁడో హేమతో నేకాంతముగ మాటలాడవలె నని కృష్ణుఁడు నిశ్చయించుకొనెను. హేమప్రేమవల్లికలు తనయనురాగవృక్షము నావరించెనేని పెండ్లి యప్పటికి తప్పించుట కేదో యొకయుపాయము పన్నుటకు సాధ్యమగునను మొండిధైర్య మాతనియందు ప్రవేశించెను. హేమ యొప్పుకొనకున్నచో, వీలైనంతత్వరలో ఏలూరు విడిచి చెన్నపట్టణమునకుఁ దిరిగి

వచ్చెద నని శోకార్ద్రహృదయముతో నాతఁడు నిట్టూర్పు పుచ్చెను.

ఈయాలోచన ముగించునప్పటి కాతఁడు—హైమాపరిష్వంగ మునందు గాదు—నిద్రాపరిష్వంగమునం దుండెను. ఆనిద్రయందు కలలు లేవు, కలవరింతలు లేవు. అది గాఢసుషుప్తి. అంతకుముం దెన్నియో యాలోచనలతోఁ దిరిగిపోయినమనఃపద్మ మంతలో నిద్రాధీన మగుట ప్రకృతివిచిత్రములలో నొకవిచిత్రము. దుఃఖ మనునెడారి యం దొకసౌఖ్యావహ మగునీటిపట్టు. కారుణ్యామృతసాగరుఁ డగు భగవంతుని యద్భుతలీలయం దొకలీల.

తూర్పుతెల్లవారుచుండఁగనే కృష్ణరావు లేచెను. కాలకృత్యములను వేవేగ నిర్వర్తించుకొనెను. హైమయనురాగసంపాదనకై బలవత్తరమగు తుదిప్రయత్న మొక్కటి చేయవలసియున్నది. అట్టిప్రయత్నమునందు తిరుపతిశ్రీవేంకటరమణమూర్తికి కరివేపాకు తక్కువమైన ట్లొక్కటియును దక్కువ గారాదు. మహారాజాధిరాజులకు కోట్లకొలఁది నజరు లర్పింపవలెను. మహాసైన్యాధిపతి కొకగొప్పబిరుదము నీయవలయును. భాస్కరుఁడు దోసెడుజలముతోఁ దృప్తి నొందుచున్నాఁడు. కాని పురుషునిహృదయసామ్రాజ్యమునకుఁ బట్టభద్రత వహించి, పురుషునిభాగ్యభోగములకుఁ జక్రవర్తినియై, కుటుంబమునకు సార్వభౌమత వహింపవలసినస్త్రీకి ఏతోయములు, ఏబిరుదులు, ఏనజరులు సమర్పింపవలెను?

కృష్ణుఁడు నాఁడు చెన్నపురిబజారు లన్నియుఁ దిరిగెను. హైమ ప్రేమించువస్తులను—ప్రేమించు నని తానునుకొన్నవస్తువులను గొనెను. వాని నన్నిటిని భద్రముగఁ దనచేతిపెట్టెలో సమర్చెను. తాను కట్టికొనినబట్టలు గాక మఱినాలుగైదుమాత్రము, ఆపెట్టెలో నైచుకొనెను. మరునటినాఁటిరాత్రి మెయిలులో ప్రయాణము నిర్ధారణ చేసి



చేసికొనెను. తనస్నేహితులతో మేనమామకూఁతురుపెండ్లి యని చెప్పినయెడల వరుఁడు కాని తన్ను వారు పరిహాస మొనరింతురని భయపడి తనపినతల్లికూఁతురిపెండ్లి యని వారితోఁ జెప్పెను.

సప్తమినాఁటిరాత్రి యెప్పటివలెనే చెన్నపురిసెంట్రలుస్టేషను నందు జనులు క్రిక్కిరిసి యుండిరి. వారినడుమనుండి త్రోవ చేసికొని తనట్రంకుపెట్టెను గూలివానినెత్తిపైఁ బెట్టి కృష్ణరావు రైలులోని కెక్కెను. త్రోవలో నేమాట విన్నను, ఏవిగ్రహమును జూచినను హైమకు సంబంధించినదిగనే యాతనిమనస్సునకుఁ గన్పట్టెను. రైలులో నొకపండితుఁడు రుక్మిణీకల్యాణములోని పద్యములను జదివి యర్థము చెప్పుచుండెను. తనస్థితియు నించుమించుగఁ గృష్ణునిదే కావలయునని కృష్ణరావు పువ్విళ్లూరుచుండెను.

కొంతసేపటికి రైలుబండియం దెచ్చటివా రచ్చట నిద్రింపఁ దొడంగిరి. కృష్ణుఁడు మఱునాఁడు తానేమార్గము నవలంబింపవలెనో యాలోచించుకొనుచుఁ దనకు జయ మిమ్మని భగవంతుని బ్రార్థించుచుఁ గలఁతనిద్దురఁ బోయెను. అట్లే యేలూరు చేరునప్పటికి ఎనిమిదిగంటలాయెను. మెయిలు దిగి, రైలుస్టేషనునందే యల్పాహారములను దీసికొని కృష్ణరావు బండి చేయించుకొని యూరిలోనికిఁ బయనమయ్యెను.

---

## నాలుగవప్రకరణము.

ఏలూరుస్టేషనునందు దిగుటతోడనే కృష్ణరావునకుఁ దోఁచిన సమస్య యంతకష్టమైనది కాదు. ఏకాయెకిని పవరుపేటలో నున్న ఆగంటివారింటి కేఁగుటయా? లేక వేఱెచ్చటనైనను దిగి భోజనము

చేసి సమయము కనిపెట్టి హైమతో మాటలాడుటయా? యని కొంత యాలోచన యోజించెను. అప్పుడే గృహాభిముఖుఁడైనచో నెప్పుడో యొకప్పుడు హైమ కనఁబడకమానదు. ఏకాంతముగ మాటలాడుట కనుకూలము కలుగదు. భయముండదు కాని తనమాటయే మఱచిపోయి, తనమనోహారిణి నింకెవ్వరికో ముడిపెట్టఁబోవుచున్న తనమేనమామయింటివారు హైమతో రహస్యముగఁ దాను మాటలాడుట కంతరాయములు కల్పింపక మానరు. తన్నుఁ జూచినవెంటనే కొంతయనుమానమైనను వారికిఁ దట్టకమానదు. తాను చేయఁబోవుపనికే యంతరాయములు కలిగి యాఱునూఱగుట సంభవించును.

పై సంగతులను లెస్సగ నాలోచించి కృష్ణరావు లక్ష్మమ్మపూటకూటియింటికి బండి పట్టించెను. తాను నాలుగైదుదినము లక్కడ నుండునని చెప్పి యాయింటనే యొకగది తీసికొని తనపెట్టె నందులోఁ బెట్టికొని, భద్రముగఁ దాళము వైచికొనెను. స్నానాద్యనుష్ఠానములను ముగించి, భుజించి, గదిలోఁ బూటకూటిలక్ష్మమ్మయిచ్చిన తాటాకులచాపపైఁ బరుండి తనప్రస్తుతకర్తవ్యమును గూర్చి యాలోచించుచుండెను.

తనతల్లిదండ్రులు దశమినాఁ డుదయమునఁగాని రారు. నాఁడు, అష్టమి. కావునఁ దాను వచ్చినట్లు తనతల్లిదండ్రులకింకను దెలియదు. తాను పెండ్లియింటికి వెడలినను దనయత్తమామలును, వీరమ్మయు హైమయుఁ దప్ప నింకెవ్వరును దన్ను గుఱుతు పట్టఁజాలరు. హైమ తన్ను గుర్తుపట్టవలసియే యున్నదిగదా! వేంకటప్పయ్యగారు ఏమూలగదిలోనో మంచముపైఁ బరుండి యుందురు. ఇంక వీరమ్మను, సుందరమ్మను దప్పించుకొనుటెట్లు? వారికంటఁబడినఁ దనకార్యనాశన మగుట నిక్కువము.



ఇంతలోఁ గృష్ణరావున కొకసంగతి జ్ఞాపకమునకు వచ్చెను. ఊరిలోనివారిని బెండ్లికిఁ బిలుచుటకు సుందరమ్మయు, వీరమ్మయుఁ దప్పక వెడలుదురు. సాయంతనముపూట బయలుదేఱుదురన్నమాట వారిసంగతి పూర్తిగ నెఱింగినకృష్ణరావునకుఁ గొత్తగాదు. కాని వారు నాఁడు పిలుపులకు బయలుదేఱుదురా, మఱునాఁడు బయలుదేఱుదురా? యనుప్రశ్నకు కృష్ణరావు సమాధాన మీయఁజాలకయుండెను. ఆసమయము చిక్కించుకొని హైమతో మాటలాడవలెనని యాతఁడు తలంచెను.

కాని, నాఁడు హైమ కనఁబడనిచోఁ దనపైఁ బ్రేమ తిరుగుటకుఁ దానేమిచేయవలెను? వెంటనే తనపెట్టెలోని యొకవస్తువుదీసెను. అది యొకచిన్నగట్టిగఁగట్టిన గుడ్డసంచి. దానియం దేదో విలువగల పదార్థ మున్నట్లు కృష్ణరావుయొక్క జాగ్రత్తవలనఁ దెలియవచ్చుచుండెను. ఆసంచికిఁ గట్టిగ కుట్టఁబడిన యొకపలుచనితెల్లయట్టపైఁ దన ఫౌన్‌టెన్‌కలముతో కృష్ణరావీక్రిందివిధమున వ్రాసెను.

| | |
|---|---|
| స. కృష్ణరావు<br>60 తులసింగపెరుమాళ్లకోవెల వీథి, తిరువల్లిక్కేణి,<br>చెన్నపట్నం.<br>పంపినది. | మహారాజరాజశ్రీ<br>ఆగంటి వేంకటప్పయ్యగారికి,<br>పవరుపేట,<br>ఏలూరు. |

ఈసంచి నాతఁ డప్పుడే తీసికొనిపోయి పోస్టుకచ్చేరియందు ఇనూ్స్సరు చేయించి పంపివైచెను. దానితోడనే యొకకార్డును గూడ ఆగంటి వేంకటప్పయ్యగారిచిరునామాకు వ్రాసి పోస్టులోఁ బడవైచెను.

60 తు. పె. కోవెలవీథి,
తిరవళ్ళిక్కేణి, చెన్నపట్నం.

క్షేమం.

మహారాజరాజశ్రీ ఆగంటి వేంకటప్పయ్యగారి దివ్యపాదపద్మముల సన్నిధికి. మీ మేనల్లుడు, సర్వవరపు కృష్ణరావు అనేకనమస్కారములు.

ఉభయకుశలోపరి. హైమయొక్క వివాహమునుగూర్చి మా నాన్నగారికి మీరు వ్రాసినట్లు వినియున్నాను. నేను వివాహమునకు రాజాలనందుకుఁ జింతించుచున్నాను. కాని చిన్నప్పటినుండియు నీమె జోడుగ నాడుకొన్నవారమగుటచేత హైమవతి కొకబహుమానమును బంపుచున్నాను. నాయందు దయయుంచి దానిని స్వీకరింపఁగోరెదను. మీకు అందినవెంటనే ఆవస్తువును, ఏమాత్రమును ఆలస్యము చేయక హైమ కిచ్చితిరేని నేను చాల సంతోషింతును. తప్పులు క్షమింప వేఁడెదను. చిత్తగించవలెను.

స. కృష్ణరావు.

పోస్టుకచ్చేరియందు తనపని ముగించుకొని, కృష్ణరావు పూటకూటియింటికిఁ దిరిగి వచ్చి హైమ నేవిధముగ నాకర్షింపనగునా? యని యాలోచించుచుఁ బెట్టెలోఁ దాను తెచ్చుకొన్న విలువగలబట్టలను ధరించి, క్రాపును మనోహరముగ దువ్వి మెడపట్టీ నతిసుందరముగాఁ గట్టి నాలుగుగంటలకు ఆగంటివారింటికిఁ జనెను.

రోడ్డుపైనుండి యింటిలోని కొక్కచూడ్కి నాతఁడు పఱపెను. వీరమ్మ యెవరో దాసీదానిని గసరుచుండుట నాతఁడు చూచుటతోడనే



గుండెలలో రాయి పడెను. రోడ్డుపై నాఁగక గబగబ నడచి యాతఁడు కొంతదవ్వరిగి ప్రక్కసందులోనికిఁ దిరిగి మెల్లగ నడచుచు నాలోచించుచుండెను.

వీరమ్మ నైఖరినిబట్టి వారు మఱునాఁడు పిలుపులకు వెడలుదురని కృష్ణరావు నిశ్చయించెను. వాకిట బండిలేకుండుట, బయలుదేఱు సన్నాహము లేకుండుట, వీరమ్మ యెప్పటిబట్టలే ధరించి యుండుట— ఇవిమూఁడును నాతనియుద్దేశమును స్థిరపఱచెను. వెంటనే మఱునాఁ డావేళయప్పుడే హైమను గలసికొనుటకు రావలయునని తీర్మానము చేసికొనెను. కాని మనస్సునందు విచారము కలిగెను. నాఁడంతదూరము వచ్చి హైమను జూడకుండఁ బోవుట యాతని కిష్టము లేకుండెను. అట్లయ్యును దనతో నెక్కువకాలము మాటలాడుటకు వీలులేనప్పుడు హైమను బలుకరించినపక్షమునఁ దనకార్యహాని యగునని యాతనిమనస్సునకుఁ దట్టెను.

కృష్ణరా వింక నక్కడ నాఁగలేదు. వెంటనే పూటకూటింటికిఁ బోయి తనక్రొత్తయుడుపులను నలిగిపోకుండ భద్రపఱచి యెప్పటియుడుపులే ధరించెను. చీఁకటి పడునంతకును నాలుగువీథులును దిరిగి భుజించి కృష్ణరావు హై[illegible]ప్రయాణమునను, నాఁటిమధ్యాహ్నపుశ్రమవలనను గలిగినబడలికలు వాయునట్లు గాఢనిద్రావస్థలో మునిఁగిపోయెను.

మఱునాఁడు నాలుగుగంటలకు కృష్ణరావు తనక్రొత్తవసనములతోను హైమకొఱకుఁ దాను కొన్నవస్తుసమూహముగల సూటుకేసుతోడను సవరుపేటకుఁ బయనమయ్యెను. రోడ్డుపైనుండి లోనికిఁ జూచెను. ఎవ్వరును లేరు. అదగ్గఱనే కృష్ణరావునకు హైమస్నేహితురాండ్రలో నొక్కతెయైన చంపకము కనఁబడెను. కృష్ణరా వాపిల్లవద్దకుఁ జని చేయి పట్టుకొని యిట్లనియెను.

కృష్ణ—చంపకం, నేనెవరో జ్ఞాపకమున్నదా? మఱచిపోయి
నావా?

చంపక మతనిని దేరిపారఁజూచెను. "మఱచిపోలేదు. జ్ఞాపక
ముంది." అనియెను.

కృష్ణ—అయితే నాపేరేమిటి. చెప్పు మరి.

చంప—మీపేరు కృష్ణరావుగారు.

కృష్ణ—అమ్మా! జ్ఞాపక మున్నదన్నమాటే. సరే గాని సుందర
మ్మగారూ, వీరమ్మగారూ, ఇంట్లో ఉన్నారా? ఎక్కడికన్నా వెళ్లారా?

చంప—ఇప్పుడిప్పుడే మేమిక్కడనే ఆడుకుంటూ ఉంటే, బం
డెక్కి వెళ్లారు.

కృష్ణ—అయితే నేనొకచిన్నపని చెపుతానుగాని చేసిపెడతావు?

చంప—(కొంచెము కష్టముతో) ఏమిటో చెప్పండి?

కృష్ణ—ఏమీలేదు. చిన్నపని, (అనుచూ ఆగంటివారి వీథివా
కిలిదగ్గఱకువచ్చి) హైమవతితో, "మీబావ వచ్చి వాకిట్లో ఉన్నాఁడు"
అని చెప్పాలి.

చంపకము లోనికిఁ బరుగెత్తెను.

నాఁటిమధ్యాహ్నమే పోస్టుబంట్రోతు వచ్చి కృష్ణుఁడు ఇన్సూ
రెన్సు చేసిపంపినవస్తువును ఆగంటివేంకటప్పయ్యగారి కిచ్చివేసియుండె
ను. వెంటనే హైమవతి కాతఁడు దాని నిచ్చివైచెను. అది యొకచిన్న
యుంగరము. దానిని హైమ సంతోషముతో వెంటనే ధరించెను. ఆస
మయమున వీరమ్మయే తనవద్ద లేనిచో వేంకటప్పయ్యగారు హైమతో
బావనుగూర్చి యేమి చెప్పియుండెడువాఁడో హైమకుఁ దెలియదు.
బావమాత్రము తన్ను మఱచిపోలేదని హైమకనుఁగొనెను. ఈసంగతి
వీరమ్మకుఁ దెలియకపోలేదు, కాని తాను వివాహమునకు రాఁజాలనని



కృష్ణుఁడు వ్రాసియుంచుటచే వీరమ్మ యత్యధికసంతోషస్వాంత య
య్యెను. సుందరమ్మగారు, వీరమ్మగారు, హైమను నాయుంగరము ధ
రింపవద్దని చెప్పలేదు. మరునాఁడు లగ్నమునఁగా సంతోషముతో నుం
డు కాఁబోవుపెండ్లికూఁతురిహృదయమును కష్టపెట్టుట యుక్తము
కాదని వారికిఁ దోఁచెను.

కాని హైమకుమాత్రము మనస్సు మనస్సులో లేదు. బావ
తనవివాహమునకు రాఁడు. తానిఁక బావ నెన్నఁడైనఁ జూడఁగలుగు
నా? హృదయవిదారకమగుతనవివాహవార్త వినికూడఁ దనపైఁ బ్రే
మను విడనాడలేక తనకీముద్దుటుంగరమును బావ పంపెను. బావతోఁ
దనకు ఋణము తీఱిపోయినను, దనతో బావ కింకను ఋణము తీఱలే
దు. పందిరిమంచముపై బోర్లపరుండి హైమ యొక్కమాటు తలగడ
నంతను నశ్రుధారచేఁ దడిపివైచెను.

"బావా, నీవు నన్నే వివాహ మగుదు వనుకొంటిని. మనదే
హములును, ఆత్మలును నొక్కటే యగునను కొంటిని. కాని భగవం
తుఁ డింకొకవిధముగ లిఖించెను. ఒక్కమాటు నీముఖము చూచుట
కైన నేను నోచుకొనలేదా? ఈపాడువివాహమునకు రారాదా?—ఆఁ.
నేను తప్పుచేయుచున్నాను. బావ రాకుండుటయే మంచిది. వచ్చినను
నేను చూడకుండుటయే మంచిది. చూచినచో నిఁక నన్నుఁ బట్ట పగ్గ
ములుండవు. నాతల్లిదండ్రులమాటల నన్నింటిని మఱచి దేవతలకును
మానవులకును గూడఁ జూడ హేయనగుదును. ముక్తికి దూరమగు
దును. కావున నతఁడు రాకుండుటయే మంచిది."

ఇట్లు నిర్ధారణ చేసికొని హైమ పందిరిమంచముపైఁ బరుండెను.
కొంచెము కునుకు పట్టుచుండెను. ఇంతలోఁ జంపకమువచ్చి

చంప—ఏమోయి పగలూ రాత్రి ఒకటేలాగే ఉన్నదే నీకు!

హైమవతి ఏమో చెప్పఁబోయెను, కాని యామెకంఠమునుండి మాట రాలేదు.

చంప—నేనిక్కడి కొకపనుండి వచ్చాను. ఎవరొచ్చారు చెప్పుకో.

హైమ—ఎవరొచ్చారు—? మామామా, అత్తా వచ్చారు కాబోలు.

చంప—కాదు.

హైమ—అయితే నాకు తెలియదు నువ్వేచెప్పు.

చంప—ఇంతేనా? నీకు తెలియదూ? మీబావొచ్చాడు. వాకిట్లో ఉన్నాడు. నీతో చెప్పమని పంపించాడు.

హైమ మొదట నిది నమ్మలేదు. చంపకము నమ్మకముగాఁ జెప్పినమీఁదట నమ్మి చంపకముతో నిట్లు చెప్పెను.

హైమ—చంపకం, మాబావతో నేను చూడ్డానికి వీలులేదని చెప్పు. చావడిలో పెట్టిపెట్టుకోమని చెప్పు.

చంపకమునకీమాటలర్థముకాలేదు. "నా [illegible] స్తున్నావు. ఇక్కడికి రమ్మన్నావు. అని చెప్తా[illegible] మీబా[illegible]" అని చంపకము పరుగెత్తెను.

అట్లు పోయి కృష్ణునితో హైమచెప్పుమన్నమాటను, తాను చివర చెప్పివచ్చినమాటను చెప్పెను. హైమకుఁ దనపైఁ బ్రేమ పోయినదని కృష్ణుఁ డనుకొనెను. కాని యాలస్యము చేయక యతఁడు లోపలఁ బ్రవేశించెను. వివాహసమయమున నెందఱో వచ్చుచుందురు. "ఎవరుమీరు" రని ప్రశ్నింప సాహసించువా రుండరు. కావున కృష్ణుఁ డొకటేవిగ హైమకూర్చున్నగదిగుమ్మముదగ్గఱ నిలిచెను. అప్పుడే యువతుల నొకచిన్నతోఁటలోనికిఁ బోవుతలుపును హైమ తెఱచుచుండెను.



బూటుజోళ్ల చప్పుడు విని హైమ వెనుకకుఁ దిరిగి చూచెను. ఎదుట కృష్ణరావు ప్రత్యక్ష మయ్యెను. కృష్ణునిఁ జూచి హైమ ఖైదీవలె నేనైపునకును, అడుగు పెట్టఁజాలక యట్టె నిలువఁబడిపోయెను. తనకై దూరప్రదేశమునుండి యనురాగలాలసుఁడై వచ్చినకృష్ణుని విడిచి పోవుట కామెకుఁ గాళ్లు రాలేదు. తల్లిదండ్రులయాజ్ఞ యామెను కృష్ణునివైపున కడుగిడనీయలేదు. కృష్ణుఁడును అరనిమిష మట్లే నిలువఁబడెను.

కృష్ణ—హైమా, నేనేమి తప్పుచేశానని నామీద నీకు కోపం? నేనేమన్నా తప్పు చేసుంటే నువ్వు ఏశిక్ష అనుభవించమంటే అది అనుభవిస్తాను.

హైమకు మాట రాలేదు. తల తిరిగిపోవుచుండెను. కృష్ణునివైపొక్కయడుగు పెట్టుట కామె సాహసించెను. ఆకస్మికముగఁ గ్రమ్మిన కన్నులనీ రామె తుడుచుకొనుచుండెను. కృష్ణుఁడు తనపెట్టెను బందిరిమంచముపైఁ బడవైచెను. క్రొత్తచెన్నపట్టణపుటత్తరులు పూసినతన జేబురుమాలును హైమ కందిచ్చెను.

కృష్ణ—హైమా, నన్ను చూసి నీవేమీ భయపడవద్దు. పెళ్లికాకముందు నిన్నొక్కమాటు—ఒక్కటే ఒక్కమాటు—చూద్దామని వచ్చాను. ఈకాస్సేపైనా నవ్వుతూ ఏమన్నా ఒక్కమాట నాతో చెప్పవూ!

ఈమాటలకు నవ్వుట మాని హైమ మఱింతయెక్కువగ నశ్రువులను రాల్చుచు వెక్కివెక్కి యేడువసాగెను. ఎవ్వరైన విందురని కృష్ణునకు భయము దోఁచెను. మఱేమియు మాటలాడక కృష్ణుఁ డామెచేయి పట్టుకొనుటకు సాహసించి చిన్నదొడ్డిలోనికిఁ దీసికొనిపోయెను. ఆదొడ్డిలోనికి నాలుగుద్వారము లుండెను. వీథిలోనికొకటి, దానికెదురుగఁ బెద్దదొడ్డిలోని కొకటి, ఇప్పుడు హైమాకృష్ణులు వచ్చినద్వార

నొక్కటి. ఆప్రక్కగదిలోనుండి యొకటి. ఇంటివారివస్తుసంచయ మంతయు నిప్పు డాప్రక్కగదిలో నుండెను. దానిలోని కెవ్వరును రారు. వీథిలోనికిని, దొడ్డిలోనికిని బోవుద్వారము లెప్పటివలెనే గడియలు వేయఁబడి యుండెను. అచ్చటి కిప్పు డెవ్వరైన వత్తురన్నభయములేదు.

ఆతోఁటలో నొకజాజిచెట్టు, ఒకమల్లెపందిరి, ఒకసీతాఫలపు చెట్టుమాత్ర ముండెను. అందు ప్రవేశించుటతోడనే హైమ కృష్ణుని చేతిలోనుండి తనచేతిని లాగికొని కృష్ణునకు గజముదూరమున నిలువఁబడెను. ఆమె యిప్పుడు, అశ్రులను రాల్చుట లేదు. ఏదో యొక దృఢమగునిర్ణయమునకు వచ్చిన ట్లామెకన్నులకాంతులే తేటతెల్లము చేయుచుండెను.

కృష్ణ—హైమా, నేను పంపినయుంగరమందినదా?

ఔనని యర్థము వచ్చునట్లు హైమవతి తల నాడించెను. తన యెడమచేతిని బైకెత్తి యాముద్దుటుంగరమును బావకుఁ జూపెను.

కృష్ణ—హైమా, నీవు నాదానవుకాకపోయినను నీమీదప్రేమ ను విడగొట్టుకోలేకపోయాను. నీకు ఏయేవస్తువులు ఇష్టమంటావో అవ్వన్నీ చెన్నపట్నంలోనే కొని తెచ్చాను. అని లోనికిఁబోయి సూటుకేసు తెచ్చుచుఁ దలుపుగొళ్లెముతీసివచ్చి "హైమా నువ్వు భయపడవద్దు. నీఇష్టము లేనిదే నీఒంటిమీద వేలైనా పెట్టను" అనుచు నా వస్తువులను ఒక్కొక్కటిగఁ దీసి యామెచేతి కిచ్చెను. ఒక్కొక్కవస్తువును ఆమె యందుకొని దానివంకఁ గొంచెము చూచి క్రిందఁ బెట్టుచుండెను.

కృష్ణరావు వస్తువుల నన్నింటిని నందించెను. హైమ యన్నిటిని జూచెనే గాని యేమియును మాటాడలేదు. కృష్ణరావు హైమపాదములపై దృష్టి నానించి యొక్కనిముషము మాటాడక నిలుచుండెను.



హఠాత్తుగా తలపైకెత్తి, హైమా, నేను నీపెళ్లికి రాలేదు. నీతో పనుండి వచ్చాను......నేను నిన్ను చిన్నప్పటినించీ ఎంత ప్రేమించానో నీకు తెలియదు. హైమా, ఒకనాఁడు నువ్వు నన్నే ప్రేమిస్తానని చెప్పావు. జ్ఞాపక ముందా?

హైమవతి జ్ఞాపక మున్నదని తల యూడించెను.

కృష్ణ—హైమా, మనము మేనత్తమేనమామల పిల్లలము. మనకు భార్యాభర్తలవరస. నేను నిన్ను నాహృదయపూర్వకంగా ప్రేమించడానికి అడ్డం చెపుతావా?

హైమ మాటలాడలేదు. చలింపలేదు. నేలవంకఁ జూచుచు నిలుచుండెను.

కృష్ణ—నీవు నన్ను నిజంగా ప్రేమించడమేలేదా? హైమా! నీకోసం చెన్నపట్నానించి ఇక్కడికొచ్చాను. నీప్రేమసంపాదించడానికి వస్తువులన్నీ తెచ్చాను. అంతా నిష్ఫలమేనా? ఇదుగో, హైమా, ఒక్కమాటు చూడు. నన్నుగాక నువ్విప్పుడు ఇంకొకరిని పెళ్లిచేసుకుంటావనుకో?—

హైమ వణఁకుచు నిట్టూర్పు పుచ్చెను.

కృష్ణ—నిన్ను వదిలి నేనుండలేను. నిన్నుతాకకుండా నేను జీవించలేను. నేనిప్పుడు గాలిలో కరిగిపోతూన్నట్లున్నాను. నిన్ను చూడకుండా, నాహైమను చూడకుండా—నేనొక్కనిమిషం ఉండలేను. నీదగ్గిరగాక దూరంగా ఉండడం నాకు భయం. (హైమచేతిని దీసికొని యామృదుహస్తమును మెల్లఁగ నొత్తుచు) హైమా, నీమనస్సు మారనే మారదా? హైమా, ఇటు చూడు. నీమనస్సు మారదూ? నాప్రేమకు అంతము లేనేలేదు.......

హైమ యాతనిముఖమువంకఁ జూచెను. ప్రేమమాధుర్యముచే

నాతనిముఖ మెఱ్ఱవారి యుండెను. ఆసంధ్యాసమయమున, నానిశీథమున నాతనివాక్యము లామెతాపము నధికము చేయసాగెను.

కృష్ణ—హైమా, మళ్లా ఒక్కమాటు నన్ను చూడవూ? నువ్వు చూడందే నేనెలా జీవించడం? నేను తెచ్చినవస్తువులవిలువంతా ఒక్క చూపుతో కొనేశావు. హాస్యానికన్నా నన్నొద్దు అనకు. నీమీదిప్రేమే నామతము. నీవొక్కతెవే నామనసునంతా నింపేశావు. నేనడ్డుపెట్టలేనిమహాశక్తితో నువ్వు నన్ను నీప్రేమపాత్రుణ్ణిగా చేశావు. నిన్ను చూడకుండా ఉన్నంతవఱకు ఎలాజీవించానో తెలియదు. నిన్ను చూసినతరువాతగూడా నాప్రేమప్రవాహాన్ని ఆపడానికి నాకు శక్తిలేదు. హైమా! నేనాపని చెయ్యలేను. అది నేను భరింపలేను. నిన్ను మరి వకడు తీసికొనిపోతూంటే చూసి ఓర్చలేను. నీవు నాదానివై పోవాలి. హైమా, ఇంకా నీమనస్సు కరగలేదూ? మళ్లీ మీఅమ్మా, వీరమ్మా వస్తారు. „నేను నీదాన్ని, నీయిష్టంవచ్చినట్లు చేస్తాను.” అను! చాలు. తరవాద్ది నేను చూసుకుంటాను.

హైమ—చిన్నప్పటినించీ నిన్నే ప్రేమించాను. నామనస్సులో నీకంటే ఎక్కువగా నేనెవ్వరిని ప్రేమించలేదు. చిన్నప్పుడు కథలు చెప్పి నీమీదికి నామనస్సు తిప్పుకున్నావు. నాకు విచారం లేదు. నామనస్సెప్పుడు నీదే. నామనస్సును నువ్వు ఆకర్షించినందుకు భగవంతుడికి అనేకవేలనమస్కారాలు. నేనిప్పు డెవరిని పెళ్ళిచేసుకున్నా నామనస్సంతా నీదే. నాప్రేమఅంతా నీదే.

కృష్ణ—హైమా—

హైమ—నాఆత్మ నామనస్సు నాకు దేవుడిచ్చాడు. అతడే నాకు బుద్ధి ఇచ్చాడు. నాఆత్మా నామనస్సు నాబుద్ధిప్రకారం నడవకూడదని ప్రపంచకంలో ఎవ్వరూ అనలేరు. నాబుద్ధిపూర్వకంగా నా



మనస్సు యావత్తు నీఅధీనం చేస్తున్నాను. కాని—

కృష్ణుం డొకనిట్టూర్పు పుచ్చెను.

హైమ—కాని, నాతల్లిదండ్రులమాటను నేను జవదాటలేను. మాఅమ్మకి ఐహికాముష్మికజ్ఞానం లేదు. మాతండ్రి చాలా చదువుకున్నవాడు. పేరుప్రఖ్యాతులు గలవాడు. మాతల్లిమాట కాకపోయినా మాతండ్రిమాటైనా, నేను చెల్లించాలి. ఇది ధర్మమని చదువుకున్ననీకూ తెలుసును.

కృష్ణ—ఈతత్వం నాకు బోధపడ్డంలేదు.

హైమ—ప్రపంచకంలో నాధర్మము నివర్తించుకోవడానికి నా దేహము, మాతండ్రి ఎవ్వరిఅధీనం చెయ్యమంటే వారిఅధీనం చేస్తాను. రేపురాత్రి అధీనం చెయ్యడం అయిపోతుంది. భగవంతుం డిచ్చినహృదయంమాత్రం యావత్తూ నీకర్పిస్తున్నాను.

కృష్ణ—హైమా, ప్రపంచకంలో ఎవ్వరైనా దేవుడందరికంటే గొప్పంటారు గదా? నీకు దేవు డొకలాగు, మనుష్యు డొకలాగూ చెపితే దేవుడిఆజ్ఞేగదా నీవు పాలించాలి?

హైమ—బావా, నాదోపిచ్చితత్వం. నాకుతప్ప అదెవరికీ అర్థంకాదు. నిన్ను తలుచుకోకుండా ఒక్కగడియన్నా నేనుండలేను. నీకు తప్ప ఇంకెవ్వరికీ నాదేహం అమ్ముకోను. లగ్నకాలంలో ఎవ్వడో ఒకడు నామెడలో పుస్తె కడతాడు. అంతటితో నామనస్సు నాదేహం అతడి వెన్నటికి కావు. నేనింకొకరిని ప్రేమించకపోతే, నాప్రేమంతా ఇక అతడిమీదే ఉంటుంది. కాని నేనంతకముందే నిన్ను ప్రేమించాను. ఇంకొకమాట. ప్రపంచపద్ధతిప్రకారం పుస్తెకట్టినవాడికి నేనులొంగవలసిఉన్నా పెళ్ళిఅయి మళ్ళీ నన్ను అతడు చూడకముందే

నాకు చావు నిశ్చయమని నాకు తెలుసును. నీకుగాక ఇంకొకడికి నా దేహాన్ని అప్పగించను. భగవంతుడు నాకు చావుపెట్టకపోతే బలవన్మరణము, ఆత్మహత్య చేసుకుంటానని నీపాదాలు పట్టుకొని ప్రమాణం చేస్తున్నాను.

కృష్ణుఁడు హఠాత్తుగ హైమను కౌఁగిలించుకొని ముద్దుపెట్టుకొనెను. హైమ యాతనినెట్టు విడిపించుకొని "ఇంతఅన్యాయంగా ప్రవర్తిస్తావనుకోలేను. కాని బావా, నువ్వు చేసినపని నాకు తప్పుగా తోచదు. కాని మళ్లా ప్రయత్నించావంటే నేను చెప్పేదంతా చెప్పకుండా వెళ్ళిపోతాను." అనియెను.

కృష్ణ—హైమా, నేను ఆపుకోలేకపోయాను. నిజంగా నన్ను క్షమించాలి. మళ్ళీ నిన్ను ముట్టుకోను.

హైమ—వచ్చేజన్మంలో మనఇద్దరివివాహం తప్పదు. రేపురాత్రి ఒకయజ్ఞం. అందులో నేను యజ్ఞపశువును. దుఃఖంతో కృశించి నీమీదే దృష్టితో ఏడాది తిరిగేటప్పటికి నేనుండను. ఎల్లప్పుడూ మా బావే నాకు మొగుడు కావాలని భగవంతుణ్ణి ప్రార్థిస్తాను. భగవంతుఁడు నాప్రార్థన తప్పకుండా పాలిస్తాడు.

కొంతసేపూరకుండి మరల హైమ యిట్లనియెను. "బావా, సిగ్గు చంపుకొని నీతో ఈమాటలన్నీ చెప్పాను. సిగ్గులేనిదాన్ననుకుంటావేమో. నీకు నాస్థితి అర్థంకావడానికి, నీదగ్గిర నాకు సిగ్గేమిటని చెప్పాను. ఏమన్నా తప్పులు నేను చేసిఉంటే అవ్వన్నీ మరిచిపోతావు కాదూ? ఎప్పుడన్నా నాకు కనబడుతూ ఉంటావుగాదూ?—" మరల హైమనేత్రము లశ్రుపూరితము లయ్యెను. కృష్ణుఁడు చలింపక యట్లే నిలిచెను.

కృష్ణ—హేమా! ఈజన్మంలో మనకింతేనా? ఈజన్మంలో



నువ్వింకొకరిదానివి కావలసిందేనా?

హైమ—నేనెవ్వరిదాన్నీ కాను. భగవంతుడిదాన్ని అవుతాను. నీకేమీ విచారము వద్దు.

కృష్ణ—హైమా! నీవుతప్ప నాకింకొకస్త్రీతో అనవసరము. నీవు నన్నీజన్మంలో పెళ్లిచేసుకోవుగదా. నీపేరే తలుచుకుంటూ వచ్చేజన్మంలోనన్నా నువ్వే నాకు భార్యవు కావాలని భగవంతుణ్ణి ధ్యానిస్తూ నాజీవితమంతా బ్రహ్మచారినై ఉంటాను.

హైమ—ఇదేమిటి, బావా! నాబతుకు దుఃఖమయ మైతే శుభ్రంగా మొగపుట్టుక పుట్టినవాడికి నీకేమీ?

కృష్ణ—ఏమీ లేదు. మళ్ళీ మీఅమ్మా వీరమ్మా వస్తారు. నేను ఈరాత్రి మెయిల్లోనే చెన్నపట్టం వెళ్ళిపోతాను. మాఅమ్మా, నాన్నా వస్తే నేనొచ్చి వెళ్లానని చెప్పరు. ఈపెళ్లికుండి భరించలేను. హైమా! నీతో మాట్లాడితే స్థితిగతులు ఇలా పరిణమిస్తాయని ఎప్పుడూ అనుకోలేదు.

కృష్ణుఁ డిట్లు మాటలాడుచుండఁగనే చిన్నతోఁటలోని వీథిద్వారమును హైమ తెఱచివైచెను. కృష్ణుఁడు "హైమా! నన్ను జ్ఞాపకముంచుకో" అని చెప్పి వెడలిపోయెను. ఆనాఁటిమెయిలునందే కృష్ణరావు చెన్నపట్టణమునకు వెడలిపోయెను.

కృష్ణుఁడు వెడలిపోయినతరువాత చాలసేపువఱకును హైమ చూపు లాతని వెంబడించుచునే యుండెను. తుద కాతఁడు కానరాలేదు. సవనినాఁటిచంద్రుఁడు పూర్ణముగఁ బ్రకాశించుచుండెను. చాలసేపటివఱకును హైమ తన్నుఁ దాను మఱచి విశ్వమునే మఱచి నిలుచుండెను.

రాత్రి యెనిమిదిగంటలకు సుందరమ్మ యచ్చటికి వచ్చెను.

చంద్రబింబమునుండి వెన్నెలవెల్లువలు భూమినంతను ధవళమయ మొనర్చుచుండెను. ఎల్లెడలను ప్రశాంత మగుసుధాకరతేజమే కన్పట్టుచుండెను. ఆవెన్నెలలనడుమ నాలోచనాన్వితయై హైమ నిలుచుండెను. "హైమా! ఏమిటమ్మా, ఆలోచిస్తున్నావు?"

హైమ తల్లిమొగమువంకఁ జూచెను. ప్రశాంత మగునావెన్నెలయందు హైమచెక్కిళ్లపై రెండశ్రుబిందులు నిగనిగలాడుచుండెను. సుందరమ్మ వివర్ణ యయ్యెను.

---

## ఐదవప్రకరణము.

నాఁడు శ్రావణశుద్ధదశమి. ఆగంటి వేంకటప్పయ్యగారిగృహమంతయుఁ గలకలలాడుచుండెను. తెల్లని వెల్లపూయఁబడి తోరణములుకట్టఁబడి గడపలకుఁ బసుపు కుంకుమలు పూయఁబడి యుండెను. ఇల్లంతయుఁ గొత్తశోభఁ దాల్చియుండెను. వివాహ[illegible]కువన్నెలచిత్రశోభలతో నిండియుండవలయునో యాతళుకులన్నియును గలిగి సాక్షాదింద్రభవనమువలె నాగృహము వెలయుచుండెను.

ఆగంటివారిగృహము చాల విశాలమైనది. ఆయింటిలోనికిఁబోవుద్వారము లన్నియును దక్షిణపువైపునకే యుండెను. శ్రావణశుద్ధదశమినాఁటియుదయమున వేంకటప్పయ్యగారిగుమాస్తాయగురామయ్య యింటిసింహద్వారమున కెదురుగ నిలువఁబడి యేమేమో యాలోచించుచుండెను. ఆసింహద్వారము దక్షిణపువైపున నున్నమూఁడుద్వారములలోను మధ్య నుండెను. ఈమూఁడుద్వారములలో రామయ్యకు, ఎడమచేతివైపుననున్నద్వారము చిన్నతోఁటలోనికిని, కుడిచేతివైపు



ద్వారము వంటయింటిదగ్గఱనున్న మెరాబావిమీఁదికిని దీసికొనిపోవును. సింహద్వారమును ప్రవేశించుటకు ముందు రామయ్య కటకటాలతలుపును దెఱచెను. ఆతలుపు తెఱచుటతోడనే యేడెనిమిదిమెట్లుండెను. ఆమెట్లకు రెండువైపులను విశాలములగు రెండరుఁగులుండెను. కుడివైపున నున్నయరుఁగు, ఎడమవైపుదానికన్నఁ జాలపెద్దది. ఆయరుఁగులకు దక్షిణపువైపుకొన చుట్టును కటకటా లమర్పఁబడి యుండెను. ఆమెట్ల నెక్కి రామయ్య సింహద్వారముగుండ లోనఁ బ్రవేశించెను. ఆతఁడు ప్రవేశించినది విశాలమగుచావడి. ఆతని కెడమవైపున నాతని చేతికిఁ దగులుచు నొకగోడ యుండెను. కుడివైపున నున్నయరుఁగెంత పొడుగుండెనో యంతపొడుగు గలిగినఆనలుచదరపుచావడినంతను ఆతఁడు కలయఁజూచెను. అందమర్పఁబడిన రంగురంగులచిత్రపటముల నాతఁడు మరలమరలఁ జూచి యానందపరవశుఁడై పోయెను.

రామయ్య తూర్పువైపునకుఁ దిరిగె. చావడి పడమటికొననుండి తూర్పుకొనవఱకునుగలయనేకవిచిత్రవస్తువులను జూచుచు నాతఁడుచావడితూర్పుననున్నయొకతలుపును దెఱచెను. ఆద్వారముగుండ నాతఁడు విశాలమగునొకభోజనములచావడిలోనికిఁ బోయెను. అచ్చటఁ గూరలుతరుగువారును, పచ్చడులు చేయువారును నానావిధములుగ ననేకులమ్మలక్కలు కూర్చుండియుండిరి.

ఆభోజనములచావడికి వీథివైపున సామగ్రులుపెట్టుకొనుపెద్దగది కలదు. ఆగదికి భోజనములవసారాలోనుండి యొకతలుపును, బైట వీథియరుఁగుమీఁది కొకతలుపును గలవు. భోజనములవసారా కుత్తరపువైపున సామగ్రిగదికన్నను పొడుగగు వంటగది కలదు. అది భోజనములవసారాతూర్పుగోడను మించి యింకను తూర్పునకుచొరచుకొనిపోయి యుండెను. వంటయింటికి రెండవతలుపు దక్షిణమున [illegible]

బావిమీఁదికిఁ దీసికొనిపోవును. రామయ్య వంటయింటఁ బ్రవేశింపకుండ చావడిలోనుండి తాను భోజనములవసారాలోనికి వచ్చినద్వారమున కెదురుగ నున్నయొకద్వారముగుండ మెరాబావిమీఁదికిఁ జనెను. ఆతని యెడమచేతివైపున వంటయింటిరెండవద్వారమును, కుడిచేతివైపున వీథిలోనికిఁ బోవునొకద్వారమును గలవు. ఆమెరాబాయందు వంటయింటి నానుకొని, తూర్పుగ స్నానములగది కలదు. ఆస్నానములగది తలుపుకూడ మెరాబావైపుననే యుండెను. దానికి దక్షిణముగఁ గొంతదూరమున, అనఁగా భోజనములవసారాలోనుండి మెరాబావిమీఁదికి వచ్చుద్వారమున కెట్టయెదుట నొకబావి కలదు. స్నానములగదికిని మెరాబాకును తూర్పుగ నొకసరాసరిగోడకలదు.

అచ్చటినుండి రామయ్య మరల పెద్దచావడిలోనికిఁ బోయెను. సింహద్వారమున కెదురుగ చావడిలోనుండి వేఱొకద్వార ముండెను. ఆద్వారములోనుండి రామయ్య లోనికేఁగెను. అదియొకపొడుగైన గది. వీథిలోనిరెండరుఁగులును మెట్లును గలసి ఎంతనిడివియుండునో, అంతనిడివియు, పెద్దచావడికన్నకొంచెము వెడల్పు తక్కువయైనయాగది పొడుగుగదియని వ్యవహరింపఁబడుచుండెను. ఆగదియందు వంటయింటివైపున నొకభోషాణముతప్ప నింకేవియును లేవు. ఆపొడుగుగదికి పడమటికొనయందొకద్వారముకలదు. ఆద్వారము హైమవతిగదిద్వారము. రామయ్య ప్రవేశించినద్వారమున కెదురుగ పొడుగుగదిలోనుండి పెద్దతోఁటలోనికిఁ బోవునొకద్వారముండెను. ఆద్వారముగుండ రామయ్య పెద్దతోఁటలోనికిఁబోయి వెంటనే పడమటివైపునకుఁ దిరిగి హైమవతిగదిప్రక్కగా చిన్నతోఁటలోనుండి పెద్దతోఁటలోనికి వచ్చిద్వారముగుండ, చిన్నతోఁటలో ప్రవేశించెను. ఆతనికి ఎడమచేతివైపున హైమవతిగదిద్వారమును కుడివైపున నొకచిన్నతడకలగదియు



నుండెను. ఇంకను రెండడుగులు వేసినతరువాత నెడమవైపున సుందరమ్మగదిద్వార ముండెను. రామయ్యకు ఎదురుగ చిన్నతోఁటవీథివాకిలి యుండెను. ఆవాకిలిగుండ రామయ్య వీథిలోనికిఁ బోయి మరల నతఁడు సింహద్వారమున కెదురుగనున్నకటకటాలతలుపును తెఱచి యెడమచేతివైపున లోనఁ బ్రవేశించి పెద్దచావడిలో పడమటివైపున నున్నయొకద్వారముగుండ నొకగదిలోనికిఁ బోయెను. ఈగది వీథిలో పడమటివైపుననున్న యరుఁగునకును, పొడుగుగది పడమటిభాగమునకును నడుమ నుండెను. ఈగది వేంకటప్పయ్యగారిగది. ఈగదియందే ప్రస్తుతము వేంకటప్పయ్యగారు మంచముపైఁ బరుండి యుండిరి. ఈగదియందే ఇనుపపెట్టెకూడ నుండెను.

రామయ్యప్రవేశించినద్వారమున కెదురుగ మఱియొకద్వారము కలదు. ఆతఁ డాద్వారమున లోనికిఁజనెను. అదియే సుందరమ్మగది. అందిప్పుడు పెట్టెలు, బట్టలమూటలు, మొదలగునవేకవస్తువులుండెను. ఆగదికి దక్షిణముగ వీరమ్మగదిలోని కొకద్వారమును ఉత్తరమున హైమవతిగదిలోని కొకద్వారమును కలవు. ప్రస్తుత మది మూసియుండెను. వీరమ్మగదిలోనుండి వాకిటిలోనిపడమటియరుఁగుమీఁది కొకద్వారము కలదు. ఇదియే ఆగంటివారివిశాలమగునింటియాకృతి.

చావడియం దిప్పుడు వివాహము జరుగనుండెను. వివాహమునకు వలయునేర్పాటు లన్నియును, తు. చ. తప్పకుండఁ జేయఁబడెను. ఏలూరునందలిజను లందఱును నాఁడు వేంకటప్పయ్యగారియింటికివచ్చి యుండిరి. వేంకటప్పయ్యగారిని జూచి జాలిగొనువారు కొందఱు, సానుభూతి చూపువారు కొందఱు, "అయ్యోపాప" మనువారు కొందఱు క్రొత్తగా నేర్చుకొన్నపాశ్చాత్యపరిమళపూరితులై "నాకు చాలావిచారంగాఉంది" అనువారు కొందఱుగా నచ్చటివారు పలుకుచుండిరి.

బందుగు లందఱును వచ్చిరి. వారిలో శేషమ్మ, నాగభూషణములుగూడ నుండిరి. శేషమ్మ బండిదిగినవెంటనే, అన్నదగ్గఱకు పరుగెత్తెను. మంచముపై నాసీనుఁడై గోడ కానుకొని వేంకటప్పయ్యగారు కూర్చుండిరి. అన్నను జూచుటతోడనే శేషమ్మ యొక్క పెట్టున రోదనము చేయఁబోయెను. ఆమెమనస్సు దుఃఖపూరిత మయ్యెను. పెండ్లిజరుగునింట నేడువరాదని యెట్లో శేషమ్మహృదయతాపమును జల్లార్చుకొని వేంకటప్పయ్యగారివద్దకు వచ్చెను.

శేష—అన్నయ్యా,

వేంక—శేషీ, వచ్చావు? కూచో—నువ్వేనావచ్చావు? నాగభూషణం రాలేదూ?

శేష—వచ్చారు. బండిదగ్గిరున్నారు.

వేంక—రెండురోజులు కద్దనగా రాక మరీఇవాళొచ్చారేం?

శేష—ఇక్కడ మమ్మల్ని ఆదరించేవా రెవరు? ఎప్పుడో ఒకప్పుడు వచ్చాంగదా? కృష్ణుడు రాలేదూ?

వేంక—ఏడీ రాలేదు వాడు.

శేష—వాడిచదువుల కేమడ్డమొస్తుందోఅని రాలేదుకాబోలు.

వేంక—వాణ్ణొకమాటు చూడాలని ఉంది.

శేష—వాణ్ణి చూసేదేమిటి? అందరూ ఎక్కడో వకచోట బతికి బాగుంటే చాలు.

వేంక—ఏమిటమ్మా, అంతకోపం? నేనుచేసినతప్పేమిటి?

శేష-ఒకరిపనిలో తప్పులు పట్టడం కూడనా, నా తెలివికితోడు.

వేంక—ఏమిటో చెప్పవే మరి. చెప్పకపోతే నాకెలా తెలుస్తుంది ?

శేష—నీకు తెలిసి జరిగించేదేమిటి? వైకుంఠం?



వేంక—అది గాదే. నీమనస్సులో దేమిటో చెప్పు.

శేష—ఏంజెపితే ఏంలాభం. అయేది కాకమానుతుందా ఏమిటి ? నువ్వివ్వకపోతే మాపిల్లాడికి పెళ్లి కాకనూ పోదు; మీపిల్లే దిక్కని పట్టుపట్టుకోనూ లేదు.

వేంకటప్పయ్య మాటాడలేదు. అదివఱకే సుందరమ్మ వేంకటప్పయ్యతోఁ బెండ్లిసంబంధమునుగూర్చి శేషమ్మతోఁగాని యెవరితోఁగొని చెప్పవద్దనియు, జరుగుచున్నపెండ్లి తన కతిసమ్మతమైన దనిచెప్పమనియుఁ జెప్పియుండెను. ఆమాటలు వేంకటప్పయ్యమనస్సులో నుండెను. ఇప్పు డాసందర్భము వచ్చుటతోడనే యాతఁడు మౌనముద్రాంకితుఁ డయ్యెను. ఇంతలో నాగభూషణముగూడ నచ్చటికి వచ్చి బావగారిని కొన్నికుశలప్రశ్న లడిగి వెడలిపోయెను. శేషమ్మయు తన యన్నను వదలి మెరాబామీఁదికిఁ జనెను.

రాత్రి యెనిమిదిగంటలకు లగ్నము. చావడియంతయుఁ గ్రిక్కిరిసి యుండెను. బ్రాహ్మణులు మంత్రములు చదువుచుండిరి. ఆ మంత్రోచ్చారణములసందునను, మేళతాళములసందునను ఒకరిమాట యొకరికి వినఁబడుట లేదు. ఎవరెవ రేయేపనులు చేయుచున్నను సరియే, వారాపనుల నన్నింటిని వదలిపెట్టి వివాహము జరుగుచావడిలోనికి వచ్చుచుండిరి. తలవాకిలి, చావడి, పెద్దతోట, మెరాబా యివి యన్నియు నావిరిదీపములవెలుఁగులో ప్రకాశించుచుండెను. స్త్రీలు రకరకముల పట్టుచీరలు, బనారసుచీరలు, పారిస్‌చీరలు, లండన్‌చీరలు, ఇంక నేమైనచీర లున్న నాయాచీరలు—మృదువైనవి, విలువగలవి, సరిక్రొత్తవి, ఇదివఱకు వాడనివి—కట్టుకొని యుండిరి. విలువగలయాభరణములను ధరించి, యవి కనఁబడునట్లు పైటకొంగును సర్దుకొనుచుఁ గొందఱుస్త్రీలు నిలుచుండిరి. సన్ననిచీర కట్టుకొని ముం

జేతినుండి మోచేతివఱకును, మెడనుండి నడుమువఱకును ఆభరణము లను ధరించి చెవులకు, ముక్కులకు, కాళ్లకు, వేళ్లకు, నడుమునకు నానావిధభూషణములు ధరించి వీరమ్మ యధికారదృక్కులతో నలుగ డలఁ దిరుగుచుండెను. ఆమెకుఁ దీసిపోకుండ సుందరమ్మ యధికారదృ క్కులతోనే గాక, నధికారపదజాలప్రవాహసందోహములతో విజృం భించుచుండెను.

ఇంతలో బ్రాహ్మణులు వేంకటప్పయ్యగారిని దీసికొనిరమ్మనిరి. మధ్యాహ్న మాయనమాడపట్టునఁ గొంచెమునూనెఁ బెట్టి తలయంటి యైనదన నైనదనిపించి యుండిరి. ఇప్పుడు సుందరమ్మగారియన్నయగు కామేశ్వరరావును, వేంకటప్పయ్యగారి గుమాస్తాయగు రామయ్యయు ను లేచి వేంకటప్పయ్యగారున్నగదిలోని కేఁగి వేంకటప్పయ్య కేదో యొకగుడ్డ చుట్టి తమయెడమచేతులను రెండింటిని గలిపి జోలీపట్టి కుడిచేతులతో మెల్లఁగ నాతని వివాహవేదికదగ్గఱకుఁ దెచ్చి యచ్చట నమర్పఁబడినయొకపీటపైఁ గూర్చుండఁబెట్టిరి. చేతులు కదపవలసినప్పు డెల్ల వేంకటప్పయ్యగారు కదలలేక కూర్చుండెడివారు. ఆమంత్రము లు చెప్పుముఖ్యబ్రాహ్మణుఁడే యాపనిని జేయుచుండెను. కొంతసేప టికి “ ఏమమ్మా ! పెళ్ళికూతుర్ని రమ్మనండి ” అని బ్రాహ్మణులు కేకవేసిరి. వీరమ్మయు, కామేశ్వరరావుభార్య కామమ్మయుఁ గలసి హైమను దీసికొనిరాఁబోయిరి. హైమ చక్కనిపట్టుచీర కట్టికొని పెండ్లిబొట్టు దుఃఖపూరిత మగునాముఖమునకు వింతశోభ గొలుపు చుండఁ దనగదికిటికీలోనుండి పెద్దతోఁటవైపునకుఁ జూచుచుండెను. కాని, యామెదృష్టి దేనిపైని నిలువలేదు. ఆమెహృదయాకాశమునం దలి కాఱుమేఘములనే, యామెమనోనేత్రములు చూడఁగలిగియుండె క్షణక్షణమునకు నిట్టూర్పు పుచ్చుచు, క్షణమునకుఁ దల పంకిం



చుచు, క్షణమునకుఁ గ్రిందిపెదవిని పండ్లతో నొక్కుచు, క్షణమునకుఁ దననోరు తెఱచి “ హా ” యని లోనిగాలిని బైకిఁ బంపుచు, క్షణము నకుఁ గంటితడి చెక్కులపైకి జారకుండఁ గన్నులను త్వరత్వరగ నార్పు చు హైమవతి కిటికీవద్ద నిలుచుండెను. బలిసమయ మంతశీఘ్రముగ దగ్గఱించిన దని యామెకుఁ దెలియదు. వీరమ్మ గదిలోనికి వచ్చినసం గతియే యామెకుఁ దెలియదు. హైమముఖము చూచి కామమ్మ వెలవెలఁబోయి “ హైమవతీ ! ఏమి ఆలావున్నావు ?” అనియెను.

హైమ—ఏమీలేదత్తా ! ఈకిటికీలోనుంచి చూడు. ఆఆవిశి దీపందగ్గిర ఎన్నిపురుగులున్నాయోను.

కామమ్మ కీజవా బంతతృప్తికరముగ లేదు. కాని ప్రశ్నించు టకుఁగాని బుజ్జగించుటకుఁగాని యవకాశము చాలదు. ఆమె “ సరే గాని రా ! లగ్నంవేళైపోతూఉంది.” అనియెను.

హైమదేహలత యొక్కమాఱుగ వాఁడిపోయెను. ఇదివఱకేవిచా రగ్రస్తమైయున్న హైమవతిముఖము భయాకులిత మయ్యెను. ఆమె పై నొకపెద్దరాయి పెట్టినట్లు, దేహము కదల్పలేకపోయెను. కాని హృదయదార్ఢ్యమున నామె చావడిలోనికిఁ బోవఁ బ్రయత్నించెను. వీరమ్మ కాగ్రహ మెక్కువగుచుండెను. కాని అప్పుడే పెండ్లి కాఁబో వువధువు నేమియు ననఁగూడదని తలంచి “ ఏమే లగ్నకాలం దాఁటి పోతే ఇక సర్వకష్టాలు సంభవిస్తాయి. వాళ్లంతా కనిపెట్టుకున్నారు.” అనియెను.

ఇంతలో చావడిలోనుండి కేకలు వినఁబడెను. “ పెళ్లికూతు రేదమ్మా, పెళ్ళికూతురు ! లగ్నకాల మైపోతూంది! తొందరగా తీసు కరండి .” అని—ఇఁక నవకాశము లేదు. వధ్యశాలకుఁ గొనిపోఁబడు పశువు రాక యీడిగలఁబడుచుండును. కాని హైమమాత్రము పితృ

వాక్యపరిపాలనాపరతంత్రయై వధ్యశాల కరుదెంచెను. వాద్యఘోష
ములు చెలరేఁగెను. మంత్రఘోషము మిన్నుముట్టెను. మంగళసూ
త్రమును బెద్దలు పరీక్షించిరి. మాచారపు కేశవరావు నడుమునకు
బట్ట బిగించి యాసూత్రములను హైమవతిమెడచుట్టును గట్టెను. శా
స్త్రవాక్యము ప్రకారము హైమ యావజ్జీవమును నింక కేశవరావునకు
దాసి. కాని హైమకుమాత్ర మాసూత్రము తన్ను శీఘ్రముకాలము
ననే దుఃఖభాజన మగునీప్రపంచమునుండి స్వేచ్ఛకును, ఆనందమునకు
ను దావల మగువేఱొకప్రపంచమునకుఁ బంపు నురిత్రాఁడువలెఁ గన్పఁ
బడెను.

నాఁడు జరుగవలసినవివాహకార్యములన్నియు జరిగెను. ఎల్లరు
నానందమున మునింగిరి. అక్కడక్కడఁ గొంత విచారముగల స్త్రీపు
రుషు లున్నను సర్వజనవదనారవిందసంస్థితమైనయానందఘోషమునడు
మ వారివిచార మంతర్ధాన మయ్యెను. కాని యావిశాలప్రపంచమున
నిరువురే నాఁటిరాత్రి దుఃఖాభీలకాలసర్పముయొక్క రెండుకోరలనడు
మను జిక్కి యుండిరి. వారు హైమాకృష్ణు లని వేఱుగఁ జెప్పనక్కఱ
లేదు.

కృష్ణుఁడు చెన్నపట్టణమునకు వెడలెనే కాని యాతనిమనస్సంత
యు హైమపైనే యుండెను. దశమినాఁటిరాత్రి యెనిమిదిగంటలవఱ
కును హైమ తనదేనని భ్రమించుటకు తన కధికార మున్నదని కృష్ణుఁ
డనుకొనెను. ఎనిమిది దాఁటెనేని హైమపైఁ దనహక్కు లన్నియు బు
ద్బుదములవలె నదృశ్యములై పోవలెను. కృష్ణుఁడు తనముందు చేతిగడి
యారమును జూచుచు గూర్చుండెను. “ఇప్పుడు హైమను పెండ్లిపీట
లవద్దకు తీసుకొనివస్తూఉంటారు. హైమ వచ్చిందా? ఎవరన్నా బలా
త్కారం చెయ్యాల్సొచ్చిందా?......లేదు, లేదు. హైమ దృఢంగా నే



ఆలోచించింది. తప్పకుండా వెళ్లేఉంటుంది......ఇదిగో గుండు వినప
డ్తది. సరిగ్గా ఇప్పుడే లగ్నం. హైమ ఇక నాది కాదు. ఇతరులసొ
త్తైపోయింది.” కృష్ణునిమనమున భావవేగము లేదు. భావములయొ
త్తిడిగాని విసురుగాని యావేగముగాని కృష్ణునిమనస్సునందు చోఁటే
లేదు. కృష్ణుఁడు చేతిగడియారమును బల్లపై నుంచి పరుండెను. నాఁ
టినుండియు బ్రహ్మచారియై యుండుట కాతఁడు సంకల్పించుకొనెను.
హైమను మఱచిపోవుటకుఁ బ్రయత్నించుచుండెను. తనపుస్తకముల
వంకకు దృష్టి మరల్చి చక్కఁగఁ జదువుకొనఁ బ్రయత్నించుచుండెను.

వేలూరునందు దశమినాఁటిరాత్రి గడచినది. పెండ్లికుమార్తె
ముఖవైపరీత్యము నెవ్వరును గమనింపలేదు. కాని యామెమనోగోళ
మునందుమాత్ర మెన్నియూహలు, ఎన్నిగొప్పతుపానులు, ఎన్నిసుడి
గుండము లుండెనో ఎవ్వరికిని దెలియదు.

ఈవివాహమునందలి రెండువిషయములనుగూర్చి మాత్రము
తెలిసికొని కథాభాగమునకు వత్తము. అందు మొదటిది బువ్వముబం
తి. రెండవది నామోచ్చారణ—బువ్వముబంతి కందఱును వరుసగఁ
గూర్చుండిరి. పెండ్లికుమారునిప్రక్కనే హైమ కూర్చుండెను. భోజ
నములు సగమయ్యెను. హైమకు నిద్రాహారములు లేవు. ఏదియో
భుజించుచు నాలుగుమెతుకులను అరగంటసేపు నములుచు విస్తరివంక
నే మొగమై హైమ కూర్చుండి యేదియో యాలోచించుచు నటునిటు
చూచుచుండెను. ఇంతలో నామెవిస్తరియందు పెండ్లికుమారుఁ డేది
యో పడవైచెను. హైమ నిశ్చేష్ట యయ్యెను. ఉలికిపడెను. ఆమె
కసహ్యము దోఁచెను. కృష్ణాదత్తమైన—కాదు తనహృదబ్జమునందు
కృష్ణాదత్తమైన—తనూలతను తనమెడ కురిత్రాఁడు బిగించినయొకని
యెంగిలితో నపవిత్రీకృతము చేయుట కామె యియ్యకొనలేదు. నఱు

...సలనుండియు నానావిధభక్ష్యభోజ్యములును, ఎగిరి పడుచుండెను. ...వ్వులు, హాస్యములు, అపహాస్యములు, పరిహాసకరములగు నాశాభంగములును చెలరేఁగుచుండెను. వానినట్టనడుమ హృదయవిదారకమగు నాశాభంగముతో, సైన్యాధిపతులకు వన్నెవెట్టఁజాలుమనోదార్ఢ్యముతో, కదలక మెదలక హైమ కూర్చుండెను. బాగుగ నెదిగి పెరుగుచున్న మల్లెతీఁగెను చేతగానితోఁటమాలి త్రివ్వి తీసి వేఱొకచోట నాఁటిన నెట్లుండునో, హైమతన్మాలత యట్లు వెలవెలబోవుచుండెను. సముద్రమధ్యమునందు, సెలయేళ్ళసందున జలక్రీడావిహారములు సల్పి జాలరివానిచే గట్టునఁ బడవేయఁబడిన మత్స్యద్వితయము వలె నామెకన్నులు చురుకుదనము దక్కి యచంచలములై యుండెను. ఆమెముఖము మకరందవిహీనమైన పద్మమువలె శోభ దక్కియుండెను. చిలుకవాతినదొండపండ్ల నపహసింపఁజాలు నామెపెదవులు కాంతివిహీనములై యెండిపోయిన ట్లుండెను. పెండ్లికుమారునివిస్తరియందామె మెతుకుల నేమియు వేయఁబ్రయత్నింపలేదు. ఆమెహృదబ్జమున సంతోషము దూరముగ నుండెను. పెండ్లికుమారునియెంగిలి తాఁకుటకే యామె కసహ్యముగ నుండెను. బంధింపఁబడియు జయభేరి మ్రోగింపఁజాలిన స్కాట్లండుదేశపు మేరీరాణివలె, విప్లవములనడుమ ధీరస్వాంతయై మెలఁగిన మేరీ అంటాయనెట్టురాణివలె, అష్టకష్టముల కోర్చి యశోకవనమున సంతాపసంచలితయైన సీతాదేవివలె, కాలకౌశికునిదాసియైన పతివ్రతాశిరోమణి చంద్రమతీదేవివలె, అల్లాయుద్దీనుచక్రవర్తిని సమీపించు పద్మినీబాయివలె, శివాజీతల్లి యగుజీజీబాయివలె, ఓరుగంటిరాజ్యరమ యగురుద్రమదేవివలె హైమ తనపీఠముమీఁద నచంచలయై మౌనముద్రాంకితయై చక్రవర్తినివలెఁ గూర్చుండెను. పెండ్లికుమారునకు హైమపై నెట్టి ద్వేషకము కాలేదు. ఆమెనెపత్తఁడు చూచెను. మరల నామెను బుజ్జగింపఁ బ్రయత్నించెను. కాని లాభము లేకపోయెను. పెండ్లియందు జరిగిన బువ్వముబంతు లన్నియు నిట్లే యుండెను. ఇష్టముగానిపెండ్లి కిదియొకశకునము! ఉఁకాణికాలము సమీపించెను. పెండ్లికుమారుఁడు చక్కనిదుస్తులతో నొకకుర్చీపై నాసీనుఁడై యుండెను. చాలసంతోషముతో నున్నయాతనిముఖమును హైమ యొక్కక్షణములో మాడ్చివైచెను. హైమకు భర్త యెవ్వరు? ఆమెహృదయము కృష్ణునియందు లీనమై యుండెను. కృష్ణుఁడామెకు భర్త కాఁడు, కేశవరావు తనభర్త యనుట కామె కిష్టము లేదు. ఎంతచెప్పినను పేరు చెప్పదు.

సుంద—పేరు చెప్పమ్మా! పేరుచెప్పు......సిగ్గుపడ్డం ఏమిటి? చెప్పు.

కామ—పేరు చెప్పాలి. సిగ్గుపడితేఎలా?

ముత్తైదుసుబ్బమ్మ—నువ్వాయనపేరు చెపితే ఆయన మళ్లీ నీపేరు చెపుతాడు.

ఎవరోమంగమ్మ—ఇలా సిగ్గుపడితే ఎలా? రేపు జుట్టుబట్టుకు పేరు చెప్పిస్తాడు.

దూరమున నిల్చిన దాసీది ఎల్లి—సెప్పండి. అమ్మాయిగోరూ. సెప్పకుంటే ఎలాగొద్ది? మేమందర మినేలాగ కేశోరావుగోరు అని సెప్పండి.

వీర—ఎంత సేపేవ్. (మెల్లిగా) చెపుతావా? చెప్పి...

హైమకు కోపమువచ్చెను—(మెల్లిగా) "చెప్పించాలి"... యెను.

ఎల్లి—అలాగమ్మాయిగోరూ, అలా సెప్పాలి. ఇంకోపాలి ...వినబడేలాగు గట్టిగా సెప్పండి అమ్మాయిగోరూ.

దూరమునఁ గూర్చున్నవారు—మాకు వినపడలేదు. గట్టిగా చెప్పాలి.

వీర—(మెల్లిగా)—గయ్యాళిగంప, రాకాసి, నల్లరాయి. (కొంచెము గట్టిగా) చెప్పవే హైమా ?

సుబ్బమ్మ—అల్లుడు ముందు చెపితే అమ్మాయి చెపుతుంది.

క్రొత్తవియ్యపురాలు—అల్లు డెందుకు చెపుతాడు ? ముందు అమ్మాయే చెప్పాలి.

మంగ—ఎవరు గెలుస్తారో చూద్దాంగా ?

సుబ్బమ్మ—ఇంకా చూసేదేమిటి ? అల్లుడు చెప్పాలిసిందే.

ఎంతసేపైనను హైమ పెదవులు కదల్పలేదు. కేశవరా వంతకన్నను గదల్పలేదు. పెండ్లికుమారునిపక్షమువారికిఁ గోపము హెచ్చెను. ఓర్పు తగ్గెను. వారిలో నొకరు " ఇదెక్కడి సమంధమమ్మా ! మొండిసంమంధం ! మర్యాదస్తులనుకున్నాం. ఇలాటిదని తెలిస్తే మొదటనే వద్దందుము. " అనిరి.

హైమవతి యేమాటలకును జలింపలేదు. పెండ్లికుమార్తెపక్షమువారిలోఁ గొందఱును, పెండ్లికుమారునిపక్షములోనివారుకొందఱును వాగ్వాదమునకు డీకొనిరి. చిట్టచివర కెవ్వరును పేరు చెప్పలేదు. పోట్లాటలతోడను, శపథములతోడను నాఁటిరాత్రి గడచిపోయెను.

హైమవతిని వీరమ్మసుందరమ్మలు చాటునకుఁ దీసికొనిపోయి బుగ్గలు నులిమి చీవాట్లు పెట్టిరి. హైమ మాఱుమాటాడలేదు. బుగ్గలుతడవుకొనుచు నచట నిలుచుండెను. హైమ కేశరావుపే రొక్కమాఱైన నుచ్చరింపలేదు. కేశవరావుకూడ హైమపేరుచ్చరింపలేదు. తలుపులదగ్గఱ హైమచేఁ బేరుచ్చరింపఁజేయఁ బ్రయత్నించినవారి ప్రయత్నములన్నియు ఫలహీనము లయ్యెను. పెండ్లి యైదుదినములును వి



నోదరహితముగాఁ గడచెను. ఏలూరంతయును పెండ్లికొమార్తె మొండితనమునుగూర్చియే ప్రస్తావించుచుండెను. ఆగంటివారికిఁ దలవంపులుగ నుండెను. కాని, సుందరమ్మవీరమ్మలు దానికారణ మారయఁదలంచుకొనలేదు. ఈకారణమునుబట్టి యిరుపక్షములవారునీయవలసినకానుకలందును, కట్నములందునుబిగింపులు మొదలుపెట్టిరి. " ఇది సరిగా జరుగలేదు అది సరిగా జరుగలే " దని యందఱును దప్పులు పట్టుచుండిరి. ఇట్టివివాహమునఁ గలహములు కలుగుటకేమికొదవ ? ఒకటి, రెండు—పది—ఇరువది—నూఱు—లక్ష—కలహములమీఁద కలహములు. పోట్లాటలమీఁద పోట్లాటలు. మనస్తాపముల కిది ప్రథమకారణము.

పెండ్లికి వచ్చినవారందఱును పరిపరివిధములఁ దలపోసిరి. ఏలూరుబజారునందొకఁడు " రామయ్యా, ఏమోయ్ వెంకటప్పయ్యగారింట్లో పెళ్లికెళ్లావుగాబోలు. ఎలాజరిగింది ? " అనియెను.

రామయ్య—ఎలాగో జరిగిపోయింది.

ఒకఁడు—ఎలాగైనా మహారాజు. మహారాజుల్లాగే చేస్తారుగా ?

రామయ్య—మహారాజుల్లాగే చేశారు చెయ్యడానికి. చాలా డబ్బు ఖర్చు చేశారు.

ఒకఁడు—తొమ్మిదివేలైనవటగా ?

రామయ్య—అబ్బే తొమ్మిమివేలు కాలేదు గాని, సుమారు నాలుగైదువేలు ఖర్చుపెట్టారు.

ఈరామయ్య వేంకటప్పయ్యగారి గుమాస్తా. వేంకటప్పయ్యగారి కొమార్తెమొండితనమునుగూర్చి చెప్పుట యాతనికిఁ గొంచెము కష్టముగ నుండెనుకాని చెప్పకుండుటకును, ఆతనిమన స్సియ్యకొనలేదు.

ఒకఁడు—పెళ్లంతా సలక్షణంగా జరిగిందన్నమాట.

రామయ్య—జరిగింది కాని ఎవరికీసంతోషం లేదు.

ఒకఁడు—ఎందుచేత ?

రామయ్య—నువ్వు ఊళ్లో లేవా ఏమిటి ?

ఒకఁడు—అబ్బే, నేను నిన్నరాత్రి గుడివాడనించి వచ్చాను.

ఇంతలో మఱియొకఁడు వచ్చి—రామయ్యా పెళ్లికూతురు మొండికెత్తిందిటే ?

ఒకఁడు—ఏమిటి ? మొండికెత్తడ మేమిటి ?

రామయ్య—అదే చెప్తున్నాను. పెళ్లికూతురికి పెళ్లికొడుకుమీద ఇష్టమున్నట్లు కనపడదు. పేరుచెప్పలేదు. పెళ్లి అయిదురోజులూ మొహం వేలేసుకొని ఏడుస్తూనే ఉంది.......దానిమీద ఇద్దరికీ దెబ్బలాట లయినయి.

ఒకఁడు—ఇద్దరికీ ఎవరికి ?

రెండవవాఁడు—అదేనయ్యా ! పెళ్లికూతురివారికీ పెళ్లికొడుకువారికీని.

రామయ్య—ఇప్పుడు వీళ్లింటికాకి వాళ్లింటిమీద వాలదు. వాళ్లు గర్భశత్రువు లై పోయారు.

ఒకఁడు—పెళ్లికూతు రిలా ఉండడానికి కారణం ఏమిటి ?

రామయ్య—ఏదో కుఱ్ఱతనం.

రెండవవాఁడు—మేనత్తకొడుకు ఎవడో ఉన్నాట్టగాదూ? వాణ్ణి చేసుకోవాలనుకుందిట ?

రామయ్య—అబ్బే, ఆమాటే ఎవరూ ఎత్తుకోలేదు. లోకులు కాకుల్లాంటివాళ్లు. కాస్తుంటే గంపంత చేస్తారు.

ఒకఁడు—నేను గుడివాడలో విన్న దేమిటంటే, పిల్ల బావుందనీ, చేసుకుంటే వెంకటప్పయ్యగారిఆస్తిలో సగమొస్తుందనీ ఎవరో ఆశపడి వెంకటప్పయ్యగార్ని అడిగితే పిల్లను ఇయ్యనన్నాట్ట. అందుకని ఈసమంధాని విఘ్నంచెయ్యాలని, ఆపిల్లకు మొండిదయ్యాలు పెట్టారుట. గుడివాడలో అంతా ఇదే చెప్పకుంటున్నారు.



రామయ్య—ఇదేదో కొత్తసంగతి. ఎవరూ అనుకోలేదు. నిజమైతే కావచ్చు.

రెండవవాఁడు—లేకపోతే పన్నెండేళ్లపిల్ల ఇంతమొండికెత్తడమేమిటి !

ఒకఁడు—పాపం, ఆపెళ్లికొడు కెంతఅదృష్టహీనుడో? ముత్యంలాంటిపిల్ల. ప్రపంచకంలో ఎన్నోఉంటాయి. అది సరే గాని, పంతులుగారింట్లో ఏమనుకుంటున్నారు ?

రామయ్య—ఏదో కుఱ్ఱతనం. జరిగిందేదో జరిగిందని మాట్లాడక ఊరుకున్నారు.

## ఆఱవప్రకరణము.

వివాహము జరిగి యాఱుమాసములు కావచ్చినది. ఆయాఱుమాసములలోను హైమ కృష్ణుని జూడలేదు. కృష్ణునివద్దనుండి తనతండ్రిపేరనైన నొక్కయుత్తరమును రాలేదు. అహోరాత్రములు హైమ కృష్ణమంత్రమునే జపించుచుండెను. ఆమెకన్నులు మూసినప్పుడెల్లను కృష్ణరావు మనోహరముఖబింబమే, అతనిసుందరవిగ్రహమే యామె కన్నులకుఁ బొడకట్టుచుండెను. నాఁటిసాయంకాలము—వివాహమునకుఁ బూర్వము—నూతనవసనములను దాల్చి యపరమన్మథునివలెఁ బ

న్నతోఁటయందామెయెట్టయెదుట నిలిచినకృష్ణునిరూపమే యామెహృదాకాశమున సంచరించుచుండెను.

ప్రేమయనునేమియోయామెయెఱుంగనియీమనందే ప్రేమరసమున నామె కర్థమైనది. కాని, ప్రేమామృతమును గ్రోలుట యామె కర్థము కాలేదు. ఈప్రపంచమునఁ దనకొఱకు కృష్ణుఁడు యావజ్జీవమును బ్రహ్మచారియై బ్రదుకఁదలంచె నని యామెకుఁ దెలియును. కృష్ణుఁ డాశపథమును నిర్వహించుకొనునని యామె యెఱుంగును. కృష్ణుఁడు తనకొఱకు, తనయందలిప్రేమకొఱ కిట్టిపాట్లు పడుచుండఁ దానుమాత్రము పరపురుషుని—కేశవరావు పరపురుషుఁడుగాక మఱెవ్వఁడగును?—ప్రేమించి సుఖించుట కృష్ణున కెంతదుస్సహముగ నుండును? అంతపాపమున కొడిగట్టినఁ దానెంతతుచ్ఛురాలగును? ఈకష్టముతో, ఈదుఃఖసాగరమున మునిఁగి యామె యెన్నిదినములు జీవింపఁగలుగును? అంతకన్న మరణము శ్రేయోదాయకము గాదా? అయ్యో! తనమరణము విని కృష్ణుఁ డెంతదుఃఖించును? అది కృష్ణునియకాలమరణమునకుఁ గూడఁ గారణమగునేమో? అయ్యో హైమా! ఎంతపిచ్చిదానవు? కృష్ణుఁ డకాలమరణమువాతఁ బడినను మరల బునర్జన్మమున సందియములేకుండ నీకు భర్తయగునుగాదా? కాని, ఆత్మహత్య యంత సులభమైనపనియా! తానాత్మహత్యచేసికొనెనేని కృష్ణునకుఁ గోపము వచ్చునేమో? ఏమీ, పిచ్చితనము? తనకృష్ణునకు, ప్రేమావేశపరవశుఁడైన తనకృష్ణునకు, బావకు, తనపైఁ గోపమా? ఎన్నఁటికిని గలుగదు. హైమ యిట్లాలోచించెను.

“నేఁడో రేపో నాకు యుక్తవయస్సు వచ్చును. నాతల్లిదండ్రులు బలవంతముగ నన్ను బలిపెట్టుట నిశ్చయము. నాకృష్ణునకు నేనన్యాయము ద్రోహము చేయఁజాలను. నాయీదేహమును త్యజించి



కృష్ణునియాత్మలో లీనమైపోయెదను. కృష్ణుఁడే నాయాత్మలతను దోహదముచేసి పెంచి యందతిసుందరకుసుమగుచ్ఛముల వాసనాసారమును గ్రోలుచు సంతోషించును.”

హైమ దృఢమనస్క. తానాత్మహత్య చేసికొని జీవములను గోలుపోవకున్నచోఁ దననీతికి భంగము గలుగునన్నయాలోచన యామెను మృత్యువన్న సంతోషించుస్థితికిఁ దెచ్చెను. పండ్రెండేండ్లబాలిక. యౌవనవతి కాదు. అప్పుడే ప్రేమకొఱకుఁ దనజీవితాంతము కొఱకు నిర్బంధమరణము ననుభవింపనుండెను. ఇది యామె కాత్మహత్యగఁ దోఁచలేదు. స్వచ్ఛందమరణముగఁ దోఁచెను. మున్ను భీష్మాదులకుఁ గోరినప్పుడు మరణ మెట్లు కలిగెనో, యట్లే యామె యచంచలమానసముతోఁ గరుణామయుఁ డగుభగవంతుని బ్రార్థించెనేని స్వచ్ఛందమరణమే కలుగు నని యామె విశ్వసించెను. తనస్వచ్ఛందమరణమునే, తెలివిలేనిమనుజు లాత్మహత్య యందురు. తుచ్ఛము లగు నైహికసుఖములపై నాసపడి, నీతిబాహ్యము లగుకార్యాతురులగుమనుజులు తెచ్చిపెట్టుకొనుమరణము ఆత్మహత్య. తదేకమానసముతో, భగవద్భక్తితో, ప్రపంచమునఁ దానింకను బ్రదికినచో నీతికిని జాతికిని దూరమగుకాలము వచ్చినప్పుడు బ్రతుకుబ్రతుకు హేయమైనది. ఆబ్రతుకు బ్రతుకుటకన్నఁ జచ్చుటయే మేలని భగవంతుని యుద్దేశ మనుట నిశ్చయము. అది చావు గాదు. ప్రాపంచజీవితము యొక్కయంతము. పునర్జన్మకును, నీతిమార్గమునకును, ఆరంభము. అదియే స్వచ్ఛందమరణము. హైమతత్వమునం దామరణము తప్పు కాదు. ఆహా! ప్రేమకు మనస్సుపైని దేహముపైని నెంత శక్తియున్నది!

నాఁడు పుష్యశుద్ధనవమి. ఆనాఁటిరాత్రియే హైమ యాత్మహత్య చేసికొననెంచెను. హేమంతమారుతము పెద్దతోఁటలోనుండి

కిటికీనుండి యామెగదిలోనికి వీఁచుచుండెను. రాత్రి తొమ్మిదిగంట లయ్యెను. నలుగెలంకులను నిశ్శబ్దముగ నుండలేదు. తనతల్లియు, అక్కయు పదిగంటలకుఁ బండుకొందురు. అప్పటికే తానును బండు కొనుటకు సిద్ధముగ నుండవలెను. ఈలోపుగ నామె చేయవలసినపని యొక్కటి కలదు. కాని, ముందు తానేవిధముగ మరణము తెచ్చు కొనవలెనో హైమ యాలోచింపవలసియుండెను. ఆమెకు వెంటనే యొకయాలోచన తట్టెను. తమయింటిమొగసాలయందు బావి యొకటి కలదుగదా? నిశీథమునఁ బ్రపంచ మంతయు నిద్రాసక్తమై యున్న ప్పుడు తానాబావిలోఁబడి యేల ప్రాణత్యాగము చేసికొనరాదు? హైమ కదియే మంచిమార్గముగఁ గనఁబడెను. ఆమె కిటికీనుండి పెద్ద తోఁటవంకఁ జూచెను. చంద్రుఁడు మనోహరముగఁ బ్రకాశించుచుం డెను. నాఁడు రాత్రి రెండుగంటలవఱకును వెన్నెలకాయును. ఆత్మహత్య చేసికొననెంచినచో రెండుగంటలవెనుక నాపని జరుగవలెను. హైమ యాకాలమునే నిర్ణయించుకొనెను. కాని తనసంగతి పోలీసు వారికిఁ దెలిసినచోఁ దనతల్లిదండ్రులనుగాని, యక్కనుగాని శిక్షింతు రేమో యని యామెకు భయము దోఁచెను. వెంటనే కలమును సిరా బుడ్డియును దీసికొని యీప్రకారముగ నామె వ్రాసెను.

“నేను, ఆత్మహత్య చేసికొనఁబోవుచున్నాను. ఇది యొకరు నన్నుఁ జేసికొనుమని బలవంతపెట్టినది కాదు. నామనఃపూర్వకముగ నేనే యీపని చేసికొనుచున్నాను. నాహత్యకీప్రపంచమున నేనుదప్ప నింకెవ్వరును గారణభూతులుగారు—నాతుదికోర్కె యొక్కటికలదు. ఈయుత్తరమును జదువువారు నాకోరికను మన్నింతు రని విశ్వసించె దను. ఈయుత్తరముక్రిందనే వేఱొకయుత్తరము కలదు. దాని నెవ్వరు



ను జూడకుండ చెన్నపట్టణము, తిరవల్లికేణి, నెంబరు 60 ఇంటిలో నున్న సర్వవరపు కృష్ణరావుగారికి పంపవలెను.

హైమవతి.”
పుష్యశుద్ధనవమి.

ఇది వ్రాసి హైమవతి మఱియొక కాఁగితమును దీసికొనెను. కొంతసే పాలోచించి యీక్రిందివిధముగ వ్రాయ నారంభించెను.

“ మహారాజశ్రీ సర్వవరపు కృష్ణారావుగారి పాదపద్మములకు- సేవకురాలు హైమ అనేకనమస్కారములుచేసి చేయఁగలవిన్నపములు-”

ఇంతటితో గౌరవార్థకమగు పదసంచయ ముగిసెను. ఆమె మరల నారంభించెను.

“ నాప్రాణప్రియుఁడ వగునీకు పుట్టినుండియు నామనఃప్రాణ ము లర్పించినైచితిని. నేను బ్రదికియున్నచో నీదాననే కావలయును. ఇంకొకరి కధీననై యుండఁజాలను. కావున బావా! నాదేహమును నేఁటితోఁ ద్యజించి భగవత్సన్నిధానమున కరుగుచున్నాను. నాకొఱకు నీ వేవిధమైనచింతయు మనస్సున నుంచుకొనవలదు. నే ననుదినమును నీవే నాకు భర్తవు కావలెనని భగవంతుని బ్రార్థించుచుంటిని. పున ర్జన్మమున మనము భార్యాభర్తల మగుదు మని నాకు దృఢమగు నమ్మకము గలదు. నీకు నాయందు చిన్నప్పుడు మనమాడుకొన్నప్ప టినుండియు ననురాగము గలదని నేను విశ్వసించెదను. పునర్జన్మమున మనకు సమాగమ మగుటకు భగవంతుని బ్రార్థింపుమని నేను నిన్నుఁ గడసారి కోరుచున్నాను. నీహైమ నింక నీజన్మమునఁ జూడఁజాలవు. బావా! నీవున్నయీప్రపంచమును వీడఁజాలకున్నాను. కాని దైవ విధి నిరాఘాటముగ జరుగుఁగాక! బాల్యమునుండియుఁ దెలిసియో

తెలియకయో చేసినతప్పులను మఱచి, నన్ను నీమనోహారిణివలె ప్రేమింతు వని నమ్మెదను.

ఇట్లు
పునర్జన్మమున నీప్రాణప్రియయు, సహధర్మిణియు నగు
హైమ."

ఈయుత్తరమును మడచి పై విలాసము వ్రాసి దానిపై మొదటి యుత్తరమును మడవకయే పెట్టి, ఒకపుస్తకమును అవి గాలి కెగిరిపోకుండునట్లు దానిపై నుంచెను. ఇంతలో గడియారము పదిగంటలు కొట్టెను. తలుపు గొళ్లెము వైచి హైమ యెప్పటియట్ల చావడిలోనికిఁ బోయి తనపరుపుపైఁ బరుండెను. మెల్లమెల్లఁగ నింటిలోనివా రందఱును చావడియందే పరుండి నిదురించు చుండిరి. రాత్రి రెండుగంట లయ్యెను. అప్పుడే చంద్రుఁ డపరవారాశియందు గ్రుంకుచుండెను. ప్రపంచ మంతయు నిబిడాంధకారమున మునుంగుచుండెను. ప్రపంచ మెల్ల నిశ్శబ్దముగ నుండెను. హైమ మెల్లఁగ లేచెను. చావడి యంతయు గాఢాంధకారబంధురముగ నుండెను. చిమ్మటలు మాత్రము గోలపెట్టి యఱచుచుండెను. ఎవరైన మెలఁకువతో నున్నారేమో యని యామె నిదానించెను. తల్లియు, అక్కయు గురకపెట్టి నిద్రించుచుండిరి.

హైమ మెల్లఁగఁ జావడితూర్పుతలుపు తెఱచెను. ఆగదియం దెవ్వరును లేరు. గాఢధ్వాంతము నలుదెసల నుండెను. హైమ భయపడెను. గుండె తటతట కొట్టుకొనుచుండెను. హైమ తనభయము నణఁచుకొని తూర్పుద్వారమును తెఱచెను. వెంటనే శీతవాయువు లామెపై జివ్వున వీచెను. గదిలోవలె బైట నంతదట్టముగఁ జీకటులల్లుకొనలేదు. ఆతలుపు నట్లే తెఱచి హైమ చావడిలోనికిమరల వచ్చెను. అందఱును



గురకలుపెట్టి నిద్రించుచుండిరి. తండ్రిగదిలో మాత్రము దీప ముండెను. కాని యాతలుపు వేయఁబడియుండెను. తన్నడ్డుపెట్టువా రెవ్వరును లేరు. అంతయును ప్రశాంతముగ నుండెను. హైమ మెరాబామీఁదికి వచ్చెను. అచ్చటనేదియో యొకపదార్థ మామెకాలికిఁ దగిలెను. ఆమె యులికిపడి వంగి చూచెను. అదియొక త్రాటిముక్క— పాము కాదు. పామైన నేమి? కాలసర్పమైనచో నంతకన్న సంతోషము.

చదువరులారా! హైమవైఖరిని కనిపెట్టుఁడు. అబల. పంద్రెండేండ్లబాలిక. తోడులేనిదే యెన్నఁడును బైటఁ దిరుగనిది. అది నిశీథము. శీతకాలము. భయంకరమగుదొడ్డి. గోడపైనుండి పెద్దతోఁటలోనిచెట్లు కనఁబడుచుండెను. హైమ యాచెట్లవంకఁ జూచెను. ఎన్నఁడు నెఱుఁగనిభయ మామెహృదయమునఁ గప్పివైచెను. ఆచెట్లకొమ్మల నుబట్టుకొని వ్రేలాడువా రెవరు? యమభటులా? హైమ నిశ్చేష్టయయ్యెను. గుండె మహావేగముతోఁ గొట్టుకొనుచుండెను. ఆమె భయవిహ్వల యయ్యెను. కాని లోనికిమాత్రము పోలేదు. ఆచెట్లమీఁదఁ జూడక "కృష్ణుఁడే, బావే, నన్నూర్కే అలాధడిపిస్తున్నాఁడు" అని దృఢముగ ననుకొనెను. కృష్ణుఁడు కాఁడని యామెకుఁ దెలియును. కృష్ణుఁ డప్పుడు చెన్నపురియం దున్నాఁడని యామె యెఱుఁగును. వచ్చినను నిశీథసమయమునఁ బెద్దతోఁటలోనిచెట్లను బట్టుకొని వ్రేలాడఁడని హైమకుఁ దెలియును. ఇన్ని యెఱిఁగియుఁ దనమనస్సులోని భయభ్రాంతిని పెఱికివేయుట కట్టిభ్రమ యావశ్యక మని భావించి హైమ యాభ్రమయే నిజమని భావింపఁ బ్రయత్నించెను. ఆమెమనస్సులో నొకమూలనుండి, "వారు యమభటులే" యని యొకయూహ పొడమెను. కాని పూర్తిగ నాయూహ రాకమునుపే "కృష్ణుఁడు, మాబా

వ, ఒచ్చాఁడు. భయమేమిటె ? భయం ? బావ చాలా మంచివాఁడు”
అని తనహృదయమునందు వేఱేయూహాయు రాకుండునట్లు హైమ
యనుకొనుచుండెను. ఆమె మరల రెండడుగులు వైచెను. ఆస్నాన
ములగదిగుమ్మముదగ్గఱ నెవ్వరు ? “ అమ్మయ్యో ఇఁక నేమున్నది ?
ఏదోదయ్యం.” హైమదేహము గగుర్పొడిచెను. ఆఁ అని యఱవఁబో
యెను. నోట మాట రాలేదు. మూలనుండి యాదయ్యము గుడ్లుఱి
మి యామెవంకనే చూచుచుండెను. మఱి యేదిక్కు తిరిగినను నది
తనమీఁదికుఱుకును. దయ్యము నోరు తెఱచెను. “ ఆత్మహత్య చేసు
కోబోతున్నావ్. ఖబడ్దార్. హాఁ ! ఇదుగో మింగేస్తాను ! ఇప్పుడే మిం
గేస్తాను. ఒంటిగా చిక్కావు ఎవ్వరూ తోడులేరు. అదుగో చెట్లమీఁ
ద యమభటులు. అటుతిరిగావంటే మీఁద పడతా. నీకోసమే ఎన్నా
ళ్లబట్టో ఆహారం లేకుండా ఉన్నా. నేటికి దొరికావు. కళ్లుమూస్తే
మీఁదబడతా. కదులు. నీపని తెలుస్తుంది. అరవబోతున్నావూ ? కది
లితే మీఁదికి దూఁకుతా. ఇదుగో నాఖడ్గం. తళతళ మెరుస్తూ ఉంది.
చూశావా ? నీవెనకాల అదుగో మాఅక్క వస్తూఉంది. అట్నుంచి
అదో, ఇట్నుంచి నేనో నీప్రాణాలు దక్కనియ్యం ” అనిదయ్యమనుచు
న్నట్లు హైమకుదోఁచెను. వెనుకనుండి అక్కదయ్యము, ముందునుండి
చెల్లెలుదయ్యము, ప్రక్కను చెట్లమీఁద యమభటులు. హైమస్థితి చ
దువరులే యూహించుకొందురు గాక.

హైమమాత్రము చలింపలేదు. “ ప్రాణాన్ని త్యజిస్తూంటే,
యీభయాలకేమిటి ?” అన్నమాటనే యనేకవిధాలుగా వేఱొకయూ
హ తోఁచకుండ జపించుకొనుచుండెను. భయముమాత్రి మట్లే యుం
డెను. “ అది దయ్యంకాదు. పాచి ” అని హైమ దృఢముగ నడచి
గోడను దాఁకెను. హైమయనుకొన్నట్లది గోడమీఁద ప్రాఁచియే.



హైమ నూతిని సమీపించెను. నూతిలోనికిఁ దొంగిచూచెను. అగాధ
ము. హైమ మరల భయస్వాంత యయ్యెను. మరల భయమును త్య
జించెను. ఎంతసేపామె యట్లు నిలుచుండెనో తెలియదు. పురపాలక
సంఘపుకచ్చేరినుండి నాలుగుగంటలు వినఁబడెను. హైమ యదరిపో
యెను. నాలుగుగంటలైనది. రెండుగంటలు తానచ్చట నుంటినని
యామెనమ్మజాలకుండెను. తెల్లవాఱుకాలము సమీపించుచుండెను.
నలుగురు లేచుకాలము సమీపించుచుండెను. ఇఁకజాగు సేయరాదు.
అలస్యము లేదు. తానప్పుడే ప్రాణము త్యజింపకున్నచో నీకముం
దట్టిసమయము దొరుకదు.

ఇంతలో “ వీరమ్మా, వీరమ్మా, ఏమిటే తలుపులన్నీతీసున్నా
యి. దొంగలు పడ్డట్టున్నారు.” అని సుందరమ్మమాటలు వినఁబడియె
ను. ఈమాటలు వినుటతోడనే హైమ యోపికపట్టలేదు. ఒక్కయుఱు
కున నామె బావిలోని కుఱికెను. బావిలోనుండి “బాం” అను నొక
ప్రతిధ్వని వినఁబడెను. భళ్లున చప్పుడయ్యెను. వీరమ్మ యాచప్పుడు
ను తల్లికేకలను గబుక్కున లేచి వేంకటప్పయ్యగారి గదిదీపము తీసికొ
ని తల్లియొద్దకుఁ బోయెను.

సుంద— హైమ ఏదీ ?

వీరమ్మ హైమపరుపువంకఁ జూచి “ హైమ లేదు. బావిలో
పడ్డదేమోనే !” అనియెను.

సుందరమ్మ హఠాత్తుగ లేచి బావిదగ్గఱకుఁ బరుగెత్తిపోయి గుం
డెలుబాదుకొనుచు “ ఏమర్రోయ్ ! హైమ బావిలో పడ్డది. బావిలో
పడ్డది. అయ్యో !” అనియెను. ఈకేకలు నీయార్తనాదములు విని
యిరుగుపొరుగువారందఱును బరుగెత్తికొని వచ్చిరి. అందఱును బావి
చుట్టును మూగిరి. దీపములమీఁదదీపము లచ్చటికి వచ్చెను. తొంగి

చూచువారే గాని సాయము చేయువారు లేరు. తల్లియార్తనాదము
లు బావియందు ప్రతిధ్వనించుచుండెను. ఆజనసమూహమునుండి
యొక్కఁడు బావిలోని కరికి యొక్కమునుకతో హైమను జుట్టు పట్టు
కొని లేవఁదీసి ‘‘తాటిని గట్టిగా పట్టుకొని కిందికి పడెయ్యండోయ్’’
అనిమాత్రఁ డఱచెను. మరల హైమతో నాతఁడు మునిఁగెను. అప్పు
డు త్వరత్వరగ త్రాటి నొకదానిని బావిలో విసరి రెండవకొనను నలు
గురైదుగురు పట్టుకొనిరి. మునిఁగినవాఁడు హైమను నెడమచేతితోఁ
బట్టుకొని కుడిచేతితో త్రాటిని బట్టుకొని వ్రేలాడుచు త్రాటికొనను
హైమనడుమునకును, జేతులకును గట్టి పైకిలాగుఁడని సైగచేసి మరల
నతఁడు నీట మునిఁగెను. హైమను పైకి లాగి బావియొడ్డునఁ బడవై
చిరి. ఇంతలో బావిలోనివాఁడు బావిలో నీఁదుచు త్రాడు పడవేయుఁ
డని యఱచెను. ఆత్రాటిని బట్టుకొని యాతఁడు పైకెక్కి వచ్చెను.

సుందరమ్మ ‘‘నాయనా! ఇంకా ప్రాణముందా?’’ అని రాగ
ములు పెట్టి యేడ్చుచుండెను. బావిలో దిగినవాఁడు—‘‘ఇంకో ఐదు
నిమిషాలుంటే చల్లబడేదే.’’ అనియెను. ఇంతలో ప్రక్కయింటినుండి
‘‘బాయ్‌స్కౌటొక్కఁడు వచ్చి ప్రథమచికిత్స చేయుచుండెను. డాక్టరు
గారికొఱ కొక్కఁడు పరుగెత్తెను. డాక్టరుగా రరుదెంచి చేతిని పట్టి
చూచి యప్పటికేదో కొంతచికిత్స చేసి ‘‘ప్రాణభయం లేదు. ఇంటి
లోకి తీసికెళ్ళి ఆడవాళ్లెవరో పొడిగుడ్డ చుట్టి మంచంమీద పడుకోబె
ట్టండి. తలుపులన్నీ తీసి పెట్టండి. ఏడుగంటలకు మళ్లీ వస్తాను. అప్పు
డు మందిస్తాను. మీరేం భయపడకండి. ఈలోపుగా స్పృహవస్తుంది.
మంచంచుట్టూ పదిమంది చేరగూడదు.’’ అని చెప్పెను.

సుంద—అయితే ప్రాణభయం లేదుగదా! డాక్టరుగారూ!
మీరేమీ అనుమానించొద్దు. ఉన్నమాట చెప్పెయ్యండి.



డాక్టరు—ప్రాణభయం లేదండి. లోపలికి కొద్దిగా నీళ్లుపోయి
నాయి. ఏడుగంటల్లోగానే స్పృహవొస్తుంది.

అని చెప్పి డాక్టరుగారు వెడలిపోయిరి. చుట్టుప్రక్కల నమ్మల
క్కలును, అయ్యలును ఏమేమియో వితర్కించుచుండిరి. హైమ లో
పలికిఁ గొంపోఁబడెను. డాక్టరుగారు చెప్పినప్రకార మంతయు జరుపఁ
బడెను. చావడియందొక మంచముపై హైమ పరుండెను. అన్నికిటికీ
లును, అన్నితలుపులును తెఱవఁబడెను. ప్రభాతవాయువులును చావ
డిలోనికి విచ్చలవిడిగ వచ్చుచుండెను. హైమ కప్పుడే స్పృహ వచ్చు
చుండెను. కాని యింకను బూర్తిగ నీ ప్రపంచమున కామె రాలేదు.
ఆమె కన్నులింకను దెఱవలేదు. కాని యామెముఖమున మందహాస
మొక్కటిమాత్రము తాండవమాడుచుండెను. చూచుచుండఁగానే భా
స్కరుని ప్రథమకరస్పర్శచే విచ్చుచున్న యంభోజముకుళమువలె నామె
పెదవులు విచ్చుచుండెను. ‘‘బావా, చూశావా? నీకోసం ఎంతపని
చేశానో! ఇఁక నిన్నూ నన్నూ ఎవరూ వేఱుచెయ్యలేరు!! అనెను.
కొంచెముసేపుండి యామెపెదవులనుండి ‘‘ఏదిబావా మళ్లీ ఇంకోమా
టు ముద్దుపెట్టుకోవూ? ఇఁక నీదాన్నేగా’’ అను మాటలు వెలువడె
ను. మంచము దగ్గఱ కనిపెట్టుకొని యున్న సుందరమ్మ కీమాటలు
సంతోషమును గోపమును గూడఁ గలిగించెను. కొమార్తె బ్రదికినం
దుకు సంతోషము. బావనే ప్రేమించినందుకు కోపము. కాని మాతృ
హృదయము క్రోధపూరితమై కొలఁదికాలమే యుండఁగలదు. ప్రస్తు
త మామె కొమార్తె బ్రదుకునా బ్రతుకదా యని తహతహపడుచుం
డెను. ఆమాట లామెను హర్షాబ్ధిలో ముంచివైచెను. క్రమముగా
హైమ కన్నులు విచ్చెను. ఆమె తాను పండుకొనినచావడి నలుదెస
లును గనుఁగొనెను. ఆమెముఖమునందు మందహాసమునకు బదులు భ

యమును, విచారమును, అనుమానమును గలిగెను. "ఇప్పుడు నేనెక్కడున్నాను. ఇది చెన్నపట్నం కాదూ! ఏలూరులో ఇంటిలా ఉందే. ఇక్కడి కెప్పుడొచ్చానూ?" అని హైమ యనుటయు సుందరమ్మ యింక నూరకుండఁజాలక "హైమా, ఎలాగుందమ్మా, ఒంట్లో?" అనియెను.

హైమ తల్లివైపుచూచి, "మనింటి కెలా వచ్చాను? నువ్వే తీసుకొచ్చావా" అనెను.

సుంద—డాక్టరుగారొచ్చి మందిస్తారు జబ్బు చేస్తుంది మాట్లాడకు.

హైమ మంచముపై లేచి కూర్చుండెను. ఆమె కిప్పు డన్నియు నర్థమయ్యెను. తాను చేయఁబూనిన ప్రయత్నము విఫల మయ్యెనని యామె తెలిసికొనెను. తానిప్పుడే యనుభవించినయానందము స్వప్నము గాని నిశ్చయమయినది కాదు. బావిలోనుండి తన్నెవరో పైకిఁదీసిరి. తనజీవితమును దుఃఖభాజనముచేసిరి—మరల నామె శోకార్ద్రచిత్తయై మంచముపైఁ బడిపోయెను. వైద్యుఁ డేమియో మందుల నిచ్చెను. క్రమక్రమముగ హైమకు దేహము స్వస్థమగుచుండెను.

మొదటిదినమున వైద్యుఁడు వెడలిపోవుటతోడనే యొందఱెందఱో వచ్చి కుశలప్రశ్నములు వైచిరి. వారిలో నొకయావిడ "ఏమమ్మా, బావిలో ఎందుకు పడ్డావు?" అని యడిగెను. హైమ మాటాడలేదు.

సుంద—పైకెళ్లాలని వెళ్లింది. బావిలో చేదవెయ్యబోయి చీకట్లో లాగలేకపోయింది. తాడు లాగేసింది. చుట్టచుట్టుకు బావిలో పడ్డది.

ఆవిడ—ఎవరినన్నా తోడు తీసికెళ్లలేకపోయిందా?—



సుంద—ఏమో తెల్లవారుతూంది గదా అని వెళ్లింది. అంతలో బావిలోపడ్డది.

ఆవిడ—ఈవ్వాళ గండమమ్మా ఎంతగండం?

సుంద—గండమా, మరీగండమా? ఆయుష్షు గట్టిగా ఉండబట్టి బతికింది.

వీరమ్మ చేత రెండుకాగితములు పట్టుకొని ప్రవేశించి "అమ్మా, చూశావా, దీనిదుండగీడుదనం?" అని కృష్ణునకు హైమవ్రాసినయుత్తరము తల్లిచేతికిచ్చెను.

ఆవిడ—ఏమిటమ్మా, ఆకాయితాలు?

సుంద—ఏవో కాయితాలు.

ఆవిడ వెడలిపోయినతరువాత తల్లి క్రోధదుర్నిరీక్షయై యాయుత్తరములను చదివి "ఆత్మహత్యకు సాహసించావుటే. నీపేరిమ మండిపోనూ! అందరికీ తెలిస్తే ఎంతఅప్రదిష్ట. పెళ్లైనమొగుణ్ణి వదిలిపెట్టి దొంగఉత్తరాలు వ్రాయడం నేర్చుకున్నావుటే. ఎంత అపఖ్యాతి!" అని గద్దించెను.

వీర—ఇది బావిలో పడ్డది. అలాగన్నా పోతే బాగుండును. మన కప్రదిష్ట తెచ్చిపెట్టడానికే దీన్ని పైకితీశాం.

హైమ చలింపలేదు. ప్రత్యుత్తర మీయలేదు. కొంతసేపటివఱకును, ఎడతెగక సంతతధారగ వీరమ్మ సుందరమ్మల దూషణప్రవాహము సెలయేఱ్ఱ నధిగమించి ప్రవహించుచుండెను. కొంతయుద్ధృతము తగ్గినవెనుక నామె "అమ్మా! ఆకాయితాలు నాకిస్తావా?" అనియెను.

వీర—దొంగవుత్తరాలు దాచుకుంటావా?

హైమ మాటాడలేదు. సుందరమ్మ యాకాగితములను చింపి

క్రిందఁ బాఱవైచెను. హైమ యాతనుకొలవంకనే చూచుచుఁ బరుండెను. ఆమెకన్నులు కళావిహీనములై యుండెను. కొంతసేపటికి కామె కన్నులు మూసికొని యొకగంటయైనవెనుక గాఢనిద్రావస్థలో నుండెను. సుందరమ్మ తనపనిని చూచుకొనఁబోయెను. తల్లి యటు తిరుగుటతోడనే వీరమ్మ తునుకలై పడియున్న కాగితములను దీసి వేఱొకకాగితముపై నాయుత్తరములమొదటియాకారము వచ్చునట్లుగా నంటించి తడి యాఱినవెనుక భద్రముగ వానిని తనపెట్టెలో నుంచుకొనెను. ఆమె యెందుల కది దాఁచుచున్నదో యామెకుఁదప్ప నింక నెవ్వరికిని దెలియదు. ఆయుత్తరమునుదలంచికొనినప్పుడెల్ల వీరమ్మ కెక్కుడలేనిసంతోషమును గలుగుచుండెడిది. ఆయుత్తరపుముక్క లేమయ్యె నని యెవ్వరు నడుగలేదు. హైమవతి యడుగసాహసింపలేదు.

నాఁటిమధ్యాహ్న మొకఁడు వచ్చి "వేంకటప్పయ్యగారున్నారండీ?" అని ప్రశ్నించెను. ఆతఁడీయాత్మహత్యవిషయమై యేమియో కనుఁగొనుట కరుదెంచెను. కాని యది యాత్మహత్య కాదనియు త్రాటిని లాగలేక త్రాటితోనే బావిలోఁ బడె ననియు సుందరమ్మ చెప్పెను.

అతఁడు—తాడుతో పడితే, తాడూ బొక్కెనా కూడా పడాలి. పిల్లమాత్రం ఎందుకు పడ్డదీ?

సుంద—తాడూ పడ్డది. పడకపోవడమేం. ఇరుగుపొరుగువాళ్ళను కనుక్కోవచ్చు.

వచ్చినయాతఁడు "సరే లెండి. దీనికి బ్రహ్మాండ వేమిటి? వెడతాను. గొప్పగా బతికినవాళ్ళని అట్టే తంటాలుపెట్టడం మాపద్ధతి కాదు." అని గిరుక్కున మరలి వెడలిపోయెను.

## ఏడవ ప్రకరణము.

హైమ యాత్మహత్యకై చేసినప్రయత్నము బైటికి రాకుండ, ఆగంటివారు కప్పిపుచ్చిరి. ఈసంగతి రాజమహేంద్రవరమునందుగాని, కాకినాడయందుగాని, చెన్నపురమునందుగాని యెవ్వరికిని దెలియలేదు. హైమయు దుఃఖాకులితస్వాంతయై దినములు గడపుచుండెను. హైమ వివాహమునందు జరిగిన ఘోరకలహములఫల మందఱు ననుభవింప వలసియుండెను. ఆగంటివారు మాచారపుకేశవరావును సంక్రాంతికిరమ్మని యుత్తరము వ్రాసిరి. కేశవరావునకు పోవలెననియే మనస్సునం దుండెను. కాని తల్లిదండ్రు లాతనిఁ బోకుండఁజేసిరి. పెండ్లియందుఁ దమకు జరిగిన యవమానములను జ్ఞాపకమునకుఁ దెచ్చిరి. అట్టివారితో నింక సంబంధము కూడదనిరి. వేఱొకపిల్లను వివాహ మాడుటయే యనువగుమార్గ మని కేశవరావునకు బోధించిరి. ఆగంటివారిమాట మఱచి పొమ్మనిరి. వారిమద మడఁచుటకు వేఱొకవివాహమే మందనిరి. కేశవరావు మనస్సులో నేమియుద్దేశ మున్నదో మనకుఁ దెలియరాదు. ఆతఁడు తల్లిదండ్రులమాటలకు "ఊఁ" కొట్టి యూరకొనెను. అత్తవారంపిన యాహ్వానమునకు ప్రత్యుత్తర మీయక సంక్రాంతిపండుగకుఁ గూడ వెడలక కేశవరావు రాజమహేంద్రవరముననే యుండెను. కేశవరావుతండ్రి తనకుమారునికొఱకు రెండవపెండ్లికి సంబంధములు వెదకుచుండెను. ఈసంగతి రాజమహేంద్రవరమున కామేశ్వరరావునకుఁ దెలిసెను. వెంటనే యాతఁడు మాచారపువారింటికిఁ జని సంగతి విచారించవలె ననుకొనెను. రెండుమూఁడుమాఱు లరిగినను నరసయ్యగారింట నుండియే లేదనిపించిరి. తుద కెట్లో కామేశ్వరరా వాయనను పట్టుకొనెను.

నర—అయ్యా! రండి. ఇలా దయచెయ్యండి.

కామేశ్వరరావు లోనికి వెళ్లెను. నరసయ్యగారు లోనికేగిరి. అరగంట యయ్యెను. పైకి రాలేదు. కామేశ్వరరావు ప్రాణము విసిగిపోవుచుండెను. తుదకు నరసయ్యగారు బైటికి వచ్చి ‟చాలాసేపైంది. వచ్చారు. ఏదో కొంచెం అవసరమైనపనుండి అది చూచుకుంటూ కూర్చున్నాను.” అని చెప్పిరి.

కామే—ఫర్వా లేదులెండి. తమదగ్గిరికి పనుండొచ్చాను. కొంత మాట్లాడాలి.

నర—అలాగే. దాని కభ్యంతర మేమిటి?

కామే—మీఅబ్బాయి కెక్కడో రెండోసమంధం ఆలోచిస్తున్నారని విన్నాను.

నర—చిత్తం. విచారిస్తున్నాను. రెండుమూడుసమంధాలున్నాయి. తమ కెక్కడన్నా తెలుసునా ఏమిటండి?

కామే—నాసంగతి మీ రెరగనివాళ్లు గారు, మీసంగతి నేనెరగనివాణ్ణి గాను. పుట్టినప్పటినుంచీ ఇద్దరం ఈఊళ్లో ఉన్నాము. అయిందా అండి. నేనే మాట్లాడి కావాలని మాచెల్లెలుకూతిర్ని మీ అబ్బాయికి చేయించాను.

నర—అదోగొప్పగా చెపుతున్నారా ఏమిటి? పొరపాటున చేసుకున్నాము. మొండిసమంధ మని మాకు తెలియలేదు.

కామే—గడచినవేమిటో గడచి పోయినాయి. పెళ్ళిలో ఏం జరిగిందో ఏమిటో మరిచిపోవాలి.

నర—మరిచిపోవాలీ? ఏమిటి మరిచిపోయేది? పెద్దదగ్గిరనుంచి చిన్నదాకా మమ్మల్ని అవమానపరిచింది కాకుండా మరెంత ఎగసన త్రొయ్యడాని కొచ్చారా ఏమిటి, మీరు?



కామే—మీబోటిపెద్దలు కోప్పడ్డం ఉచితం కాదు. పిల్లా పిల్లాడూను సుఖపడితే చాలు. అయిపోయినవన్నీ తవ్వుకుంటూ ఉంటే వాళ్ళసుఖంకూడా చెడిపోతుంది.

నర—ఇప్పుడు సుఖ మేంతక్కువైంది? మరోపిల్లను చూసి ఈయేడాదిలో ముడిపెట్టేస్తాను.

కామే—పిల్ల యావజ్జీవం దుఃఖిస్తూ అఘోరిస్తూ ఉండవలసిందేనా?

నర—పేరు చెప్పమంటే తెగసాగింది. మొండికేసింది. ఆపిల్ల మాకెందుకు? పూర్వజన్మాన ఏంపాపం చేశామో ఈసమంధం దొరికింది.

కామే—ఒకఊరివాళ్ళం. కొత్తవాళ్ళంకాము. ఎరిగినవాళ్ళం. మనతప్పులు మనం సర్దుకోవాలి.

నర—అందుకనే చెపుతున్నాను. తప్పులో ఒప్పులో ఎవళ్లవి వాళ్ళదగ్గిరే ఉంటే మంచిది. మాదోవ మాది, వాళ్ళదోవ వాళ్లదీని.

కామే—నేనుచెప్పేమాట కాస్త వినండి.

నర—మీరుచెప్పేది నాకు తెలుసును. ఓమాటు మీమాట విని అనుభవించింది చాలును...... నాకు తొందరపనుంది. శలవు తీసుకుంటాను.

ఈమాటలతో నరసయ్య వెడలిపోయెను. కామేశ్వరరావుకూడ ఇంటిదారినే పోయెను. ఏమి చేయుదమా యని యాత్రడాలోచించి తనచెల్లెలు సుందరమ్మపేర నొకకార్డు వ్రాసెను. దానియందు మాచెంపు నరసయ్యగారు వేఱొకసంబంధముకొఱకు వెదకుచుండుటయు, తానాప్రయత్నము వారింపఁ బ్రయత్నించియు విఫలుఁడగుటయు మున్నగువిషయములను వ్రాసెను.

ఉత్తరము వచ్చునప్పటికి సుందరమ్మయు వీరమ్మయు పచ్చీసాట నాడుచుండిరి. వారీయుత్తరమును చూచి వెంటనే వెంకటప్పయ్యగారి వద్దకుం బోయిరి.

సుంద—మా అన్నయ్యదగ్గిర్నించి ఉత్తరం వచ్చింది.

వేంక—ఏమని ?

సుంద—వాళ్లు వేరేసమంధం విచారించుకొంటున్నారని.

వేంక—ఎవరు ? హైమఅత్తవారా ?

సుంద—ఇంకెవరు మరి ?

వేంక—పెళ్లిలో వద్దే అంటూంటే తెగపోరు పెడితిరి. వారికవమానంగాదూ మరి ?

సుంద—ఎంతఅవమానమైతేమట్టుకు పిల్లను కాదని మరోసమంధం చేస్తాడా ?

వేంక—చేస్తాడా ఏమిటి ? చేస్తున్నాడని కాదూ ఉత్తరంలో చదివావూ ?

సుంద—ఎంతమొహమాటం లేనిపని ?

వీర—దీనికంతా హైమే కారకురాలు. వెధవబావకోసం వేషాలేసింది. దీనిరోగం బాగాకుదురుతుంది. ఒకటా, రెండా దీనివల్ల మనకు కష్టాలు ?

సుంద—ఏదీ హైమను పిలు.

వీరమ్మ హైమను తీసికొనివచ్చెను.

సుంద—మీఅత్తవారు చూశావా ? నీగొంతుకు 'కటిక్క' ని ఉత్తరించడానికి సిద్ధంగా ఉన్నారు.

హైమ కష్టము కాలేదు. రెండుకన్నులను తల్లి కప్పగించి నిలుచుండెను.



సుంద—మామ ఉత్తరం వ్రాశాడు. మీఅత్తవారు, మీఆయనకి మరోపిల్లని విచారిస్తున్నారట. ఇదంతా పెళ్లిలో నీదుండగీడుతనంవల్ల వచ్చింది.

వీర—యావజ్జీవం అనుభవించాలిసిందే. చేతులారా తెచ్చిపెట్టుకున్నది అనుభవించకేంజేస్తుంది ?

హైమ—దానివల్ల మనకేమిటి నష్టం ?

సుంద—అయ్యో, నీరాతా ! నీమొగుడు నిన్నొదిలేసి ఇంకోదాన్ని చేసుకుంటే నీబతుకెందుకు ? నలుగుర్లో నీకూ మాకూ గూడా తలవంపులు గావూ ? ఇదివరకే ఒకామె పుట్టింటనే పడుండెగదా అనుకుంటే, నువ్వుగూడా ఒకతెవ్వ. ఎక్కడికెళ్లినా నిన్నుగూడా వెంటబెట్టుకెళ్లాలి. పుట్టింది మొదలుకొని బతికున్నంతకాలమూ పుట్టింటనే బతకడము చిన్నతనం కాదుకాబోలు.

హైమ—పోయేదాన్ని పోనియ్యకుండా మళ్లీ ఎందుకు పైకి తీశారూ ?

వీర—నిన్నుగుడించి యావజ్జీవం కష్టాలనుభవించడానికి. పీడవిరగడైపోతే అన్నా బావుండేది.

వేంక—ఎవరిమొహాన ఎలా రాశుంటేఅలా జరుగుతుంది. హైమా, నువ్వేళ్లు. ఏంజేస్తాం ? చేసుకున్నకర్మం అనుభవించాలి, నువ్వూ, నిన్నుగుడించి మేమూను.

హైమ మెల్లగ తనగదిలోనికి వెడలిపోయెను. కేశవరావు మఱియొకతెను వివాహముచేసికొనంబోవుచున్నాఁడు. ఇఁక తనకును అతనికిని సంబంధముండవలసిన యవసరము లేదు. అనతికాలముననే మరల నాత్మహత్య చేసికొనం బ్రయత్నించుట యనవసరము. బావయందే తనమనస్సును లగ్నముచేసికొనవచ్చును. అని ఆమె సంతోషించెను.

ఆమె వేంకటప్పయ్యగారిగదిలోనుండి బైటకు వచ్చుటతోడనే సుంద
రమ్మ వీరమ్మలును బైటకువచ్చివేసిరి. సుందరమ్మ కేమిచేయుటకును
పాలుపోలేదు. అల్లునొక్కమాఱు పిలిపించి నయభయములఁజెప్పి రెం
డవవివాహము తప్పింపవలెనని యామె తలపోసెను. కాని, యొకమా
ఱు పిలిచిన, రానియల్లుఁడు మరల నెట్లు వచ్చును? క్రోధసంభరితుఁ
డై యున్నయల్లుని నింటికిఁ దీసికొనివచ్చునుపాయమేది?

ఇట్లు వితర్కించుకొనుచుఁ దనలోఁదానే యొకప్పుడును, వీరమ్మ
తో నొకప్పుడును సుందరమ్మ ఆలోచించుచుండెను. ఎన్నిదినము లా
లోచించినను ఉపాయము పాలుపోలేదు. చేసినపనికి స్వయముగ
పోయి క్షమాపణ చెప్పుకొనుటకు సుందరమ్మగాని వీరమ్మగాని సహిం
పఁదలఁచుకొనలేదు.

కాలచక్ర మతిత్వరితముగ తిరిగిపోవుచుండెను. సంవత్సరాది
పండుగ సమీపించుచుండెను. రాజమహేంద్రవరమునకు మఱియొక
యుత్తరము వ్రాయఁబడెను. ఈపండుగకైనను తప్పక రావలెనని
గుట్టు రట్టుగాకుండ, బెట్టుచెడకుండ, మనస్సునకు నచ్చునట్లు ఒకనాఁటి
పగలంతయు వినియోగించి సుందరమ్మవీరమ్మలు ఆయుత్తరమును వ్రా
సిరి. ఆసమయముననే కామేశ్వరరావునకును, ఒకయుత్తరము వ్రాయఁ
బడెను. స్వయముగ పోయి వారిని బలవంతపెట్టి కేశవరావునైనను
పంపునట్లు చేయవలసినదని—సుందరమ్మయే దానిని వ్రాసెను. కోప
ముగలమనుజులలో రెండురకములవారు గలరు. మరణకాలమువఱకు
ను పగసాధించువారొకరకము; శీఘ్రముగ మెత్తఁబడువా రొకరకము.
మాచారపువారు రెండవరకమునకుఁ జెందినవారు. ఏలూరునుండి వ
చ్చినయుత్తరపుబలిమివలనను, కామేశ్వరరావువచనకౌశలముచేతను,
పని కొంతవఱకు సాధింపఁబడెను. కాని, ఒకషరతుమాత్రము తప్ప



లేదు. సంవత్సరాదికి ఎవ్వరును పోవలనుపడదనియు, ఎప్పుడో వైశాఖ
మాసములో వీలగుననియు, అప్పుడైనను కేశవరావునొక్కనినే పంపు
దుముగాని వేఱెవ్వరును కదలమనియు, నరసయ్యగారు దృఢముగ చె
ప్పిరి. ఈమాటలనే ఏలూరుకు వ్రాయవచ్చునని కామేశ్వరరావుతో
నరసయ్యగారనిరి. అదియే పదివేలని సంతోషించి కామేశ్వరరావు,
సుందరమ్మకు జరిగినసంగతినంతను సవిస్తరముగ వ్రాసెను.

ఆయుత్తరము చేరఁగనే చదువుకొని సుందరమ్మవీరమ్మలు లోకసం
భాషణలోనికి దిగిరి.

వీర—చూశావా, అమ్మా మనకు హైమ ఎంతఅవమానం
తెచ్చిపెట్టిందే. వాళ్లకాళ్లదగ్గర మనం బంట్రోతుల్లాగ పడి 'మహాప్ర
భో, రక్షించండి' అని కోరినట్టయింది.

సుంద—ఏంజేస్తాము? మనమర్యాద దక్కేయోగం లేకపో
యాక!

వీర—ఒకమాటొస్తాను. ఆతరువాత?

సుంద—అదే ఆలోచిస్తున్నాను.

వీర—హైమను పిలిచి నీకిదితగదే. రేపు ఆతనువచ్చినప్పుడు
రెండుకాళ్లూ పట్టుకు క్షమించమన” మంటే వింటుందా మొండిఘటం?

సుంద—అదెక్కడ వింటుంది? ఆత్మహత్యకు తెగించింది.

వీర—అయితే సాధన మేమిటి?

సుంద—ఏమీ పాలుపోవడం లేదు.

కొన్నదినములు గడచెను. సంవత్సరాదిపండుగ వెడలిపోయెను.
హైమకుమాత్రము ఉత్తరముసంగతి ఆవంతయును వెలిబుచ్చలేదు. ఆ
సంగతి తెలిసినచో హైమ మరల నాత్మహత్యప్రయత్నము చేయునే
మోయని వారనుమానించిరి. మరల తెగించినచో రక్షించువారెవ్వ

రు? వైశాఖమాసము సమీపించెను. అల్లునిరాకకై ఆగంటివారు కనిపెట్టుకొని యుండిరి. అనేకవిధముల పిండివంటలు చేయుటకు సదుపాయములు జరుగుచుండెను. క్రొత్తక్రొత్తవియు, విలువగలవియు నగు వస్త్రాదులు సిద్ధము చేయఁబడుచుండెను. మరల కామేశ్వరరావొకసారి నరసయ్యగారిదర్శనము చేసి కుమారుని బంపుమని ప్రోద్బలముచేసెను. వైశాఖశుద్ధపంచమినాఁటియుదయమున మాచారపు కేశవరావు ఏలూరికి వచ్చెను. అనేకవిధములగు సన్మానములతో నాతని నింట సుఖాసీనునిఁ జేసిరి. మరల దశమినాఁటికైన తిరిగి తమ్మని నరసయ్యగారు ఆజ్ఞాపించియుండిరి. ఆయాజ్ఞానుసారమే తప్పక చేయుటకు కేశవరావుద్దేశించి యుండెను. అతనికప్పుడు చేసిన మర్యాద పెండ్లిలో జరిగినయమర్యాదనంతను మఱచిపోవునట్లొనర్చెను.

కేశవరావును చూచుటతోడనే హైమ నిలువున నీరయ్యెను. కొన్నిదినములనుండి జరుగుప్రయత్నములు హైమకు తెలియకపోలేదు. కాని, యవి కేశవరావురాఁకకొఱకే చేయఁబడుచున్నవని పంచమినాఁటివఱకును ఆమెకుఁ దెలియదు. తెలిసిమాత్ర మామె చేయఁగలిగిన దేమి? అసహాయయు, నబలయు నగు నామెకు పట్టినపట్టు నెగ్గించుకొనఁజాలు ధీరస్వాంతలు గర్భశత్రువు లైనప్పు డామెయుపాయము లెందులకును బనికిరావుగదా? కేశవరావు మిక్కిలి మొగమాటము పడు మనుష్యుఁడు. అతనిగుణములనుకనిపెట్టియు, ఇష్టములను దెలిసికొనియు, వీరమ్మసుందరమ్మలు ప్రవర్తించుచుండిరి. సుందరమ్మకు ముఖ్యముగ వంటపని యుండెడిది. కాని వీరమ్మ కేశవరావునకుఁ దగుసపర్యలు చేయుచుండెడిది. వేంకటప్పయ్యగారును, ఆయాసము రాకుండునంతవఱకును, అల్లునితో మాటలాడుచుండెను. అల్లున కన్నివిధముల సౌకర్యముగ నున్నను సప్తమినాఁడే [illegible]



యాణ మయ్యెను. కాని, బ్రతిమాలి అత్తగారును, వదినెయు, మామగారును, బలవంతముమీఁద కేశవరావు నచ్చట మఱిరెండుదినము లుండునట్లు చేసిరి. కేశవరావును చూచినప్పటినుండియు వీరమ్మ కాతనిపై మక్కువ కుదిరెను. ఆతఁడు వెనుకకుఁ దిరిగినప్పుడెల్ల తదేకదృష్టితో నాతనినే వీక్షించుచుండెను. తనవంకకుఁ దిరిగెనేని తాను వేఱొకవంక జూచుచుండెను. ఆతఁ డటునిటు తిరుగునప్పు డామె పైఁట సద్దుకొనుచు నెదురుగ నిలుచును. తనసొబగు విస్తరించునట్లు విలువగల వస్త్రములను ధరించి యాతనిమనస్సు నాకర్షింపఁ బ్రయత్నించును. పరుపులు వేయుటకు చాకలి యున్నను వాఁడు పఱచిన కేశవరావుపఱపును శుభ్రముగ దులిపి తా నత్యధికశ్రద్ధ వహించును. ఇట్లనేకవిధముల నామె కేశవరావును తనవశునిగాఁ జేసికొనుటకు యత్నములు సలుపుచుండెను.

కేశవరావు లొంగలేదు. వీరమ్మయూహలాతని కర్థమయ్యెనో లేదో మనకు తెలియదు. కాని సప్తమినాఁటినుండియు వీరమ్మ గొప్ప ప్రయత్నములుసలుపసాగెను. కేశవరావుతో హాస్యోక్తులు విచ్చలవిడిగ నాడుట యారంభించెను. కేశవరావును తాఁకుటకును, నాతనితో పిల్లతనపుటాట లాడుటకును గూడ నామె జంకలేదు. చూచువా రెవ్వరునులేరు. చాకలి సాయంతనమునను ప్రొద్దున్నను వచ్చి యొకగంట మాత్ర ముండి వెడలిపోవును. దాసీదియు నించుమించుగ నంతకాలమే యుండును. తల్లి వంటమొదలగుపనులతో నుక్కిరిబిక్కిరి యగుచుండును. హైమ గదివిడిచి బైటికే రాదు. వేంకటప్పయ్యగారు మంచము దిగఁజాలఁడు. వీరమ్మ యచ్చనైచివిడచిన యాఁబోతువలె నిష్టమువచ్చినట్లు ప్రవర్తించుచుండెను.

సప్తమినాఁటిసాయంకాలము వద్దనుచున్నను వీరమ్మ కేశవరా

వునకు కొప్పు దువ్వెను. తనగదిలోనికిఁ దీసికొనిపోయి కూర్చుండఁబెట్టి తానును ప్రక్కనే కూర్చుండి యతనిపైఁ బడుచు, అతఁడు కొంచెమొత్తిగిలినప్పుడెల్ల, “తప్పేమీ లేదులెండి. మీకెక్కడలేనిమొగమాటమూను” అని సద్దుచుండెను.

కేశవరావున కిదియంతయు నసహ్యముగ నుండెను. అతఁడు హైమనుగూర్చి విచారించుచుండెను. “అక్క యిట్టిదైన చెల్లెలును నిట్టినీతిబాహ్యవర్తనకలదిగాదా?” యని యాతఁడు ప్రశ్నించుకొనుచుండెను. అట్లైన మరలనెప్పుడును ఏలూరుమొగము చూడకుండ పునర్వివాహము చేసికొనుటయే యుక్తమని యాతనికిఁ దోఁచుచుండెను. వీరమ్మ నాతఁడేమియు ననఁదలఁచుకొనలేదు. ఏమైన నన్నచో తాను చెడ్డవాఁడగును. వీరమ్మ, ప్రవర్తననుబట్టి కేశవరావునే లోకమునకు దుర్మార్గునిగఁ దోపఁజేయుశక్తిగలదిగఁ గనఁబడెను. తానురెండుదినములుండి వెడలిపోవువాఁడు. ఆతనికి వీరమ్మప్రవర్తనతో సంబంధమేమి? తానెంతప్రయత్నించినను కేశవరావు లొంగకపోవుటచే వీరమ్మ యాశాభంగము నొందఁజొచ్చెను. ఆతనితో తనహృదయమునందలి తలఁపుల నన్నింటిని ఏకరువు పెట్టవలెనని యామె తలపోసెను. నాఁటి రాత్రి యామెకోరిక సఫలము గాలేదు. మరునాఁటిసాయంతనమువఱకును, ఆమె ఓపికపట్టవలసివచ్చెను. అష్టమినాఁ డామెవర్తనము కేశవరావునకు మఱింతయసహ్యముగఁ గనఁబడెను. కాని కేశవరావు ఆసంగతి విమర్శింపవలసినది కాదని తీర్మానించుకొనెను. మధ్యాహ్నము రెండుగంటలకు సుందరమ్మ ఏలూరుబజారుదగ్గఱ నున్నతమబంధువులలో నొకరియింటి కేఁగవలసివచ్చెను. తండ్రికిని, ఆయనతోపాటు అల్లునకును గావలసినసపర్యలు చేయుటకు వీరమ్మ యింటనే యుండవలసివచ్చెను. హైమనుకూడ తల్లి వెంటఁబెట్టుకొనిపోయెను. చూచుచుండఁగనే యాకసమంతయు మేఘావృత మయ్యెను. ఇంకఁ గొంతసేపటిలో కుంభవృష్టి కురియుట యారంభించెను. ఇఁకనవి యురుములు కావు, అవి మెఱుపులు కావు, అదివర్షము కాదు. సుందరమ్మ బంధువుల యింట నుండెను. ఇంట నెవ్వరును లేరు. వర్షములో నెవ్వరును రారు. వీరమ్మ కిఁక తగుసమయము దొరకెను.

ఆమె కేశవరావుదగ్గఱ కేగెను. కేశవరావుతో తనచరిత్రము నంతయుఁ జెప్పెను. తనభర్త దేశాంతరగతుఁ డయ్యెననియు, తన యౌవనము అడవిగాచిన వెన్నెల యయ్యెననియు వాపోయెను. ఎంత చేసినను కేశవరావు తొందరపడలేదు. అతఁడు మూర్ఖుఁడై యూరకుండెనో, సన్మార్గవర్తనుఁడై యూరకుండెనో మన మెఱుంగము. తుట్టతుదకు వీరమ్మ విసిఁగిపోయెను. ఇట్టిప్రస్తుతప్రవరునితో నేవరూథినియు నెగ్గఁజాలదని వీరమ్మ యనుకొనెను. కాని ప్రపంచమున ప్రవరులుండుట యరుదు. ఉండినను కేశవరావు ప్రవరుఁడుగాఁడు. కాని వరూధునివలె పచ్చిపచ్చిగ పరునితో ప్రేమాతిశయమును వెలిబుచ్చుటకు వీరమ్మ శీతపర్వతోద్యానములందలిగంధర్వస్త్రీయును గాదు. కేశవరావుచేతనే ముందుగ ప్రేమాలాపము లాలింపఁజేసినచో తరువాత నేమిజరిగినను కేశవరావుపైనే తప్పు మోప వీలగునని వీరమ్మ యాలోచన. కేశవరావన్ననో క్రొత్తయల్లుఁడు. మొగమోట మెక్కువ. వీరమ్మ పిచ్చిచేష్టలు చేసినప్పుడెల్ల నామెపిచ్చిచేష్టలుగాక ‘హైమకూడ నిట్టిదియే యగునా”? యను తలంపు లాతని హృదయమునఁ దిరుగుచుండెను.

వీరమ్మ కేశవరావు మనోభావములను కనిపెట్టెను. ఇప్పుడు తాను చేయవలసినదేమని ప్రశ్నించుకొనెను. హైమ దుష్టస్వభావ యని కేశవరావునకు హైమపై నాతనికేమైన ప్రేమ యున్నచో పెళ్ల

తో దానిని పెకలింపవలె నని తలంచెను. హైమపై ప్రేమ నశించిన చో, వాడిపోయిన పుష్పమును విడిచి, మకరందపూరిత మగు నూతనోత్ఫుల్లకుసుమము వద్దికి భృంగరాజ మెట్లువచ్చునో యట్లే కేశవరావుగూడ తనపై మక్కువ గుదుర్చుకొనునని వీరమ్మయనుకొని ఈక్రింది సంభాషణములోనికిఁ దిగెను.

వీర—మిమ్మల్ని చూసినకొద్దీ నాకు జాలిగా ఉంది.

కేశ—నన్ను చూస్తే జాలెందుకు?

వీర—మీరు పడుతూన్న కష్టాలకు.

కేశ—నేనేంకష్టాలు పడుతున్నాను?

వీర—మీమీఁద నిజంగా భక్తిశ్రద్ధలులేనివాళ్లకు అవిఉన్నాయి అని మోసపోతూ ఉన్నారు.

వీరమ్మ హైమనుగూర్చి మాటలాడుచున్నదని కేశవరావునకుఁ దెలియదు. లేనియెడల వీరమ్మసుందరమ్మలు భక్తిశ్రద్ధలతో మెలఁగుటలేదని యాతఁ డర్థము చేసికొనుచుండెను. ఆతఁ డేమియుఁ బ్రత్యుర మీయనందున వీరమ్మ "మీమీఁద న్యాయంగా హైమవతికి భక్తి ఉండాలిసిందే కాని—అయినా మీతో చెప్పఁగూడదు." అనియెను.

కేశ—చెప్పితే తప్పేమిటి?

వీర—మీరెవ్వరితోనూ చెప్పనంటే హైమవ్రాసినఉత్తరమే చూపిస్తాను.

కేశవరావు వివర్ణుఁ డయ్యెను. "ఎవరికివ్రాసిన ఉత్తరం?" అనియెను.

వీర—ఫలానివారికి అనిలేకుండా వ్రాసినఉత్తరం ఒకటి. ఒకరి పేరుపెట్టి వ్రాసినఉత్తరం ఒకటీని. అవి రెండూ నాదగ్గిరున్నాయి.



మీరు చూపించమంటే ఇప్పుడే చూపిస్తాను.

కేశవరావు చూపుమని తల యూఁడించెను. వీరమ్మ తనగదిలోనికిఁ బోయెను. కేశవరా వొక్కఁడును గూర్చుండి యాలోచనానిమగ్నుఁ డయ్యెను. దుష్టురాలిచెల్లెలు దుష్టురాలుగాక మఱెవ్వతె యగును? ఇఁక యావజ్జీవమును తనభార్యవర్తనమువలన తనకు ఎగ్గుసంభవింపక మానదు. వీధులలోఁ బోవుచున్నప్పుడు అందఱును తనవంక వ్రేలు చూపి "అదుగో ఊరిదాని మొగుఁడు" అని నవ్వుకొందురు. తనగొప్పతనమును తండ్రిగొప్పతనమును నీటఁ గలిసిపోవును. ఆగంటివారు మర్యాదస్థు లని యాతఁడు తలంచియుండెను. వివాహసమయమునందే వారిమట్టుమర్యాదలు కొంతవఱకు కేశవరావునకుఁ దెలియవచ్చెను. వీరమ్మను చూచినప్పటినుండియు నామెనీతిమారవర్తన మాతనికి రోఁతజనింపఁజేసెను. ఏది యెట్లున్నను హైమవర్తనమైన బాగుండదా? యని యాతఁడనుకొనెను. నేటితో నామెకూడ నెవ్వరిమీఁదనో కన్నువైచినట్లు స్పష్టపడుచుండెను. నోటిమాటకాదు; వీరమ్మ కాగితములు తీసికొనిరానుండెను. హైమ స్వహస్తముతో వ్రాసినయుత్తరములకన్న వేఱుసాక్ష్య మేమికావలయును? తెలిసియో తెలియకయో తల్లిదండ్రులు తనకు వివాహముచేసిరి. అనుభవము కలిగిన యాతనిజననీజనకులు వివాహమునందు జరిగినయప్రశస్తములగుపనులను గనిపెట్టి దూరమాలోచించి చాలకాలము తన్ను అత్తవారింటికిఁ బంపలేదు. నాఁడావైశాఖదినమునందు, ఆమహోపన్యాససంక్షోభమునందు, ఆమధ్యాహ్నధ్వాంతవితానములందు, ఆశీతలవాతూలసంఘర్షణమునందు ఆతనికి సంగతులన్నియుఁ దెల్లమగుచుండెను.

ఇఁక ముందుకర్తవ్యమునుగూర్చి కేశవరా వాలోచింపసాగెను. దశమివఱకును ఎట్లైన నోపిక పట్టి ఏలూరునందే యుండి సంగతిసంద

ర్భములను పూర్తిగ తెలిసికొనవలెనని యాతనికిఁ దోఁచెను. హైమవతి ప్రవర్తన చెడ్డదని తెలిసికొన్నతరువాత దశమినాఁ డూరికిఁ జని యుదంతమునంతను తల్లిదండ్రులకు నివేదింపవలెననియు వారితోఁ జెప్పినవెనుక పునర్వివాహప్రయత్నము జరుపవలెననియు నాతఁడు నిశ్చయించుకొనెను. కాని ఆతనికి మఱియొకయాలోచన తోఁచెను. నిజముగ హైమవతి మంచిదేమో. వీరమ్మ తనయందు ప్రేమను వృద్ధిపొందించుటకు లేనిపోనివన్నియును కల్పించుటకు సాహసించుచున్నదని యాతఁడనుకొనెను. హైమవతి స్వంతముగ వ్రాసినవ్రాఁతను కేశవరావెప్పుడును చూడలేదు. వీరమ్మచూపునుత్తరము నిజముగ హైమవతి వ్రాసినది కాకపోవచ్చును. అట్టిసందర్భమున నామెప్రవర్తననుగూర్చి తానేమి నిర్ధారణ చేయఁగలఁడు? ఇంకొకవిషయ మేమన, హైమవతి యింకను వ్యక్తురాలు కాలేదు. అట్టిబాలికనుగూర్చి యపోహపడుట పనికిమాలినపని. బాలిక యిట్టియుత్తరములు వ్రాసెనన్నను, ఎవ్వరును నమ్మఁదగువిషయముగాదు. అయినను పండ్రెండేండ్లబాలికకు ప్రపంచస్థితి కొంత తెలిసియుండును. ఎవ్వరినైన ప్రేమించెనేని వారితో నుత్తరప్రత్యుత్తరములు జరుపుటలో నాశ్చర్య మేమియునుండదని కేశవరావనుకొనెను. అదియునుగాక దుర్వ్యాపారముగలవీరమ్మతో నుండుటవలన నామెప్రవర్తన చెడిపోయియుండునని యాతఁడు తలంచెను. ఈ ద్వంద్వసమస్య కాతఁడే ప్రత్యుత్తరమును ఈయఁజాలకుండెను. ఉత్తరములను చూచినచో నేమైనఁ బ్రయోజన ముండునేమో యని యాతఁ డనుకొని వీరమ్మకై వేచియుండెను. కొంతసేపటికి ఉత్తరములను తీసికొని వీరమ్మ చావడిలోనికిఁ బ్రవేశించెను. కేశవరావు రెండుత్తరములను తొందరగాఁ జదివి "అయితే మీచెల్లెలు ఆత్మహత్యచేసుకోవాలనుకుందా?" అనియెను.



వీర—చేసుకున్న మొగుణ్ణొదిలిపెట్టి కృష్ణుణ్ణి తనవైపు తిప్పుకోవాలని ప్రయత్నం చేసింది.

కేశవరా వీమాటను వదలివేసి "ఎలాప్రాణం దక్కించారూ?" అని అడిగెను.

వీర—బావిలో పడేటప్పటికి ఎవరోవచ్చితీశారు.

కేశ—ఏదో పొరపాటున పడ్డదనికాదూ మీరు మానాన్నగారికి ఉత్తరం వ్రాశారు?

వీర—అవును. పైకి పొక్కితే పోలీసులూ, కోర్టూను.గలభా అవుతుందని అందరికీ అలాగేచెప్పాము. ఇంతకూ ఇంకోడిమీద మనస్సు పెట్టింది చూడండి.

కేశ—ఈయింట్లోవాళ్ళంతా అటువంటివాళ్ళలాగే ఉన్నారు.

వీరమ్మ తనపతివ్రతాత్వమును కొనియాడఁదలఁచుకొనలేదు. ఆసంగతి తానెఱింగినదే. కేశవరావు దారికి వచ్చుచున్నాఁడని తలంచి "ఎవ్వళ్లైనా ఒకళ్లమీదే మనసుంచుతారుగాని ఇద్దరిమీద ఉంచరు" అనియెను.

కేశ—అదేమాత్రం తప్పుగాదని మీఉద్దేశం. ఆసంగతి నిజమేనా?

వీరమ్మ తడబడుచు "ప్రపంచకంలో నేనొక్కతెనే అదృష్టంలేనిదాన్ని. పెళ్లైనమొన్నాడే మాకు ఎడబాటు కలిగించి. అప్పటినించీ నామనస్సులో ఎలాగో ఉంటుంది" అనియెను.

కేశవరావు "మాకిటువంటివాళ్లతో సంబంధం పొరపాటువల్ల దొరికింది" అనుచు ఆయుత్తరములను జేబులో పెట్టుకొనెను. వీరమ్మ భయభ్రాంతయై యాయుత్తరముల నడిగెను. కాని కేశవరా వీయలేదు. ఆతఁ డాయుత్తరములను బాగుగ నర్థమగునట్లు చదువలేదు.

సావధానముగఁ జదువవలెనని యాతఁడు తలంచెను. అవి ఎచ్చటదా
చినను వీరమ్మ దొంగిలించు నని యాతఁ డనుమానపడి "వాన వెలి
సింది. ఇప్పుడే ఈఉత్తరాలు పోస్టుద్వారా మానాన్నగారికి పంపించి
వేస్తాను. ఈఉత్తరాలతో నాకు కొద్దిగా పనుంది" అని లేచెను.

అప్పుడు నాలుగుగంట లయ్యెను. సుందరమ్మయు హైమవతి
యు నింటికి వచ్చిరి. వీరమ్మ కన్నములో తేలుకుట్టినదొంగవలె మాట
లాడక యూరకుండెను. కేశవరావు పోస్టుకచ్చేరికిఁ బోయి ఆరెండుత్త
రములను తండ్రిపేర రాజమహేంద్రవరమునకుఁ బంపివైచెను.

## ఎనిమిదవ ప్రకరణము.

వీరమ్మ యోచనానిమగ్న యయ్యెను. తానొక్కటి తలంచిన
దైవము మఱొక్కటి తలంచెను. కేశవరావును తనవలపువలలోఁ
జిక్కించుకొనవలెనని యామె ప్రయత్నించెను. కాని అనాగతవిధాత
యనుమత్స్యమువలె కేశవరావు తప్పించుకొనెను. ఎప్పటికైన నుప
యోగించునని తాను దొంగతనముగ దాచినయుత్తరము లిప్పుడు ప
రునిచేతఁ బడినవి. అవి హైమ దుష్టురాలని ప్రపంచమునకంతకును ని
రూపింపఁగలవు. కాని ఆయుత్తరము లెట్లు తనచేతఁ జిక్కినవో కేశవ
రావు తెలుపకమానఁడు. తాను కేశవరావును ప్రేమించినసంగతియు,
అనేక హేయము లగుకార్యములవలన నాతని వలపింపఁదలఁచినదియు,
తుట్టతుదకు భయమునకుఁగాని లజ్జకుఁగాని వెఱవక తనచెల్లెలుదుష్టప్ర
వర్తన కలదియని యామెభర్తకే నిరూపింపసాహసించిన తననైచ్యము



ను జగత్తునందంతటను వ్యాపింపక మానవు. అటుగాక ఉత్తరములు
తనయొద్దనే యున్నచో కేశవరావెన్ని చెప్పినను, ఆపలుకు లాధారహీ
నములైనట్లే జనులకుఁ గాన్పింపవచ్చును. తనకును, తనపుట్టినింటికి న
పఖ్యాతి రాకుండవచ్చును. తరువాత హైమవతిగతి యేమైన నేమి?
ఇష్టమున్నచో నత్తవారే పిలుపనంపుదురు. అయిష్టమైనచో కేశవ
రావునకు వేఱువివాహము చేయుదురు. హైమవతి యావజ్జీవమును
తానున్నవిధముననే పుట్టినింట నుండును. అందు మునిఁగిపోవున దేమి
యు లేదని వీరమ్మ తలంచెను. హైమ చెడునడత కలదని ప్రపంచము
న నన్నిమూలలను మాఱుమ్రోగునట్లు చాటినను తనకేమియును న
ష్టము గలుగదు. కాని విధివశమున స్థితిగతులు వేఱుగఁ బరిణమించిన
వి. హైమస్వభావమేగాక తనదుర్వ్యాపారముగూడ బట్టబయలగుసంద
ర్భము గలిగినది. వీరమ్మ ఈవిషయమునే యోచించుచు అన్నమాటల
నేయనుకొనుచు, తలఁచినతలఁపులనే తలఁచికొనుచు, అరచేతఁ దల
నుంచికొని యోచించుచుండెను.

ఎంతయోచించినను ఆమెకేదియుఁ బాలుపోలేదు. సుందరమ్మ
రెండుమూఁడుసారులు కేకవైచెను. కాని వీరమ్మపలుకలేదు. తుట్ట
తుదకు హఠాత్తుగ నామె కొక్కయాలోచన తోఁచెను. వెంటనే యా
మెమనోభార మణఁగెను. ఆమెహృదయము నూతనానందపరాగముతో
నిండిపోయెను. ఆమెముఖమునందు కుటిలసంతోషము తాండవమాడు
చుండెను. వెంటనే యామె దిగ్గున లేచి తల్లివద్దకుఁ బోయెను.

సుంద—ఎన్నిసార్లు పిలిచినా పలక్కుండా ఎక్కడున్నావు? ఒ
క్కదాన్నీ ఎలా చేసుకుంటా ననుకున్నావు పనంతా?

వీర—మనకందరికీ ఎంతగొప్పఆపద, ఎంతఅపఖ్యాతి రాబో
తూఉందో ఆలోచించు.

సుందరమ్మముఖమున సందేహమేఘమాలిక లుత్పన్నము ల
య్యెను. ‘‘ఏమిటా ఆపద?’’ అను ప్రశ్నను ఆమె చూపులతోనే య
డిగెను.

వీర—హైమవ్రాసినఉత్తరాలు కేశవరావుకు ఎలాదొరికాయో
దొరికాయి.

సుంద—ఆఁ—?

వీర—చింపినముక్కలన్నీ మరోకాగితముమీద అంటించి ఉ
న్నాయి. ఆఉత్తరాలని ఇప్పుడిప్పుడే ఎవరో ఆయనస్నేహితుఁడు తీసు
కొచ్చి ఇస్తూంటే చూశాను. మొదట ఏమిటో మనకెందుకనుకొన్నా
నుగాని తీరా వినేటప్పటికన్నీ ఆముక్కలే. కిటికీలోంచి చూశాను. అ
ది వ్రాసినఉత్తరాలే. వెంటనే కనుబొమలుముడేస్తూ, చేతులాడిస్తూ
వాళ్ళిద్దరూ ‘పోస్టు కచ్చేరీకి వెళదాం. రాజమహేంద్రానికి పంపించేద్దాం’
అనుకుంటూ వెళ్లిపోయారు. నాకేంచెయ్యడానికి తోచడంలేదు.

సుంద—అయ్యో, అయ్యో. ఎంత అపఖ్యాతి. వాళ్లకి తెలి
స్తే ఇహనేమన్నా ఉందా?

వీర—అంత అజాగ్రత్తగా ఎందుకుపారేశావూ, ఆకాగితాలు?

సుంద—ఏడ్చినట్టేఉంది నీసొద. చస్తూంటే సంధ్యమంత్రాలు
ట. కావలసినపనాలోచింపక అనవసరపుమాటలు మాట్లాడతావు!

వీర—ఏంచెయ్యమంటావు మరి?

సుంద—ఏంచెయ్యమంటానా. ఏదన్నాకట్టుకు ఇద్దరం బావిలో
దుముకుదాం రమ్మంటా.

వీరమ్మ తనతల్లికోపమును గ్రహించెను. ఏమిచేయుటకును
దోఁపక తనపైఁ గోపమును వెడలఁగ్రక్కుట తల్లినైజమై యుండె
ను. ఆమెకోపమును శాంతింపఁజేయుటయే తనప్రథమకర్తవ్య మని వీ



రమ్మ తలంచెను. మాటకు మాట జవాబు చెప్పక యూరకుండెను.
సుందరమ్మ రెండునిమిషము లాఁగి ‘‘గోరుచుట్టుమీద రోకటిపోటొ
చ్చింది. రాకరాక ఒచ్చావుగదా అనుకుంటే, ఇదొకటొచ్చింది. దాని
మొహాన అలావ్రాసుంటే తప్పుతుందీ? ఆఉత్తరాలు ఎందుకువ్రాయా
లి? ఆప్రయత్నం ఎందుకు చెయ్యాలి. దీనివల్ల కష్టాలే కాకుండా సుం
దరమ్మ చెడ్డతనం ఊరూరా చెప్పుకోవాలి కాబోలు? ‘ఎలాగో ఉండ
గట్టుకొద్దాము. వచ్చినవాణ్ణి ఎలాగో మళ్లీమళ్లీ వచ్చేసదుపాయం చే
ద్దాము! అని నేననుకుంటే రామాయణంలో పిడకలవేట్లాటలాగ ఇదొ
కటొచ్చి పడింది! ఎక్కడినిం చొచ్చాడు ఆపాడుస్నేహితుఁడు?’’ అ
నెను.

వీరమ్మ ప్రత్యుత్తర మీయలేదు. సుందరమ్మ మఱియు.
పుముండి ‘‘ఇక నీయన మనింటికిరాడు. వెళ్లిపోయి తండ్రితో చెప్తూతా
డు. వేతేపెళ్లి ఇదివఱకే చేసుకోవాలంటున్నారు గదా? అది ఐపోతుం
ది. దానిబతుకు కాలి బుగ్గైపోతుంది. ఏంకష్టాలు తెచ్చిపెట్టావురా భ
గవంతుడా!’’ అని కళవళపడఁ దొడంగెను.

వీర—రేపు లేదు.ఎల్లుండిమధ్యాహ్నం పదింటికి ఆయన బయ
లుదేరుతాడు.ఆయన్ని ఉండగట్టుకోవాలంటే ఇవ్వాళా రేపులోగా గట్టి
ప్రయత్నం చెయ్యాలి. లేకపోతే ఇల్లు విరిగి నెత్తిన పడుతుంది.

సుందరమ్మ ఇందలినిజమును ముఖకోచులతోనే యంగీకరించెను.

వీర—నాన్నగారిని ఆలోచన అడుగుదామా? ఆయన ఏమ
న్నా చెప్తాడేమో?

సుంద—వెఱ్ఱికుదిరింది రోకలి తలకు చుట్టమన్నదట. నాన్న
గారిని ఆలోచనడిగితే ఇకనేమి అక్కర్లేదు. శంకరగిరి మాన్యాలు ప
ట్టవలసిందే. మనమే ఆలోచించుకోవాలి.

సుందరమ్మకీసమస్య అతికష్టమైనదిగ నుండెను. పోయినచో అల్లుఁడు మరల రాఁడు. ఇప్పుడే గట్టిప్రయత్నము చేయవలెను. సుందరమ్మవీరమ్మ లిద్దఱును సుందులమారులు. వారిరువురునుగూడ కేశవరావును శమానశేము చేసికొన్నచో ఆయుత్తరములను కేశవరావు కప్పిపుచ్చుననియు, మరలమరల నాతఁడు ఏలూరునకు తప్పక వచ్చునని వారూహించిరి. తనవలపులవలలో కేశవరావు చిక్కునని వీరమ్మ సంతోషస్వాంత యయ్యెను. ఇదియే ఇంతకుముందు వీరమ్మకుఁ గలిగిన యాలోచన. ఇప్పుడు సుందరమ్మకుఁ గూడ నాయాలోచనయే తోఁచెను. వీరమ్మ తల్లిమనస్సునందలియూహ కనిపెట్టెను. సుందరమ్మ స్వమనస్సునం దీయూహయే యున్నదని తెలిసికొనెను. తమ యూహాలు రెండవవారికిఁ దెలియునని ఇరువు రెఱుంగుదురు. అయ్యును ఆక్షణమునం దొక్కరును ఆవిషయమై పైకి మాటలాడుట కిష్టపడలేదు—సాహసింపలేదు. కాని వీరమ్మకుమాత్ర మాపని జరిగితీరవలె నని యుండెను. లేకున్న తనగుట్టు రట్టగునని భయవిహ్వలయై తెగించి, „ అమ్మా! మనమొకపని ఎందుకు చెయ్యరాదు ?" అనియెను.

సుంద—ఏమిటో చెప్పు.

వీర—చెప్పేదేముందీ ? అతన్ని ఈమాట అనకుండాచేస్తే సరి. అపఖ్యాతి తప్పిపోతుంది.

సుంద—చేస్తే బాగానే ఉంటుంది మరి. ఎలా చెయ్యడం ?

వీర—' ఏదన్నా మందుపడేసి—' అనేనా నీఅభిప్రాయం ?

సుంద—నాఅభిప్రాయ మొకటీ నీఅభిప్రాయ మొకటీనా ఏమిటి, వల్లే అందులో ? మందు పడెయ్యడమంటే మాటలతో ఉందా ?



ఇరువురును ఏకీభవించి మరుసటిదినపుయుదయము కేశవరావునకు మందుపెట్టున ట్లేర్పాటు చేసికొనిరి. పరువులు వేయుటకు వచ్చిన చాకలి నాగన్నతో వెంటనే తమకుఁ గావలసినవస్తువు నొకదానిని తెమ్మని సుందరమ్మ చెప్పెను. వేంకటప్పయ్యగారి కారాత్రి యావస్తువీయనిచో ప్రాణములు దక్కవని వీరమ్మ నొక్కినొక్కి చెప్పెను. నాగన్నయు ప్రాణములకు సంబంధించినపని యని మిన్నుమన్నును రోసి యావస్తువును దెచ్చి సుందరమ్మ కిచ్చెను. సుందరమ్మ వానికి రూపాయ బహుమానముగా నిచ్చెను. కేశవరా వెప్పటియట్ల కనుచీకటిపడు సమయమున నింటికి వచ్చెను. తనశిరమునకు సూటిగఁ గట్టఁబడినరాతిబండ నాతఁడు చూడఁజాలకుండెను. వీరమ్మచేసిన చేష్టలను సుందరమ్మకుఁ దెలిపిన బాగుండునేమో యని యాతఁడుతలంచెను. తల్లియు కూఁతురును నెంత యొక్కటియైనను కూతురిఱంకులాడితనము తల్లి కిష్టముగ నుండదని యాతఁ డనుకొనెను. కాని యామాట చెప్పినందువలన తనకుఁ గలుగఁబోవులాభ మేమి యని యాతఁడు ప్రశ్నించుకొనెను. తాను మఱునాఁడుగాక మూఁడవనాఁటియుదయమున పదిగంటలకు ఏలూరికి చిట్టచివరినమస్కారము చేయఁబోవుచున్నాఁడు. వీరమ్మ అంకులాడితనముతోఁ గాని, ఆసంగతిని తల్లికిఁ దెలియఁబఱచుటతోఁ గాని యాతని కేవిధమైన సంబంధమును లేకుండెను. చెప్పినను, అందఱికన్నులను గప్పి ప్రపంచ మేలఁగల శక్తి వీరమ్మకు లేకపోలేదని కేశవరా వనుకొనెను. వీరమ్మను చూచి హైమవతి చెడిపోవునేమో యని తాను తలంపనక్కఱయే లేదు. ఇదివఱకే హైమవతి దుష్టప్రవర్తనగల దైనది. తానో యామెను త్యజించి పునర్వివాహము చేసికొనఁబోవుచున్నవాఁడు. ఆమె యేమైనను నాతనికిఁ జింత లేదు. మాటలాడకుండ తా నొక్కదినము కన్నులు మూసికొనెనేని, మఱునాఁడు

15

హాయిగ రాజమహేంద్రవరమున నుండవచ్చును. ఇంతయాలోచనయందును, వీరమ్మ చూపినయుత్తరములను దనతండ్రికిఁ బంపినమాటయు, వీరమ్మ కినుకఁబూని ఏమైనఁ జేయఁబ్రయత్నించు ననుసంగతియు, నపఖ్యాతి కలుగుచో మనుజు లెంతైనఁ జేయ సాహసింతు రనియు నాతఁడు తలంపనైన లేడు. ఆతఁడు నిజముగ ననాగతవిధాతయే యైనచో నప్పుడే రాజమహేంద్రవరమునకుఁ బయనమై యుండును గద ? దైవఘటనకు భూమిపై నెందును నడ్డము లేదు. మూఢునకును దుష్టునకును గూడ బ్రపంచమునఁ గష్టములు గలుగును; కాని దుష్టునికన్న మూఢుఁడే ముందుగ వానివాతఁ బడుట లోకధర్మము. దైవఘటన కాదు; దురదృష్టము కాదు; బుద్ధిహీనతయు, పెడబుద్ధియు మానవుని యధఃపతనమునకుఁ గారణములు.

కేశవరావు సుందరమ్మతో నేమైనఁ జెప్పునేమో యని ప్రాణము లరచేత నుంచుకొని వీరమ్మ యాతనిఁ గనిపెట్టియే తిరుగుచుండెను. ఆతనితో మరల మాటలాడ నామె తలపెట్టలేదు. ఏమిమాటలాడిన నేమగునో యని సుందరమ్మవీరమ్మలు మౌనధారిణులై కూర్చుండిరి. ఈసంగతినిగూర్చికూడ కేశవరా వంతగఁ దలపోయలేదు. మొగమాటము గలిగినవాఁ డగుటచే నారాత్రిగూడ మొగమాటముతోడనే కేశవరావు గడపి పరుండెను. రెండుమూఁడుసారు లాతని వామనేత్ర మదిరెను. గట్టిగ తుడిచికొని, దానిని లక్ష్యపెట్టక కేశవరావు నిద్రించెను. నాఁడాతని కేమోగాని గాఢనిద్ర పట్టలేదు. అనేకస్వప్నము లాతని నావరించెను. వానిచేఁ గొంచెము మనస్సు చలించినవాఁ డయ్యును దిటవు దెచ్చుకొని నాఁటిరాత్రి యాతఁ డెట్లో గడపెను. తెల్లవాఱఁగనే కేశవరావు మేలుకొని యథాప్రకారముగఁ దనకాల్యకృత్యములను నిర్వర్తించుకొనియెను. కొంతసేపటికి “కాఫీ



యుప్మాలను” దెచ్చి వీరమ్మ కేశవరావున కిచ్చెను. కేశవరా వామెవంకఁ జూచెను. ఇన్నిదినములనుండియు నామెముఖేందుమండలమునఁ బ్రకాశించినప్రణయరోచు లంతర్ధానములై యుండెను. ఆప్రణయరోచులకు బదులు భయధ్వాంత మొక్కటి యామెసహజలావణ్యమునకుఁ గళంకము తెచ్చుచుండెను. వీరమ్మ యాతనికి క్రిందటిదివపువీరమ్మవలెఁ గనఁబడలేదు. ఈమార్పు కలుగుటకుఁ దా నాయుత్తరములను దీసికొనుటయే కారణమై యుండునా ? అదికాదని వెంటనే కేశవరావు నిశ్చయించుకొనెను. అదియే కారణమైనచో వీరమ్మ మఱల తన్నడిగియే యుండు నని యాతఁడు తలంచెను.

“ఉప్మా” రెండు ముద్దల నాతఁడు నోటిలో పెట్టికొనెను. అది ప్రతిదినము నున్నవిధమున లేదు. అందలినేయి యేదో కల్మషయుక్తమైనట్లు వాసనగొట్టెను. కేశవరావు “ఉప్మాను” వదలిపెట్టి కాఫీమాత్రము త్రాగెను. ఇదియంతయుఁ జూచుచుండినవీరమ్మ తల్లివద్దకుఁ జని సంగతి నివేదించెను. సుందరమ్మయు, ఉప్మాయందు ‘మందు’ లేదనియు, ఆ ‘మందు’ వాసన రెండుమూఁడుదినములవఱకును తెలియకుండుటకై ఉప్మాయందొకపదార్థము కలుపఁబడినదనియుఁ జెప్పెను. మధ్యాహ్నము భోజనకాలమున కేశవరా వణుమాత్రమైన ననుమానము లేకుండ “ఇదియీవస్తువు, ఇదియావస్తువని రుచివలన నెఱుంగఁజాలక, మొగమాటపడి, పెట్టినదేదో భుజించి విశ్రమించెను. వీరమ్మ ప్రతిదినమిచ్చినట్లె తాంబూలము నిచ్చెను. కేశవరావు తాంబూలమును స్వీకరించి సాయంకాలము మూఁడుగంట లగువఱకును నిద్రించెను. ఆతని కడుపునందు ‘మందు’ చేయవలసినపనిని చేయుచుండెను. తల్లియు కూతురును ఒకరినొకరుచూచి యానందాంతరంగలై పచ్చిసాట నాడుకొనుచుండిరి. మఱునాఁ డుదయమున పదిగంటలకు బండియొ

క్కి సాయంకాలమగునప్పటికి కేశవరావు రాజమహేంద్రవరమునఁ జేరెను. అతఁ డిల్లు చేరుటతోడనే తల్లిదండ్రులాతనిఁ గుశలప్రశ్నముల నైచిరి. వానికాతఁడు తగుజవాబుల నిచ్చుచుండెను.

తల్లి—అదేమన్నా కుఱ్ఱతనపువేషాలుమానేసిందా?

తండ్రి—అది నల్లరాయి కాదూ? ఈజన్మంలో మానేస్తుందీ?

తల్లి—సిగ్గాయెను. పోనీలే. మీఅత్తగారూ, మామగారూ, వదినగారూ ఏమన్నారు?

కేశ—ఏమన్నారు—? మళ్లీరా, పెళ్లిలోదంతా మరిచిపోండి. మీనాన్నగారిని అమ్మగారిని కోపముంచుకోవద్దని చెప్పమన్నారు.

తండ్రి—(కోపముతో) కోపముంచుకోవద్దని చెప్పమన్నారా?

తల్లి—నీకేమన్నా బట్టలూ అవీ పెట్టారా?

కేశ—ఏమిటో పెట్టారు. నీకోరెండు పట్టంచు చీరలున్నూ, నాన్నగారికి రెండుధోవతులచాపులున్నూ ఇచ్చిపంపారు. తప్పులన్నీ క్షమించమని మరీమరీ చెప్పమన్నారు.

తండ్రి—(కోపముతో) క్షమిస్తాను తప్పులు—!

తల్లి—అంతా మర్యాదగా జరిపారా? లేకపోతే పెళ్లిలోలాగే చేశారా?

కేశ—చాలా మర్యాద చేశారు—అవన్నీసరిగానే జరిగేయి గాని, నేను పంపించినఉత్తరాలు అందినయా?

తల్లి—ఉత్తరాలేమిటి?

తండ్రి—అందినాయి. వెంటనే వాళ్లమొహాన ద్వాలిపెట్టి రాలేకపోయినావా?

తల్లి—అసలా ఉత్తరాలేమిటి?

తండ్రి—"ఏమిటా? దుర్మార్గులు ఱంకుమొగుళ్లకు వ్రాసుకున్న



ఉత్తరాలు." అనుచు నాయుత్తరములను భార్యచేతి కిచ్చెను. ఆయుత్తరములను మువ్వురును బాగుగ నవగాహనమగునట్లు చదువుకొనిరి.

కేశ—వాళ్లకుటుంబములో ఈపిల్లఒక్కతే గుణవంతురాలులా కనబడతుంది.

తండ్రి—ఏగుణవంతురాలు? గుల్లైపోయిన గుణవంతురాలు?

కేశ—వీరమ్మ అన్న ఆవిడుందే, ఆవిడిచ్చింది నాకీఉత్తరాలు. ఆవిడకింతవఱకు ఏభై మందికి తక్కువుండరు.

తల్లి—ఎవణ్ణైతే మొదట చేసుకోవాలనుకుందో వాణ్ణే ఏకాయత్తంగా చేసుకుంటానంది. ఈజన్మంలో వీలుగాకపోతే వచ్చేజన్మంలో చేసుకుంటానంది. అందుకని ఆత్మహత్యకుకూడా తెగించింది. గుణవంతురాలు కాదూ?

మాచారపునరసయ్యగారు నిర్ఘాంతపోయిరి. ఇన్నిసారులు చదివినను ఆయన కాయర్థము స్ఫురింపనేలేదు. మరల నొకమారాయన యుత్తరములను రెండింటిని చదివెను. "ఇదీకీలు. దానిమాట తోసేసి, మనవాడి కిచ్చారు. ఎరక్క చేసుకున్నాము. అనుభవించొద్దూ?

రాజమహేంద్రవరమునకు వచ్చిన నాలుగైదు దినములకే, కేశవరావున కేదో వ్యాధి ప్రారంభమయ్యెను. ఈవ్యాధి ఇట్టిదని ఎవ్వరును నిర్ధారణచేయజాలకుండిరి. రెండుమూఁడుదినములలో నది క్షయరోగములోనికి దింపెను. వైద్యులపైని వైద్యులు, పాశ్చాత్యవైద్యులు, ఆయుర్వేదవైద్యులు, యూనానీవైద్యులు, రాజవైద్యులు, భూతవైద్యులు, మాంత్రికులు, తాంత్రికులు; ఎందఱెందఱో వచ్చి మందుల నిచ్చుచుండిరి; మంత్రములు చదువుచుండిరి; హోమములు చేయుచుండిరి. కాని, వ్యాధి కుదురుటకు బదులు మఱింతయధిక మగుచుండెను. ఇది మందుగుణమని ఎవ్వరును అనుమానపడలేదు. సరస

య్యగారికి వేయిరూపాయలు ఖర్చులయ్యెను. అప్పటికిని రోగము నయము కాలేదు. కేశవరావుశరీరము దుర్బల మయ్యెను. మరణము తథ్యమని వైద్యులు వాక్రుచ్చిరి. ఈవ్యాధిచే రెండుమాసములు పీడితుఁడై కేశవరావు మరణించుటకు సిద్ధముగ నుండెను. ఏలూరునకు ఉత్తరములు వ్రాయఁబడెను. సుందరమ్మవీరమ్మలసంగతి ఎఱింగినకామేశ్వరరావు "మందేమైనఁ బెట్టితివా" యని చెల్లెలిపేర వుత్తరము వ్రాసెను. మందు పెట్టితినని యొప్పుకొన్నచో మొదటికే మోసము గలుగునని వీరమ్మసుందరమ్మ లాలోచన చేసి కూతురివైధవ్యముకన్న తమఖ్యాతియే ముఖ్యమైనదని యెంచి కామేశ్వరరావును చల్లగ చీవాట్లు పెట్టుచు, లేనిపోని యనుమానములను మనస్సున నుంచుకొనవద్దని ప్రత్యుత్తరమును వ్రాసి పంపిరి. హైమ కేసంగతియుఁ దెలియదు. కేశవరావు చావుబ్రతుకులలో నున్నాఁడని యామె తెలిసికొని యాతనికై జాలిపడెను. కాని తనకు రాఁబోవువైధవ్యమునుగూర్చి యించుకంతయు నామె తలంపలేదు. కేశవరావు రోగకారణమునుగూర్చి యామెకిసుమంతయుఁ దెలియదని వేఱుగ చెప్పనక్కఱలేదుగదా!

ఆషాఢబహుళ పంచమినాఁడు హైమ వ్యక్తురాలయ్యె ననువార్త రాజమహేంద్రవరమునఁ దెలియవచ్చెను. రోగములేనప్పుడే దుఃఖకరముగ నుండవలసిన యీవార్త రెండుమాసములనుండియు క్షయరోగముచే బాధపడు కేశవరావుబంధుగులకు మఱియు నింతదుఃఖము గలిగించెను. ఆగంటివారు, ఏలూరునందు సంబరములు చేయుచుండిరి. ప్రపంచమున నొకచో వెలుఁగైనప్పు డింకొకచోట చీకటి గ్రమ్మును. కలువలు హర్షించునప్పుడు కమలములు ముడుచుకొనిపోవును. ఒకచోట నానందముగ నుండునప్పుడు మఱొకచోట దుఃఖాశ్రువులు నదీవడమువలెఁ బ్రవహించుచుండును. అదేవిధముగ ఏలూరునందలి సంబరములు రాజమహేంద్రవరమున దుఃఖము నినుమడింపఁజేసెను. కాని ఏలూరునందుమాత్రము హైమవతి సంతోషించుచుండె నని యెవ్వరనఁగలరు? శ్రావణబహుళ షష్ఠినాఁడు రోగపీడితుఁడైన కేశవరావు మరణించెను. ఈకఠోరవార్త చీకటివలె దశదిశలను వ్యాపించెను. ఏలూరునందు హైమచుట్టు నొక 'డజను' మంది తలలు పట్టుకొని ఏడువసాగిరి. హైమహృదయముకూడ చలించెను. ఆమెకుకూడ హృదయనిర్గతము లగుబాష్పబిందువులతో ప్రపంచమును తడిపివేయుచుండెను. వీరమ్మయు సుందరమ్మయు నిర్ఘాంతపడి యొకరిమొగ మొకరు చూచుకొనుచు, బావురని యేడ్చుచు గ్రుడ్లనీళ్లు గ్రుక్కుకొనుచుండిరి. హైమకు మైల, మాధ్యమికవయఃపరిపాకము, వైధవ్యము—మూఁడును ఒక్కమాఱు సంప్రాప్తమయ్యెను. "ఈసంబంధము వద్దంటే విందికాదో" అని వేంకటప్పయ్యగారు శోకములు పెట్టుచుండిరి. "ఎవరిపూజ కెవరుకర్తలు? 'నుదుటన్ వ్రాసిన వ్రాలుకన్నఁ గలదే నూఱేండ్లు చింతించినన్'" అని చూడవచ్చినవారు ఓదార్చుచుండిరి.

హైమ మరల నేనూతనైన గోతనైనఁ బడునేమో యని రేయింబవళ్లు కంటికి ఱెప్పవలె వీరమ్మసుందరమ్మలలో నెవరో యొకరు కాచుకొని యుండెడివారు. కాని హైమ అట్టిప్రయత్నముల నంతగా తలపెట్టలేదు. మైలదినములు గడచిపోయెను. మాచారపువారికిని ఆగంటివారికిని చావుకబురుతో నుత్తరప్రత్యుత్తరములు నిలిచిపోయెను. ఇంక వారిసంగతి వీరును, వీరిసంగతి వారును విచారించుట మానుకొనిరి. ఈవిధముగ దినములు గడచిపోవుచుండెను.

## తొమ్మిదవ ప్రకరణము.

కేశవరావు మరణించినపదునైదుదినములకు కామేశ్వరరావు రాజమహేంద్రవరమునుండి పరామర్శ చేయుటకై వచ్చెను. అందఱును తలపట్లు పట్టుకొని ఏడ్చినతర్వాత, కామేశ్వరరావు హైమను రహస్యముగ సమీపించి, "ఏమమ్మా! కేశవరావు పోవడానికి కారణమేమిటనుకుంటావు?" అని యడిగెను.

హైమ—నేనేంజెప్పేది? ఎవరుచేసుకున్న పాపపుణ్యాలువారివి.

కామే—ఎవరన్నా ఏమన్నా చేశారని అనుమానముందా?

హైమ—ఏమో, నాకేమీ తెలియదు. ఎప్పుడూ ఈగదిలో కూచుంటాను. ఇదే నాప్రపంచము.

కామే—ఎప్పుడూ ఇంటిలోనే ఉంటావుగనక అడుగుతున్నాను. ఇక్కడికొచ్చినప్పుడు మనవాళ్లేమన్నా పెట్టారా? అని నాఅనుమానం.

హైమ మాటలాడలేదు.

కామే—మళ్లీ ఎవళ్లతోనూ ఈమాట అనకు. నీకేమన్నా ఆవిషయమై తెలుసునేమో అడుగుదామని వచ్చాను.

హైమ—నాకేమీ తెలియదు. ఇక్కడికొచ్చినప్పుడు మొహంగూడా చూడలేదు. ఈగడప దాటలేదు. ఒకరోజుమాత్రం—వానొచ్చినరోజు—చిన్నతాతగారింటికెళ్లాం అంతే.

వీరమ్మ ఇంతలో నచ్చటికి వచ్చెను.

కామే—ఇంతచిన్నతనంలో ఎంతకష్టం తెచ్చిపెట్టాడు భగవంతుడు! నాలుక్కాలాలపాటు సుఖంగా ఉంటారనుకున్నాను. ఇంతదగ్గిర్లోనే మృత్యుదేవత ఉందనుకోలేదు.



హైమ—ఏది జరిగినా మనమంచికోసమే జరుగుతుందని, దేవుడిమీద భారంవెయ్యడమే ఉత్తమం.

"అయేదంతా అయింది. ఇక బ్రతుకవలసిన నాలుగురోజులూ కళ్లుమూసుకు వ్రతాలు, నోములు చేసుకుంటూఉండు. ఊరికే దుఃఖపడితేమటుకు పోయినవాడొస్తాడుగనకనా?" అనుచు కామేశ్వరరావు వెడలిపోయెను. రెండుదినములుండి కామేశ్వరరావు కుటుంబసహితముగ రాజమహేంద్రవరమునకుఁ జనెను.

హైమను వీరమ్మ సుందరమ్మ లనేకవిధములఁ గష్టపెట్ట నారంభించిరి. హైమకు కుంకుమగాని పసుపుగాని ఎవ్వరును తాకనీయలేదు. వైధవ్యము సంభవించెనేని పసుపుకుంకుమలకు దూరమున నుండవలెనని యామెకు సుందరమ్మ చెప్పెను. హైమ తెల్లపోయిచూచి నిట్టూర్పువిడిచి "నాబొమ్మలకుగూడా పసుపూ కుంకుమా పెట్టుకోగూడదూ?" అనియెను.

సుంద—అసలలా వేలేసి ముట్టకూడదు.

హైమ—పోనీ చామబొట్టు బొమ్మలకు పెట్టొచ్చునా?

వీర—అసలు తాకరాదని నీకుగాదూ చెప్పేదీ? నీబొమ్మలన్నీ అందరికీ ఇచ్చేస్తే రోగం కుదురుతుంది.

హైమ బొటబొట నీరుకార్చుచు గదిలోనికిఁబోయెను. వీరమ్మ మఱునాఁడు నలుగురైదుగురు రాండుపిల్లలను బిలిచి హైమగదిలో ప్రవేశించి "ఏవీ నీబొమ్మలపెట్టె?" అని యడిగెను.

హైమ—(బిక్కమొగముతో) ఎందుకు?

వీర—బొమ్మలుంటే పసుపుకుంకాలు ముట్టుకుంటానంటావు. నీకు బొమ్మలెందుకసలే? చిన్నపిల్లలు ఆడుకుంటారు.

హైమ—నాబొమ్మలతోనే ఆడుకొని మళ్లీ నాకిచ్చెయ్యమనండమ్మా

వీర—వెధవచాదస్తం. చెపుతూఉంటేను.

అని విదల్చి, హైమను తోసి పెట్టెలో కృష్ణుడు పెండ్లియందు తెచ్చినవానితోగూడ నన్నింటిని ఆపిల్లలకుఁ బంచియిచ్చివైచెను. హైమ ఏడ్చుచు నిలుచుండెను. ఆమె నోదార్చువా రెవ్వరును లేరు. సుందరమ్మ యన్ననో వీరమ్మచేసినప్రతిపనికిని తలయూచునట్టిది. ఇంక హైమకుదిక్కెవ్వరు? భగవంతుఁడుగూడ నామెను విసర్జించెనా? ఆమె పదుమూఁడువత్సరములప్రాయముగల 'కన్యక.' పుట్టిననాటనుండియు నుపవాసములు చేసికాని, యొంటిపూటనిరాహారములు చేసిగాని యెఱుంగదు. కాని వైధవ్యము సంభవించిన మాసముదినములకు దినమున కొక్కపూటమాత్రమే భుజింపవలె ననియు, రాత్రిపూట నేదియో నోటిని గొట్టుకొనవలెననియు వీరమ్మ అభిప్రాయపడెను. వెంటనే సుందరమ్మనుగూడ తనయాలోచనాపథమునకు మరల్చుకొనెను.

వీర—అమ్మా! హైమకు రోజూ మూఁడుపూటలాఅన్నం పెడుతున్నావా?

సుంద—చిన్నపిల్ల. మొగుడుపోయినంతమాత్రాన పెద్దదైందా?

వీర—పెద్దదికావడం గాదు. అది వ్రాసినఉత్తరాలూఅవీ చూశావుగదా. మొగుడున్నప్పుడే దాన్ని పట్టపగ్గాలు లేనప్పుడు ఉప్పూ, కారం, మూఁడుపూటలు భోజనం—అదేమున్న దారిలో ఉంటుందీ? ఎల్లకాలం దీనివల్ల మనకు అపఖ్యాతి రావడమేకాదూ. కృష్ణుడికి ఉత్తరంవ్రాసెనో, ఇంకెవడికన్నా మచ్చుజల్లో తెంచుకు పోయిందంటే మనమనుకొని కార్యంలేదు.

సుందరమ్మ—మాటాడలేదు.

వీర—సరెపోయింది. నువ్వు పెట్టలేకపోతే, నేను పెడతానులే. ఇంట్లో వెధవకూతురుందంటే ఎంతకష్టంగా గడుస్తుందో తెలియదు. నీఅంతపెద్దదానికి నేను చెప్పాల్సొచ్చింది.

నాఁటినుండియు వీరమ్మయే హైమకు భోజనము పెట్టుచుండెను. మూఁడుపూటలు భోజనముచేయుబాల ఏకభుక్తముతో దినములు గడపవలసివచ్చెను. రాత్రిపూట నేదో రుచియుఁ బసియు లేనిదేదియో తినవలసినదాయెను. అంతేగాక తనప్రక్కనే వీరమ్మయుఁ గూర్చుండి సరసములగుపదార్థములను భుజించుచుండెడిది. జిహ్వాచాపల్యముచే హైమ ఏదైన నడిగినచో వీరమ్మరుద్రాకారముతో నామెను భయపెట్టి తిట్టి నోటికివచ్చినకారుకూతలు కూయుచుండెడిది. ఇంత కష్టపడుచున్నను హైమవతి యొక్కొకప్పుడు మంచిచీర గట్టుకొని తన నగలను పెట్టుకొని యద్దముముందునిలిచి తనలో తాను సంతోషించుకొనుచుండెడిది. వీరమ్మగాని సుందరమ్మగాని చూచిన నేమందురో యనుభయ మామెకు లేకపోలేదు. అందువలన నెవ్వరును చూడకుండుటకు తగుప్రయత్నముల నామె చేయుచుండెడిది. కాని, యొకనాఁడు వీరమ్మ యామె ధరించినయలంకారములనుచూచి వెంటనే గదితలుపు కొట్టెను. హైమ ఏమిచేయుటకునుఁ దోచక తలుపు తీసెను. అంతవీరమ్మ రాక్షసాకారముతో నిలిచి "ఏమిటీ వేషమంతా?" అని గద్దించెను. హైమ మాటాడలేదు. "భగవంతుఁడు బాగా క్షౌరం జేస్తున్నా, ఇంకా ముచ్చట్లుతీరలేదు కాబోలు. వెధవ కెందుకూ ఈవేషాలన్నీ? చూస్తే నలుగురిలో నగుబాటు కాదూ? నేఁగనుక సరిపోయింది. ఇంకెవరన్నా చూస్తే ఏమనుకుంటారు? ఈవేషం చూసి అనుమానపడతారా, పడరా?" అని కోపపడియెను.

ఈప్రకారముగ నుపన్యాసము నిచ్చి వీరమ్మ యామెవస్త్రములను నగలను తనపరము చేసికొనెను. హైమవతి దుఃఖించుచుఁ గూరుచుండెను. కాని యబలయగునాబాలిక ఏమిచేయఁగలదు? తనవస్త్ర

భరణములను తీసికొన్నఁ దీసికొనెఁగాక, అవి పదిలముగ నుండునవియైన సంతోషింపవచ్చును. కాని, ఆసంతోషమునకుఁగూడ తావులేకుండు నట్లు వీరమ్మ చరించెను. హైమవతివస్త్రములనే తాను ధరించి యామె యాభరణములతో తాను శృంగారించుకొని చెల్లెలికెదురుగ నామె తిరుగ మొదలిడెను. హైమవతియన్ననో, ఏయలంకారములును లేక, క్లేశోపవాసములతో శుష్కించి వీరమ్మ కరుణించి యొసంగిన 'కోరా మల్లు' గుడ్డలతో కాలము గడపవలసినదాయెను. ఈస్థితి యామెకెం తయు సహింపరానిదై యుండెను.

ఆమె యేమైన నన్నచో, "వైధవ్యము తెచ్చిపెట్టుకొంటి" వని యు, "నిన్ను వివాహమాడుటవలననే నీభర్త మరణించె" ననియు, "నీపాపఫలము ననుభవింపు" మనియు, "ఆత్మహత్యకుఁ దలపడినదా ని నబల వెళ్లగుము" వనియు, "దొంగయుత్తరములు వ్రాయనేర్చిన బోగముదాన" వనియు, "పుట్టినిల్లంటిపెట్టుకొని, ఎల్లప్పు డేడ్చుచు, నాకు దుఃఖము కల్పింతు" వనియు, ననేకములగుమాటలను చీవాట్లను దెప్పిపొడుపుమాటలను సుందరమ్మకూడ శ్రావణభాద్రపదములందలి వర్షధారాసమూహమువలె హైమపైఁ గురిపించుచుండెను. ఒకనాఁడు హైమవతి వీరమ్మను తలకురాచికొనుటకుఁ గొబ్బరినూనె యడిగెను. వీరమ్మ ముఖముముడిచి, చిల్లించి, మార్చి-"వెధవకు షోకులెందుకు?" అనెను. పాపము హైమకుఁ గొబ్బరినూనెగూడ కఱవయ్యెను. తిరుపతి వెంకటేశ్వరునకు మ్రొక్కుకొన్నతలవెంట్రుకలవలె నామెశిరోజములు చిక్కులు పడి జడలుగట్టి యుండెను. తలంటి స్నానము లేదు. నూనె లేదు. సంస్కారము లేదు. పేలుమాత్రము లుకలుకలాడుచుండెను. ఈరుపేనతో పేలబాధనుండియైన నామెను రక్షించువారొక్కరును లే రైరి. మగఁడు 'ముండ' యన్న నూరివారందఱును 'ముండ'యన్నట్లు



తల్లియు, అక్కయుఁగూడ నానాకష్టములపాల్సేయుచుండ, నేఁడు హైమ నాదరించువారు లేకుండుటయేగాక, ఇంటిలోని చాకలినాగన్న తోటమాలిగంగయ్య, దాసీకోటాం మున్నగువారందఱును గూడ నా మెమాటలను సరకుగొనరైరి. అందఱిబట్టలను ఉదికి నాగన్న హైమ గుడ్డ లట్లేయుంచి పోవుచుండును. అందఱిపరుపులను బఱచి యామె పరుపట్లేయుంచును. ఆమె ఎవ్వరితో చెప్పినను కార్యము లేదు. చావ పైఁ బరుండుమని వీరమ్మగారియుత్తరువయ్యెను. "గుడ్డఉదుక్కోలే వా?" అని వీరమ్మగారు గద్దించి, ఆశ్చర్యచకితురాలైనట్లు నటించిరి. చేయవలసినపనినేచేయనప్పుడు, చెప్పినపని చేయుటెక్కడిది? మీఁదు మిక్కిలి ఇంటినౌకరులందఱును హైమకు మీఁదియధికారులై యాజ్ఞ లిచ్చుచుండిరి. ఆమెమాటలాడ కూరకున్నప్పుడే నూఱుఅక్షింతలు నామెమొగముపైఁ జల్లనీదయామయులు, కర్మము చాలక యేమైన నన్నచో, బ్రదుకనిత్తురా? ఆమెను కొట్టక ప్రాణముతో విడిచిరనుట చే వారు కరుణాసముద్రులనుటయే యగును. రెండునెల లగునప్పటికి క్రొత్తకోరానోసతుల నన్నింటిని చాకలినాగన్న చింపివైచెను. అందు లో నొకదానిని కోటాం దొంగిలించెను. ఈసంగతి వీరమ్మకు విశదీక రింపఁగా, చెల్లెలిపై దయ దలఁచి తనవిరెండుప్రాఁతగుడ్డ లిచ్చి యాద రించెను. ఈయావరణయే హైమకుఁ బదివేలుగ నుండెను. కాని, యామెకు రైక తొడిగికొనవలెనని కోరిక యుండెను. అడిగినచోఁ జీవాట్లును చెప్పదెబ్బలేయని యామె తెలిసికొని ఎట్లో సూదిని, దార మును సంపాదించి చినిగిపోయినగుడ్డల నతుకుపెట్టి యొకరవికను కుట్టు కొనుచుండఁగా వీరమ్మ పెద్దపులివలె నామెను పట్టుకొనెను. నాఁడామె పడినచీవాట్లిన్నియన్నియనరాదు. సూదిని దారమును చింపిగుడ్డలనుగూడ వీరమ్మ తీసికొనిపోయి పాఱవైచెను.

ఏకాదశీనిరాహారములతోడను, రాత్రిఫలాహారములతోడను, నేకభుక్తములతోడను, అక్షింతలతోడను, అలక్ష్యములతోడను, ఆన్నిటినిమించు వైధవ్యముతోడను హైమవతిజీవితము దుర్ఘటముగ నుండెను. ఆమెకు మనోరోగము వృద్ధియయ్యెను. తనూలత శుష్కించెను. జబ్బుచే లేవలేక పడిపోయినప్పు డామెపై జాలిగొన్నవారెవ్వరును లేరైరి. సుందరమ్మమాత్రము తల్లియైనదోషమువలన నింత కరుణించి శుశ్రూషోపచారములను జేయ సాహసించెను. వీరమ్మ తనతల్లిని, ఆపనియైనఁ జేయనిచ్చినందులకు మాకృతజ్ఞతాపూర్వకవందనసహస్రము లర్పించుచున్నాము. వేంకటప్పయ్యగారి కీసంగతులు పూర్తిగఁ దెలియవు. కాని హైమ నేదో కష్టపెట్టుచున్నారనిమాత్ర మాయనకుఁ దెలియవచ్చెను. ఆసంగతినిగూర్చి యడిగినచో భార్యాదుహితలు తన్ను దండితు రని చాలవఱ కూరకుండెను. తుట్టతుదకు సుందరమ్మను బిలిచి, ‚‚ హైమకన్నీ జాగర్తగా చూస్తున్నారు కాదూ ?" అని యడిగెను.

సుంద—జాగర్తగానే చూస్తున్నాం. ఈమూలకూచొని ఏదో ఒకటి అనుకుంటూఉంటారు.

వేంక—కాదులే, దానికన్నీ సర్గ్గా జరుగుతున్నాయో లేవో అని అడిగాను. దాన్నెలాగో జాగర్తగా చూసుకోండి. మనంతప్పితే దాని కెవ్వరూ దిక్కులేరు గాదా !

సుంద—మీరు చెప్పలేదని ఏమీ చెయ్యకుండా అట్టేఉంచాం! మీకొక్కరికే కూతురిమీద దయ ! మీరొక్కరే పట్టుకు పాకులాడుతూ ఉన్నారు !

వేంక—కాస్త జాగర్తగా చూడండి అని చెప్పాను.

సుంద—అలాగే చూస్తాం. మహాలావుగా దయ ! మీరుచెప్పలేదని అట్టేఉండదు.



ఇంతలో వీరమ్మ ప్రవేశించి ‚‚ ఏమిటే అమ్మా ?" అనియెను.

సుంద—ఏముంది ? ఎప్పుడూ ఉన్నసంతే. దాన్ని మనం జాగర్తగా చూడలేదుట. దానికేమీ కష్టకంలేదుట, పొయ్యడంలేమట. నాకు బుద్ధులు చెప్పడానికి పిల్చారు.

వీర—'నిజమే, ఏమీచెయ్యం' అని చెప్పలేకపోయావూ ?

సుంద—ఆమాటేమిటో నువ్వేచెప్పు. (అని వెడలిపోయెను.)

వీర—ఎప్పుడూ ఏదోగొడవ. ఊర్కే కూచుంటే ఏంతోస్తుంది? మాప్రాణాలు తీస్తున్నాను.

వేంక—అదికాదే; మొగుడుపోయినపిల్ల. కొంచెం జాగర్తగా చూడండి అని మెల్లిగా చెప్పాను.

వీర—మేము చూడము; చూడవల్సుకోలేదు. ఏంజేస్తావు ? నీదండనా ఏమిటి మాకు ?

వేంక—లేదులే. మీకంటే నేను ఎక్కువగా చూడఁగలనా ఏమిటి ? పెద్దవాణ్ణిగనక చెప్పాను.

వీర—ఆఁహా ! నీపెద్దతికమంతా కొల్లబోతూఉంది. పెట్టిందేదో తిని పడుండక అధికారాలు బలిస్తేసరి.

వేంకటప్పయ్య నిరుత్తరుఁడై యొక్కమాటయైన జవాబుచెప్పక వీరమ్మయిచ్ఛానుసారముగ నాదూషణోపన్యాసమును సాగనిచ్చెను. వీరమ్మయు నాయుపన్యాసతీవ్రతవలన నలసి సొలసి వెడలిపోయెను. ఇంటిగుమాస్తా యగు రామయ్య యీసంగతుల నన్నింటిని జూచుచుండెను. ఆగంటివారి పూర్వపుస్థితిగతులనుగూర్చిగాని, ప్రస్తుతవిషయములనుగూర్చిగాని రామయ్యకుఁ దెలియని దొకతలవెంట్రుకవాసియైన లేదు. సుందరమ్మవీరమ్మలకుట్రలును, కుచోద్యములును, ఊహాసంరంభములును ఆతఁ డెఱుంగకపోయినను, ఇంట జరుగు సంగతుల

ను కన్నులారఁ జూచుచున్నవారిలో రామయ్య యొకఁడు. రామయ్య తండ్రి వేంకటప్పయ్యగారివద్ద గుమాస్తాగా నుండి చనిపోయెను. ఆయనతరువాత మన కథాకాలమునాఁటి కైదాఱుసంవత్సరములకుఁ బూర్వము రామయ్య వేంకటప్పయ్యగారి గుమాస్తా యయ్యెను. వేంకటప్పయ్యగారు వృద్ధగాత్రుఁడై యుండి, పక్షవాతపీడితుఁడు గాకున్నప్పుడు రామయ్య యాయనకుఁ గుడిభుజమై మెలంగుచుండెడివాఁడు. ప్రస్తుతము సుందరమ్మ వీరమ్మల ప్రభుత్వముసందాతఁ డేముఖ్యవిషయమునందును నియమింపఁబడకుండెను. ప్రతిదినమును వచ్చి వేంకటప్పయ్యగారి లెక్కలను చూచుచు, ఆగంటివారియింటికిఁ గావలసిన భోజనసామగ్రులను దెప్పించుచు, ఏవిషయమునందును జోక్యము గలిగించుకొనక ఆతఁడు తామరాకుపై నీటిబిందువువలె కాలము గడపుచుండెను. ఊరివా రెవరైనను ఆగంటివారివిషయమై సత్యమును దెలిసికొనవలె నన్నచో నీరామయ్యనే యడుగుచుండెడివారు. రామయ్యయు ఇంటఁదిని ఇంటివాసములు లెక్కించువారిలోఁ జేరక ఆగంటివారివిషయమై ఎవరికైన నేదైన దురభిప్రాయము గలిగెనేని దానిని తుత్రిటిలో నెగురఁగొట్టుటకు సంసిద్ధుఁడుగ నుండెను. కాని హైమవతిపడు బాధలను జూచి యాతఁడు సహింపఁజాలకుండెను. ఆమె విశ్వతుమే యగును. నియమితమార్గమున నామె నడవవలసినదే యగును. వీరమ్మసుందరమ్మ లామెయాముష్మికసౌఖ్యమునకే పాటుపడుచుండవచ్చును. కాని బాలికయు, 'కన్యయు' నగు హైమవతి నీ రూక్షకట్టునిబంధనలకు లోఁబడియుండుమనుట యాతని కసహ్యముగ నుండెను. పెద్దముసలివారే సరకుగొనని యేకభుక్తవ్రతము నామెపైఁ బ్రయోగించుట యాతని నాశ్చర్యమునకును, దుఃఖమునకును పాల్సెసెను. బాల్యచాపల్యముచేతనో, సౌందర్యలాలసత్వముచేతనో (ఏదో కథచెప్పినట్లు



గంజిలో మెతుకుఁజూచి యానందపరవశయై నోటఁబెట్టుకొన్న తరుణివలె) హైమవతికూడ బాహ్యప్రపంచమునకు ద్వారమునుండి, తోడిబాలికలకు దూరముగనుండి సౌఖ్యమునకు దూరముగనుండియు, తనగదిలోనే రెప్పపాటుకాల మానందించుటకుఁగూడ నోఁచుకొనఁజాలకపోవుట రామయ్యకుఁ గష్టముగ నుండెను. పూజాపునస్కారములులేక ఎండిపోయినలతానికుంజమువలె నున్నయామె శిరోజము లాతనికి వీరమ్మసుందరమ్మలపై వెగటు గలిగించెను. బొట్టుమాత్రము తీసివైచి గదిలోఁ బడియుండనిచ్చి వంగని మడఁగని రూక్షకట్టుబంధనలకు లోనగునట్లు చేయకున్నచో రామయ్య సంతోషించెడివాఁడు. ఏది ఎట్లున్నను ఆతఁడీవిషయములో జోక్యము కలిగించుకొనఁదలఁచుకొనలేదు.

ఏలూరుబజారునందొకనాఁ డొకఁడు రామయ్యనుగాంచి "ఏమోయి. ఆగంటివారి కన్నికష్టాలేవచ్చినట్లున్నాయి?"

రామ—ఆఁ, అవును. మొదటల్లుడు దేశాంతరుఁడై పోవడము, వేంకటప్పయ్యగారికి పక్షవాతం రావడమూ, రెండోఅల్లుడు చనిపోవడమూను. తగిలినకాలికే తగులుతూఉంటుందని శాస్త్రమే ఆయెను.

ఒకఁడు—అవునుగాని ఆరెండోపిల్లని నానాకష్టాలు పెడుతున్నారుటగా?

రామ—ఏదో, నలుగురూ నాలుగుమాట లనుకుంటారు. ఒకరింటిగొడవ మనకెందుకు?

ఒకఁడు—అయితే, ఊరికేనే బుకారు పుట్టిందన్నమాట.

రామ—కద్దైతే మనకేమి? కల్లనైతే మనకేమి? అదీ ఇదీగాక నిజమే అయితే మనకేమిటి?

ఒకఁడు—అదికాదు రామయ్యా, నాదగ్గిర నువ్వు దాచొద్దు. నీచరిత్రం అప్టుపుట్టానవాళ్లతో నాకుదెలుసును. నాసంగతి యావత్తూ నీకుతెలుసును. ఇన్నాళ్లబట్టీ స్నేహితులముగా ఉన్నవాళ్లము మనము. నువ్వు నాతో చెప్పినముక్క మఱొకడికి వెళ్లదని నువ్వెఱుగుదువు. నాతో చెప్పడానికి ఎందుకూ నీకుజంకు?

రామ—నాకథైతే నీకు చెప్పొచ్చును. ఊళ్లోవాళ్లసంగతులు నీతో చెప్పమంటా వేమిటి? దీనివల్ల నీకొచ్చేలాభ మేమిటి?

ఒకఁడు—చెప్పినందువల్ల నీకొచ్చే నష్టమేమిటి? చెప్పనందువల్ల లాభమేమిటీ? మీదుమిక్కిలి ఎవ్వడితోనూ చెప్పనయ్యా బాబూ అని మొత్తుకుంటూ ఉంటేనిగానూ?

రామ—ఏదోశాస్త్రానుసారంగా యావత్తూ చెయ్యమంటారు. చిన్నపిల్లకావడంచేత అవ్వేమీ చేయదు. దానిమీద పెద్దవాళ్లు నాలుగుమాట లంటారు. అంతకన్న ఏముంది.

మెల్లమెల్లగ హైమకష్టములసంగతియంతయు నాతఁడు రామయ్యవద్దనుండి తెలిసికొనెను.

ఒకఁడు—అయితే ఎరక్క అడుగుతూఉన్నాను—వీరమ్మకు హైమవతిమీద ఎందుకుఅంతక్కోపం?

రామయ్య—అడగవలసినప్రశ్న అడిగావు. దాచేద్దామనుకున్నాను. వేంకటప్పయ్యగారు మొట్టమొదట కాకినాడలో ఆయనమేనల్లుడికి హైమవతిని ఇద్దామనుకున్నాడు. హైమవతికికూడా బావనే చేసుకోవాలని ఉండేది.

ఒకఁడు—ఉండదూ మరి? అది సహజం.

రామయ్య—వేంకటప్పయ్యగారికి పక్షవాతంవచ్చి మంచంలో పడ్డాక సుందరమ్మకుగాని వీరమ్మకుగాని మేనరికమూ అంటే కంతపూ



ర్తిగా ఉండి ఈకొత్తసమంధం చేశారు. హైమవతి బావనే చేసుకుంటానని పట్టుపట్టింది.

ఒకఁడు—పాపం.

రామయ్య—తమకు ఇష్టంలేని మేనఱికముకావాలన్నదని కోపానికి మొదటికారణం. ఎలాగైతేనేం ఈమూణ్ణాళ్లరాజమహేంద్రవరంసమంధం చేశారు. ఇంకా బావమీదే మనస్సుండేటప్పటికి వీరమ్మకూ సుందరమ్మకూ మరింతకోప మొచ్చింది. ఒకమాటు కోపమూ, కసరడమూ, ఇటువంటిభావాలు కలిగేయా అంటే పెళ్లగించడానికి వీలుగాకుండా అవి మనస్సులో నాటుకుంటాయి. ఆమెమీద ద్వేషం ప్రబలి మహావృక్షమైపోయి, ఇప్పుడు ఆమెనుచూస్తే అరికాలుమంట నెత్తికెక్కేటంతగా పెరిగింది. అది అసలుమనోతత్త్వమూయెను.

ఒకఁడు—ఈఒక్కకారణానికి ఇంతచేసిందిటోయి? తల్లికిగూడా కూతురంటే ప్రేమలేదా?

రామ—లేకపోవడమేమి? పైకారణాలనుబట్టి వీరమ్మకూ సుందరమ్మకూ ఒకేవిధమైన ద్వేషభావాలు ఉండవలసి ఉన్నప్పటికీ తల్లిగనక సుందరమ్మ వీరమ్మకన్న కొద్దిగా నయము.

ఒకఁడు—వీళ్లబ్రతుకు బండలుగానూ? రాక్షసిపుట్టకలా ఏమిటి వీళ్లవి? ఎంతైతేమటుకు ఈకష్టాలు పెట్టడమేమిటి? తరువాత.

రామ—వీరమ్మకు చెల్లెలిమీదద్వేషానికి మఱొక్కకారణమున్నది. రోజూ కాలవగట్టున పురాణంచెప్పేఇంట్లో కామరాజని ఒకఅతను ఉన్నాడు. అతనికీ వీరమ్మకీ కొద్దిగా స్నేహముంది. వాకిట్లో వీరమ్మగదిలో వారుమాట్లాడుకుంటూ ఉండేవారు. ఒకనాడు, పెళ్లి అయినతర్వాతనే, హైమవతి ఇద్దరినీ చూసి తల్లికిచూపింది. తండ్రికీ చెప్పింది. తండ్రి కాసేపు తనపూర్వమర్యాదను తలుచుకొని ఏడ్చా

ను. తల్లి వీరమ్మకు ఏమీ అనక ‹‹పోనీలే›› అని వదిలిపెట్టింది. లేకపోతే ఏమంటుంది? ఆపాటిస్వేచ్ఛన్నా ఇవ్వకపోతే దేశమ్మీద పడుతుంది. మర్యాదంతా మంటిలో కలుస్తుంది. ఈసంగతిజరిగిన మొన్నాడు వంటసామానుగదిలో నేను ఏదో చూస్తూఉంటే సుందరమ్మ వీరమ్మతో చెప్పినమాటలు వినపడ్డాయి. సుందరమ్మ అన్నదేమిటంటే ‹‹నువ్వు ఏవడితోనే స్నేహం కలిపావు. బాగానే ఉంది. మొగుడు దేశాంతరం పోతే అంతా న్యాయమార్గంగా ఉండమంటే ఎలాఉంటారు? కాని, నలుగురికి తెలియకుండా ఆకామరాజు నొక్కణ్ణే నమ్ముకున్నావంటే సరిపోతుంది.›› అని చెప్పింది. వీరమ్మ చేష్టలన్నీ అప్పటినించీ సుందరమ్మకు తెలుసును. ఏమంటే ఎక్కడ తెంచుకుపోతుందో అని వీరమ్మమాటకు జవదాటకుండా సుందరమ్మ ప్రవర్తించడం మొదలుపెట్టింది. అప్పటినించీ గుట్టు బైటపెట్టిన హైమవతిమీద, సుందరమ్మలాగ ఉపదేశవాక్యాలు చెప్పక మర్యాదకోసంవచ్చిన వేంకటప్పయ్యమీద వీరమ్మ కారాలు మిరియాలు నూరడం సాగించింది.

ఒకడు—ఇంత్తకథ ఉందని నాకు తెలియనే తెలియదు. ఏదో ఇటువంటిదని అనుమానించానుగాని; నువ్వు చెప్పేదాకా నిజం తెలియలేదు.

రామ—ఇది బైటికి తెలిసిందంటే నాకూ ట్రోరాయి పడుతుంది జాగ్రత్త. నీమనస్సులో ఉంచుకో, పైకి స్వప్నమాత్రమూ మనసుకైనా గానీ రానీయకు.

ఒకడు—అది సరేగాని, ఎన్నాళ్లు ఆపిల్ల ఇలాబాధలు పడుతూ ఉంటుంది.

రామ—బతికున్నంతకాలమూను.

ఒకడు—ఎక్కడికైనా తెంచుకుపోదుగదా? అప్పుడు వెంకట



ప్పయ్యగారికి మరీ అప్రదిష్టవస్తుంది.

రామ—ఛీ. ఛీ. ఛీ ఆపిల్ల అటువంటిదిలా కనబడదు. మళ్లీ ఆబాధ వచ్చినా వచ్చేజన్మంలో చేసుకుంటానంటుందిగాని ఈజన్మంలో చేసుకోదు.

ఒకడు—ఏమోలే, కష్టాలు భరించడం ఎవరికి సాధ్యమవుతుంది?

రామ—నాకూ, అనుమానంగానే ఉంది కాని, అప్రదిష్ట తెచ్చే ఏపనీ ఆపిల్ల చెయ్యదని నానమ్మకం.

ఒకడు—లోకోభిన్నరుచిః అన్నారు. నీదృష్టిలో అప్రదిష్ట అనుకున్నపని ఆపిల్లదృష్టిలో అప్రదిష్ట కాకపోవచ్చును. వెనకటికి వెండి కవచమనీ, బంగారుకవచమనీ పోట్లాడుకొన్న వీరులకథలోలాగ ఒకవేపు చూసి ‘ఇదివెండిది’ అని నువ్వనుకోవచ్చు. కాదు ‘బంగారపుది’’ అని మరొకరనొచ్చు.

రామ—నువ్వుచెప్పేది నిజమే గాని, లోకంలో ప్రజలంతా ‘మంచివి’ అని ఒప్పుకొనేవి కొన్ని ఉంటయి. ‘చెడ్డవి’ అనేవి కొన్ని ఉంటయి. ప్రపంచకము మారుతూ ఉంటుంది. ఇప్పుడు చెడ్డదనుకున్నది, ఇంకాస్సేపటికి మంచిదనుకుంటాము. ఇవ్వాళ చెడ్డదనుకున్నది ఇంకోపదిరోజులు పోయాక మంచిదనుకుంటాము. మనచుట్టూ ఉండే పరిస్థితులనుబట్టికూడా మన అభిప్రాయాలు మారుతూ ఉంటయి. అందరిఅభిప్రాయముతో పాటు నీఅభిప్రాయమూ, నాఅభిప్రాయమూ, ఆపిల్లఅభిప్రాయమూకూడా మారొచ్చును. చుట్టూఉండే పరిస్థితులు అందరికీ ఒకలాగే మారినప్పుడు, అందరికీ ఒకమోస్తరు అభిప్రాయాలే కలుగుతయి. ఎప్పుడూ మంచిపనినే చేసే హైమవతి అప్పుడు మనకుండే అభిప్రాయాలనుబట్టి మంచిపనే చేస్తుంది అని నాకు గట్టినమ్మకము ఉంది.

ఒకఁడు—చాలా అనుభవంమీద చెప్పావు. ఏమౌతుందో చూడాలి. ఒకటి స్థిరపరుచుకోడానికి వీలులేదు. ఇక నేను వెడతాను. అప్పుడప్పుడు కనబడుతూఉండు.

రామ—అలాగేలే.

---

## పదియవప్రకరణము.

కృష్ణరావు చెన్నపురమునందు బి.ఏ. సీనియరుతరగతిలో చదువుకొనుచుండెను. ఆతనికి హైమవతిభర్త చనిపోయినట్లు నాగభూషణముగారివద్దనుండి యుత్తరము వచ్చెను. కృష్ణరావు హైమవతికివచ్చిన పెద్దకష్టము దలపోసి దుఃఖించెను. ఆమె ఆత్మహత్య చేసికొనఁ దలపెట్టినసంగతి యాతనికిఁ దెలియనేతెలియదు. పెండ్లిముందు "పునర్జన్మమున నీభార్య నగుదు" నని యామె చెప్పినమాట లాతనికి జ్ఞాపకము లేకపోలేదు. కాని, పెండ్లియైనవెనుక భార్యాభర్తలన్యోన్యప్రేమపాత్రులై యుందురని యాతఁడు తలంచెను. నాఁటిహైమవతిప్రేమాలాపములు, అప్పటి కామెమనోభావములను వెల్లడించె ననుటకు సందియములేదు. కాని దినములు గడచినకొలఁదిని పెండ్లియైనభర్తపై గాఢానురాగము కలిగి తనపై ప్రేమ యంతరించు నని కృష్ణరావు దృఢనిశ్చయుఁడై చెన్నపురమున నుండెను. అట్టితఱి హైమవతిభర్త మృతుఁడయ్యెనన్నకఠోరవార్త యాతని కించుక హృదయసంతాపకరముగ నుండెను. హైమవతి ఇంక తనది కాదని నిర్ధారణచేసికొన్నప్పటినుండియు ప్రేమశిఖరమునుండి తన్ను పరాజితునిజేసి పడఁద్రోచిన



కేశవరావుపై నాతఁ డెప్పుడును కినుకఁ బూనలేదు. కేశవరావు మరణించె ననుటతోడనే యాతఁ "డయ్యో పాప" మనుకొనెను. ప్రేమశిఖరారోహణమునకై జరుగు ద్వంద్వయుద్ధములలో, మహాసంగరములలో, విజితులగు వీరులలో ననేకరకములవా రుందురు. "కామిని నన్ను వరింపక మఱొక్కని వరించినది, కానిమ్ము. ఇంక నాది కానప్పుడు దానిసుఖదుఃఖములతో నాకేమిపని ?" అనువారు కొందఱు గలరు. ఆమె పడుకష్టములను జూచి కొంచెము మనస్సంతాపమును సూచించు మనకృష్ణరావువంటివారు కొందఱు గలరు. "నాది కాకున్నను, అది సుఖపడుటయే నాజీవితోద్దేశ" మని నిర్ధారణ చేసికొనువారు కొందఱు గలరు. "నన్ను వరింపలేదుకావున, దీనిని, ఇది వరించినవానిని గూడ నష్టకష్టములు పెట్టెద" ననువారు కొందఱు గలరు. "నాకు దక్కకున్న దీని నింకెవ్వరికిని దక్కనీయ" ననువారు కొందఱు గలరు. కృష్ణరా వట్లు చింతించి యుత్తరమును డ్రాయరుసరుగునందుంచి తాళము వైచి తాను యథాప్రకారముగఁ జేసికొను పనులలో నిమగ్నుఁ డయ్యెను.

క్రిస్టుమసుసెలవులు సమీపించుచుండెను. కృష్ణరావు సెలవులకు కాకినాడ వచ్చెద నని యుత్తరము వ్రాసెను. ఆయుత్తరము నాగభూషణముగారు శేషమ్మకుఁ జదివివినిపించిరి. అదియంతయు విన్న వెనుక శేషమ్మ "క్రిస్టమసుశెలవులలో అబ్బాయి వస్తానని వ్రాశాడు. ఆశెలవులు పదిహేనురోజు లిస్తారా ?" అనెను.

నాగ—ఆఁ, పదిహేనురోజు లిస్తారు.

శేష—అయితే అబ్బాయితోగూడా ఒకమాటు ఏలూరు హైమను చూసి వస్తాను.

నాగ—తెలివితేకపోతే సిగ్గన్నా ఉండాలి. పెళ్ళిలో మన కేం

మర్యాద జరిగించవని నీఉద్దేశ్యం ?

శేష—ఏమీ జరగనేలేదనుకోండి. అయితేమటుకు మొగుడు పోయినపిల్లను చూడకపోతే బాగుంటుందీ ? ఏమనుకుంటారు ?

నాగ—వాళ్ళేమనుకుంటే మనకేమీ ? మనకు చేసిందంతా బాగుందా ఏమిటి, వాళ్ళకు చేసేది బాగుండడానికి ?

శేష—సరిపోయింది. పరామర్శ చెయ్యొద్దూ ? మొగుడుపోయినపిల్ల. అదేంజేసింది మనని ?

నాగ—అది చెయ్యకపోతే మానె. దానితల్లీ, అక్కా చెయ్య లేదూ ?

శేష—వెనకటికి కథచెప్పినట్టుగా ఉంది. తోడేలు గొర్రెపిల్ల నందిట—“నువ్వు తప్పుచెయ్యకపోతే మీఅమ్మో మీనాన్నో తప్పు చేశారు; అందుకని నిన్ను తింటాను” అందిట. అలా ఉంది. ఎవళ్లో ఏమిటో చేశారని ముక్కుమొహం ఎఱక్క, మొగుడుపోయినపిల్లని చూడ్డం మానెయ్యమంటారూ ?

నాగభూషణమ్మగారికి శేషమ్మమాటలు నచ్చెను. “అలాగ యితే కృష్ణాన్ని తీసుకొని వెళ్ళు. ఒకటిరెండురోజులకంటే ఎక్కువ ఉండకుండా వచ్చెయ్యండి.” అనెను.

శేష—అలాగేలెండి... అబ్బాయి ఎప్పుడు వస్తానని వ్రాశాడూ ?

నాగ—పందొమ్మిదోతారీఖున బయలుదేఱి, ఇరవై పొద్దున్న మెయిలుకు వస్తాడట. (పంచాంగము చూచి) ఆవేళ త్రయోదశివెళ్లగా చతుర్దశి అయింది.

శేష—అయితే ఏలూరికి ఎప్పుడు బయలుదేరొచ్చునండీ.

నాగ—వాడు రావడముతోటే బయలుదేరాలా ఏమిటి ?



శేష—చప్పున మనం చెయ్యవలసిన పరామర్శ జరిగిపోతే బరువు వదలినట్టుంటుంది.

నాగ—అయితే విదియినాడు పొద్దున్న బయలుదేరి సాయంత్రం మూడుగంటలకు ఏలూరు చేరండి. తరువాత—

శేష—పాడ్యమి మంచిదేగా, వెళ్ళకూడదూ ? పెళ్ళికెడుతున్నామా ? వడుగుకు వెడుతున్నామా ?

నాగ—ఆఁ. మంగళం కృష్ణపాడ్యమీ—బాగానే ఉంది. ఇరవై రెండోతారీఖు పాడ్యమి. పొద్దున బయలుదేరి సాయంత్రం ఏలూరు చేరుతారు. తదియనాడు పొద్దున్నే మెయిలులో పదకొండింటికల్లా ఇంటికి రావచ్చును.

ప్రయాణము నిశ్చయించుకొనఁబడెను. మార్గశిర శుద్ధ చతుర్దశినాఁడు కృష్ణరావు కాకినాడ చేరెను. పాడ్యమినాఁడు బయలుదేఱి శేషమ్మ కృష్ణరావులు ఏలూరు చేరి బండి కట్టించుకొని ఆగంటివారి యింటికిఁ జనిరి.

వాకిట బండి యాగెను. కృష్ణరావు బండి దిగుట హైమ చూచెను. వెంటనే యామెనెక్కడనులేనిదుఃఖముపరించెను. వెంటనే యామె చావడిలోనుండి గదిలోనికి వెడలిపోయి చాపపైఁ బడిపోయెను. కృష్ణరావు నామె చూచి ఒకటిస్సరసంవత్సర మయ్యెను. ఇదివఱకు కృష్ణుఁడు తన్నుచూచినప్పుడు నానావిధభూషణాద్యలంకారములతో, నూత్నసౌందర్యముతో, తొలకరిమెఱుపువలె నుండెను. ఇప్పుడో సౌందర్యవిహీనయై, శుష్కితగాత్రయై, వికృతవస్త్రయై, యాభరణవిహీనయై యుండెను. తనశిరోజములు ‘మహానటజటాదీప్తాటవీ’ సందోహములను ధిక్కరించుచుండెను. ఆమెముఖచంద్రబింబము తిలకకళంకవిహీనమై యుండలేదు. తన్నిప్పుడు చూచి కృష్ణుఁ డానవాలుపట్టఁ

గలుగువా? తాను వైధవ్యదశయందున్నందు కామెయంతగ దుఃఖమం
దలేదు, కాని అలనాఁడు చిన్నతోఁటయందు కృష్ణునికౌఁగిలింతలోఁ జి
క్కినహైమకును, నేఁడు సర్వసంగపరిత్యాగినియైనసన్యాసినివలె మలిన
వసనాన్వితయై నేలఁబడి పొరలుచున్నయీస్త్రీకిని గలతారతమ్య మా
మెహృదయమును కుఠారధారలతో వ్రచ్చివేసినట్లుండెను. ఒక్కనిమిష
మామె నిశ్చేష్టయయ్యెను. ఉచ్ఛ్వాసనిశ్వాసము లాగిపోయెను.
ప్రబలప్రయత్నముతో మరలనామె యథాస్థితికివచ్చెను. "కృష్ణుఁడు
నన్నింకను సౌందర్యవతి యనుకొనునా? కృష్ణుఁడు చిన్ననాఁటితోఁట
లందు చూచినహేమనే మరలచూచునా? నారూపమును అద్దములో
చూచికొన్నప్పుడు నాకే అతిభయంకరముగఁ గనపడెను. కృష్ణునకు నా
రూపు వెగటుకలిగింపదా? 'ఛీ' యని నాముఖముచూడక యాతఁడు
వెడలిపోయెనేని నాగతి ఏమగును?" అనుప్రశ్నలకు జవాబు చెప్పుకొను
లోపల నామెకు తననిజస్థితి జ్ఞాపకమునకు వచ్చెను. తానెవ్వరు? కృష్ణ
రావెవ్వరు? కృష్ణుఁడు తన్ను సౌందర్యవతి యని ఎందుకనుకొనవలెను?
తన్నెందులకు చూడవలెను. అతఁడు 'ఛీ' యనుకొనినందువలనఁ గలు
గు నపద్రవమేమి? ఈజన్మమునఁ దనకు జరుగవలసినదంతయు సమా
ప్తము కానున్నది. పునర్జన్మమునఁగాని కృష్ణుఁడు తన్నాసింపఁడు. కృ
ష్ణుని తానాసింపదు. అట్టియెడ కృష్ణుఁడిప్పుడేమనుకొన్న నేమి?——

ఎందువలననోగాని ఈతర్క మామెకు నచ్చలేదు. కృష్ణుఁడు
తన్నుచూచి సౌందర్యవతి యని యనుకొనవలెననియే యుండెను. వై
ధవ్యముచే నపవిత్రీకృతమైనతన్నాతఁడు కన్నెత్తియైన చూచునా?
చూడఁడా?——ఇట్లు వితర్కించుచు నామె లేచిగదిమూల కూర్చుండె
ను. ఇంతలో ప్రక్కనున్న పొరుగుగదియందు నడుగులచప్పుడు వినవచ్చె
ను. హైమ పొంగివచ్చుచున్న దుఃఖమును దాచుకొనఁ బ్రయత్నించుచుం



డెను. ఇంతలో శేషమ్మసుందరమ్మలు గదిలోఁ బ్రవేశించిరి. శేషమ్మ
ప్రపంచకమదరిపోవున ట్లేడ్చెను. ఆరోదనధ్వనిలో హైమరోదనధ్వనులు
కూడ కలసిపోయెను. ప్రక్కనున్న సుందరమ్మయు చేతులు కలిపి ఏడు
పసాగించెను. కొన్నినిముషము లిట్లు గడచినతర్వాత సందఱును శాం
తించి కుశలప్రశ్నలు వేసికొననారంభించిరి. హైమమాత్రము తన్ను
లునులుముకొనుచు మాటలాడకుండఁ గూర్చుండెను. ఆసమయమున
దేనికొఱకో వెదకుచున్నట్లు చూచుచు కృష్ణరావు మెల్లగ గదిగుమ్మ
ముదగ్గఱకు వచ్చెను. ఆతఁడు హైమవంకఁ జూచెను. ఆతనినయనము
లశ్రుపూరితములయ్యెను. వెంటనే యాతఁడు గోడచాటున కేగెను.
హైమ కృష్ణుని దూరముననే చూచి ఏమవుబడులు భయముతో చూ
చుచుండెను. కృష్ణునిబాష్పబిందువులను, వానిని దాచుట కాతఁడు
చేసినప్రయత్నమును హైమ చూచెను. ఆమె ఇఁక పట్టఁజాలక ముఖ
ము వెనుకకుఁ ద్రిప్పుకొనెను. రవికచేఁ గప్పఁబడనియామెప్రక్కటెము
కలు సముద్రకల్లోలమునందు వాతాహతిచేఁ గొట్టఁబడెడునెసరుబొం
గులవలె తేలిపోవుచుండెను. ఆ ఆయాసము, ఆఘోషము, ఆవిశ్వప్రయ
త్నము——ముందెవ్వరును అట్టిదిచూడలేను. శేషమ్మ హైమను లేవఁ
దీసి యోదార్చెను. కృష్ణరావు చావడిలోనికిఁ బరుగెత్తెను. అప్పుడు
సాయంతనము నాలుగుగంటలు దాటెను. శీతకాలము. చావడిలో
గామయ్య పచారుచేయుచుండెను. కృష్ణరావు తొందరగ చావడిలో
నికి వచ్చుటచూచి, "ఏమోయి, ఇంతతొందరగా వచ్చావు"
అనియెను.

కృష్ణ——ఏమీలేదు, ఎందుకోవస్తూఉంటేను——

రామ——పంతులుగార్ని చూశావా?

కృష్ణ——చూడలేదు ఇంకాను. వచ్చి అరగంటైనా కాలేదు.

కావకంతోటే మాఅమ్మ ఆగదిలోకి వెళ్లింది.

రామ—కొత్తవాడిలాగ అలా సిగ్గుపడతావేమిరా? కొత్తవా [illegible]

[illegible]

అని రామయ్య కృష్ణరావును లోనికి తీసుకొనిపోయెను. అక్క-డ పేరమ్మయు వేంకటప్పయ్యగారిని [illegible]యుండిరి. "ఇదుగో మీమేనల్లుడు కృష్ణరావొచ్చాడు" అని రామయ్య యనెను.

వేంక—ఎప్పుడొచ్చావు? బాబూ, రా, కూచో, క్షేమమొచ్చిందా?

కృష్ణ—వచ్చింది. అత్తా, అమ్మావాళ్లూ ఆగదిలో ఉన్నారు.

వేంక—ఏగదిలో? ఇక్కడికి రాకుండా ఎక్కడికో వెళ్లిం దెందుకూ? చూసి చాలాకాలమైందిగదా?

వీర—హైమగదిలో ఉన్నారుట అంతాను. ముందుహైమనా నిన్నాచూడాల్సింది?

వేంక—ఇక్కడ ఇంకా రెండురోజాలుంటావా?

కృష్ణ—ఎల్లుండి పొద్దున్న మెయిలుకు వెళ్లిపోతాము.

వేంక—మీనాన్న బాగున్నాడా?

కృష్ణ—ఆ.

ఇట్టివే ఇంకను గొన్నిలోకాభిరామాయణమునకు సంబంధించిన ప్రశ్నలు వైచినతరువాత కృష్ణరావు వెడలెద నని చెప్పి చావడిలో రామయ్యను కలిసికొనెను. వేంకటప్పయ్యయుఁ గృష్ణరావును మాటాడుచున్నప్పుడు వీరమ్మముఖము కందగడ్డవలె ఎఱ్ఱఁగఁ గందియుండెను. అంతచనువుగఁ దనతండ్రి కృష్ణరావుతో మాటలాడుటకు జగత్కంటకముగు విషయముగ నామెకుఁ దోఁచెను.

కృష్ణరావు రామయ్యతోఁగలసి షికారు వెడలెను. కొంతదూర



మరిగిన తరువాత రామయ్య ఇట్లారంభించెను.

రామ—హైమవతిగతి చాలావిచారకరమైంది.

కృష్ణ—ఊఁకొట్టెను.

రామ—ఇంతపసితనంలోనే మొగుడు జావడం ఆగదిలో అలా కూచోడం. ఆ ఆకారం. చూస్తే ఏడుపొస్తుంది......అదీ కాకుండా అత్తల్లీ అక్కా పెట్టేబాధలు చెప్పతరంగాదు.

కృష్ణ—హైమను బాధలుపెడతారా? ఏంచేశారేమిటి?

రామ—రవిక తొడుక్కోవద్దనడం. ఒకపూటే తిండిపెట్టడం. ఇలాంటిబాధలు పెడుతున్నారే.

కృష్ణ—హైమ ఎలాపడుతూ ఉంది ఈబాధలు?

రామ—పడక ఏంచేస్తుంది?

కొంతదూరము వారిరువురును మాటలాడకుండ నడచిరి. కృష్ణరా వేమియో యాలోచించుచుండెను. రామయ్య ఏదో యూహను వెల్లగ్రక్కుదమా వద్దా యని తహతహపడుచుండెను. కృష్ణరావు రామయ్యయాతురతను తహతహను చూడలేదు. కొంతసేపటికి రామయ్య కృష్ణరావువైపు తిరిగి,

రామ—ఏమోయ్, నామనస్సులో ఒకసంగతుంది. అది నీతో చెప్పా లనుకుంటున్నాను.

కృష్ణ—మీఇష్టం. చెప్పవచ్చును.

రామ—హైమవతి చిన్నప్పటినుంచీ నిన్నే చేసుకోవాలనుకున్నమాట నిజమేనా?

కృష్ణ—అయిపోయినసంగతు లన్నీ ఎందుకులెండి—

రామ—ఇప్పటికిని నీమీదనే మనస్సుంది. [illegible] సాయంచేశావంటే హైమవతి కష్టాలు దాటి గట్టెక్కుతుంది.

కృష్ణ—మీమాట నాకర్థం లేదు. ఎలా సాయంచెయ్యమంటారు?

రామ—మీయింటికి తీసికెళ్లిపోవాలి.

కృష్ణ—మాయింటికివాళ్లు పంపించా పంపించరు. అది రానూ రాదు. మాఅమ్మా మానాన్నా గూడా ఊరుకుంటారు గాని సాయం చెయ్యరు. అదీ గాక వెధవపిల్లని మాయింటికి తీసికెళ్లడమూ మర్యాదగా ఉండదు......మీరు చెప్పేదేమిటో నాకు అర్థం కాలేదు.

రామ—అది కాదోయి పిచ్చివాడా! స్త్రీపునర్వివాహాలమాట ఎప్పుడన్నా విన్నావా?

కృష్ణ—విన్నాను. ఇప్పుడు నన్నేలా చేసుకోమంటారా? ఏమిటి?......మానాన్న పూర్వాచారపరాయణుడు. చేసుకున్నానంటే ఇల్లువెళ్లగొడతాడు గాని డబ్బియ్యడు. ఇప్పటిరోజుల్లో పిడికెడునూకలిచ్చేవా డెవడూ లేడు. అదీగాక ఈమూడునెలల్లూ, నా బి. ఏ. పరీక్షకూడా తుదిగతమౌతుంది. మీరు చెప్పినట్టు చేస్తే మొన్నాడు మీరే నన్ను మీయింటికి రానియ్యరు. ఇదీ గాక అత్తా మామా ఒప్పుకోరు. హైమ అంతకన్నా ఒప్పుకోదు. ఎప్పుడైతే హైమ పెళ్లి అయిపోయిందో, అప్పుడే దానికీ నాకూ సంబంధం తీరింది.

రామ—ఈమాట అన్నానని కోపమా ఏమిటి?

కృష్ణ—కోపంకోసం గాదు. ఉన్నమాట చెపుతున్నాను. ఎన్నో చిక్కులున్నాయి.

రామ—ఐతే, ఎల్లకాలం హైమ ఇటి అలా కష్టపడుతూ ఉండాలనేనా, నీనమ్మకం?

కృష్ణ—నా కాఉద్దేశం లేదు. భగవంతుడెలా వ్రాసిపెడితే అలా అవుతుంది.



రామ—అది గాదోయ్. బి. ఏ. చదువుకుంటూ, నువ్వూ ఆ సంస్కర్తలతత్వంలోనికి దిగిపోయావా ఏమిటి ?

ఈసమస్యకు ఆలోచించకుండా నేను జవాబుచెప్పలేను. నన్ను క్షమించాలి. ప్రస్తుతం గాలిమీద నడుస్తూన్నట్టుగా ఉన్నాను. చీకటి పడుతూంది. ఇంటికి వెళదాం.

వారిరువురును మరల నీవిషయమై మాటలాడుకొనకుండ నింటికి వచ్చిరి. ఎవ్వరితోడను కృష్ణరా వీసంగతి చెప్పలేదు. రామయ్యయ్యను ఎవ్వరితోడను చెప్పలేదు.

కృష్ణరా వచ్చుట నున్న నలువదియైదుగంటలలో హైమను రెండుమార్లే చూచెను. మొదటిసారి కృష్ణరావును చూచినతరువాత నాయనేయింటికి హైమ యొక్కతెయుఁ గూర్చొని యాలోచనానిమగ్నయయ్యెను. ఆమెను ప్రాణసమానుఁడును ప్రాణముకన్న నెక్కుడును నగు బావ మరల కంటఁబడియెను. కంటఁబడియున్నప్పుడెట్లో ఉగ్గఁబట్టిన యామెప్రేమప్రవాహము వెడలుదలయయ్యై గట్లు తెంచుకొని పైపైకు బుకుచుండెను. కృష్ణరా వామె కన్యగాను గాఁడు. నిజముగఁ గృష్ణరావే యామెభర్త. ఆమెహృదయమును మానప్రాణములను ఏనాఁడో కృష్ణరావున కామె హృదయమునందు ధారపోసియుండెను. అతనికొఱకు ప్రాణములపై నిగూఢ నాసమాని యాత్మహత్యాప్రయత్న మొనరించెను. కారణాంతరములచే నాప్రయత్నములు నిష్ఫలములై యామెను నేఁటికి మరల కృష్ణునిముందుకుఁ దెచ్చెను. ఆమెను ప్రాణిగ్రహణమైనవాఁ డొక్కఁ డుండె నని యెవ్వరు చెప్పసాహసింతురు ? ఆమె కేశవరావునామమునైన నుచ్చరింపలేదు. అతనిముఖమునైన సంతోగాఁ జూడలేదు. అతఁ డెవ్వఁడో ఆమె యెఱుంగదు. ఆతఁడు చనిపోయినవో నామెను వైధవ్యము సంభవింపవలసిన కారణ మామె

కు గోచరింప లేదు. ఆమె మనస్సునం దెవ్వనికి తనజీవితమును ధారా దత్తము చేసెనో, ఎవ్వనితోడిసౌఖ్యమే తనసౌఖ్యముగ భావించెనో, ఆకృష్ణరావే యామెకు నిజమగు భర్త. కృష్ణరావు బ్రదికియున్నంత కాలమును ఆమె కేల వైధవ్యము కలుగవలెనో యామె కర్థముకా లేదు. నాఁడు చిన్నతోఁటయందు జరిగిన కథయంతయు నామెకు జ్ఞాపకమునకు వచ్చెను. కృష్ణరావు తనప్రేమకొఱ కెంతగ బతిమాలెనో యామెకు స్ఫురించెను. “మందబుద్ధినై, క్రూరురాలనై, నే నానాఁ డు కృష్ణుని హింసించితిని. నే నిప్పు డాపాపఫలము ననుభవించుచు న్నాను. నన్ను నాకృష్ణుఁడు ‘హైమా, నేను ఏంతప్పుచేశాను? ను వ్వేశిక్ష అనుభవించమంటే అది అనుభవిస్తాను.’ అని యన్నప్పు డా తనికౌఁగిలి చేరని నాకాఠిన్యమును జూచి యాతఁ డెంతదుఃఖించెనో గదా?” అని పరిపరివిధముల నామె మనస్సునందు వాపోవుచుండెను. ఆసమయమునఁ గృష్ణుఁ డేకత మచ్చటికి వచ్చియుండెనేని యామె యేమి చేసియుండెడిదో గాని, యాతఁ డచ్చటికి రాలేదు. చిన్ననాఁటి యాటల నన్నింటిని తలంచుకొని యామె వాపోవ మొదలుపెట్టెను. చిన్ననాఁడు తనప్రేమను సంపాదించుటకై కృష్ణుఁడు చెప్పిన కథలన్ని యు నామెకు జ్ఞాపకమునకు వచ్చుచుండెను. అట్టి తనబావను రాక్షసి యై కష్టపెట్టిన తన కేశిక్ష సరియగు నని యామె ప్రశ్నించుకొనెను. చిన్నతోఁటయందు జరిగిన సంభాషణ మంతయు నప్పుడే జరిగిన ట్లా మెమనస్సునం దుండెను. ఆనాఁడు బావచేతిలో చెయ్యివైచి “నీఇష్టం వచ్చినట్లు చేస్తాను.” అని చెప్పని తననాలుకను ఖండించినను పాపము లేదని చాపపైఁ బడి యామె హోరున నేడ్చెను. తరువాత తనప్ర స్తుతకర్తవ్యమును గూర్చి యామె యాలోచింప మొదలుపెట్టెను. “కృష్ణుఁ డేకతముగనగుడెంచినచో పాదములపైఁ బడి ‘నన్ను క్షమింపు’



మని మొఱపెట్టుకొందును. ఆతనిపాదములను కౌఁగిలించుకొని ముద్దుపెట్టుకొందును. నన్ను క్షమించెద నని చెప్పువఱకును నేను విడు వను... అయ్యో! అయ్యో! నాకేమి యధికారము కలదని కృష్ణుని తాక సాహసింతును? అపవిత్రురాల నగునేను శ్రీకృష్ణునివలె పవిత్రు డంతుఁ డగు కృష్ణు నెట్లంటఁగలను? ఒక్కతాపుతో నాతఁడు వెడలి పోయె నేని నేను చేయున దేమున్నది?... దుష్టులకు చెడ్డతలంపులే తోఁచుచుండును. కారుణ్యమూర్తి, దయాసముద్రుఁడు, రూపజితమ న్మథుఁ డగుకృష్ణుఁడు నావలె క్రూరుఁడై నన్ను రక్షింప నని చెప్పునా? ఉత్తరక్షణమున నన్ను బాహుద్వయీవలయమునం దుంచుకొని ‘హైమా’ యని ప్రేమాలాపము లాలపింపఁడా?

“అయ్యో, నే నెంత పిచ్చిదానను? నన్ను కృష్ణుఁడు మరల గౌరవించునా? ‘క్షమించెదను పొమ్ము’ అని నన్ను త్రోసివుచ్చినచో నేమి చేయుదును? నామానమునుగూడ పోగొట్టుకొన్నదాన నగుదును. నామానమా? ఇదివఱకే నాయాత్మకూడ కృష్ణునకు ధారాదత్తము చే సితిని. ఇక నాకు హృదయము లేదు. మనస్సు లేదు. దేహము లేదు. ఆత్మ లేదు. అంతయు కృష్ణునిదే. అట్టియెడ కృష్ణుఁడు నన్నేమి చేసిన ను నాకు భయములేదు.

ఈప్రకారముగ నోటికి వచ్చినదెల్ల, మనస్సునకుఁ దట్టినదెల్ల నాలోచించుచు హైమవతి చాపపైఁ బొరలి పొరలి నిద్రపోయెను.

మరునాఁడుదయమున శేషమ్మ హైమవతివద్దకుం జని తలదు వ్వి జడవైచి, సుందరమ్మవద్దనుండి హైమవతిచీర నొకదానిని తీసికొని హైమవతి గట్టుకొన నియమించెను. ఒకచక్కని పట్టుచురవిక కూడ హైమవతి తొడిగికొనెను. రెండుమూఁ డాభరణములుగూడ సుందర మ్మవద్దనుండి తీసికొని శేషమ్మ హైమకుఁ బెట్టెను. పేరమ్మ అది యం

తయుఁ జూచి యసూయచెందెను. కాని సుందరమ్మ మాటలాడలేదు. శేషమ్మ సుందరమ్మతో నిట్లనెను.

శేష—శుభ్రంగా ఇలా ఉంటే మొహానబొట్టులేకపోయినా తొలకరిమెరుపులా ఉంటుంది పిల్ల.

సుంద—బాగానే వుంటుంది మరి. వైధవ్యమాయెను. ఎవరన్నా చూస్తే ఏమని అనుకుంటారు?

శేష—ఎవ్వరూ ఏమీ అనుకోరు. ఇప్పుడంతా ఇలాగే ఉన్నారు. బొట్టూ, మంగళసూత్రం తప్ప తక్కినవాటికి తప్పేమిటి? రోజూ మూడుపూటలు అన్నంపెట్టి శుభ్రంగా ఉంచండి పిల్లని.

వీర—ఇక వేరే అక్కర్లేదు. ఎవడన్నా కన్నేశాడంటే మర్యాద కాస్తా మన్నులో కలుస్తుంది.

శేష—మీకేమి అపఖ్యాతి తెచ్చేపిల్లకాదు. చిన్నతనంనించీ ఇలాగే ఉండమంటే సాగుతుంది.

ఈలోపుగా రామయ్యకూడ వచ్చి పిల్లని ఇలా ఉంచండమ్మా ఎంతో ముచ్చటగా ఉంటుంది." అనెను.

సుంద—అలాగేలే వదినా.

వీరమ్మముఖము సురసురలాడించుచు సాగిపోయెను.

ఆనాఁడంతయు హైమవతి పోషణభారమును శేషమ్మ వహించెను. వారేకాంతముగ నున్నప్పుడు హైమవతి ఇట్లనెను.

హైమ—అత్తా, నన్ను నీతోఁగూడ ఊరికి తీసికెడతావూ? ఇక్కడ ఉంటే నాకు ఎవ్వరు తలదువ్వుతారు? నీళ్లు పోస్తారు? అన్నం పెడతారు? నన్నెవ్వరు సొమ్ములు పెట్టుకోనిస్తారు? చెప్పు? ఏమత్తా?

శేషమ్మ ఈమాటలు విని ఏడువమొదలుపెట్టెను. మరల నెవరైనఁ దెలిసినచో హైమపని తప్పలోబేరము బుట్టలోనికి దిగునని తనలో



దానే యుపశమనమును బొంది ఇట్లనెను.

శేష—తీసికెళ్లడానికి నేనెవ్వరు? నువ్వెవ్వరు? మీవాళ్లు నిన్ను కదలనియ్యరాయెను. నే నెలా తీసికెడతాను?

హైమ—అయితే అత్తా! నేను కష్టపడుతూ ఉంటే చూస్తూ ఊరుకుంటావా?

శేష—పిచ్చిపిల్లా, అదికాదమ్మా ఇంత చిన్నతనంలోనే నీకు కష్టాలు. అవి భరించడం—మరల శేషమ్మదుఃఖము నాపుకొని—హైమా, నీకు ప్రపంచకమంటే తెలియదు—

హైమ—అయితే, అత్తా, ఇక నే నెప్పుడూ కాకినాడ రాఁగూడదూ?

శేష—రాగూడకపోవడమేమమ్మా, రావచ్చు.

హైమ—మఱి ఇప్పుడెందుకు రాఁగూడదా?

శేష—మాఅబ్బాయిపెళ్లికి రావొచ్చు. అప్పుడు తప్పకుండా నేను తీసికెడతాను.

హైమ—అత్తా. అప్పుడూ పంపించరు. వీళ్లు నాకోపాతగుడ్డ ఇచ్చి ఆగదిలో ఉండమంటారు.

శేష—నేను రామయ్యతో చెప్పి నిన్ను సరిగ్గా చూసేటట్టు చేస్తాను. రోజూ తలదువ్వుకుని, నీళ్లుపోసుకుని చీరా రవికా తొడుక్కో. వాళ్లివ్వకపోతే రామయ్యతో చెప్పు. నేను కాకినాడకు వెళ్లి, మీకామేశ్వరం మామకు ఉత్తరం వ్రాస్తాను. అతను మీఅమ్మకు వ్రాస్తాడు. ఇవ్వాళ ఎలా ఉన్నావో అలా ఉండు. ఇల్లు మాత్రం కదలగూడదు. తప్పు.

హైమ—అత్తా. మరి నాకు ఆకలివేసినప్పుడు అన్నంపెట్టకపోతే.........ఎలాఉంటుందో చెప్పు. అమ్మా, అక్కయ్యాను జిలేబీ

లా అన్నీ తిని, నేను తినగూడదంటే ఎలా ఉంటుంది?

సేప్పటకు సిద్ధమయ్యెను. "రామయ్యగారితో చెప్పి రోజూ నీకు ఎవరూ చూడకుండా బజారునించి ఏమన్నా తెచ్చి పెట్టేలా చేస్తానులే. ఎవరికీ చూపించకుండా తినేసెయ్యి.

హైమ—అలాతింటే తప్పుకాదూ?

శేష—పెద్దవాళ్లు, ముసైళ్ళు, సలభై వేళ్లవాళ్లకిగాని నీకేమిటి తప్పు? నువ్వురాణీలాగ నేనిచ్చిన డబ్బుతో తిను. అయిపోతే రామయ్య వ్రాస్తాడు. పంపిస్తాను. నీదగ్గిరుంటే తీసుకుంటారు. రామయ్యకే ఇస్తాను.

హైమమనస్సులో నేదో యాలోచనయున్నట్లుండెను. కొంతసే పటికి......అత్తా, నీదగ్గిరనించి నాకు ఏమి హక్కుందని డబ్బుతీసుకుంటాను?"

శేష—నే నివ్వడం ఏమిహక్కుందని మాఇంటికొచ్చాను...... అలాగే నీకెందుకు తలదువ్వాను? ఎందుకు నీళ్లుపోశాను?

హైమ—నువ్వు మంచిదానివి గనక.

శేషమ్మ మాటలాడజాలకపోయెను. రవిక చేతితో సర్దుచు, "ఎంత కష్టం తెచ్చిపెట్టాడు భగవంతుడు?" అనెను.

హైమ—అత్తా! నాలుగురోజు లుండవూ?

శేష—లేదమ్మా! రేపుపొద్దున్నే వెడతాను.

హైమ—అక్కడ నుంచుకుపోయే పనేముంది? ఇక్కడే నాలుగురోజులు ఉండరాదూ?

శేష—ఇక్కడ ఎవర్ని చూసి ఉండేదమ్మా?

హైమ—నన్ను చూసి ఉండు.

శేషమ్మ మాటలాడలేదు. హైమ నిరాశచేసికొనెను. హైమ



కేదో క్రొత్తయాలోచన తోచినట్లు ముఖమున చిహ్నములు కనబడుచుండెను. "అత్తా! ఎప్పుడూ ఉత్తరమే వ్రాయవేమీ? ఇకనించీ రామయ్యకు ఉత్తరం వ్రాసి నాకు ఇయ్యమని వ్రాస్తావూ? నువ్వు వ్రాయకపోతే నాకెవరు ఉత్తరం వ్రాస్తారు?

ఉత్తరము వ్రాయవలసినంత ప్రాముఖ్యత ఏమో శేషమ్మ కర్థముకాలేదు. కాని, హైమకు అట్లేనని ప్రత్యుత్తర మిచ్చెను. తన్ను మరల నుత్తరము వ్రాయుమనునేమో యని ఆమె నిరీక్షించెను గాని శేషమ్మ యేమియు ననలేదు.

హైమ—అత్తా, నేనుకూడా వ్రాస్తానులే. మామపేర వ్రాస్తాను. నువ్వు చదువుకుందుగాని.

శేష—అలాగేనమ్మా.

హైమ—అయితే అత్తా, బావపెళ్ళి ఎప్పుడవుతుంది?

శేష—అవుతుంది. వేసంగుల్లో కావాలిమరి.

హైమ—పిల్లను మాట్లాడారా?

శేష—ఇంకా ఎక్కడ?

హైమ తలవంచి నేలపై నేదియో గీయుచుండెను. కొంతసేపటికి దగ్గఱనున్న అద్దమును తీసి ముఖము చూచుకొనెను.

హైమ—ఇలా ఉండి ఎన్నాళ్లో అయింది అత్తా.

శేష—ఎలా ఉండి ఏంకార్యమమ్మా—?

హైమ—అత్తా, ఎవ్వరూ చూడ్డంలేదుగదా? ఒక్కమాటు చాదుబొట్టు పెట్టుకు చెరిపేసుకోనేదీ?

శేష—ఎవరన్నా హఠాత్తుగా వస్తే నీపనీ, నాపనీగూడా అవుతుంది. దబ్బున పెట్టుకో.

హైమనతి చాదుబొట్టు పెట్టుకొని అద్దమునందు తేరిపార చూ

చుకొనెను. “ఇలా ఉంటే బావ ఏమంటాడు ?” అని తనమనస్సులో ననుకొనెను. శేషమ్మకు బొట్టు చూపించుచు “అత్తా, బాగున్నానా?”

శేషమ్మ “చక్కనిచుక్కలా ఉన్నావు. చప్పున తుడిచేసుకో” అని చిట్టూర్పు పుచ్చెను. హైమ తుడిచివైచుకొనెను. కాంతిహీన మగుచంద్రబింబమువలె నామెముఖము వెలవెలఁబోవుచున్నట్లుండెను. నాఁడంతయు నట్లు గడచి పోయెను. పదునొకండవయేఁట పైఁబడ్డవె నుక నామెజీవితచారిత్రమున నిది యొక్కటే పర్వదినము ! మఱునాఁడు తెల్లవాఱెను. శేషమ్మ హైమనిమిత్తమై రామయ్యకు పదిరూపాయల నిచ్చి యామెవిషయమై శ్రద్ధతీసికొనవలసిన దని బతిమాలెను. రామయ్యయుఁ గొంచెము సంకోచించి “నాచేతనైందంతా చేస్తాను గాని, వీరూ అటువెళ్ళటంతోటే యథాప్రకారమే అవుతుం దని నా అనుమానం” అనెను.

శేష—సాధ్యమైనంతవరకు చూడండి.

ఈలోపుగ కృష్ణరావు మేనమామతోను, అత్తతోను, వదినెతోను వెళ్ళెద నని చెప్పుచుండెను. హైమ పొయిగదిలో రామయ్యతో మాటలాడుచుండెను. కృష్ణరావామెను చూచి నిర్ఘాంతపోయి “వెళ్లొస్తాను.” అనెను. ఆమె తలత్రిప్పెను. బండి కదలెను. చంద్రుని బాసినకలువపువ్వువలె నామెముఖము వాఁడిపోయెను. రామయ్య ఏదో పనిమీఁద బజారున కేఁగెను. వీరమ్మ హైమవతివద్దకు వచ్చి “వెళ్ళి నీళ్లు పోసుకో.” అనెను.

హైమ—వేడినీళ్లున్నాయా ?

వీర—నిన్న పోసుకుంటే ప్రతిరోజూ పోసుకుందామనుకున్నావా ? వెళ్లి చన్నీళ్లు పోసుకో.

హైమ—ఇప్పుడు చలేస్తుంది. కొంచెం పొద్దెక్కాక రోజూలాగ పోసుకుంటాను.



వీర—వేళా లేదు పాళా లేదు. పోసుకోమన్నప్పుడు పోసుకో. తెగసాగుతావు.

హైమ మాఱుమాటాడక స్నానముచేసెను. ఈలోపుగ నామె క్రిందటిదినమున నేమేమి ధరించెనో అవియన్నియు వీరమ్మ తీసికొనిపోయి భద్రపరచెను. హైమ ఏడ్చెను. బతిమాలెను. కాని కఠినశిలానిర్మిత మగు వీరమ్మహృదయముమాత్రము కరఁగలేదు. నాఁటిదినము కోరామల్లుతో, నేకభుక్తముతో హైమ జరపివైచెను. రామయ్య తెచ్చిపెట్టిన గులోబాజాన్, కారబ్బూంది, పాల్గోవా మాత్ర మామె సేవించెను. ఆమెకు కృష్ణరావునందు ప్రప్రథమమున నంకురించినప్రేమ శేషమ్మచేతలవలనను, మాటలవలనను మఱింత వృద్ధినొందెను. తన్ను పుత్త్రికకన్న నెక్కువగ నాదరించిన శేషమ్మయే తన కత్తగారు కావలయు ననియు, కృష్ణుఁడే భర్తగావలె ననియు నాఁటినుండియు హైమ ధ్యానింప మొదలుపెట్టెను. ఈభావములను వీరమ్మచేతలు వృద్ధిబొందించెను. శేషమ్మ బండెక్కుటతోడనే హైమయలంకారము లంతర్ధానము లయ్యెను. ఆమెసంతోషము తమావృత మయ్యెను. శేషమ్మ కృష్ణరావులున్నదే లోకముగ నామె భావింప మొదలుపెట్టెను. వీరమ్మను చూచిన నిదివఱకు భయముమాత్రమే ఆమెకుఁ గలుగుచుండెడిది. ఇప్పుడన్ననో యొకవిధమగు నసహ్యముకూడ పొడసూపెను.

పది ప్లెన్నను రామయ్య ప్రతిదినమును చిరుతిండ్లు తెచ్చిపెట్టుచుండెను. ప్రతిదినమును నూనెయు దువ్వెనయుఁ దెచ్చి ఇచ్చి తిరుగ తీసికొని పోవుచుండెను. కట్టుకొనునది కోరాగుడ్డయైనను, రవిక లేకపోయినను దువ్వుకొన్నతల యామెకొకయందమును గలిగించెను. అంతవఱకే పదివేలని యామెకొంతవఱకుఁ దృప్తిపడియుండెను. ఇట్లు నాలుగైదుదినములు గడచినతరువాత హైమ శేషమ్మకొఱకు యుగ్రముగ్రా

సి రామయ్యచేతి కిచ్చి పోస్టులో వేయించెను. అందు తనస్థితిగతుల నుగూర్చి విశదీకరించుచు ముత్యములవంటియక్కరములు వ్రాసెను. ఆయుత్తరమును శేషమ్మకుఁ గృష్ణరావే చదివి వినిపించెను. దానికి వెంటనే శేషమ్మ హైమ నోదార్చుచు నొకకార్డు రామయ్యపేర వ్రాసెను. అది హైమ చూచుకొని తనవిషయమై ప్రేమించుటకు శ్రద్ధతీసికొనువారొకరిద్ద ఱున్నారని సంతసించెను.

హైమవతి దుఃఖభాజనమగుజీవితమునందు శేషమ్మచే వ్రాయఁబడినయుత్తరము ఎడారిలోనివచ్చికబయలువంటిదై యుండెను. శేషమ్మ వ్రాసినయుత్తరమును హైమ చదివెను. దానినే మరల చదివెను. ఇంకొకపరి చదివెను. ఎన్నిసారులు చదివినను నామెకుఁ దృప్తి జనింపలేదు. కొంతసేపటి కాయుత్తరమును బల్లపైఁ బడవైచి చింతింపనారంభించెను. ఏలూరునందు పడుకష్టము లన్నియు దలచికొనుచు నామె వాపోయెను. ఈకఠినసరకమునుండి ముక్తియగుమార్గ మామెకుఁ దోఁపలేదు. రామయ్య ఎన్నిచిరుతిండ్లుతెచ్చిపెట్టినను, శేషమ్మ ఎన్నిచిన్న చిన్నయుత్తరములు వ్రాసినను నామెబాధ లిసుమంతయును తగ్గకుండెను. ఆచిరుతిండ్లు మధురములే గావచ్చును, శేషమ్మయుత్తరములు ప్రేమసంగీతమునే పాడుచుండవచ్చును, కాని వీరమ్మపెట్టుకష్టములను నివారింపఁగలశక్తి వానికి లేకుండెను. పదునైదునిముసములుమాత్రమే యామెను సంతసింపఁజేయును కాని తక్కినకష్టకాలమంతయును నామె భరించుట యెట్లు? కాకినాడకుఁ బోయి కొన్నిదినము లచ్చట నెందులకుండఁగూడదని యామెకుఁ దోఁచెను. తన «శతుమిత్రు» లగు సుందరమ్మవీరమ్మల కది యంతయిష్టముగ నుండకపోవచ్చును. కాని తండ్రియనుజ్ఞవడసి కాకినాడకుఁ బోయి కష్టములనుండి విశ్రాంతి గొనవలయునని హైమ దృఢనిశ్చయయయ్యెను. శేషమ్మకృష్ణరావు లచ్చటికి వచ్చినప్పుడు తానడిగినమాటయు, శేషమ్మ దానికి ఒప్పుకొనకపోవుటయు, నామెకు జ్ఞాపకమునకువచ్చెను. ఏది ఎట్లున్నను శేషమ్మపేర తనకష్టములనుగూర్చి యుత్తరమువ్రాయవలెననియు, నందు తన్ను కాకినాడకుఁ దీసికొనిపోవవలయుననియు నామె వ్రాయనెంచెను. తానువ్రాయుఫక్కిపై నంతయు నాధారపడియుండుననని యామె తలంచి ఎట్టకేల కొకకాగితముపై భావోద్రేకముతో నాలుగుపంక్తులు వ్రాసి రామయ్యకిచ్చి పోస్టులో వేయించెను. ఆయుత్తరమునందలి సారాంశమేమన, మొదట ఉద్రేకపూరితములగు కష్టముల వర్ణన; రెండవది శేషమ్మప్రత్యుత్తరము వ్రాసినవెంటనే వేంకటప్పయ్యగారి యుత్తరువు తీసికొని డిశంబరు 28 సప్తమిఆదివారము బయలుదేరెదననియు, రామయ్యపవరుపేటలో తన్ను రైలునం డెక్కించుననియు నాటిమధ్యాహ్నము చామర్లకోటరైలుస్టేషనునం దెవ్వరైన తనకొరకు నిరీక్షింపవలసినదనియు వెంటనేజవాబు వ్రాయుమనియు నామె వ్రాసెను. శేషమ్మ దీని కేమిప్రత్యుత్తరమిచ్చెనో అరయుదము.



---

## పదునొకండవప్రకరణము.

హైమవతివ్రాసినయుత్తరము శేషమ్మచూచుకొని యామెను నాలుగుదినములు తనవద్ద నుంచుకొనవలయునని యనుకొనెను. కాని, తాను ఏలూరునకు వచ్చినప్పుడామెను తీసికొనిపోవువిషయమై వేంకటప్పయ్యగారిని గాని, సుందరమ్మనుగాని యడిగి లేదనిపించుకొనుటకు జంకెను. ఇప్పుడు హైమవతి వ్రాసినయుత్తరమువల్ల నామెకష్టముల కోర్వఁజాలక కాకినాడ కానుద్దేశించుచున్నదని స్పష్టముగఁ దెలిసెను.

అదియునుగాక తనతండ్రియనుమతిమీఁదనే బయలుదేఱుదునని వ్రాసినయామె చాకచక్యమునకు ఎంతయు సంతసించెను. శేషమ్మ కేమియు నాలోచించుకొనవలసిన యవశ్యకము లేదు. వెంటనే యామె హైమవతిని రమ్మనియు నాగభూషణముగారు స్టేషనువద్ద నుందురనియు జాబు వ్రాసి నాఁటిపోస్టునందే పడవైచెను. ఈసంగతులనుగూర్చి కృష్ణరావున కేమియుఁ దెలియదు. మఱచిపోవుటచేతనో, కృష్ణరావుతఱచు తన స్నేహితులతోఁ గలసి చదువుకొనుటకుఁ జనుటచేతనో ఇంటనే తనగదిలో బాహ్యప్రపంచచింతనలేక చదువుకొనుచుండుటచేతనో, మఱి యేయితరకార్యములవలననో గాని హైమవతి వచ్చుచున్నదనుసంగతి కృష్ణరావునకుఁ దెలియలేదు.

హైమవతియు నచ్చట రామయ్యసాహాయ్యమువలన వేంకటప్పయ్యగారివద్దనుండి సులభముగనే యనుమతిపడసెను. ఆమె కాకినాడకుఁ బోవుమాట తుదిక్షణమువఱకును వీరమ్మకుఁ దెలియదు. సుందరమ్మ నాఁటియుదయముననే తెలిపెను. రామయ్య సుందరమ్మ కనేకవిధములఁ జెప్పి, మరలఁ ద్వరలోనే రాఁగలదని వాగ్దానముచేసెను. ఈ యొప్పుకోలుయొక్క ఫలితముగ వీరమ్మ మున్నుతీసికొన్న హైమబట్టలపెట్టె యామెకీయఁబడెను. హైమయుఁ దనపెట్టె సర్దుకొని తల్లిదండ్రులకు నమస్కరించి రామయ్యగారికి సాష్టాంగము చేసి, అక్కకుఁగూడ నమస్కరింపఁబోయెను. అప్పుడు వీరమ్మకు సంగతులు బోధపడెను. ఆమెకు ఏమిచేయుటకుఁ దోఁచలేదు. ఆమెమనస్సునందెన్నియాలోచనలో తిరుగుచుండెను. ఈలోపుగ బండి కదలి స్టేషనునకుఁ బోయెను. వీరమ్మ మొదట కొంచెము ముఖము ముడిచెను. వెలవెలఁబోయెను. కాని, తనవిషయాసక్తతకును, దుష్ప్రవర్తనమునకును సాక్షిగనుండు నామె వెడలిపోవుట యామెకంతవిచారకరముగఁ దోఁపలేదు. ఆమె



మరింత విచ్చలవిడిగ తనప్రవర్తనముఁ బాడుచేసికొనవచ్చుననియు, మరింతబహిరంగముగ చిన్నతోటకు మహారాణిగావచ్చుననియు ముదమందెను. హైమనువిడుచుటకు సుందరమ్మకు కష్టముగనేయుండెను. ఆమె ఎంతరాక్షసియైనను మాతృప్రేమమాత్ర మామెహృదయమునందు లేకపోలేదు. అందఱుతల్లులకున్నంతప్రేమ యామెకు లేకుండవచ్చును. ఈచిన్నప్రేమాణువులనుగూడ వీరమ్మ పైకిరాకుండ నణచియుండవచ్చును. హైమపడుకష్టములు సుందరమ్మచూచుచునే యుండెను. తానే కొన్నికష్టములకుఁ గారణభూతురాలనని యామెకుఁ దట్టలేదు. అంతటికిని వీరమ్మయే కారణమని యామెతలంచెను. ఏదియెట్లున్నను బండి కదలినవెనుక సుందరమ్మ నేత్రగోళములందు రెండు కన్నీటిబిందువులు ప్రకాశించుచుండెను.

సప్తమినాఁటిమధ్యాహ్నము రెండుగంటలగుసరికి బండి చామర్లకోటస్టేషను చేరెను. నాగభూషణముగారు మేనకోడలికొఱకు వెదకుచుండిరి. హైమ బండిలోనుండి చూచుచుండెను. నాగభూషణముగారినిఁ జూచుచుటతోడనే యామె చప్పట్లుకొట్టి పిలిచెను. రైలుదిగి వారు కాకినాడబండినెక్కి కాకినాడలో బండి కుదుర్చుకొని నాలుగుగంటలగునప్పటి కిల్లుచేరిరి. శేషమ్మ హైమరాకకై నిరీక్షించుచుండెను. ఆమె వచ్చుటతోడనే శేషమ్మ యామెను కౌఁగిలించుకొని గాఢముగ ముద్దుపెట్టుకొనెను. హైమ యానందాతిరేకమున నొడలు మఱచెను. కృష్ణరావుకొఱకు హైమ ఇటునటు చూచెను. కాని, యాతఁడు కనఁబడలేదు. అతనిఁ గూర్చి ఏప్రశ్నలైన నడుగుట కామెకు సిగ్గుతోఁచెను. ఏమియు ననక స్నానముచేసి హైమ ఫలాహారముచేసెను. రాత్రియైన తరువాత శేషమ్మ వంటచేసికొనుచుండగా నొకపీట వైచికొని వంటయింటియందే కూర్చుండి కబుర్లుచెప్పుచుండెను. కొంతసేపటికి నాగ

భూషణరావుగారు అచ్చోటికివచ్చి “వంట అయిందా?” అనియడిగెను.

శేష—అయింది. వడ్డించేదా ?

నాగ—అబ్బాయి రానీ, వడ్డిద్దుగాని. హైమ పొద్దుననంగా భోంచేసింది కాబోలు, చేసిపెట్టావా ?

శేష—ఆ, పెట్టాను.

ఈమాట లైనతరువాత ముగ్గురు మండువాలోనికిఁ బోయి కూర్చుండిరి.

నాగ—అయితే, మనఅబ్బాయి పెళ్లిమాట ఏమాలోచించావు ?

హైమహృదయమునఁ బిడుగుపడినట్లయ్యెను. ‘అబ్బాయిపెళ్లి’ పెండ్లికూతురు ఎవ్వరు ? తానే యైయుండవచ్చును. ఆమెకుఁ గొంచెము బరువు తగ్గెను.

శేష—ఆలోచించడాని కేముంది ? ఇప్పటికాలంలో పిల్లవాడే చెప్పాలి. మనకు నచ్చిందే వాడికి నచ్చొద్దూ ?

నాగ—అది సరేలే. అయినా నీఅభిప్రాయ మేమిటి ?

శేష—పట్టిసం సుబ్బారావుగారు మూడువేలు కట్నం ఇస్తామన్నారుగదా ? వాళ్ళను చేసుకుంటే బాగుంటుందేమో?

నాగ—ఆపిల్ల నల్లగా ఉంటుందని వాడనుకున్నట్లు కనబడుతుంది. మామిడాడ శ్రీరాములుగారిపిల్ల బాగుంటుంది.

శేష—వాళ్లు పదిహేనువందలే కట్నమిస్తారుగా !

నాగ—ఆ, అవును. నేను రెండువేలు అడుగుతున్నాను.

శేష—ఏమో, నాకిది నచ్చలేదు. అబ్బాయిని కనుక్కున్నారా ?

నాగ—అదే, నిన్న కనుక్కోవాలంటున్నాను. నాదగ్గరకంటె



నీదగ్గిర చనువు ఎక్కువగనక మనస్సులో ఉండేమాట చెపుతాడు. నాకు ఏదీ కనుక్కోని చెపితే దబ్బున తెములుతుంది.

హైమవతి కీమాటలు కర్ణకఠోరములుగ నుండెను. “కృష్ణరావునకు నాయెడ ప్రేమ నశించెనా ? నశింపక నిలుచుట యెట్లు? నావివాహమునకు ముందు నన్నంతగా ప్రేమించి వేడినను కృష్ణుని ప్రార్థనను పెడచెవిని బెట్టితిని. పునర్జన్మమునఁగాని సమాగమము లేదంటిని. పునర్జన్మముననే గాని ఈజన్మమున నాకును బావకును సంబంధ మేమున్నది ? ఏది ఎట్లగునో దైవఘటనగదా ?” అని యామె చింతించెను. ఇట్లనుకొన్నతరువాత కూడ కృష్ణరావు నుద్దేశములను గూర్చి యాలోచింప మొదలుపెట్టెను. కృష్ణరావు తనమనస్సును తానే తెలిసికొనుట ముఖ్యమైనవిషయ మని యామె తలంచెను. పట్టిసమువారైనను, మామిడాడవారైనను ఏసంబంధము మంచిదో, మర్యాద కలదియో, యాలోచింపవలసియుండెను. ముఖ్యముగా కృష్ణుఁడు తనగౌరవమునకేమాత్రమును లోటు తీసికొని రాఁగూడదు.

ఇట్లు రెండుమూఁడుదినములు గడచెను. కృష్ణుఁడు హైమవతి వచ్చిన దని యెఱింగెను. కాని యామెతో మాటలాడుటకు సంకోచించెను. ఆమెయుఁ గృష్ణునితో మాటలాడుటకు సిగ్గుపడెను. వారెప్పుడు కలిసికొన్నను శేషమ్మయు నాగభూషణముగూడ నచ్చటనే యుండెడివారు. కాని యొకమధ్యాహ్నము మూఁడుగంటలకు కృష్ణరావు ఫలహారము చేయుటకై ఇంటిలోనికి వచ్చెను. నాగభూషణముగారు కచ్చేరికిఁ బోయియుండిరి. శేషమ్మ కనఁబడలేదు. కృష్ణరావు భోజనముల వసారాలోనికి వచ్చునప్పటికి హైమమాత్ర మచ్చట నుండెను. ఆమెతో నొంటిగ నచ్చటనుండుట యాతని కొకవిధమైన సంభ్రమము గలిగించెను. ఆతనిభావము, మనస్సును, ఏకోవిధముగ నూఁగెను. హై

మును చూచినవెంటనే యాతఁడు వెనుకకుఁ దగ్గెను. హైమ వెనుకకుఁ దిరిగిచూచెను. కృష్ణరావు "మాఅమ్మ ఇక్కడ ఉందనుకున్నాను." అనుచు దొడ్డివైపుకిటికీవద్దకుఁ జని తదేకదృష్టితో దొడ్డివంకఁ జూడ నారంభించెను. తానెట్లు ప్రవర్తింపవలెనో యాతఁ డాలోచించుచు నిలువఁబడెను.

"ఇప్పుడే వస్తానని పక్కఇంటికి వెళ్లింది" అని తొట్రుపాటుతో సిగ్గుతో హైమవతి ప్రత్యుత్తర మిచ్చెను.

ఆవసారాయం దప్పుడు ప్రక్కఇంటివారిచిన్నపిల్ల ఆడుకొనుచు క్రిందఁబడిపడువసాగెను. హైమ ఆపిల్లను లేవఁదీయవలసివచ్చెను. ఈ పనిచేయుట యనావశ్యకమై యుండినచో నామె ఆవసారాలోనుండి గదిబైటికిఁబోయి యుండెడిది. అప్పుడు హైమవతికిని, కృష్ణరావునకు నుగూడ విమోచనము గలిగియుండెడిది. కాని, ప్రస్తుతము కృష్ణరావు కిటికీవద్దనే నిలిచి యుండెను. ఆతఁడేమియును మాటలాడలేదు. వసారాలోనుండి బైటికిఁబోవుటకు ప్రయత్నము చేయలేదు. హైమవతి కృష్ణరావు వచ్చుటకు ముందు శేషమ్మగారిబొమ్మలపెట్టెను సవరించుచుండెను. బొమ్మలన్నియు నేలపై నుండెను. వానిని వదలిపెట్టి పోవుట వీలుగాదు. ఇట్లొకటిరెండునిముషములు గడచెను. పిల్లను ఓదార్చి హైమవతి దానినొకచోఁ గూర్చుండఁబెట్టి బొమ్మలు పెట్టెలోఁ బెట్టనారంభించెను. ఆపిల్లయుఁ గొంతవడి అటునిటు దిరిగి హైమవతి వద్దకుఁబోయి మెల్లగనామెవీపు పట్టుకొని నిలిచెను. ఆతరువాత వీపు మీఁది కెక్కుటకుఁ బ్రయత్నముచేయుచుండెను. హైమవతి యాబాలిక నెంతవదలించుకొనఁజూచినను నాఁగలేదు. "బబ్బా, అమ్మడూ, అలా కూచొని ఆడుకోవే" యనెను. ఆపిల్ల యీమాటలను పాటింపలేదు. వీపుమీఁది కెక్కి హైమవతిమెడను గట్టిగఁ బట్టుకొనెను. ఆమె యీపిల్లను వదిలించుకొనఁజాలకుండెను.



హైమవతి ఇట్లుక్కిరిబిక్కిరి యగుచుండుటను కృష్ణరావు చూచెను. వెంటనే హైమవతిదగ్గఱకు వచ్చి యామెవీపుమీఁదినుండి యాపిల్లను తీసికొని కిటికీవద్దకు మరల యథాప్రకారముగఁ బోయి ఆపిల్లను ముద్దులాడఁబ్రారంభించెను.

ఈసంగతి కనిపెట్టుటతోడనే యామెభావములు వెలవెలఁబోయెను. ఆమె మౌనసముద్రమున మునిగిపోయెను. ఆమెబొమ్మలపెట్టె వంకనే తదేకదృష్టితో జూడసాగెను. బెదరిపోయినభావముల నామె మరల నొక్కచోఁ గూర్పఁ బ్రయత్నము సలుపుచుండెను.

హైమవతిపడుచున్నచిన్నికష్టమునుండి కృష్ణుఁ డామెను తొలఁగించెను. లేకున్న బొమ్మలు పగిలిపోయియుండునేమో. ఆపిల్లచేతులతో గొంతుకను గట్టిగఁబట్టుకొని తనకూపిరి సలుపకుండఁ జేసియుండునేమో. తన్నుతాను కాపాడుకొనఁజాలనిస్థితియం దున్నప్పుడు, తాను బొమ్మలనన్నింటినిఁ బెట్టెలో పెట్టుటకుఁ దొందరపడుచున్నప్పుడు కృష్ణరా వామెకు సాహాయ్యము చేసెను. ఈదయాపూర్వకమగుప్రయత్నమును మౌనముతో నొక్కమాటయైనను మాటలాడకకృష్ణుఁడొనర్చిన సాహాయ్యమును ఆమెమనస్సున నాటెను. కృష్ణుం డు తన్నట్లు రక్షించుటకుఁ గారణ మేమని యామె వితర్కించుకొనెను. ఈపనియైనవెనుకఁ గృష్ణుఁడు మరల కిటికీవద్దనే యథాపూర్వకముగ నిలుచుండెను. ఆతఁడు తనతో నేమియు మాటలాడఁదలఁచుకొనలేదని యామె తెలిసికొనియెను. ఇదియంతయు నామెమనస్సును బాధించుచుండెను. ఈ భావవిభ్రమమునుండి శేషమ్మ వచ్చువఱకు ఆమె తెప్పిఱిలఁజాలకపోయెను. శేషమ్మ వచ్చుటతోడనే బొమ్మలు సర్దుటయు ముగిసెను. వెంటనే పెట్టెను మూసివైచి యామె గదిగుమ్మలకుఁ జనెను. అచ్చట

నొక్క నిమిషమైనను నామె యుండఁజాలకపోయెను. అంతమనశ్చాంచల్యము కలుగుట కామెలో నామెకే సిగ్గుగ నుండెను. పిల్లను వీపు మీఁదినుండి తీయుట యనునంత చిన్నవిషయమును గూర్చి అంతగా విభ్రమముచెందుట యామె కసహ్యముగ నుండెను. ఆమె వెంటనే చావడిలోని పడకకుర్చీపైఁ బరుండెను. ఆమె ఎంతసేపక్కడ పరుండెనో మనకుఁ దెలియదు. కాని యామె విభ్రమమునుండి దాటి మనుష్య ప్రపంచములోనికి వచ్చుటకుఁ జాలకాలము పట్టెను.

ఇట్టివిషయములను గూర్చి యాలోచించుటకును గృష్ణునిఁ జూచుచుండుటకును తగుసమయము లనేకము లామెకు చిక్కకతీఱవని యెల్లరు నెఱింగినవిషయమే గదా? అనేకపర్యాయము లాతని నామె చూచుచుండెను. తనమనోగతాభిప్రాయములను మననము చేసికొనుచుండెను. కృష్ణునివివాహసమస్య ఇప్పుడు ముందునకు వచ్చియుండెను. ఆతఁడు మామిడాడవారిపిల్లను చేసికొనునా? పట్టిసమువారిపిల్లను చేసికొనునా? ఆతనికి వారిరువురిలో నెవ్వరిమీఁదను ఇష్టములేదని యామె తలంచెను. ఏవిధమైన జవాబును చెప్పక యాతఁ డూరకుండి తల్లిదండ్రులకు లేనిపోనిచింత కలిగించుచుండెను. ఇట్టిచింత కలిగించుచుంటినని యాతఁ డెఱింగినచో తప్పక యేదియో దృఢాభిప్రాయమును దెలిపెడివాఁడని యామె నిర్ధారణచేసికొనెను. ఒక్కనాఁటిరాత్రి భోజనసమయమున నాగభూషణముగా రీప్రస్తావనఁ దీసికొనివచ్చిరి.

నాగ—ఏమిరా, కృష్ణా! రెండుసమంధా లొచ్చాయని తెలిసిన సంగతే కదా? నీఅభిప్రాయం ఎలాఉంది?

కృష్ణరావు మాటలాడుటకుఁ బ్రయత్నించెను. ఆతఁడు తండ్రి వంకకుఁ దిరిగెను. తండ్రి కృష్ణరావువంకనే చూచుచుండెను. వెంటనే కృష్ణరావు విస్తరివంకకుఁ జూడసాగెను.



శేష—సిగ్గుపడతావేం, సిగ్గెందుకు మొగపిల్లవాడికి?

హైమ అరచేతిలో గుండెపెట్టుకొని కృష్ణునిప్రత్యుత్తరముకొఱకు నిరీక్షించుచుండెను. ఆమె వంటగదిమొత్త నంటికొని నిలువఁబడియుండెను. కృష్ణునివంకకే తదేకదృష్టితోఁ జూచుచుండెను. శేషమ్మగాని నాగభూషణముగాని ఆమెవంకకుఁ జూడలేదు. కృష్ణుఁడు తల్లివంక చూచెను. గదినలువంకలను జూచెను. హైమవంక చూచెను. తన్ను చూచుటతోడనే హైమ కృష్ణునిపైఁ బ్రసరించుచున్న తనదృగ్జాలకములను వేఱొక్కదిక్కునకుఁ ద్రిప్పివైచెను. కృష్ణుఁడు విస్తరివంకకుఁ జూచుచు, "ఈసంగతి సెలవుల్లో ఆలోచించి చెప్పాలి. ఇప్పుడు పరీక్ష రాబోతూ ఉండగా పెళ్ళిమాట ఆలోచిస్తే "వివాహో విద్యానాశాయ" అన్నట్లౌతుంది." అనెను.

నాగ—అవును, నిజమే. శెలవులదాకా ఆపుదాము.

శేషమ్మయు దీని కంగీకరించెను. హైమ మొత్తనుండి యీవలకుం జని యొక్కనిట్టూర్పు విడిచెను.

ఆమఱునాఁడు హైమయు శేషమ్మయు నిష్టాగోష్ఠిగ మాటలాడుచుండిరి. కాకినాడకు వచ్చినప్పటినుండియు హైమ సుఖముగఁ గాలము గడపుచుండెను. ముఖమునఁ దిలకమును గళమున సూత్రముదప్ప నామెకును ముత్తైదువులకును నేమాత్రమును వ్యత్యాసము లేకుండెను. అంతేగాక ఆమె యిప్పుడు ప్రతిదినమును కృష్ణసందర్శనము గావించుచుండెను. కృష్ణునిమాటలయందును చేఁతలయందును నామెకు నూతనార్థముల పొడకట్టుచుండెను. ఇట్టిజీవితమే యామెకు స్వర్గతుల్యముగ నుండెను. ఏలూరునందు దనతండ్రినిగూర్చి యప్పుడప్పుడు తలంచుకొనుచుండెను గాని కాకినాడను విడిచి యొక్కయడుగైన నేలూరువంకకుఁ బెట్టుట కామె యియ్యకొనదు.

కృష్ణునితో నాలుగునిమిషము లేలోకాభిరామాయణమో మాటలాడవలయు నని యామె యువ్విళ్లూరుచుండెను. అంతటితోఁ దనకుఁ దృప్తి గలుగు నని యామె యనుకొనెను. కృష్ణునితో మాటలాడునప్పుడు తా నెట్లారంభించవలెనో యామె తలపోయుచుండెను. ఆతనితో మాటలాడుటకుఁ దనకు శక్తికలదా? యని యొక్కొక్కప్పుడామె ప్రశ్నించుకొనుచుండెను.

ఒకనాఁటి మధ్యాహ్నమున ముందొకదినమువలెనే శేషమ్మ ప్రక్కనున్న యొకయింటికిఁ జనెను. సాధారణముగఁ గృష్ణుఁడు వచ్చు సమయ మయ్యెను. హైమ యాతనికొఱకై నిరీక్షించుచుండెను. కాని యేలనో, ఆతఁడు రాలేదు. వాకిటిలోనికిఁ జని యామె తొంగిచూచెను. దూరమునఁ గృష్ణుఁడు వచ్చుచున్నట్లు లామె కెన్నిసారులో పొడకట్టెను. కాని, కృష్ణుఁడు రాలేదు. నాఁటిమధ్యాహ్నము హైమ కాలమంతయు నిష్ఫలమయ్యెను. శేషమ్మ యరుగుదెంచెను. మరల నంతయు యథాస్థితికి వచ్చెను. మరల నింకొకసమయమునకై హైమ ఎదురుచూడవలసివచ్చెను. ఇంకొకయానందతరంగమునకై నిరీక్షింపవలసినదాయెను. రాత్రిభోజనసమయమున నామె కృష్ణరావును చూచెను. ఏకాంతముగ చూచినను తనప్రేమనుగూర్చి కృష్ణరావుతో మాటలాడియుండెడి దనుమాట పొరపాటు.

ఇంకొకదినమున శేషమ్మ వంటచేసికొనుచుండెను. నాగభూషణముగా రెవ్వరితోడనో మాటలాడుచుండిరి. కృష్ణరావు తనగదిని విడిచి చిన్నచావడిలోనికి వచ్చెను. అచ్చటనే హైమ పడకకుర్చీపైఁ గూరుచుండెను. ఆమె తనముందు నిర్జనమగు ప్రదేశమును తదేకదృష్టితోఁ జూచుచు పరుండెను. ఆమె కృష్ణుని చూచెను. ఆతఁడు దూరమున నుండెను. ఆతఁడుకూడ నామెను చూచెను. కాని యాతనిముఖము గంభీరముగఁ గనఁబడెను. ఆతనిచూపు లాతని మనస్సునం దేవిధమగు దృఢాభిప్రాయమును లేనట్లు విశదముచేయుచుండెను. అడుగులో నడుగిడుచు నిటుచూచుచు, నటుచూచుచు నాఁగుచు నాతఁ డామెకు రెండుబారలదూరమునకు వచ్చెను. ఏదియో విశేషమున్నట్లామెకుఁ దోచెను. ఏదియో యొకమార్పామెకుఁ గనఁబడెను. క్రిందటిదినము హైమ పాడినపాట తాను వింటి ననియు నది మనోహరముగ నుండె ననియు కృష్ణుఁడు పలికెను. చిన్నప్పుడు బడియం దాపాట నేర్చికొంటి నని యామె బదులుచెప్పెను. ఇదేవిధముగ నొకటి రెండునిమిషములు మాటలాడుటతోడనే వారిసంభాషణ మతింత సాగజొచ్చెను. ఇంచుమించుగ నైదునిమిషములు వారు మాటలాడిరి. అందు ప్రేమనుగూర్చి యొక్క ముక్కయైనను లేదు. ఈలోపుగ వంటయగుటచే వారి సంభాషణ అంతటితో నాఁగిపోయెను.



ఇట్లు కొలఁదిదినములు గడచెను. కృష్ణునికి కాలేజి తెఱచు దినములు సమీపించెను. హైమ కాసంగతి తెలియకపోలేదు. మనస్సునందలి యుద్దేశ్యముల నామె బైటికిఁ దెలియనీయలేదు. కృష్ణుఁడు బయలుదేఱి వెడలుసమయమున హైమ యాతనివంకనే చూచుచుండెను. ఆతనిదృష్టులు తనపైనే తాండవమాడుచున్నట్లామెకుఁ బొడకట్టెను. ఆతఁడు నిశ్చయముగ తనవంకనే చూచుచున్నట్లామె తలఁచెను. కృష్ణుఁడు తల్లిదండ్రిలతో వెడలెద నని చెప్పెను. హైమతో చెప్పవలెనా, చెప్పవచ్చునా, కూడదా? అని యాతఁ డొకనిమిషము సందేహించెను. తుట్టతుదకు "హైమా—" యని పిలిచి వెడలెద నని తలను కన్నులను ఆడించెను. హైమ కేమిచేయుటకును దోఁచలేదు. మాటాడక స్తంభమువలె నిలువఁబడెను. కృష్ణుఁడు బండిపై నెక్కి స్నేహితులతో స్టేషనుకు బయలుదేఱెను.

మూడవనాడు కృష్ణారావువద్దనుండి యాతఁడు సురక్షితముగా జేరినట్లు జాబు వచ్చెను.

హైమ—ఒకమాటు మనమందరమూ చెన్నపట్నం వెడితే బాగుండును.

శేష—వెడితే బాగానే వుంటుంది. ఎప్పుడూ వెళ్లడం జతపడదు.

హైమ—అక్కడ చూడఁదగినవి చాలా ఉన్నాయిట. అవన్నీ బావ మనకు చూపిస్తాడు. వాటిని బావైనా చూశాడా?

శేష—బావ చూడ్డానికేం? బావ చూశాడు. వాటినిగురించి మాతో చెప్పాడు కూడాను.

హైమ—ఇప్పుడు పరీక్ష రోజులు కాబోలు. ఇప్పుడు మనం వెడితే బావచదువుకు అడ్డం వస్తుంది.

కొంతసేపు వారిరువురును మాటలాడకుండఁ గూర్చుండిరి. మఱల హైమ ఇట్లనెను.

హైమ—రేపు ఏప్రియలు పరీక్షలు ప్యాసుఅయితే బావ బి. ఏ. ప్యాసవుతాడు కాదూ? అంటేనా?

శేష—ఔను. ఆతరవాత అందఱికీ పట్టాలిచ్చేరోజు ఒకటి ఉంటుంది. అప్పుడు మనం బావతోగూడా చెన్నపట్నం వెళ్లి అన్నీ చూడొచ్చు.

హైమ—ప్యాసైపోవడంతోటే శలవులిస్తారే. అప్పుడు వెళ్ళి చూడకూడదుటూ? అప్పుడు బావకేమీ చిక్కుండదుగా?

శేష—ఆఁ, అవును. ఇవ్వాళ మీమామను అడిగి అలా వీలవుతుందేమో కనుక్కుంటాను.

హైమ—నన్నుకూడా తీసికెడతానని చెప్పుతావా?



శేష—నీమాట మఱచిపోవడమేమిటి? తప్పకుండా తీసికెడతాను. మీమామ ఒప్పుకోవడమే ఆలస్యము.

కృష్ణరావు చెన్నపట్టణము చేరినతరువాత సత్యనారాయణ, సోమయాజులు నను నిరువురుస్నేహితు లాతనిదగ్గరకు వచ్చిరి.

సత్య—కాకినాడలో మీఇంటికొచ్చినపిల్ల ఎవరు.

కృష్ణ—మామేనమామకూతురు.

సోమ—ఎప్పుడూ బొట్టుపెట్టుకోదా ఏమిటి?

కృష్ణ—దానిమొగుడు పోయాఁడు.

సత్య—అరే, ఎంతచక్కనిపిల్ల. పాపము.

సోమ—అయితే, నీకు వరసే. ఎందుకు చేసుకోగూడదు?

కృష్ణ—ఇక చాల్లే నీపని చూసుకుందూ? ఆగోడవంతా నీకెందుకు?

సత్య—ఏం, నువ్వు చేసుకుంటే తప్పేమిటి?

కృష్ణ—సరేలెద్దూ, పరీక్ష వస్తూఉంది. చదువూ లేదు. సంధ్యలేదు. ఇంతలోకి దిగింది వ్యవహారం. నువ్వసలువచ్చినసంగతేదో చెప్పు.

సత్య—మేము వచ్చినసంగతే చెపుతూఉంట. ఆఅమ్మాయిని అలా నువ్వువదిలిపెట్టడం బాగుండలేదు.

కృష్ణరావు వారిని తనగదిలో వదలిపెట్టి బైటకు వచ్చెను. సోమయాజులాతనిఁ గదలకుండఁ బట్టుకొని “ఇంతమాత్రానికే కోపమా? ఇంటో చక్కనిపిల్లఉంటేనే చాలు. స్నేహితులెందుకు? అంటూలో వరసగూడా ఆయెను.

సత్య—వస్తూ ఉంది. కృష్ణరావుకు కోపం వస్తూంది.

నిజముగఁ గృష్ణరావు లేనికోపము తెచ్చుకొనుచుండెను. ఒకమాటు కసరినఁగాని వారినోరు మూఁతపడదని కృష్ణు డూహించెను.

కాని యూతఁ డేమియు ననకముందే సోమయాజులు "అయితే మన కెందుకు? వాడికే కోపమొస్తే మనం బతగ్గలమూ? కానీలే బాబూ, నీయోగక్షేమం నువ్వేవిచారించుకో" అని నవ్వుచుననెను.

ఇట్లు కొంతసంభాషణ జరిగినతరువాత కృష్ణరావును ఏదోపుస్తకమడిగి వారిరువురును తీసికొనిపోవుచు త్రోవలో కృష్ణరావునుగూర్చి మాటలాడుకొనసాగిరి.

సత్య—నిజంగానోయ్. పాపం. చిన్నపిల్లవునా? అప్పుడే మొగుడు పోవడం, ఎంతకష్టం చూడు.

సోమ—వాళ్లతల్లిదండ్రులు నానాకష్టాలూ పెట్టేవాళ్లట ఆపిల్లనిపాపం. తుదకు ఎలాగో తప్పించుకొని మేనత్తగారింటికి వచ్చింది. అంతా పదిపదిహేనురోజు లవుతుంది. అంతే.

సత్య—మనకృష్ణరావుకి కాస్తపూర్వాచారసంపర్కము ఉన్నట్లుంది. ఆపిల్లకేమిటి తక్కువ? చక్కదనం తక్కువా? మన్మథుడిమొలకలాగుంది. కృష్ణరావు ఆపిల్లను చేసుకుంటే అదృష్టవంతుడేనోయ్. ఏమంటావు? నేను చెప్పేది నిజమేనా?

సోమ—నేను తు. చ. తప్పకుండా నువ్వన్నమాటలతో ఏకీభవిస్తాను...వాఁడు ఈగోడవే మనని ఎత్తుకోనియ్యడుగదా?

సత్య—కాకినాడలో మనం చదువుకొనేటప్పుడూ అంతే. ఆడవాళ్లమాట ఒక్కటిమాట్లాడనిచ్చేవాడు గాడు. అది ఒకసుగుణమే గాని, ఆపిల్లను అలా యావజ్జీవం దుఃఖాలపాలు చేసి వీడింకెవతెనో చేసుకోవడం నాకేమీ బాగుండలేదు.

సోమ—నువ్వూ నేనూ అనుకున్నట్టే ప్రపంచకమంతా తిరిగేమాటైతే ఈపాటికి నేను ప్రధానమంత్రి బాడ్విననో, మాగ్డనాల్డునో అయిపోదును.



సత్య—చిన్నప్పటినించీ చదువుకున్నాం గదా? వాడితో మాట్లాడ్డానికంత సాహసంత్రముఉండక్కరలేదూ?

సోమ—వాడు ఉండనిస్తే ఉంటుందా? లేకపోతే ఉంటుందా?

సత్య—ఎందుకుండనియ్యడూ—నాడుండనిచ్చే దేమిటి? 'నేను చెప్పేది వింటావా? వినవా?' అని జుట్టుపట్టుకుంటే సరి.

సోమ—ఏదీ, ఇప్పుడేగా వెంగళప్పవైనావు? ఎందుకోయ్ లేనిపోనిఘోష?

సత్య—ఇందాక నవ్వుతాలకింద పోనిచ్చాంగనక అలా అన్నాగాని లేకపోతే అనకు.

సోమ—మనకు వచ్చేదుందా, పోయేదుందా? ఎందుకీ అవస్థ.

సత్య—బి. ఏ. చదువుతున్నావు. `కాస్త ఆపాటిజ్ఞానం ఉండనక్కరలేదూ? అక్కడేమో ఒకపిల్ల అవస్థపడుతూ ఉండెను. వీడేమో చేసుకుంటే ఆపిల్ల సౌఖ్యపడుతుంది. అటువంటప్పుడు నువ్వుచెయ్యగలిగినకాస్తపనీ చేసి ఉపకారం చెయ్యడం నీధర్మం కాదూ? ఏమిటో మాట్లాడతా వేమిటి?

సోమ—అవునోయ్, నువ్వు చెప్పింది నిజమే గాని కృష్ణరావును వెధవపెళ్లి చేసుకోమంటావా?

సత్య—వెధవపెళ్లేమిటి? వెధవపెళ్లీ ఉంకపెళ్లీని. మేనమామకూతుర్ని చేసుకోమంటూఉంటేను. ఏమీ? పిల్ల వీడికి తగకపోయిందా?

సోమ—నువ్వు వెధవపెళ్లి చేసుకుంటావా?

సత్య—ఎందుకు చేసుకోగూడదు?

సోమ—చేసుకుంటావా? చెప్పుమా?

సత్య—పిల్ల బాగుంటే చేసుకుంటాను.

సోమ—ఇవన్నీ ఏవో దొంగమాటలు. 'మాటు, దూకుమనే

అమ్మేగాని దూకేఅమ్మ ఒక్కతా లేదని సామెతే ఉంది.' ఇప్పుడు లోకవ్యవహారాన్ని అనుసరించేమాట్లైతే కృష్ణుడు వెధవపెళ్లి చేసుకోగూడదని అనుకున్నాడు.

సత్య—అలా అనుకోడం ధర్మమేనా?

సోమ—అయితే అధర్మమా? గొంతుక్కు ఉరిబిగించుకుంటే ధర్మం. లేకపోతే అధర్మమూనా? ఎక్కడసంపాయించావు నాయనా, ఈతర్కం?

సత్య—అది కాదోయ్. ఎంతమంది చేసుకుంటున్నారు కాదు? ఇది ఉరిబిగించుకోడమా ఏమిటి?

సోమ—అది కాదు. వాడితో చెప్పడం మనధర్మము. వాడు చేసుకుంటాడో చేసుకోడో వాడికి వదిలిపెట్టవలసినవిషయము.

సత్య—అయితే, వాడికి చెప్పడం మనవిధి అని ఒప్పుకుంటావా?

సోమ—ఒప్పుకుంటాను గాని 'నువ్వెందుకు చేసుకోవు' అంటే నాలిక వెళ్లబెట్టాల్సివస్తుంది.

సత్య—మరేమీ భయం లేదులే. రేపుచెపుదామా ఏమిటి?

సోమ—అంతతొందర లెందుకూ? మెల్లిగాచెపుదాం రేపే చేసుకోమంటావా ఏమిటి?

సత్య—అది కాదు. ఇప్పుడే చెప్పి ఉంచుతే వాడికి ఏదీ ఆలోచించటానికీ మళ్లీ మనమొకముక్క వెయ్యడానికీ వీలుంటుంది.

సోమ—ఇప్పుడే చెపితే ఈఆలోచనలో చదువు సంధ్యలు చల్లబడతాయి. పరీక్షలయినదాకా ఓపిక బట్టి చెపుదుగాని. పరీక్షలయినతరువాత పేనురోజులు ఊళ్లోనే ఉంటామనుకున్నాంగాదూ?

సత్య—అవును. నువ్వు చెప్పినఆలోచన బాగుంది. ఈమధ్యన అఖండుడినై పోయినావు.

సోమ—ఈలోపుగా మళ్లీఆమాటఎత్తక. వాడిదసలే సతిమెత్తని మనసు. ఈపడుగడిస్తే ఎక్కడో నాలుగుడబ్బులు సంపాయించుకుంటాడు. వాణ్ణి గట్టెక్కకుండా చేసినవాళ్లం అవుతాం జాగర్త.

సత్య—మరేం భయంలేదులే. మళ్లీఆమాట ఎత్తను. పరీక్షఅయినా్నాడు రాత్రి ఇకవాడికి పురెక్కించడం నిశ్చయమన్నమాట.

సోమ—ఇంకెవ్వరితోనూ చెప్పకు. కర్మంజాలక వాళ్లెవళ్లయినా వాడితో అన్నా, చదువు చెడుతుంది.

ఇట్లు మాటలాడి ఎవరిగదులకు వారరిగిరి.

---

## పండ్రెండవ ప్రకరణము.

పై ప్రకరణములోని సంగతులు జరిగి రెండుమాసము లయ్యెను. మాఘమాసము గడచి ఫాల్గుణము ప్రవేశించెను. చెన్నపురమున విద్యార్థు లందఱును తదేకచిత్తముతో తమతమ పాఠములను చదువుచుండిరి. స్నేహితులతోడి సరససల్లాపములును, నాటకములు, బయాస్కోపులు, సభలు, పందెములు, ఆటలు మున్నగున వన్నియు విద్యార్థిప్రపంచకమునకు జాలదూర మయ్యెను. కాఫీహోటలులకుమాత్రము రాంబడి తగ్గలేదు. కిరసనాయిలు ఖర్చుమాత్రి మెక్కువగ నుండెను. ఎలక్ట్రిక్కువారికి విద్యుచ్ఛక్తినుపయోగించుట కిచ్చుధన మానెలయధికమగు నని యూహింపఁబడు చుండెను. కాలేజీలకుఁ బోవు విద్యార్థులసంఖ్య తగ్గుటవలన ట్రాంకారులకును, మోటారుబస్సులకును రాంబడి

తక్కువయయ్యెను. విద్యార్థుల కొకరితో నొకరి కిపుడు హాస్యములు లేవు. ఒకరితో నొకరి కిపు డనవసరప్రసంగము—నిజముగ ప్రసంగము—లేనే లేదు. పుస్తకము, దీపము, విద్యార్థి—ఇవి ఫాల్గుణమాసమునకు లక్షణములు.

ఈ చెన్నపురిప్రపంచకమునుండి సుమారు మూఁడువందలమైళ్లు ఉత్తరముగఁ బ్రయాణము చేసితిమేని హేలాపురము కనఁబడును. హేలాపురమనఁగా ఏలూరు. ఆఏలూరులో ఆగంటివారిఇల్లు. ఇంట సుందరమ్మ వీరమ్మలు. వారిముచ్చటలు కనుఁగొనుట కిప్పుడు మనము ప్రయత్నించవలెను.

హైమవతి కాకినాడకు వెడలినప్పటినుండియు వీరమ్మ విచ్చలవిడిగ తిరుగుచుండెను. మధ్యాహ్నము మూఁడుగంటలమొదలు ఐదుగంటలవఱకును సుందరమ్మ పురాణశ్రవణమున కరుగును. ఆ రెండుగంటలును వీరమ్మదే సామ్రాజ్యము. రాత్రి తెల్లవాఱువఱకును వీరమ్మదే సామ్రాజ్యము. ప్రొద్దున, సాయంత్రము తల్లి వంటచేసికొను నప్పుడు వీరమ్మకుఁ గొంత లేకపోయినఁ గొంతయైన సామ్రాజ్యముండెను. కావున హైమ ఇంటనుండకుండుట వీరమ్మకు సౌఖ్యముగనే యుండెను.

సుందరమ్మకుమాత్రము హైమ నొకమాఱు చూడవలె నను నపేక్ష జనించెను. ఇంట పనిచేసికొనినప్పుడెల్ల హైమను చూచి నేఁటికిన్ని దినము లైన వని లెక్కపెట్టుకొనుచుండెను. ఎన్నిదినము లొకరి ఇంట నుండుటకు వీలగు నని యామె తలంచెను. పుట్టింట నుండుట విధాయకము కాని వేఱొకచో కాదని యామె యనుకొనెను. పుట్టింటికన్న మేనత్తఇంటనే హైమవతి ఎక్కువగఁ బ్రేమింపఁబడుచుండె నని సుందరమ్మ తెలిసికొనఁజాలకపోయెను. ఇంకొకచోట నెంతసుఖముగ నున్నను బిడ్డలవద్ద నుండవలె నన్న యపేక్ష తల్లికి నైజమే కదా?



ఇట్లుండియుండి యొకనాఁడు సుందరమ్మ ఇట్లారంభించెను.

సుంద—వీరమ్మా, హైమవతిని రమ్మని వ్రాద్దామా?

వీర—ఎందుకే హైమవతి. ఇక్కడుండి ఏంజేస్తుంది. అక్కడుంటే, ఏం, కొంపమునిగింది?

సుంద—ఎంతైనా మనింట్లో ఉంటే బాగుంటుందా, వాళ్లింటో ఉంటే బాగుంటుందా?

వీర—వాళ్లుమాత్రము అవిధాయకమా ఏమిటి?

సుంద—ఇప్పుడు నీఅభిప్రాయాలు మారినట్లున్నాయే. ఇన్నాళ్లూ సర్వవరపువారి పొడంటే గిట్టనివాని వి హైమవతిని వాళ్లదగ్గిర ఇన్నాళ్లుండమంటావుటే.

ఈమాట వీరమ్మకు తేలుకుట్టినట్లు వేదన కలిగించెను. మేనత్తకుటుంబముపై నిప్పుడామె కెక్కడలేని క్రోధమును కలిగెను. ఆమె డెందమంతయు నొక్కనిముషములో విషపూరిత మయ్యెను. తల్లికేమి జవాబు చెప్పనగునా యని యామె యాలోచింపసాగెను.

వీర—నాలో ఏమీ మార్పులేదు. నీలోనే ఉన్నట్లుంది. వాళ్ల పొడంటే నాకు గిట్టదని నేచెప్పుడన్నాను? ఇలాగే ఒకళ్లను చెడ్డవాళ్లను చెయ్యడం.

సుందమ్మ ఏమియు జవాబుచెప్పలేదు.

వీరమ్మ ఇట్లనెను—అది సరేగాని, అక్కణ్ణించి దాన్ని రాజమహేంద్రవరములో కామేశ్వరరావుమామదగ్గిర ఉంచితే ఏమీ. వాళ్లింట్లోనే ఎల్లకాలం ఉంచమన్నానని నామీద ఎందుకు లేనిపోని అపవాదం. ఇవ్వాళే కామేశ్వరం మామకు వ్రాసి కాకినాడ వెళ్లి హైమను రాజమహేంద్రవరము తీసుకొనివచ్చి ఒకనెల్లాళ్లపాటు అక్కడ ఉంచవలసిం దని వ్రాయి.

సుందరమ్మకు ఈఆలోచన నచ్చెను. హైమ ఇంటికి వచ్చుట వీరమ్మకు సరిపడ దని సుందరమ్మ తెలిసికొనెను. కాకినాడలోనే యుంచుట వారిరువురకును ఇష్టము లేదు. అట్టిసందర్భమున చేయవలసినపని వీరమ్మ చెప్పినచొప్పున రాజమహేంద్రవరమునకుఁ దీసికొనిపోవుటయే యని స్పష్టముకాఁగలదు. సుందరమ్మ యాలోచన యేమన, హైమ యొక సెలవులు రాజమహేంద్రవరమున నుండెనేని, ఎట్లో ఆనెల యైన తరువాత ఏలూరు రాకతప్పదు. కావున ప్రస్తుతము వీరమ్మను సంతోషపెట్టుటయే గాక ఇఁక ముందట్లు ఇంకొకరియింట నుంచుటకుఁ గూడ ఇయ్యకొనుటకు వీలుండదు.

ఈసంగతి యంతయు బాగుగ నెవరిమనస్సున వారాలోచించుకొనిరి. అనాఁడు కామేశ్వరరావునకు ఉత్తరము వ్రాయఁబడెను. కాని నాలుగైదు దినములలో కామేశ్వరరావు వద్దనుండి తిరుగుజవాబు వచ్చెను.

రాజమహేంద్రవరము.
6—3—...

మహాలక్ష్మీసమానురాలైన చిరంజీవిసౌభాగ్యవతి సుందరమ్మను అన్న కామేశ్వరరావు అనేక చిరాయువులుగా దీవించి వ్రాయునదేమనఁగా—

నీవు ఎంతపెద్దదానవైనను చిన్నతనము ఇంకను పూర్తిగ వదలలేదు. హైమవతి మాయింట నున్నప్పుడు చాల కష్టము లనుభవించినది. ఆకష్టములనుండి తప్పించుకొని కాకినాడకుఁ బరుగెత్తినది. ఇట్టిసందర్భమున నేను కాకినాడకుఁ బోయి ఆమెను తీసికొని వచ్చుటకుఁ బ్రయత్నించితినేని దానిమనస్సును అనవసరముగ నొప్పింపఁజేసినవాఁడ నగుదునని నాకు భయముగ నున్నది. దానిని తీసికొనివచ్చుట కట్టు



మొదటికి, బలిపెట్టుమేకను తెచ్చినట్లుండును. ఇదివఱకే నాపెత్తనము గొంతవఱకు వెలిగించి దానికి వైధవ్యమును దెచ్చిపెట్టి నిర్భాగ్యపుఁ బెండ్లి చేసితిని. ఇంకను నేనే జోక్యము కలిగించుకొని హైమవతిని కష్టములపాలు చేయుట మంచిది కాదు. కాకినాడలో నెప్పుడు సౌఖ్యముగ నుండదో అప్పుడే ఆమె మనకు వ్రాసితీరును. అది చులుకఁదనము గలది కాని బుద్ధిహీన కాదు. కాఁబట్టి ఎక్కడ నున్నవారిని అక్కడనే యుండ నిచ్చినచో శ్రేయస్కర మని నేను నమ్ముచున్నాను. ఆమెను తీసికొనువచ్చు ప్రయత్నమును మానివేయఁగోరుచున్నాను. అందఱును క్షేమము. తఱచు మీక్షేమసమాచారములు వ్రాయఁ గోరెదను. ఇంతే సంగతులు.

గ్రహించవలెను.
కామేశ్వరరావు.

ఈయుత్తరము చూచుకొని సుందరమ్మ క్రోధసంతాపపూరిత యయ్యెను. వీరమ్మతో నామె యేమియు నాలోచింపలేదు. వెంటనే యన్నపేర నామె మఱియొక యుత్తరమును వ్రాసెను.

ఏలూరు.
8—3—...

మహారాజశ్రీ కామేశ్వరరావు అన్నగారి సముఖమునకు. చెల్లెలు సుందరమ్మ అనేక నమస్కారములు— "ఉభయకుశలోపరి."

త॥ మీరు వ్రాసిన ఉత్తరము ఇప్పుడే అందినది. సంగతులు తెలిసినవి. మీరు వ్రాసిన ఉత్తరమునకు నాకు కోపము లేదు. ఆఁడుపిల్ల పుట్టింటనైన నుండవలెను. లేదా అత్తింటనైన నుండవలెను. అత్తింట నుండుట ఇప్పుడు దూరమైనదికదా? ఉండవలసినచోట నుం

ఇక ఉండరానిచోట్ల నుండుట తగదని నాయభిప్రాయము. అట్లు కాకయున్నను, ఎక్కువకాల మొకచోటనే పాతుకొని పోయినయెడల లోకాపవాదముల పాలగుట సంభవించును. ఈయపవాదమునుండి కాపాడుటకు నాకు వేఱు మొగదిక్కు లేకపోవుటచే మిమ్ములను పట్టుకొని పాకులాడుచున్నాము. మేము హైమవతిని కష్టపెట్టుచుండుట నిజమో అబద్ధమో భగవంతునకును మాకును తప్ప ఇతరులకుఁ దెలియదు. ఒకవేళ మేమామెను కష్టపెట్టుచుండుట నిశ్చయమే యని యొప్పుకొన్నను, దానిని రాజమహేంద్రవరమున మీయింటికిఁ దీసికొనివచ్చుటకు నాకేయాటంకమును గనఁబడలేదు. కావున నాయందు దయయుంచి ఆమెను రాజమహేంద్రవరమునఁ దమయింటికిఁ దీసికొని రాఁగోరెదను. కాకినాడకుఁగూడ మరల నొకయుత్తరము వ్రాయుచున్నాను. మీరు తప్పక నామనవి మన్నింతురని తలఁచెదను.

ఇంతే సంగతులు. చిత్తగించవలెను.

సుందరమ్మ.

ఈయుత్తరమును చూచి కామేశ్వరరావు మఱునాటి యాదివారమునఁ బ్రయాణమై తొమ్మిదిగంటలకు కాకినాడ చేరెను.

మొట్టమొదట కామేశ్వరరావున కుత్తరము వ్రాసినప్పుడే కాకినాడకుఁగూడ సుందరమ్మ యుత్తరము వ్రాసియుండెను. ఆయుత్తరమందినవెంటనే హైమకుఁ దల తిరిగిపోయెను. తనతల్లి తనకొఱకు కామేశ్వరరావును పంపుచున్న దని తెలిసికొని యామె నివ్వెఱపోయెను. ఆమెను రాజమహేంద్రవరమునకే తీసికొనిపోవుదురు గాని ఏలూరునకుఁ గాదని హైమవతికిఁగాని శేషమ్మకుఁగాని తెలియదు. సౌఖ్యముగ వచ్చుట నున్న తన్ను ఇట్లు సుఖమునుండి దూరముచేయుచున్న తన తల్లిని హైమ లోలోన నిందించుకొనియెను. ఇంకొక్కనెలలో బావ



వచ్చు ననియు, నప్పటికన్న సౌఖ్యముగఁ గాలము గడపుద మనియు, బావభావము లేమైన మాఱినవో లేదో తెలిసికొనవలెనననియు నామె వాంఛించెను. ఇంతలోనే తనకు దుఃఖకరమగు నీజాబు వచ్చెను. శేషమ్మయు కన్నుల నీరువెట్టుకొనెను.

నాలుగైదుదినములైనను కామేశ్వరరావు రాకుండుట చూచి హైమకును శేషమ్మకునుగూడ కొంతభీతి తగ్గెను. కాని దైవనియతి నెవ్వరు తప్పింపఁగలరు? రెండవయుత్తరము వచ్చుటతోడనే మరల భీతి ఎక్కువ కాఁజొచ్చెను. తుట్టతుదకు కామేశ్వరరావురాక హైమకు సాక్షాద్యమదర్శన మైనట్లుండెను. అతిభారముగ నున్న హృదయముతో మేనత్తయు మేనకోడలును కామేశ్వరరావునకు సపర్యలొనర్చిరి. భోజనానంతరమున కామేశ్వరరావు హైమవతిని దీసికొని పోవుటకు వచ్చితి నని చెప్పెను. సాయంతనము మెయిలులో వెడలుటకు తీర్మానించితి ననియు, మఱునాఁడు కచ్చేరికిఁ బోవలయు ననియు కామేశ్వరరావు చెప్పెను.

హైమ——నన్ను ఏలూరులో బతకనియ్యరు. చాలా కష్టపెడతారు.

కామే——ఆసంగతి నాకు తెలుసునమ్మా. నిన్నిప్పుడు ఏలూరికు తీసికెళ్లను. రాజమహేంద్రవరంలో మాయింటికి తీసికెడతాను. ఇక్కడ ఎలాఉన్నావో అక్కడ అలాఉంచుతాను. సరా?

హైమ——ఇక్కడే ఎందుకు ఉండకూడదూ?

కామే——ఒకచోటే ఇన్నాళ్లుండకూడదు. విధాయకంగాని ప్రదేశాల్లో ఉండకూడదు.

హైమ——అలాగయితే ఇప్పుడు పుట్టినిల్లొక్కటేవిధాయకమైనది.

కామే——నిజమే ఆమాట. అక్కడ నీకు కష్టంగా ఉన్నప్పుడు

ఇక్కడికీ అక్కడికీ తిరుగుతూ ఉంటే బాగుంటుంది కాని ఒక్కచోటే అంటిపెట్టుకుంటే లోకు లేమన్నా అనుకుంటారు. ఇక్కడ నీకెలా జరుగుతూ ఉందో అలాగే నేను రాజమహేంద్రవరంలో జరుపుతాను.

హైమ—అక్కడనించి ఏలూరు పంపించకుండా ఉంటావు కదా మరి?

కామే—వెళ్లి అక్కడొక నెల్లాళ్లెలాగో గడపుకొని రావచ్చును. ఆమాట ఇప్పుడెందుకు? ఇప్పుడు రాజమహేంద్రవరం రా.

హైమ—మళ్లీ కాకినాడకు ఎప్పుడు పంపిస్తారు?

ఇది నువ్వడగవలసిన ప్రశ్న కాదు. మీ అత్త అడగవలసిన ప్రశ్న.

ఇట్లే కొంత సంభాషణ జరిగిన వెనుక హైమవతిని తీసికొని కామేశ్వరరావు బయలుదేఱెను. హైమవతిని విడిచి యుండఁజాలక శేషమ్మయు నశ్రుపూరితనయన యయ్యెను. ఆదివారము సాఁటిరాత్రి ఎనిమిదిగంటలకు హైమవతియు కామేశ్వరరావును రాజమహేంద్రవరము చేరిరి.

కాకినాడయందు జరిగినంత సుఖముగ కాలము జరుగకున్నను, రాజమహేంద్రవరమున హైమవతి కొంతవఱకును సుఖముగనే కాలము గడపుచుండెను. కాని ఆయూరనే హైమవతి యత్తవా రుండుటం జేసి హైమవతి ఇంటినాలుగుగోడల సందునను ఉండవలసివచ్చెను. కాకినాడలో నున్నప్పుడుకూడ నామె ఇంటిగడప దాఁటి ఎచ్చటికిని వెడలి యుండలేదు. కాని కాకినాడలో తానుబయటికిఁ జనుట కవసరము కలుగలేదు. వద్దని తన్నెవ్వరును ఆపనులేదు. కాని నిరోధ మున్నప్పుడు స్వేచ్ఛకుఁ జాలభంగకరముగఁ గొన్నివిషయములు కనఁబడుచుండును. అత్తవారు చూతు రన్న భయముచేతను, ఇంకెవ్వరైనను జూచి యత్తవారితో నందురను భయముచేతను హైమవతి ఇరుగుపొరుగు



వారి కంటఁబడకుండ దాఁచివేయఁబడవలసివచ్చెను. స్వేచ్ఛ యన నేమియో రెండుమూఁడుమాసములనుండియుఁ దెలిసికొన్న హైమవతికీబందికానాలో నుండుట యసాధ్యముగ నుండెను. తినఁ గూడును కట్ట ననువైన బట్టయును లేకున్నను గదిలోనే తలుపులు మూసికొని యుండవలసిన యవసరము, ఏలూరులోఁగూడ హైమవతికిఁ గనఁబడలేదు. కాని అవి రెండును ఉండియు స్వేచ్ఛలేని రాజమహేంద్రవరపు ఖైదు కామెకు సహింప నశక్యమై యుండెను.

ఇట్లు పదునైదుదినములు హైమవతి ముండ్లపై నున్నట్టులెట్లో కాలము గడపెను. ఎవ్వరితోడను తనస్వేచ్ఛాహీనతగాని, మనోవేదనగాని యామె చెప్పుకొనలేదు. పదునైదుదినము లైనతరువాత నొకనాఁడు కామేశ్వరరావు హైమతో నిట్లు ప్రస్తావింప నారంభించెను.

కామే—హైమా, మీ అమ్మ నిన్ను ఏలూరు తీసుకురమ్మని ఉత్తరం వ్రాసింది. ఎలాగన్నా పుట్టినింట ఉండవలసిన పిల్లవు. ఇక్కడా అక్కడా ఉంటే బాగుండదు. అప్పుడే మీ అత్తవారు అడ్డమైన మాటలూ అంటున్నారట. నీగౌరవమూ మాగౌరవముకూడా నిలవబెట్టవలసిన బాధ్యత నీమీద ఉన్నది.

హైమవతికి రాజమహేంద్రవరమునుండి ఎట్లయినను దాఁటి బైట పడవలె ననియే యుండెను. కాని కాకినాడయందు, ఏలూరు పంపవద్దని కామేశ్వరరావుతో నన్నమాట లప్పుడు హైమకు జ్ఞాపకమునకు వచ్చెను. [illegible] కొంచెమయిష్టత చూపి తనకు ఏలూరునకుఁ బోవుట కిష్టపడవలె నని హైమ తలంచెను. ఈయుద్దేశ్యమును మనస్సునం దుంచుకొని హైమ ఈక్రింది ప్రత్యుత్తరము నిచ్చెను.

హైమ—కాకినాడలో నేను నిన్ను వేడుకున్న దంతా మఱచిపోయినావా మామయ్యా? ఏలూరులో నేను పడ్డ బాధలు నీకు తెలి

యవా? నన్నిలా తీసుకొచ్చి నమ్మించి మోసపుచ్చడం ధర్మమేనా? నిన్ను నమ్ముకున్నప్పు డిలా చెయ్యొచ్చునా?

కామేశ్వరరావు నిరుత్తరుఁ డయ్యెను. తాను చేసిన పని యతి నీచమైన పని యని యాతనికిఁ దట్టెను. ఆతనిమనస్సునం దొక బడబాగ్ని పుట్టి దేహమును ఆత్మను గూడ కాల్చివేయుచున్నట్లాతనికిం దోఁచెను. ఏమియు నెఱుఁగని బాలికను వైధవ్యదుఃఖపీడిత యగుదానిని, కష్టముల కోర్వఁజాలక ఎచ్చటనో మర్యాదగ తలదాఁచుకున్న హైమవతిని మాయమాటలాడి మోసపుచ్చితి నని కామేశ్వరరావు హృదయము ఛేదిల్లుచుండెను. కాని, ఇంతలో తా ననుకున్న ఫక్కికింబడి యనవసరమగు బలవత్తరములగు వాక్యము లుపయోగించినందులకు ఫలిత మేమగునో యని హైమవతి భయపడెను. దీనినిగూర్చి యాలోచించుట కప్పుడు హైమకు వేళలేదు. కామేశ్వరరావు ప్రత్యుత్తర మిచ్చులోపల తా నన్నమాటలయొక్క కఠినత్వమును తీసివేయు పలుకులఁ బలుకవలె నని హైమవతికి స్ఫురించెను.

హైమ—ఎలాగయినా నువ్వు చేసేదేముంది? కొన్నాళ్లపాటు రాజమహేంద్రవరములో ఉన్నతరువాత ఏలూరుకు తీసికొనివెడతానని కాకినాడలో నేనాతో చెప్పావుకదా? నువ్వన్నమాట నిలవబెట్టుకున్నావే.

కామేశ్వరరావుమనస్సు కొంత చల్లపడెను. తనవాగ్దానమున కాతఁడు భిన్నముగఁ బ్రవర్తించియుండలేదు. రాజమహేంద్రవరమునందే యావజ్జీవమును ఉంచెదనని కామేశ్వరరా వెన్నడును వాగ్దానము చేయలేదు. అయ్యును, కామేశ్వరరావు రాజమహేంద్రవరమునందే హైమవతి నుంచుట కొకనైతికబాధ్యత గలవానివలె నాలోచింపసాగెను. ఇక్కడ కామేశ్వరరావు, అక్కడ హైమవతి—మౌనము, నిశ్శబ్దము—ఊహాకల్లోలము, అభిప్రాయభేదము—ఇవి యచ్చట సప్రధాన



ముఖ్యవిషయములై యుండెను. ఎట్టకేలకు కామేశ్వరరావు వంచిన తనశిరము నెత్తి, హైమవైపుకుఁ జూచి "అయితే, హైమా, ఎప్పుడు మనప్రయాణం?" అనెను.

హైమ—నీకు కచ్చేరీకి సెలవువచ్చి అనుకూలంగా ఉన్నప్పుడు.

కామే—ఎల్లుండి ఆదివారమునాఁడు వెడదామా?

హైమ—అలాగే.

కామే—అయితే పెట్టె సద్దుకొని సిద్ధంగా ఉండు.

ఆదివారమునాఁడు పగలు పదిపదునొకండుగంటలకు భోజనానంతరము హైమవతియు కామేశ్వరరావును బయలుదేఱిరి. హైమవతి రాజమహేంద్రవరమునకు వచ్చి ఇంటఁ బ్రవేశించినతరువాత ననుభవించినప్రథమస్వేచ్ఛాగమనసౌఖ్య మిదియే నని పాఠకులెల్లరు నెఱింగినవిషయమే. ఇప్పుడుకూడ నెవ్వరైన జూతురేమో యనుభయముచే కొంతవఱకు తురకబూబులప్రయత్నములు చేయఁబడెను. ఒడలినిండ గుడ్డకప్పుకొనుమని హైమవతికి నచ్చఁజెప్పఁబడెను. ఆమెను వీథిలోని వారు చూడకుండ కామేశ్వరరావు అడ్డముగఁ గూరుచుండెను. రాత్రి పూట ప్రయాణము చేయలేమైపోతిమని యాతఁడు చింతింపసాగెను. ఆధునికభర్తృహీనలను దాచుటలో నిదియే కామేశ్వరరావు ప్రథమ ప్రయత్న మగుటచే నందందు గనఁబడునాతనితప్పులను చదువరులు మన్నింతురుగాక. సాయంకాలము మూఁడునాలుగుగంట లగునప్పటికి వారిరువురును ఏలూరు చేరిరి. బండిలో తురకబూబును ధిక్కరించి ఇంటిలోఁ బ్రవేశించినవెంటనే యొక్కపెట్టున తండ్రిమంచము వద్దకుం బరుగెత్తి హైమ రోదనముచేయ నారంభించెను. హైమవతి యప్పుడే బండిదిగివచ్చినదనియు నెందులకో రోదనము చేయుచున్నదనియు నెంచి దుఃఖ మాపుకొనంజాలక వృద్ధుఁడును ఏడుపు సాగించె

మ్మ యిట్లు కొంతసేపైన తరువాత సందఱును యథాస్థితికి వచ్చిరి.

హైమ వచ్చినందుకు పురాణము విని వచ్చిన సుందరమ్మకుఁ జాల సంతోషముగ నుండెను. కాని వీరమ్మ కనుఁగొనలఁ బ్రస్ఫుటములగు నశ్రుకణములను చూచి యామె వెనుకకుం జంకెను. ఎట్టకేలకు స్వభావమగు మాతృప్రేమతో సుందరమ్మ హైమకంఠమును కౌఁగిలించుకొని ఏమిమాటలాడిన వీరమ్మకుఁ దప్పుగఁ దోఁచునో యని యొక్క కౌఁగిలింపుతోనే యామెను వదలిపెట్టెను. వీరమ్మకు మాత్రము హైమవతి వచ్చినందులకుఁ జాలఁ గినుకగ నుండెను. ఆమె వచ్చునప్పటికి సుందరమ్మ పురాణము వినుటకుం బోయియుండెను. అప్పుడే వీరమ్మకొడుకుఁ గామరాజు వచ్చియుండెను. అట్టిసమయమున వీరమ్మ మనస్సెట్లుండునో యూహింప నలవికాదు. కావుననే, సుందరమ్మ వచ్చునప్పటికి క్రోధకషాయితనేత్ర యగు వీరమ్మను చూడవలసివచ్చెను. దీనివలననే సహజమగు మాతృప్రేమ యరికట్టఁబడెను. భగవచ్చిత్రములలో నీ స్వభావచాంచల్యఫల మొక ముఖ్యదృశ్యము. హైమవతిని ఏలూరులో దిగవిడిచి సుందరమ్మకు నాలుగునీతు లుపదేశించి హైమను జాగ్రత్తగఁ జూచుకొనవలసినదని నొక్కి వక్కాణించి, భుజించి రాత్రి ఎనిమిదిగంటలబండిలో కామేశ్వరరావు రాజమహేంద్రవరమునకుఁ జనెను.

హైమవతియు మునుపటివలెఁ దనగదిలోఁ బ్రవేశించెను. ఆమెకు మరల ప్రాఁతకష్టము లారంభమయ్యెను. సుందరమ్మ వీరమ్మచేతలను మాటలను ఆటంకపఱుపఁజాలకపోయెను. కామరాజు తనతో సల్లాపములాడుచుండఁగ వచ్చిన హైమవతిపై నకారణముగ వీరమ్మ మండిపడుచుండెను. హైమవతిబట్టలు పోయి ప్రాఁతగుడ్డలును, కోరామల్లును ఆమెకు శరణ్యము లయ్యెను. రామయ్య మాత్రము మునుపటివలె తలనూనెయు, దువ్వెనలును, చిరుతిండ్లను తెచ్చిపెట్టుచుండెను.



కాని, యేకభుక్తములు మరల నారంభమయ్యెను. హైమ నానాటికిఁ గృశించుచుండెను. ఏలూరు చేరినతోడనే యామె శేషమ్మపేర నొక యుత్తరమువ్రాసెను. అందు తనకున్న భయముల నన్నింటినిఁ బొందుపఱిచెను. ఆమెవ్రాసినట్లే పూర్వపుకష్టము లినుమడించినశక్తితో నామెను జుట్టుముట్టెను. అసహాయయు నబలయు నగు నామె యేమిచేయఁగలదు. రాజమహేంద్రవరమునకును కాకినాడకును ఉత్తరములు వ్రాయఁగలదు. రామయ్య సాహాయ్యము చేసినంతవఱకును దానిని పోస్టులో వేయింపఁగలదు. రాజమహేంద్రవరమునుండి ఎవ్వరును నామెకు జవాబువ్రాయరైరి. కాని శేషమ్మమాత్రము ప్రత్యుత్తరములు వ్రాయుచుండెను. రానురాను హైమయు రాజమహేంద్రవరమున కుత్తరములను వ్రాయుట మానుకొనెను.

ఎంత నీచస్థితిలో నుంచినను తలవంచుకొనుచునే యుండిన హైమవతిని చూచి వీరమ్మ ఏమాత్రమును ఓర్వఁజాలకుండెను. ఆదుర్విపతల హైమవతి కోకయందము నిచ్చుచున్నదని తెలిసికొని దానికి మందాలోచించుచుండెను. ఆమె కఠినహృదయమున కొక మందుమాత్రమే తోఁచెననుటలో నతిశయోక్తి లేదు. హైమవతి కెట్లైన కేశఖండన మొనరించినచో నామె కీసౌందర్యపిపాస యుండదు. హైమవతి నట్లుచేయుటతోఁ దనక్రోధము పూర్తి యగు నని వీరమ్మ తలంచెను. తల్లియనుమతి లేనిదే ఈపని జరుగుట దుర్ఘటము. అందువలన తల్లితో నీవిషయమునుగూర్చి ప్రస్తావించుట వీరమ్మకు తప్పనిసరియై యుండెను. సుందరమ్మ దీని కనుమతించునా యనుమతింపదా? అనుమతించునట్లు చేయుట కేమి చేయవలె నని వీరమ్మ వితర్కించుకొనుచుండెను. అది మనకును సమస్యయే. పాఠకులారా, సుందరమ్మ యనుమతించునా ?

---

## పదుమూఁడవప్రకరణము.

కామేశ్వరరావు బండి యెక్కఁగనే హైమసౌఖ్యము కొండయెక్కెను. ఆమెస్థితి యథాప్రకారమునకు దిగె నని పోయినప్రకరణము నందే వ్రాసియుంటిమి. ఇంతటితో నూరకుండినచో ఇన్నిదినము లోర్చినట్లే యామెయు నోర్చియుండెడిదేమో. కాని రానురాను వీరమ్మ ఆమెను పెట్టుబాధ యధికమయ్యెను. ఒకనాఁడు వీరమ్మయు సుందరమ్మయు భోజనములగదిలో కూర్చుండిరి. వీరమ్మ కూరతరుగుచుండెను. సుందరమ్మ పచ్చడి రుబ్బుచుండెను. వీరమ్మ సుందరమ్మతో నిట్లు సంభాషణ మారంభించెను.

వీర—అమ్మా! రోజూ హైమ తలదువ్వుకుంటుంది. దీనికి నూనె, దువ్వెన ఎక్కడివి?

సుంద—ఇంటో ఎక్కడో పెడతావుగాబోలు తెచ్చుకుంటుంది. దానికి అవి ఉండేచోటు తెలియదా ఏమిటి?

వీర—అమ్మా! మొగుడులేని పిల్లగదా. ఇలా వేషాలు వేస్తే చూసినవా ళ్ళేమనుకుంటారు?

సుంద—అవును, నిజమే. కాని, చిన్నపిల్లాయెను. ముద్దూ ముచ్చటా ఎరగదు. అతను బ్రతికున్నన్నాళ్ళు మనతోడ వాళ్ళకీ, వాళ్ళతోడ మనకూ గిట్టకపోయెను. సరే ఇప్పుడు అసలే తెగిపోయెను. ఏదో, అదీ కాస్త ఆశపడుతుంది.

వీర—ఎంత ఆశపడ్డా మరీ ఇంతచేటా? వెధవది వెధవకుమల్లె ఉండాలి. షోకులు చేసుకోవడం తప్పుగాదూ?... దీనిరోగం ఒకపని చేస్తే టక్కున కుదురుతుంది. ఆజుట్టున్నన్నాళ్ళూను దానిఅందమూ



చెందమూను. ఆబుఱ్ఱ కాస్తా గీకించేస్తేసరి కుక్కినపేనులాగ పడుంటుంది.

సుంద—అదేం జేసిందనే నీకంతకోపమూ!

వీర—సరే, మర్యాద కాపాడుకొనే మార్గం నేం జెపితే, నీ కోపమని ఎత్తి పొడుస్తావు. ఎంత మొగుడు వదలిపెట్టినా, నీఇంటో చాకిరీ చేస్తే అన్నం పెడుతున్నావు గాని ఊరికే పెట్టడంలేదు. నామొగుడి ఆస్తితో నాకేం గడవకపోదు. ఈఅమ్మ పంచనా ఆఅమ్మపంచనా పడుండవలసిన అవసరం నాకు లేదు. లోకాపవాదా లన్నీ భరిస్తూ ఉండాల్సిన గతి నీమొహాన వ్రాసుంటే నేనేం జేస్తాను?

సుంద—ఇంతట్లోకే ఇంత కోపమైతే ఎలాగే? కష్టనిష్ఠూరా లన్నీ ఆలోచించుకోవద్దూ?

వీర—నన్నుతిట్టడం కష్టనిష్ఠూరాలు ఆలోచించడమూ ఏమిటి?

సుం—మాట్లాడితే తిట్టారంటావేమిటి? ఇప్పుడు నేను తిట్టానూ నిన్ను?

వీర—మరేం జేశావు? నాకు మాటలు జ్ఞాపకముండవు. నన్ను తిట్టలేదూ? ప్రమాణం చేసిచెప్పు.

సుంద—ప్రమాణపూర్తిగా నిన్ను తిట్టలేదు.

వీర—పోనీ, అసలు విషయం ఎగరగొట్టేశావు. హైమబుఱ్ఱ గీకించేస్తే చెప్పుకింది తేలులాగ పడుంటుంది. లేకపోతే షోకులు చేసుకు ఎవణ్ణో తీసుకు లేచిపోతుంది.

సుందరమ్మ జవాబు చెప్పలేదు. తనకు సహాయకారిగ నుండు నప్పుడు మౌన మర్ధాంగీకారముగఁ దీసికొనుచుండుట వీరమ్మకు స్వభావమై యుండెను. ఇప్పుడును అదేప్రకారముగ నర్థము చేసికొని వీరమ్మ హైమవద్దకుఁ జనెను. వీరమ్మ పిల్లివంటిది. ఆవీరమ్మకు హైమయను

చిట్టెలుక దొరకెను. పిల్లికి చెరలాటము, ఎలుకకు ప్రాణసంకట మను లోకోక్తికిది నిదర్శనము. హైమ నేవిధముగ నైనఁ గష్టపెట్టవలె నని వీరమ్మ తలంచె నేని అకష్టమునకు పూర్వము హైమవతి ఖిన్నురాలగు నట్లు చేసినైచుట వీరమ్మకు వాడుక. ఇప్పుడును అదేప్రకారముగ హైమతో చెరలాడుటకై వీరమ్మ బయలుదేరెను.

వీర—హైమా! నువ్విలా ఉండి నీకు చాలాషోకులు బలిశాయి. అది పనికిరాదు సుమా.

హైమ—నేను తప్పేమన్నా చేస్తే అనుకోవచ్చు. ఉత్తపుణ్యానికి నన్నిలా అనడ మెందుకు, అక్కయ్యా?

వీర—నీమొహాన వ్రాసినట్లు చెయ్యక, తలదువ్వుకోవడాలు అవీ ఎందుకు?

హైమ—దువ్వుకుంటే ఏమిటి?

వీర—ఆదువ్వుకోవడంలో నీఅభిప్రాయం స్పష్టముగా చెప్పు.

హైమ—ఏమీ లేదు. బాగా ఉందామనే నాఅభిప్రాయం.

వీర—ఎందుకూ, అందంగా ఉండడం? నిన్ను చూచీ నీఅందాన్ని చూచీ ఆనందించే వాళ్ళెవ్వరు? మొగుడా లేకపోయెను? ఇంకెవ్వరు ఆనందిస్తారు?

హైమ—నాఅందం నాకే ఆనందం! ఇంకొకరి ఆనందంతో నాకు పనిలేదు. నాఅందం చూచి ఇంకొకరు ఆనందిస్తే నాఆనందం మఱింత ఎక్కువౌతుంది.

వీర—ఇదంతా ఏరి వీధిలో పారేసిన వెఱ్ఱివేదాంతం. ఒకళ్లానందించడానికే అన్నీని. సూర్యుడికి వెలుగెందుకు? తనవెలుగును చూచి తానే ఆనందించుకోవడానికా?

హైమ—నేనొక ప్రశ్న వేస్తాను చెప్పు. పుస్తకంలో అక్షరాలు



వాటిని చూచే అవి ఆనందించుకుంటాయా?

వీర—ఎలా ఆనందించుకుంటాయి? కాబట్టి—

హైమ—అదికాదు. తమను చూచి ఆనందించుకొనేశక్తి సృష్టిలో కొన్నిటికే ఉంది. బుద్ధీ ఆలోచనా కలిగినవాటికి తప్ప, ఇతర వస్తువుల కాశక్తి లేదు. కాబట్టి మనుష్యులని సూర్యుడుతో పోల్చడం తప్పు.

వీర—బోగంది ఎందుకు షోకుచేసుకుంటుంది.

ఈమాట వచ్చుటతోడనే హైమకు కోపమువచ్చెను. వెంటనే ఈసంభాషణము నంతము చేయవలె నను తలంపుతో నింతకు మును పటినుండియు దాఁచియుంచిన మహాస్త్రమును పైకిఁ దీసి ప్రయోగించెను.

హైమ—నీకూ, మొగుడు దగ్గిర లేడుగదా? నువ్వెందుకు షోకులు చేసుకుంటావూ?

వీర—నీతెలివి మండిపోనూ. ఓసి నిశాచరురాలా! ఎంత మాటబడితే అంతమాట అంటావా? పెద్దంతరం చిన్నంతరం లేకుండా మాట్లాడతావా? నీకీజుట్టుండబట్టిగాదూ ఈగర్వమంతాను; ఈషోకులన్నీని? నీజుట్టు తీయించేస్తానుండు! ఏంషోకులు చేసుకుంటావో చూస్తాను.

అని మహామేఘమువలె గర్జించుచు వీరమ్మ సుందరమ్మదగ్గఱకుఁ జనెను.

మఱునాఁడు వీరమ్మ వ్యాఘ్రమువలె గర్జించుచు హైమదగ్గఱకు వచ్చెను. “ఉండు. వైశాఖమాసం రావడంతోటే నీబుఱ్ఱ డొక్కేయించకపోతే నేను మాదిగదాన్ని అన్నమాట.” అనిపలికెను. హైమ కేమిచేయుటకుఁ దోఁచలేదు. ఆమె వీరమ్మను బతిమాలవలె నను

కొనెను. కాని వీరమ్మ వెనుకకుఁ దిరుగకుండ వెడలిపోయెను.

హైమ దుఃఖావేశముచే నేలఁబడి పొరలుచుండెను. ఆమె కొ [illegible] చిక్కుగఁ గనఁబడెను. వీరమ్మసుందరమ్మల బారినుండి తప్పించుకొను టొక్కటే యామె కాధారముగఁ దోఁచెను. తనయీప్రయత్నమునకు రామయ్య సాహాయ్యము చేయవచ్చును. కాని, తాను తప్పించుకొని యెవ్వరివద్ద కేఁగును. శేషమ్మదగ్గఱకు కాకినాడ వెడలుట సరి యగునా? అని యామె వితర్కించుకొనియెను. ఏలూరునందే యున్నచో నష్టకష్టములపాలు చేయుటయే గాక, శిరోజములను దెగనఱికి యామె కందవికారము కలిగింతురు. ఎచ్చటకైన నేఁగినచో మైనరుపిల్ల నెవ్వరు దగ్గఱ నుంచుకొన సాహసింతురు? ఆమె కిది యొకగొప్ప చిక్కుగఁ గన్పట్టెను.

ఇట్లామె యాలోచించుకొనుచుండగా రామయ్య అచ్చటికి వచ్చుట తటస్థించెను. మధ్యాహ్నమగుటచే సుందరమ్మ వీరమ్మలు పురాణము వినుటకుఁ జనిరి.

హైమ—రామయ్యగారూ! నేనొక్క గొప్పచిక్కులో ఉన్నాను. నన్ను మీరు రక్షించాలి.

రామ—ఏమిటమ్మా ఆచిక్కు?

హైమ—ఇవ్వాళా, నిన్నాగూడా మాఅక్కయ్య నన్ను బెదిరించి వెళ్లింది. వైశాఖమాసం వచ్చేరావడంతోటే నాజుట్టు తీసేయిస్తారుట. ఇంత అన్యాయం ఎక్కడన్నా ఉన్నదండీ?

రామ—అదృష్టముమరి. ఏంచేస్తావు?

హైమ—నాకేమీ దరీ తెన్నూ కనపడ్డం లేదు.

రామ—మీనాన్నగారితో చెప్పరాదూ?

హైమ—అమ్మయ్యో! మానాన్నగారికి తెలిస్తే అమ్మకీ అక్కయ్యకీ తెలిసిందన్నమాటే. ఇహ నెప్పుడో అయ్యేపని రేపే అవుతుంది.



రామ—నాకో ఉపాయం తోస్తూఉంది. అది నీకు నచ్చుతుందో నచ్చదో.

హైమ—ఏమిటో చెప్పండి.

రామ—కోపం తెచ్చుకోకు... నువ్వింకా చిన్నపిల్లవి. ఇంతలోనే నీకో గొప్పదురదృష్టం వచ్చింది. నువ్వు మళ్ళీ ఎందుకు పెళ్ళిచేసుకోరాదూ?

హైమ—అది చాలా నీచమైనపని కాదండీ. మనశాస్త్రాలన్నీ భర్తతోటిదే లోకమని ఘోషిస్తూ ఉన్నాయి కాదా, మళ్ళీ పెళ్ళి చేసుకోవడం తప్పుగాదూ?

రామ—రెండుపక్షాలూ ఉన్నాయి. తప్పనేవాళ్ళూ ఉన్నారు. ఒప్పనేవాళ్ళు ఉన్నారు. ఇదివఱకు పునర్వివాహాలు బాగా జరిగేయి. ఆదంపతులూ సుఖంగా ఉన్నారు. నువ్వెందుకు చేసుకోకూడదో నా కర్థం కాలేదు.

హైమ—మనమంత విరుద్ధంగా చెయ్యొచ్చునా?

రామ—మనమతంలో కేశఖండనము జరగవలెనని ఉన్నదా ఏమిటి?

హైమ—లేకపోతే వితంతువులు ఎందుకావని చేయించుకుంటున్నారు?

రామ—అది లోకసామాన్యమైపోయింది.

హైమ—లోకాన్ని మనం అతిక్రమించి నడవొచ్చునా? లోకమంతా మన్ని వెలివెయ్యరా?

రామ—అవును. వెలివేస్తారు. వెలేస్తే నీకేంతక్కువ? ఇప్పు

డుమ్మట్టుకు ఒకరింటికి పోతున్నావా? ఒకరిమొహం చూస్తున్నావా? ఒకరిళ్ళకు వెళితేనే నీకు జరుగుతుందా?

హైమ—కన్నవాళ్ళకు పెంచినవాళ్లకు దూరం కానా?

రామ—దగ్గిరుండి నువ్వనుభవించే అనుభవం ఏమిటి? ఆవేశపడేవాళ్ళు ఎవళ్లైనా ఉంటేఉన్నా సానుకూలంగా ఉంటుంది. ఎప్పుడు చూసినా “చిట్టు బుస్సు” అనే అక్కగారున్నా, అక్క ఎంతచెపితే అంతచేసే తల్లిని నీకేం చేస్తారు?

హైమ—లేవలేని మానాన్నగారిని వదలిపెట్టడం కష్టంగా ఉండదూ?

రామ—మీనాన్నగారు రెండేళ్ళబట్టీ ఈరోగంతో బాధపడుతున్నారు. ఇంకెంతకాలమో ఆయన బతకడం. ఆతరువాత నిన్ను చూసే దిక్కెవ్వరూ ఉండరు. సరిపడని అక్కమోచేతిగంజి త్రాగుతూ పడుండాలి. నువ్వు బాగా ఆలోచించుకొని, ములగకొమ్మని వదలిపెట్టి చింతకొమ్మను పట్టుకోడం మంచిది.

హైమ—స్త్రీపునర్వివాహం శాస్త్రసమ్మతమేనా?

రామ—అవునని అనేకులు వాదిస్తారు. కలియుగానికంతటికీ పరాశరస్మృతి ప్రధానమట. దానిలో శ్లోకం ఏంచెప్పాడంటే—

“నష్టేమృతే ప్రవ్రజితే క్లీబేచ”

దీనికి అర్థం ఏమిటంటే—

ఇప్పుడు లోకంలో జరిగే అన్యాయం చూడు. తొంభైఏళ్ళ ముసలిముండాకొడుక్కి ఎనిమిదేళ్ళపిల్ల నిచ్చి పెళ్లిచేస్తారు. నాలుగూ, ఐదూ పెళ్లిళ్లు చేసుకున్నవాళ్ళను ఎరుగుదును. ఆడవాళ్లుమాత్రం ఎందుకు చేసుకోకూడదూ?

హైమ—ఇంట్లో పిల్లలను పెంచేది ఆడది. ఆడదానికి పిల్లలు



పుట్టాక ఇంకొకణ్ణి పెళ్లిచేసుకోడం ఆపిల్లలకు భంగకరం. మాబావ చెప్పేవాడు. కాపర్‌ఫీల్డు అని ఇంగ్లీషులో ఒక నవల ఉందిట. అందులో తల్లి రెండోపెళ్లి చేసుకుంటే పిల్లాడు పడ్డకష్టాలన్నీ మాబావ కథ చెప్పేవాడు.

రామ—నువ్వు మొగుడంటే ఏమిటో ఎరగవైతివి. అటువంటప్పుడు మీబావ చెప్పినకథ నీకెలా వర్తిస్తుంది?

హైమ—నాకు వర్తించడం కాదు. సంగతి చెప్పాను.

రామ—అర్థమైంది. పిల్లలు లేక పడుచుతనంలో ఉన్నవాళ్లు పునర్వివాహం చేసుకోడం బాగుంటుంది. ఒకళ్ళిద్దరు పుట్టాక చేసుకోడం బాగుండదు.

హైమ—పెళ్లిచేసుకోడానికి ఒప్పుకుంటా ననుకోండి. రెండు చిక్కులున్నాయి. మొదటిదేమో మానాన్నగారి ఒప్పుదల. అది లేకపోతే ప్రాణంపోయినా నేను ఇల్లు వదలను.

రామ—ఆపని నాది. ఆభారం నామీద వదలిపెట్టు. మీనాన్నగారిని నేను ఒప్పుకొనేలా చేస్తాను.

హైమ—రెండోది. ఇదివర కెప్పుడూ ఎవరితోనూ చెప్పలేదు. ఇప్పుడే మీతో చెపుతున్నాను. నేను చేసుకుంటే మాబావనే చేసుకోవాలి. ఇంకెవర్నీ చేసుకోను. అనుచు నామె తలవంచుకొనియెను.

రామ—రెండోపెళ్ళిపిల్లను చేసుకోడం ఇష్టం లేకపోవచ్చును. మీఅత్తకీ, మామకీ ఇష్టం లేకపోవచ్చును. వాళ్ళచేతికింద ఉండవలసిన మీబావ సాహసించి ఏకార్యమూ చెయ్యడానికి అవకాశం ఉండకపోవచ్చును.

హైమ—ఇక్కడికి రమ్మని ఉత్తరం వ్రాసి వచ్చాక అడగకూడదూ?

రామ—అలా అడిగితే బాగానే ఉంటుంది. నువ్వు వ్రాయడంలో ఉంటుంది. ఇక్కడికష్టాలన్నీ చెపుతూ కేశఖండనంమాట వ్రాసి, తరవాత ఏమివ్రాస్తావో వ్రాసి ఎలాగన్నా అతన్ని ఇక్కడికి రప్పించాలి.

హైమ—మీరు నాన్నగారితో మాట్లాడి ఆయన ఒప్పుకొనేలాగు చెయ్యండి. మీకు నమస్కారం చేస్తాను.

రామ—నీకు సాహాయ్యం చెయ్యడమే నాకు చాలు. నేను చేస్తూవున్న కార్యం పుణ్యకార్యం గాని పాపకార్యం గాదు. ఒకరిని చూచి నేను ధడవక్కరలేదు.

ఈసంభాషణ ముగిసినపిదప రామయ్య వేంకటప్పయ్యగారివద్దకేఁగెను. వేంకటప్పయ్యగారిగది చిన్నగది. దానిలో నొకమూల ఇనుపపెట్టె యుండెను. అరుగుపైపుర కిటికీవద్ద మంచము వేయఁబడి యుండెను. ఆమంచముపై వేంకటప్పయ్యగారు పరుండియుండిరి. రామయ్యను చూచుటతోడనే ఆయన గద్గదస్వరముతో,

వేంక—నాపని అయిపోయింది. ఇక నెంతోకాలం బతకను. ఇక ఏడాది బతికితే గొప్ప.

రామ—ఏడాదిలో మీరొక్క ఘనకార్యం చెయ్యాలి.

వేంక—ఏమిటో నారోజు లన్నీ గడిచిపోయాయి.

రామ—మీహైమవతి పడుతూన్నకష్టాలు ఎఱుగుదురా? తెలియదుకాఁబోలు. మీకెలా తెలుస్తుంది పాపం? రామరామ! అటువంటికష్టాలు నే నిదివఱకు చూడలేదు.

వేంక—నాకు తెలుసు. శేషమ్మ చెప్పింది మొన్న. ఇవ్వాళ ఆవీరమ్మ ఏంజేసిం దనుకున్నావు. నాకు మంచంలోనే లఘుశంక అయిందని, కాలుతూ కాలుతూ ఉన్న ఇసుక తెచ్చి—ఇదుగో అప్పుడు ఒంటిగంట. కాలిపోతూ ఉంది ఇసుక చేటలో ఎత్తుకొచ్చి నాకడుపు మీద పోసింది. నాకు తెలుసును. నాయనా వీళ్లు పెట్టేకష్టాలు. ఇప్పుడు పురాణాని కెళ్లారుకాఁబోలు.

రామ—మీఅమ్మాయికి కొద్దిరోజుల్లో జుట్టుతీయించాలని ఆలోచిస్తున్నారు.

వేంక—మొదట దానికి ఇష్టంలేని పెళ్లిచేసి నేనే ఇంతచేశాను. నేనే దానివైధవ్యానికి కారణం.

రామ—మీఅమ్మాయిని ఇక రక్షించే దిక్కెవ్వరు?

వేంక—మాకృష్ణుడే దాన్ని పెళ్లిచేసుకుంటే ఇయ్యాలనిఉంది. ఏమౌతుందో. నాకు శక్తి లేదు. ఆశ్రీరాముడిదయ. నువ్వొక్కడివే నాకు కష్టం చెప్పుకున్నా సుఖం చెప్పుకున్నానూ.

రామ—మీఅమ్మాయి దీనికి ఒప్పుకొనేటట్టు చేస్తాను. మైనరు పిల్లగనక వివాహానికి మీరు అనుజ్ఞ ఇయ్యాలి.

వేంక—నామనఃపూర్వకంగా ఇస్తాను. వ్రాసిపట్టుకురా. ఎలాగో సంతకం చేస్తాను.

రామయ్య వ్రాయవలసిన విధముగ వ్రాసి వేంకటప్పయ్యగారిచేత సంతకముగొని హైమతో నీసంగతి చెప్పి ఇంటికి వెడలిపోయెను. నామెవద్ద నాకాగితమున్నచో నెవరైన దొంగిలింతు రని ఎంచి రామయ్యయే ఆకాగితము నింటికిఁ గొనిపోయి భద్రపఱిచెను.

నాఁటిదినము వీరమ్మ తండ్రిని వేఁడిఇసుకతో కాల్చిన సంగతి ఆమె కప్పుడు రామయ్యమూలమునఁ దెలిసెను. ఆమెకు వీరమ్మపై మఱింత క్రోధము గలిగెను. ఇట్టిస్థితిలో తాను తండ్రిని వదలిపోవుట ఎట్లు? తానుండియే మాత్రము తండ్రి నేమైన రక్షింపఁగలిగెనా? లేదు. తానుచేయవలసిన దొక్కటే మిగిలియుండెను. కృష్ణుని వివా

హామాడి, తనతండ్రిని సుందరమ్మవీరమ్మలబారినుండి తప్పించవలెనని యామె తలంచెను. తానెంత శీఘ్రముగ వివాహము చేసికొనఁగలుగునో, ఎంత శీఘ్రముగ కృష్ణుఁడు సంసారభారమును వహింపఁగలుగునో, అంత శీఘ్రముగ తండ్రి తనబంధములనుండి విముక్తుఁడు గాఁగలఁడని యామె నిశ్చయించెను.

ప్రస్తుతము హైమపునర్వివాహమునకు రామయ్య వేంకటప్పయ్యగారియనుజ్ఞను బడసెను. కాని, తనంతట తానే వేంకటప్పయ్యగారి జిహ్వాగ్రమునుండి యామధురమగు ననుజ్ఞ గైకొనుట తనవిధి యని యామె తలపోసెను. మరల నొకదినము తిరిగినచో ముసలివాని బుద్ధిచాపల్య మెటుల పరిణమించునో ఎవ్వరు చెప్పఁగలరు? నాఁడు బాధను సైరింపజాలక అగచుగఁగనేయొప్పుకొనె నని యామె తలంచెను. అది తనతండ్రి హృదయపూర్వకమగు నుత్తరు వని యామె శంకింపలేదు; కాని, యాయనహృదయము నంతబట్టబయలు చేసికొనుట ఆమె కత్యాశ్చర్యకరముగ నుండెను. ఇదియునుంగాక వీరమ్మకు ప్రతిదినమును పురాణమునకుఁ జనునలవాటులేదు. నాఁడు తండ్రినిపెట్టిన హింపచేఁ గలిగినపాపమును పరిహరించుకొనుట కామె వెడలెనేమో. మరల నెవ్వరును ఇంట నుండకుండుట తటస్థించదు. ఏకాంతముగ నామె వేంకటప్పయ్యగారితో మాటలాడుటకు వేఱుసమయము దొరకుట దుర్ఘటము.

ఇట్లు తలపోసి, యామె వేంకటప్పయ్యగారివద్ద కరిగెను.

వేంక—హైమా, తల్లీ, వచ్చావుా! నేనునీకుచేసిన ద్రోహానికి నన్నెప్పుడైనా క్షమిస్తావా? నామేలు తలుచుకుని నీకీదుఃఖమంతా కల్పించాను.

హైమ—నాన్నగారూ, మీరు చేసిం దేమున్నది?



వేంక—అయ్యో తల్లీ, అంతా నేను చేసిందే. నీకష్టాలకన్నిటికీ నేనే కారణం. ... ఆవేళ పెళ్ళిముందు బావనే చేసుకుంటా నని నాతో అన్నావు జ్ఞాపకం ఉందీ?

హైమ—అవన్నీ ఇప్పు డెందుకునాన్నగారూ, అయిపోయిన దేదో అయిపోయింది.

వేంక—అప్పుడు నామనస్సులో నువ్వనుకున్నలాగే చెయ్యవలె ననుకున్నాను. కాని అయ్యో, వీరమ్మో ఎవరో వచ్చారు చాటింట్లోకి. అంతటితో నీసౌఖ్యాన్ని బోర్లా దోసి 'వల్లకాదుపో' మన్నాను.

హైమ—దానికి మీ రేమీ అనుకోకండి. నాన్నగారూ, జరిగిం దేదో జరిగిపోయింది.

వేంక—అమ్మా, నువ్వు మళ్ళీ వివాహం చేసుకొని ఈముసలివాణ్ణి సంతోషపెట్టరాదూ? తల్లీ.

హైమ—మీరు చెప్పే ప్రతిమాటా నేను తప్పక చేస్తాను. మీసౌఖ్యమే నాకు కావాలి నాన్నగారూ.

వేంక—బావనే చేసుకో అమ్మా. కలిసినసమ్బంధం. అత్తగారూ నిన్ను తల్లికన్నా ఎక్కువగా చూస్తుంది.

హైమవతి తలవంచుకొని చూచుచుండెను. వేంకటప్పయ్యగారాబాలికభావములను గ్రహించెను. "అమ్మా, రామయ్యసలహా తీసుకో. అతను చాలా మంచివాడు నే నిక మాట్లాడలేను. ఆయాసం వస్తూంది."

హైమవతి ఈమాటలను విని బాష్పనయనయయ్యెను. ఇంతలో వీరమ్మసుందరమ్మల యడుగులచప్పుడు విని యామె తనగదిలోనికిఁ బోయెను.

నాఁటిరాత్రి హైమ కృష్ణున కుత్తరము వ్రాయఁబోయెను. కాని యాలోచనలపై నాలోచన లామెను చుట్టుముట్టెను. ఒకపరి కృష్ణుని యింగసౌష్ఠవమునుగూర్చి యాలోచించును. ఆతరువాతినిముషము కృష్ణుఁడు తన్నింకను బ్రేమించుచుండెనా యని సందేహించును. వేఱొక్కక్షణమున పునర్వివాహము చేసికొనుట యొప్పా తప్పా యని మనస్సునందు వాదించుకొననారంభించును. కృష్ణున కిట్టివివాహ మిష్టమగునా యని చింతించుచుఁ గొన్నినిముషములకాలము గడపును. కృష్ణున కుత్తరము వ్రాయవలె నని కాగితము తీయును. ఏమని వ్రాయఁబోవును. మఱల నేమి వ్రాయుటకును దోఁపక చింతిల్లును. తుట్టతుద కామె ధైర్యముతో నొకయుత్తరము వ్రాయనారంభించెను. కాని ఎంతవ్రాయఁబోయినను ఆమెకు ఉత్తరము కుదురలేదు. తుట్టతుద కామె యలసిసొలసి నాఁటికి ఉత్తరము వ్రాయుప్రయత్నము మానుకొనెను. నేఁడు నే నేమియును వ్రాయఁజాలకున్నాను. అలసిపోయినాను. రేపు వ్రాయవలయునని యామె దృఢముగ నిశ్చయించి పండుకొని గాఢముగ నిద్రించెను.

---

## పదునాలుగవప్రకరణము.

---

హైమవతిపైఁ దనకోపము నంతను చూపుటకు వీలయిన దని వీరమ్మ సంతసించుచుండెను. ఆమె శిరోజములను దెగనఱకుటకుఁ బన్నిన కుట్ర వైశాఖమాసములో ఫలవంతముగా నున్న దని వీరమ్మ యువ్విళ్లూరుచుండెను. వైశాఖమాసమువఱకును ఆమెను ఏలూరు



దాఁటకుండ నుంచవలెను. అదివఱకు కాకినాడకును, రాజమహేంద్రివరమునకును బోయినట్లే పోయినచో హైమవతికి కేశఖండన మొనరించుటకు వీలుండదు. కావున నామె నిటునటుఁ గదలనీయకుండ నుంచవలె నని వీరమ్మ తలపోసెను. రాజమహేంద్రవరమును మించిన క్షౌరము వీరమ్మబుద్ధికుశలతవలన ఏలూరులోఁ గల్పింపఁబడెను.

వీరమ్మకు హైమవతిపై క్రోధము హెచ్చుటకు, మొన్న వారిరువురును మాటలాడినపుడు హైమవతి యుపయోగించిన చివరవాక్యము కారణ మని చదువరు లెఱింగియే యున్నారు. ఒకరిని నీచముగను, జంతువులవలెఁ జూచు మనుజులు, వారి నింకెవ్వరైన నాప్రకారముగనే చూచినచో నోర్వఁజాలరు. ఇతరులవిషయమై వారంతగఁ జింతింపరు. తా మొక్కరే ప్రపంచకమునందలిసుఖముల నన్నింటి ననుభవించుటకుఁ బుట్టితి మని భావింతురు. ధనమును శక్తియు నట్టిమనుజుని చేతియం దుండెనేని యాతని చేతిక్రిందివారి సుఖముమాట వేఱుగఁ జెప్పనక్కఱలేదు. వీరమ్మకో కావలసినంత 'శక్తి' కలదు. అది దేహశక్తి కాదు, ఉపాయశక్తి కాదు; కాని, అది నిశ్చయముగ సుందరమ్మను తనపలుకులతో సరిగ తాళమువేయునట్లుచేసినశక్తి, హైమవతిని క్రూరముగఁ జూచుచున్న శక్తి, వేంకటప్పయ్యగారి కీప్రపంచకముననే నరకమును గల్పించిన శక్తి—ఏమైననేమి? ఈశక్తి శక్తి కాదా? ఈశక్తి కెదురుగ నెవ్వరు నిలువఁగలిగిరి? వీరమ్మయనుకొన్న దాని కింతవఱ కెవ్వ రడ్డము కల్పింపఁగలిగిరి? ఈశక్తి యొకరిచే గుర్తింపఁబడుశక్తి కాదు. అనుభవించి తెలిసికొను శక్తి. హైమవతి ఈప్రబలశక్తిని గుర్తింపలేదు. రామయ్యయును గుర్తింపలేదు. అందువలననే వీరమ్మ యభిప్రాయములకు వ్యతిరేకముగ హైమవతి తలదువ్వుకొన నారంభించెను. అందువలననే రామయ్య హైమవతికి సాహాయ్యము చేయుచుం

డెను. రామయ్య యిట్లు చేయుచున్నాఁడని వీరమ్మకుఁ దెలిసియుండెనో లేదో, రామయ్యకు 'సాపురావు' ప్రాప్త మయ్యెడిదే. ఈశక్తి నే గుర్తించి యున్నదో హైమవతి వీరమ్మయెడలఁ జైఁజెప్పఁబడినట్లు ప్రవర్తించెడి దికాదు. హైమవతి నొకవిధముగు ఖైదునం దుంచుట కిది యొక కారణము.

వీరమ్మ యింతటితో తృప్తి నొందలేదు. హైమవతిపై లేనిపోని యుపవాదములను కల్పించి యామెను చూచినవా రందఱును 'ఛీఛీఛీ' యనునట్లొనర్పవలె నని వీరమ్మ నిశ్చయించెను. నాఁటినుండియు హైమవతి దొంగతనము చేయుచున్న దనియు, ఇంటిలోని వస్తువు లమ్ముచున్న దనియు, పెద్దతోఁటలోని పండ్లను అమ్మి ధనము సంపా దించుచున్న దనియు నపవాదములను గల్పింప నారంభించెను.

సుందరమ్మ యీయపవాదములందు గొంత నిజముండు నని నమ్మెను. ఈదుర్బుద్ధులు కాకినాడయందు నేర్చికొని యుండవలె నని వీరమ్మ సుందరమ్మతో ననెను. సర్పవరపువారిని గూర్చి ఏచెడువార్త యైనను నిజమా యబద్ధమా యని సంకోచింపక నమ్మ సుందరమ్మ కది నిశ్చయమే యని తోఁచెను. ఇట్టి యనుమానముల ఫలితముగ హైమవతి నింక నెప్పుడును కాకినాడకుఁ బంపఁగూడ దని వీరమ్మ సుందరమ్మలు నిశ్చయించిరి. ఆమె తనగది వీడి ఇటునటు తిరుగకూడ దని వారిరువురును తీర్మానము నుపపాదించిరి. వీరమ్మ దృష్టిలో రెండవది ముఖ్యమైనదిగఁ గనఁబడెను. సుందరమ్మకు మొదటితీర్మానము ముఖ్యముగఁ గనఁబడెను.

ఈయపవాదములను నమ్మనివారు లేకపోలేదు. సర్పవరపువారి వేంకటప్పయ్యగారి కెక్కువ మమత యుండెను. హైమవతి సుగుణవతి యని యాయన దృఢముగ నమ్మియుండెను. ఆమె వితంతు



వగుటవలన నామెయెడల కరుణ చూపవలె నని యాయన మతము. అదియునుగాక వీరమ్మ తనయెడ క్రూరముగఁ బ్రవర్తించియుండుటచే నామె కల్పించిన యీయపవాదము నీలాపనింద యనియే యాయన భావించెను. రామయ్యకూడ వేంకటప్పయ్యగారి విధముననే తలంచి హైమను మునుపటికన్న నెక్కుడు దయతోఁ బ్రవర్తించుచుండెను.

ఇంతటితోఁ బోనీయక యామె ఇట్టిచెడ్డపనులను చేయుచున్న దని వీరమ్మ కామరాజుతోఁ జెప్పెను. ఇరుగుపొరుగువారితో చెప్పెను. తనకుఁ గనఁబడిన ప్రతిస్త్రీతోడను పురుషునితోడను హైమవతి చెడ్డతనమును గూర్చియే వీరమ్మ యుపన్యసింప మొదలుపెట్టెను.

అందఱితోడను చెప్పుటయే గాక, తమబంధువులకు ఆమెపై నేరము లారోపించి యుత్తరము వ్రాయ మొదలిడెను. తల్లికిం దెలిసినచో నిందల కంగీకరింప దని తెలిసిన దగుటచే తల్లితో నాలోచింపకుండ రాజమహేంద్రవరమునందలి కామేశ్వరరావునకును, కాకినాడ యందలి శేషమ్మకును ఉత్తరములు వ్రాసెను. సర్పవరపువారు వీరమ్మ హైమవతిని బెట్టిన కష్టములగూర్చి తెలిసికొని యుండుటచేతను రెండు మూఁడునెల లాగుణవతివర్తనమును చూచినవా రగుటచేతను ఈ యుత్తరమునందలి విషయములను వారు నమ్మలేదు. కామేశ్వరరావు గారి కుటుంబముమాత్రము వీరమ్మయుత్తరమునం దేమైన సత్యముండ వచ్చు నని యూహించిరి. వీరమ్మకుమాత్ర మెవ్వరును జవాబు వ్రాయలేదు.

ఇంక నెవ్వరి కుత్తరములను వ్రాయుదు నని వీరమ్మ యాలోచింపసాగెను. నూచారపు నరసయ్యగారికి హైమవతియొక్క దుష్ప్రవర్తనమునుగూర్చి యుత్తరము వ్రాయవలె నని యెంచెను. వెంటనే యామె కొక యాలోచన తట్టెను. హైమవతి దొంగ యని వ్రాయు

టకన్న అంకులాఁడి యని మాచారపువారికి వ్రాయుట యామె కె
క్కువ యుపయుక్తముగఁ గనఁబడెను. ఆయుపయోగ మెట్టిదో యా
మె విచారింపఁ దలఁచుకొనలేదు. హైమవతిపైఁ గొండెములు కల్పిం
చి ప్రపంచకము నమ్మునట్లు చేయుటయే యామెయుద్దేశ్యమై యుండె
ను. కాని అంత పెద్దనేర మామానవతిపై మోపుటకు, ధైర్యముగల
వీరమ్మకూడ సాహసింపఁజాలక పోయెను. కాని, మాచారపు నరసయ్య
గారి కిట్టియుత్తరము వ్రాయుటకునిశ్చయించుకొని యుండుటచే హైమ
వతి నేవిధముగనైన తాను కల్పింపఁదలఁచినంత నీచస్వభావనుగఁ జే
యవలె ననుకౌతూహలము వీరమ్మహృదయము నావరించెను. ఆమె
నీవిధమున దుష్ప్రవర్తన గలదానిగఁ జేసినచో నామెపై తనకసి తీరు
టయే గాక, లోకమంతయుఁగూడ తనమాటలను నమ్మునని యామె
తలంచెను. వీరమ్మ ఏరాక్షసాంశమునఁ బుట్టినదో యని మనము
విచారింపఁబనిలేదు. ఇట్లాలోచించి నరసయ్యగారికి వ్రాయ నుద్దేశించి
న యుత్తరమును వ్రాయక హైమవతియొక్క నడతను బాడుచేయు
నుపాయము నామె వెదకఁదొడంగెను.

యథాప్రకారముగ చిన్నతోఁటలో నాఁటిసాయంకాలము
వీరమ్మయు, కామరాజును, కలిసికొనిరి. చిన్నతోఁటవైపున నున్న
హైమవతి గదితలుపు చాలకాలమునుండియు మూసియే యుంచఁబ
డుట వాడుకయై యుండెను. చాలకాలముక్రిందటనే ఆద్వారమునకు
చిన్నదొడ్డివైపునఁ దాళమువైచి యుంచెను. సుందరమ్మ ఏవంటపని
మీఁదనో గృహమునకుఁ దూర్పువైపున నుండెను. ఇఁక వీరమ్మకు
విచ్చలవిడి కాక మఱేమి? వీరమ్మ కామరాజు లెన్నియేండ్లనుండియో
యిట్లు విచ్చలవిడిగఁ గాలము గడపుచుండిరి.

నాఁటిదినము వీరమ్మ తనయుద్దేశ్యములను కామరాజున కెఱిం



గించెను. హైమ నెట్లైన చెడునడత గలదానినిగఁ జేయవలయు నని
కామరాజును వీరమ్మ కోరెను. దుష్ప్రవర్తనగల కామరా జందులకు
వెంటనే యియ్యకొనెను. మఱునాఁటిదినమున సుందరమ్మ పురాణము
నకుఁ బోయినపుడు వీరమ్మ యుద్దేశ్యముప్రకారము జరుపుటకు ఏర్పా
టు చేయుదు నని కామరాజు వీరమ్మకుఁ దెలిపెను. వీరమ్మకామరా
జుల సంతోషమునకు నాఁడు మేరయే లేదు.

దుష్ప్రవర్తన కలవారు చాలవఱకు రహస్యములను దాఁచలే
రు. తాము చేయఁబోవు తుచ్ఛములగు "ఘనకార్యము"లను గూర్చి
తెగవాగుచుండుట వారికి వాడుక. దుష్ప్రవర్తకు లగువారికి ఆలో
చన సాధారణముగ మట్టుగ నుండును. బుద్ధికుశలతయుఁ జాఱుకుఁదన
ము వారికి సున్న. వారిమెదడునందు బ్రహ్మదేవుఁడు బురద పెట్టియుం
డును గాని, ఇంత నేయితరపదార్థమును పెట్టియుండఁడు. కామరా
జీతరగతికిఁ జెందినవాఁ డని వేఱుగఁ జెప్పనక్కఱలేదు.

మఱునాఁటియుదయమున కామరాజు రామయ్యను బజారులో
కలసికొనెను. "రామయ్యా! ఒక్కగుండుతో రెండుపిట్టలనుకొట్టాను"
అనెను.

రామయ్యకిదియర్థముకాలేదు. "ఒకగుండేమిటి? రెండుపిట్ట
లేమిటి? నాకర్థం కాలేదు" అని ఆశ్చర్యమగ్నమానసుఁడై రామయ్య
యడిగెను.

"అంతే దానితత్త్వం. అంతాచెపితే మజా ఏముంది?" అని
కామరాజు ఏలూరుబజా రంతయు మాఱుమ్రోఁగునట్లు నవ్వెను.

కామరాజు ప్రవర్తనవిషయమై రామయ్య కంతయును సవిస్తర
ముగఁ దెలియును. కావున నేదైన గొంచెము మాటతీయవలయు నని
రామయ్య యోచించెను.

రామ—ఎక్కడ పట్టుకున్నావు, రెండుపిట్టల్ని?

కామ—పంతులుగారిచిన్నదొడ్లో.

రామ—ఏపంతులుగారు?

కామ—అంతా చెపితే నీతెలివేముంది? మొగాడివైతే కనుక్కో.

రామ—రెండుపిట్టలను జేబులో వేసుకున్నావుగదా?

కామ—ఒకటిదివఱకే పడ్డది. ఇవ్వాళ సాయంత్రము ఇంకొకటి పడితీఱుతుంది. ఇక పోతానోయ్. కూరలుకొనుక్కోవాలి. పళ్లూ ఫలాను తీసికెడితేగాని పిట్ట లొంగదు.

రామయ్య యీమాటలయర్థము సంతను గ్రహించెను. నాఁటి దిన మంతయు సాగంటివారియింటనే యుండవలెనని తీర్మానించుకొనెను. హైమవతికి రానున్న యాపదనుగూర్చి యాతఁ డాలోచించుచుండెను. ఆముగ్ధ నూరక ముందుగనే భయపెట్టు టాతని కిష్టములేదు. కామరాజును వీథిలోనే ఆఁపివేయవలయు నని యాతఁడు తలంచెను. కావున వీథివాకిలిని దానికి పడమరగ నున్న దక్షిణపువాకిలిని కనిపెట్టి చూచుచు రామయ్య పచారిచేయు చుండెను.

సాయంకాలము మూఁడున్నరకు కామరాజును రామయ్య దూరమునఁ జూచెను. కామరాజే యని బాగుగ గుర్తించినవెనుక రామయ్య యాతని కెదురుగఁ బోయెను. "ఏమోయ్, కామరాజూ, ఎవరికీ పళ్లూ ఫలాలూను?"

కామరాజు నిర్ఘాంతపోయెను. ఇంట వీరమ్మ హైమవతులు తప్ప నెవ్వరు నుండ రని యాతఁడు తలంచెను. ఇప్పుడు రామయ్య యచ్చట నుండెను. తా ననుకొన్న ప్లేనియును జరుగలేదు. కామరాజునకు నులయం దాశాభంగము కనఁబడుచుండెను. ఇంకను నట్లే యుండి విచ్చితో ముందువెనుకలు చూడక రామయ్యను చావమోదెదువాఁ



డేమో యని చూపరులకు సందియము గలుఁగకమానదు.

రామయ్య ఈవిషయమును గుర్తించెను. "కామరాజూ! నువ్వు నాకొక ఉపకారం చెయ్యాలి. ఇప్పుడు నువ్వు నాఅదృష్టంవల్ల కనబడ్డావు. రా. చావిట్లోకి వెడదాం. ఎక్కడికీ తొందరగా వెళ్ళడం లేదుగదా?"

కామరాజు చేయున దేమియును లేకపోయెను. తొందరపనిమీఁదఁ బోవుచుంటి నని చెప్పి తా నెట కేఁగును? రామయ్య ఆగంటివారి యింటిముందునుండి కదలున ట్లగపడలేదు. రామయ్యతో నప్పుడు వైరము పెట్టుకొనిమాత్రము లాభ మేమున్న దని కామరాజాలోచించెను. "ఎక్కడికీ వెళ్లడంలేదు. బజారునుంచి మాయింటికి వెడుతున్నాను. నాతో మాట్లాడవలసిన విషయ మంతముఖ్యమైనదా ఏమిటి?" అనెను.

రామ—కొద్దిగా ముఖ్యమైందే. చావిట్లోకి వస్తావా? అక్కడ సావకాశంగా మాట్లాడుకోడానికి వీలవుతుంది.

కామ—అలాగే వెడదాం పద.

ఇరువురును చావడిలోనికిఁ జేరిరి. "నేను ఐదారురోజులదాకా వేంకటప్పయ్యగారిని రాత్రింబగళ్ళు కనిపెట్టుకొని ఉండాలి. ఆయనకు నిన్నటినించీ జబ్బు ఎక్కువగా ఉంది. ఈయిల్లొదిలిపెట్టి ఎక్కడికీ కదలను. వీళ్ళింట్లోనే నాభోజనముకూడా ఏర్పాటు చేశారు." అని రామయ్య చెప్పెను.

కామరాజు మఱింత యాశాభంగమునకు లోనయ్యెను. ఐదాఱురోజులవఱకు తనకోర్కె పని సాగకపోవుటయే గాక వీరమ్మను కలిసికొనుటకుఁగూడ వీలులేకుండ వచ్చె నని కామరాజు లోలోన దుఃఖింపనారంభించెను. "అయితే, నన్నేం జెయ్యమంటావు?" అనియెను.

రామ—ఏమీలేదు. బెజవాడలో నందికొండ రంగయ్యగారని ఒకఘనవైద్యుఁ డున్నాఁడు. అతన్ని ఇక్కడికి నువ్వు తీసుకురావాలి. నీఖర్చులకు ఇదిగో పదిరూపాయలు. రేపుసాయంత్రం బయలుదేరి వెళ్ళు. ఇప్పుడే అక్కడ గోగులూరి శంకరయ్యకు ఉత్తరం వ్రాసి రైలుస్టేషనులో వెయ్యమని మాఅబ్బాయితో చెపుతాను. శంకరయ్య నిన్ను రైలుదగ్గిర కలుసుకొని వాళ్లింటికి తీసికెళ్లి నిన్ను రంగయ్య ఎక్కడున్నాడో అక్కడికి తీసికెడతాడు.

కామ—అంతకాడికి శంకరయ్యే వెళ్ళరాదూ ?

రామ—అదికాదు, కామరాజూ ! మనపని మనం చేసుకున్నట్టు చెయ్యడానికి వాళ్ళకేం బట్టింది చెప్పూ. నువ్వంటే సొంతపనికన్నా ఎక్కువగా ఈపని చేస్తావని నాకు తెలుసును. అందుకని నిన్ను బతిమాలుకొన్నాను. వెంకటప్పయ్యగారి ప్రాణం నువ్వొక్కడివే నిలబెట్టగలవాడివి. ఇంతకంటే నే నెక్కువ చెప్పదలచుకోలేదు.

ఇంతచక్కఁగా పొగడఁబడుటచేత కామరాజు మఱునాఁడు బెజవాడకుఁ బోవుటకు సమ్మతించెను. రామయ్య ఆతనిచేత నాపని చేయించుటకు పదిరూపాయల నప్పుడే ఇచ్చెను. కామరాజిఁక చేయునదిలేక ఇంటికిఁ బోయెను.

వీరమ్మ చిన్నతోఁటలో కామరాజుకొఱకు నిరీక్షించుచుండెను. ఎంతసేపటికిని కామరాజు రాలేదు. సుందరమ్మ పురాణమువిని వచ్చు [illegible]చ్చి, ఇఁక లాభములే దనుకొని వీరమ్మ చావడిలోనికి వచ్చెను. అప్పటి కిప్పుడే కామరాజు ఇంటికి వెడలిపోయెను. వీరమ్మకు కారణము గోచరము కాలేదు. నాఁటిరాత్రి యంతయు వీరమ్మ కామరాజులు దుస్సహమగు విరహవేదన ననుభవించిరి.

తెల్లవాఱెను. కాని కామరాజునుగుఱించి వీరమ్మ కేమియును



దెలియలేదు. రామయ్యమాత్రము వేంకటప్పయ్యగారికి జబ్బుఎక్కువగనున్న దను మిషమీఁద క్రిందటిరాత్రి యక్కడనే భుజించి పండుకొనెను. ఆనాఁటి సాయంకాలముకూడ వీరమ్మ నిరీక్షణ ఫలహీనమైపోయెను. కామరాజు నాఁటిసాయంకాలము బెజవాడకు బయలుదేఱెను. రామయ్య సంతసించెను. వీరమ్మ కేమియును దెలియదు.

గోగులూరి శంకరయ్య కామరాజును స్టేషనువద్ద కలిసికొనెను. నాఁటి మధ్యాహ్న మాతనికి రామయ్య వ్రాసిన యుత్తర మందియుండెను. అందు కామరాజు దుష్టస్వభావమును, ఆతఁ డొకయువతి నపహరింపఁ బన్నిన పన్నుగడయుఁ దెలుపఁబడెను. ఆయువతిని రక్షించుటకుఁగాను కామరాజును లేనిపోనిమిషమీఁద బెజవాడ పంపఁబడె ననియు, నాతని నచ్చట నాలుగైదుదినము లెట్లయిన నాఁపినచో ఆయువతిని రక్షించుటకు వీలగు ననియు రామయ్య వ్రాసెను. తనప్రాణస్నేహితుఁ డగు రామయ్యకు సాహాయ్యము చేయవలెనని శంకరయ్య నిశ్చయించి కామరాజును తనయింటికిఁ దీసికొనిపోయి భోజనముపెట్టి నాఁటిరాత్రి తనయింటనే పండుకొనున ట్లేర్పాటులు చేసెను.

మఱునాఁడు రంగయ్యగారికొఱకు బెజవాడ యంతయు వారు తిరిగిరి. కాని ఆవైద్యుని నెఱింగినవా రెవ్వరును లేరు. కామరాజున కిది యంతయు తనపైఁ బన్నిన కుట్రవలెఁ గనఁబడుచుండెను. రామయ్య తన్ను తెలివితక్కువవానిఁ జేసి యాడించినాఁ డని యాతఁడు తెలిసికొనియెను. పూటకూటియింట భోజనము చేసి మరల మఱునాఁ డుదయము దర్శనము చేసెద నని శంకరయ్యగారివద్ద సెలవు తీసికొని ఆనాఁటిమధ్యాహ్నమే బండి నెక్కి కామరాజు ఏలూరు చేరెను.

ఏలూరునందు రామయ్యయు, కామరాజు రాకుండ శంకరయ్య జాగ్రత్త పుచ్చుకొను నని తలంచెను. అదియునుగాక కామరాజు

తాను పన్నినకుట్రను భేదింపఁజాలఁడని రామయ్య తలంచెను. ఐదా ఱుదినములవఱకును ఆగంటివారింటనే యుందునని తాను చెప్పియుం డుటచేనైదాఱుదినములవఱకును కామరాజు ఆగంటివారి యింటిచా యను రాఁడనుకొనెను. ఈనమ్మకముతో రామయ్య మధ్యాహ్నము రెండుగంటలకే ఆగంటివారి యింటినుండి వెడలిపోయెను.

నాలుగుగంటలకు పవరుపేటస్టేషనులో కామరాజు రైలు దిగి ఇంటికైనను బోక ఆగంటివారింటికి వచ్చెను. వచ్చుటతోడనే చావ డిలో ప్రవేశించెను. వీరమ్మ అచ్చట నిలుచుండెను. కామరా జామె ను చూచుటతోడనే కౌఁగిలించుకొని, యాలింగనానంతరమున తనపై రామయ్య పన్నిన కుట్రనుగూర్చి తేటతెల్లముగఁ జెప్పెను. వీరమ్మ ముక్కుపై వ్రేలిడుకొనెను.

కాలము చాలదు. సుందరమ్మ ఐదున్నరకు ఇంటికి వచ్చును. ఈలోపుగ వారదివఱ కనుకొనిన పని ముగింపవలెను. వీరమ్మయు కా మరాజును హైమగదివద్దకుఁ బోయిరి. వీరమ్మ మెల్లఁగ తలుపు తట్టి “హైమా! హైమా!” అని పిలిచెను. ఆమె తలుపు తెఱచెను. కామరాజు లోనఁ బ్రవేశించెను.

కామరాజును జూచుటతోడనే హైమకుఁ బైప్రాణములు పైకే పోయెను. “అమ్మయ్యో!” అని యొక్కయఱ పఱచెను.

కామరా జామెతో నిట్లనెను. “హైమా! పిచ్చిదానిలాగ భయపడఁబోకు. నేను నిన్ను రక్షించడాని కొచ్చాను గాని మరేమీ కాదు. ఈవీరమ్మ పెట్టే బాధలు చూసి జాలిపడి నేను నీదగ్గిరికి వ చ్చాను.” అనుచు నాతఁ డామెపైఁ జేయి వేయఁబోయెను.

హైమ వెనుకకుఁ దగ్గెను. ద్వారమున కడ్డముగ వీరమ్మ నిలు చుండెను. తనకు దగ్గఱఁగ కామరాజు నిలువఁబడెను. రక్షించువా రెవ్వరును లేరు. “అయ్యా! నువ్వెవరివో నాకుఁ దెలియదు. న న్నేమి చెయ్య మనడానికి వచ్చావో చెప్పు.”

కామ—ఏమీ లేదు. నాతో ఆచిన్నతోఁటలోకి రమ్మని పిల వడానికి వచ్చాను.

ఆమె మాటలాడలేదు. అచ్చట నున్న తనగదితాళమును దీసి కొని యామె దానివంక చూచుచుండెను.

కామ—హైమా! ఆలస్యం చెయ్యడానికి వీలులేదు. తరువా త నీయిష్టము. నీమేలుకోరి నేను వచ్చాను.

హైమవతి నలువంకలను చూచెను. ఆమె తూర్పువైపు ముఖ గమై యుండెను. ఆమె కెదురుగ వీరమ్మ రెండుచేతులను ద్వారమున కడ్డము పెట్టి నిలువఁబడియుండెను. ఆమెకు ఎడమవైపున కిటికీకి దగ్గ ర కామరాజు నిలువఁబడియుండెను. తన్ను రక్షించుకొనుటకు హైమకు నొక్కటే యుపాయము కనఁబడెను. అంతక్రూరమైన పనిచేయుట కామె సాహసింపఁజాలకుండెను. తాళమును వీరమ్మముఖముపై నొ క్కవిసురున విసిరికొట్టి తప్పించుకొని బైటపడవలెనని హైమవతి తలంచెను. కాని, సహజముగా క్రూరస్వభావములేనివారు ఆపత్సమ యములందుఁగూడ క్రూరముగ నుండఁజాలరు. అందు స్త్రీలవిషయ మున నీవాక్యము తప్పక వర్తించును.

హైమవతి యుద్దేశమును కామరాజు కనిపెట్టినట్లుండెను. హై మ చేతిలోనుండి యొక్కవిసురున తాళము నాతఁడు లాగివైచెను. హైమ “రక్షింపుఁడు, రక్షింపుఁ” డని ఎలుఁగెత్తి యఱచెను.

ఆయఱపు లప్పుడే ఇంటిలోనికి వచ్చిన సుందరమ్మకు వినఁబడె ను. సుందరమ్మ పరుగెత్తికొని హైమగదివైపునకు వచ్చెను. ఆయఱపు గులచప్పుడు విని అందఱును సుందరమ్మవంకఁ జూచిరి. ఆకొంపడిలో

హైమవతి గదినుండి తప్పించుకొని సుందరమ్మను కౌఁగిలించుకొనెను. "అమ్మా నువ్వు రాకపోతే ఇవ్వాళ నా మానప్రాణాలు బుగ్గిఅయేవే" అని హైమవతి ఎలుఁగెత్తి ఏడ్చెను.

హైమవతి అఱపులు విని ఇరుగుపొరుగువారు కొందఱు పరుగెత్తికొని వచ్చిరి. కామరాజు మెల్లఁగ బైటకుఁ దాఁటెను. ఆగంటివారు మర్యాదగ బ్రతికినవా రగుటచేత నీసంగతిని సుందరమ్మ ఎవ్వరికిని జెప్పలేదు. పాము వచ్చినదనియు, దానిని చూచి హైమ యఱచె ననియు చెప్పిన సుందరమ్మమాటలను నమ్మి వచ్చినవారు ఇల్లంతయుఁ గాలించి పా మెక్కడను కనఁబడలే దని ఎవరిఇండ్లకు వారేఁగిరి.

మఱునాఁడు రామయ్య కీవార్త హైమవతియే చెప్పెను. ఈయుదంతము నంతయును కప్పిపుచ్చిరి. కాని రామయ్యహృదయముమాత్రము మండిపోవుచుండెను. నాఁటినుండియు హైమవతినిగూర్చి విచారించుచు ఆగంటివారిఇంటనే రామయ్య నివసింపఁదొడఁగెను. భోజనమునకుమాత్రము ఇంటికిఁ బోయివచ్చుచుండెను.

కామరాజు సిగ్గుచే తలవంచుకొని ఏలూరువిడిచి కొలనుకొండలో నెవ్వరో బంధువుల ఇంటికిం జని తలఁ దాఁచుకొనెను. రామయ్య వీరమ్మను ఏమియు ననలేదు. ఏమైన నన్నచో వీరమ్మ మరల ప్రత్యుత్తర మిచ్చెడిదే. హైమతోఁగూడ వీరమ్మతో నావిషయమునుగూర్చి ముచ్చటింప వద్దని రామయ్య చెప్పెను. సుందరమ్మమాత్రము మాట్లాడకుండలేదు. మౌనముగ నున్నవారిని చూచినచో వారి మనోభిప్రాయములను దెలిసికొనఁజాలక వారిని చూచినవారు భయపడుచుందురు. సుందరమ్మవలె "ఇది చేసితివి. అది చేసితివి" అనువారలచెవులకు వీరమ్మవంటివారు పిడుకలు కట్టుదురు. సుందరమ్మ వీరమ్మ నీప్రకారముగ నడిగెను.



సుంద — ఈగోలకు నీవేనా కారకురాలవు?

వీర — తెలిసి అడుగుతావా? తెలియక అడుగుతావా? నే నిలాంటిపనులు ఎప్పుడైనా ఎరుగుదునా? హైమ ఏమిటో అరుస్తూ ఉంటే నేను నువ్వువచ్చేముందే వచ్చాను.

సుం — నువ్వే వాణ్ణి తీసుకొచ్చావేమో!

వీర — వెధవ అబద్ధాలు ఆడమంటేఆడతావు. వాఁడెవడో నే నెరగను. వచ్చినాగాని, నేను దానిదగ్గిరకు తీసికెళ్లడ మేమిటి? ఎవరన్నా నమ్ముతారూ?

సుందరమ్మకు వీరమ్మ చెప్పినది సబబుగ నుండెను. ఒకయువతి వేఱొకయువతి దగ్గర కొకనిని తీసికొనిపోవుట యనువిషయ మంత నమ్మఁదగినది కా దని సుందరమ్మ యభిప్రాయపడెను. వాఁడెవ్వఁడో తనంతట తానే వచ్చియుండు నని సుందరమ్మ నిర్ధారణచేసికొనెను. కాని "ఎక్కడిదొంగ లక్కడే, గప్ చుప్" గోరంతలు కొండంతలు చేసికొని లాభ మేమి?

హైమ ఏమి[illegible] మాటలాడకుండుట వీరమ్మకు భయముగ నుండెను. ఇతరవిషయములందుగూడ హైమవతి ముక్తసరిగ మూఁడుమాటలు చెప్పుచుండెను. హైమను మును పీడించెడు వీరమ్మకు ఇప్పుడు హైమవైపు చూచుటకే జంకుగ నుండెను. మనస్సునందు తాను చేసిన దుష్కార్యము ననుసరించినబాధ యామెను కారియపెట్టుచుండెను.

ఈయుదంతము జరిగిన క్రిందటిదినముననే పోయినప్రకరణమునందు చెప్పఁబడిన యుదంతము జరిగెను. ఈరెండును గలసి హైమను పునర్వివాహప్రయత్నములోనికి దింపెను. క్రిందటిప్రకరణమునందుఁ జెప్పఁబడిన విషయములు జరిగిననాఁటిరాత్రియేగాక, ఈకామరాజు వ్యాపారముజరిగిననాఁటిరాత్రికూడ హైమవతి యుత్తరమును, వ్రాయఁ

జాలకపోయెను. మరునాఁడు వేంకటప్పయ్యగారు మరల హైమను తొందరపెట్టిరి. పునర్వివాహము చేసికొనకున్నచో తనమానమును కాపాడుకొనుట అతికష్టమని యర్థమువచ్చుమాటలనుపయోగించిరి. రామయ్యకూడ నామెను తొందరపెట్టెను. హైమవతి నాఁటిమధ్యాహ్నము తానుపడుచున్నబాధలనన్నింటిని నల్లరాయియయినను కరఁగునట్లొకయుత్తరమును వ్రాసెను. ఆతరువాత నేమివ్రాయవలెనో యామెకుఁ దెలియలేదు. ఏమియును దోఁచక యామె ఇటునటుపచారుచేయుచుండెను. మధ్యాహ్నము మూఁడుగంటలకు రామయ్యకొమారుఁడొకఁ డామెవద్దకు వచ్చి యొకకాగితము నామెకిచ్చెను. అది చూచుకొనఁగా నది వేంకటప్పయ్యగారు హైమకు పునర్వివాహాధికారము నిచ్చుచు వ్రాసినలేఖయై యుండెను. ఈలేఖను రామయ్య ఇప్పుడెందుకు పంపించెనో యామె కర్థముకాలేదు. దీని నుత్తరముతో కృష్ణునకుఁ బంపుటకే నని యామె నిశ్చయించుకొని, సందేహనివారణము చేసికొనుట మంచిదని యాబాలుం గాంచి "ఇది ఎందుకుపంపించారు?" అనియడిగెను.

బాలు—చెన్నాపట్టం పంపించెయ్యమని పంపించారు.

అని యాబాలుఁ డచ్చటనే నిలువఁబడెను. ఆతనిముఖమునం దేదోదుఃఖము—అర్థముకానిదుఃఖము—ప్రతిఫలించుచున్నట్లు హైమకుఁ దోఁచెను. ఆమెగుండె దడదడ కొట్టుకొనసాగెను. ఆమె యాబాలకుని రెండుమూఁడుప్రశ్నలు వైచెను. ఆబాలునిప్రత్యుత్తరములను వినుటతోడనే "హా" అని యరచి యామె నిలువున కొయ్యయై పోయెను. ఇంటిలోనివారందఱును పరుగెత్తికొనివచ్చిరి. గుండెజబ్బువలన రామయ్య రెండుగంటలన్నరకు మరణించెననుదుఃఖవార్త ఆగంటివారిని బహుసంతాపముపాలు చేసెను.



వేంకటప్పయ్యగారిసంతాపమునకు మేరయే లేకుండెను. హైమవతి మాటలాడఁజాలక కొయ్యయై ఎంతసేపునిలుచుండెనో మనకుయుగము. ఆమెముఖ్యస్నేహితులలో ముఖ్యుఁడు మరణించెను. ఇంక ఏలూరునం దామెసౌఖ్యమును జూచువారెవరు? ఆమెకు చిరుతిండ్లు తెచ్చువారెవ్వరు? ఆమెతలదువ్వుకొనుసదుపాయములను చేయువారెవ్వరు? ఏలూరునం దామెకొఱకు పాటుపడిన ఒక్కమనుష్యుఁడును మరణించెను. నాఁటిరాత్రి ఈవిషయమునుగూడ వ్రాసి ఒక్కమాటు ఏలూరు రమ్మని కృష్ణరావును పరిపరివిధములఁ గోరుచు చివరిముక్కలను వ్రాసి చెన్నపట్టనమునకు తమఇంటిప్రక్కనే యున్నపోస్టుస్తంభములో నుత్తరము వైచెను. వేంకటప్పయ్యగారు రామయ్యకుటుంబమునకు వేయిరూపాయల నిచ్చిరి. రామయ్యగారి కిరువురు వివాహితలయినకుమార్తెలును పదునాల్గేండ్లకుమారుఁడొకఁడును ఎనిమిదేండ్లకుమారుఁడొకఁడును ఉండెను. ఆపదునాల్గేండ్లబాలుఁడు ఐదవఫారం చదువుచుండెను. ఇప్పుడతనిపైఁ గుటుంబభారము పడెను. కాని, రామయ్యభార్య తెలివితేటలుకలదగుటచే కుమారునిచదువునకు భంగము కలుగనీయక భర్తయు మామగారును సంపాదించినధనముతోఁ గాలక్షేపము చేయఁదొడఁగెను. అప్పుడప్పుడు ఆగంటివేంకటప్పయ్యగారును సాహాయ్యము చేయుచుండిరి. ఈసంగతు లన్నియు జరుగుచున్నను వీరమ్మ దయవలఁచి యొక్కమంచిగుడ్డయైనను హైమవతికీయలేదు. భూషణహీనయై, ఏకభుక్తయై, రవిక లేక, తిలకములేక, శుష్కించి జీవితముపై విరక్తితో హైమవతి కాలము గడపుచుండెను. చెన్నపురినుండి యామె జవాబునకై నిరీక్షించుచుండెను.

---

## పదునైదవప్రకరణము.

అది ఏప్రియల్ నెల, చైత్రమాసము. ఏప్రియల్ ఆఱవ తేదీ చైత్ర శుక్ల ద్వితీయ సోమవారము పగలు పదిగంటలకు బి.ఏ. పరీక్ష ప్రారంభ మయ్యెను. కృష్ణరావు, సత్యనారాయణ, సోమయాజులు, అందఱును పరీక్షకు వ్రాయుచుండిరి. పరీక్ష చేయఁబడుచున్నచావడి అతివిశాలముగ నుండెను. ఎలక్ట్రిక్ ఫానులు గిరగిర తిరుగుచు విద్యార్థుల సేదదీర్చు చక్కని వాతూలముల నొసంగుచుండెను. ఎక్కడ చూచినను వెలుతురు బాగుగ వచ్చుచుండెను. విద్యార్థులు బారులు తీరి యొకరివెనుక నొకరు కూర్చుండి యుండిరి. ప్రతివిద్యార్థిముందును ఒకబల్ల యమర్పఁబడి యుండెను. ఆబల్లపై నొకయద్దుకాగితమును, ఒకమట్టిసిరాబుడ్డియు నుంపఁబడెను. ప్రతివిద్యార్థియు కూర్చుండుటకుఁ గొందఱికి కుర్చీలును, మఱికొందఱికి నాలుగుకోళ్ల స్టూళ్లును ఈయఁబడెను. గంట కొట్టుటతోడనే నియమింపఁబడిన పరీక్షాస్థలాధికారులు ప్రశ్నపత్రములను గబగబ పంచిపెట్టిరి. తా మనుకొన్నప్రశ్నలు వచ్చినవిద్యార్థులు అతిసుకుమారము లగుమందహాసములతో నొకరి నొకరు బహూకరించుకొను చుండిరి. కొందఱు ప్రశ్నపత్రమును జూచి ముఖము వేలవేయుచుండిరి. అట్టివా రొకరివంక నొకరు చూచి “వ్యవహారము చల్లఁబడిన” దని ముఖవిచారములతో సూచించిరి. ఐదునిమిషములు గడచెను. మనస్నేహితులు ముగ్గురును ఎడతెఱపి లేక వ్రాయుచుండిరి. ఇంకొక యైదునిమిషము లయ్యెను. కృష్ణరావు మొదటిపుటను ముగించి రెండవపుటను దీసెను. ఈప్రకారముగ కాలము గడచెను. ఒంటిగంట కొట్టునప్పటికి స్థలాధికారులు విద్యార్థు లుత్తరములు వ్రాసిన పుస్తకములను దీసికొను సంరంభము



చేయుచుండిరి. విద్యార్థు లందఱును బైటికి వచ్చిరి.

కృష్ణ—ఏమోయ్ సోమయాజులూ! ఎలా వ్రాశావు? కష్టంగా ఉందా సులభంగా ఉందా?

సోమయాజులు శీఘ్రముగఁ బైకి తేలుమనుజుఁడు కాఁడు. “ఏదో వ్రాసేశాను. అయిపోయింది. పరీక్షాఫలితాలు తెలిసినప్పుడు తెలుస్తుంది ఎలావ్రాసిందీని.” అనెను.

కృష్ణ—ఈమాటల కేంలే. నువ్వు ఎలాగూ ప్యాసు అవుతావు. ఏమోయ్ సత్యం! పుస్తకం తిరగేస్తున్నావేమిటి?

సత్య—ఓయన్ లిన్ గ్రీవు స్వభావములో ఏమన్నా గర్వమున్నదా అని చూస్తున్నాను.

కృష్ణ—అయిపోయిన పెళ్లికి మేళ మెందుకు? మధ్యాహ్నం పరీక్షసంగతి ఆలోచిద్దూ.

సత్య—నీది ప్యాసయేవాడి లక్షణం. మేము మళ్లీ దరఖాస్తులు పెట్టుకోవాలి.

కృష్ణ—చిన్నప్పటినుంచీ ఇలాగే ఉన్నావు. కాఫీహోటలుకు పోదాం పద.

ఇట్లు పరీక్షదినములు గడచిపోయెను. ఏప్రియల్ పదునొకండవ తేదీ మధ్యాహ్నము ఒంటిగంటకు సరియైన చైత్ర శుద్ధ షష్ఠీ శనివారము మధ్యాహ్నము పదునేడున్నర గడియలకు పరీక్ష ముగిసెను. ఇఁక నీముగ్గురు స్నేహితులు నొకచోఁ గూడి ఏమిచేయుద మని యాలోచించుకొనసాగిరి. పరీక్షలైనవెనుక పదునైదుదినములైనను చెన్నపురిలో నుండవలె నని వారదివఱకే తీర్మానించుకొని యుండిరి. మధ్యాహ్న మంతయు సరససల్లాపములతో కాలము గడపి మిత్రత్రితయము చెన్నపురివిశ్వవిద్వన్మందిరమున కెదురుగ నున్న సముద్రపుటిసుకలఁ

గూర్చుండి ఏదో మాటలాడుచుండిరి. సోమయాజుల కీలోపుగ నేమి యో జ్ఞాపకమునకు వచ్చినట్లయ్యెను. అతఁడు సత్యనారాయణను మోఁచేతితోఁ బొడిచి ‟ఆసంగతి మఱచిపోయినావా ఏమిటి?” అని రహస్యముగ నడిగెను.

సత్య—‟ఆసంగ తేసంగతి ?” అని మరల వెంటనే జ్ఞాపకము నకుఁ దెచ్చుకొని ‟ఇప్పు డారంభిద్దామా ?” అనెను.

ఈమాటలుజరుగుచుండఁగా కృష్ణరావు గయోపాఖ్యానములోని పద్యములను, మనుచరిత్రములోనిపద్యములను రాగముతో చదువు చు వేఱొకవంకఁ జూచుచుండెను. అతఁడు తనస్నేహితు లేమిచేయు చున్నారో చూడలేదు. సత్యనారాయణ ‟ఏమోయ్ కృష్ణరావు ! నీతో ఒకవిషయమై చాలా శ్రద్ధగా మాట్లాడవలసిఉంది. ఏమంటా వు ?” అనియెను.

కృష్ణ—ఏమి టాసంగతి ?

సత్య—సంగతి చెప్పేముందు నీకు రెండుమూడువిషయాల్ని గుఱించి చెప్పాలి. మొదట్ల మేము నీకు చిరకాలమునుంచీ స్నేహితుల మనేమాట జ్ఞాపకంచెయ్యాలి. ఈస్నేహంవల్ల మాకు నీమీద కొంత అధికారముఉంది. మామనస్సులో ఉండేఒకసంగతినిగూర్చి నీకు సవి స్తరంగా చెప్పాలి. నువ్వు తప్పకుండా వినాలని మాఉద్దేశం. వినను, గినను అనడము పనికిరాదు.

కృష్ణ—సరేన్లేవోయ్. అసలుసంగ తేమిటోచెప్పు. ఆతరవాత ఉపన్యాసం ఇద్దుగాని.

సత్య—అదే, దానికే వస్తున్నాను. రెండవది మేముచెప్పింది నువ్వు అథమం ‟గట్టిగా ఆలోచిస్తాను” అని అన్నా వాగ్దత్తం చె య్యాలి. నేను చెప్పబోయేది చాలముఖ్యమైనసంగతి.



కృష్ణ—అసలుసంగతికి రా.

సత్య—క్రిస్టమసుశలవులలో కాకినాడకు వెళ్ళినప్పుడు మీఇం ట్లో మీమేనమామకూతురిని మేమిద్దరము చూచాము. ఆతరువాత నువ్వుచెప్పినసంతులవల్ల ఆపిల్లభర్త పోయినాడనీ, పుట్టింట చాలకష్టా లు పడుతూఉన్నదనీ తెలిసింది. ఆపిల్ల భర్తమొగం పెండ్లిలోతప్ప మరెప్పుడూ చూడలేదు. ఆపిల్ల పునర్వివాహం చేసుకోకుండా యావ జ్జీవమూ వైధవ్యమే అనుభవించడం చదువుకున్నఎవ్వడికీగూడా రు చించేవిషయం కాదు. భగవదిచ్ఛ ఆపిల్లకు రెండవవివాహము జరుగ వలెననియే ఉన్నదని నాకు గట్టినమ్మక మున్నది. ఇంతేగాక ఆపిల్ల నీకు మేనమామకూతురు. కాఁబట్టివరసా, కలిసినసంబంధము. కలిసిన వాళ్లల్లో మీలో మీరు నద్దుకోవలసినవిధి అని నాఅభిప్రాయము. వయసుచూస్తే నీకు సరిపోతుంది. నీకంటే నాలుగైదేళ్ళచిన్న. సౌం దర్యము నేను వర్ణించనక్కరలేదు. నాకంటె నీకు ఆవిషయం ఎక్కువ తెలుసును. పుట్టినింట కష్టాలు అనుభవించలేక మీఅమ్మను తల్లిక న్నా ఎక్కువగా తలచి కాకినాడ వచ్చింది. అటువంటిపిల్లను నువ్వు యావజ్జీవము వైధవ్యముఅనుభవించడానికి వదలిపెట్టడం మాకేమీ బాగుండలేదు.

కృష్ణరావు ఈమాటలను విని ‟నాశ్రేయముకోరి చెప్పావని నాకు నమ్మకమున్నది. మనస్సులో మనస్సుకలిసినవాళ్లం గనుక, ఇన్నాళ్లూ ఎవ్వరితోనూ చెప్పకుండా దాచిపెట్టినసంగతులు ఇప్పుడు మీకు చెపు తాను. మీమనస్సులోనే ఉంచుకుంటామని ఒట్టుపెట్టుకుంటే చెపుతా ను” అనెను.

సత్యనారాయణయు, సోమయాజులును అట్లే యొట్టుపెట్టుకొని నపిదప, కృష్ణరావు చిన్ననాఁటినుండియు తాను హైమవతిని ప్రేమించి

నసంగతియు, తనపై నిష్టములేక యామెతల్లిదండ్రులు వేఱొకనికిచ్చి పెండ్లి చేయనిశ్చయించుటయు, చిన్నతోఁటలో నామెకును దనకును జరిగినసంభాషణమును, అప్పుడు హైమవతిప్రతిజ్ఞ నుల్లంఘించి, తల్లిదండ్రులవాక్యములను శిరసావహించి తన్ను నిరాకరించినసంగతియును చెప్పెను.

సత్య—అలాగయితే తల్లిదండ్రులమాటల నుల్లంఘించలేక బలవత్తరమయినప్రేమప్రవాహాన్నే అరికట్టఁజాలినసుగుణఖనికన్న నీకు వేఱొక్కమంచిభార్య దొరకుతుందా?

కృష్ణ—సత్యనారాయణా, నువ్వువట్టిపిచ్చివాడివి. అంతనిబ్బరముగలహైమవతి వైధవ్యము అనుభవిస్తుందిగాని పునర్వివాహం చేసుకుంటుందా?

సత్య—అదికాదు. అప్పటిసంగతులు వేఱు. ఇప్పటిసంగతులు వేఱు. ఇప్పుడు కథ ఎలాపరిణమించిందో చూడు. కష్టాలు పడలేక పుట్టినింటినుంచి, భర్తపోయి సంవత్సరమైనా కాకమునుపే వచ్చి మీఇంట్లో కూచుంది. వివాహమప్పటినిబ్బరమున్నా, భర్తపోయిన తర్వాతినిబ్బరమూ చూచావా? అప్పుడు తల్లిదండ్రులఆజ్ఞ పాలించింది. ఇప్పుడేంజేసింది? ఉల్లంఘించే అంతచేసింది.

కృష్ణ—అయితే కక్కినకూటికి ఆశపడమంటావా? నేనెన్నడూ అలాంటిపని చెయ్యను.

సత్య—కక్కినకూడేమిటి? మొదటినించీ మీరిద్దరూ ఒకరినొకరు ప్రేమించుకొంటిరి. నిన్నే తప్ప ఇంకెవ్వరినీ ప్రేమించనని ఆపిల్ల చెప్పినదంటివి. కక్కినకూడెలాఅయింది?

ఆచిన్నతోఁటలో జరిగినసంభాషణలో నిదివఱకుఁ జెప్పనిహైమశపథమును తనశపథమును కృష్ణరావిప్పుడు మిత్రులతో చెప్పెను.



సత్యనారాయణ మహాసంతోషముతో “ఇకనేమి. నీకు బ్రహ్మచర్యమూ అక్కరలేదు. ఆపిల్లకు వైధవ్యమూ అక్కర్లేదు. ప్రేమ ప్రేమలో కలిసిపోయింది. ఈప్రేమప్రవాహానికి అంతూ పంతూ లేదు. దీనిలోతు బ్రహ్మకన్నా కొలవడం శక్యం కాదు. మీశపథాలతో పని తీరిపోయింది. మీఇద్దరినీ కలపడానికే బ్రహ్మ నిన్ను ఇన్నాళ్లూ బ్రహ్మచారిగా ఉంచాడు. ఆపిల్లకు వైధవ్యం తెచ్చిపెట్టాడు. ఇంతగాఢంగా ప్రేమించినపిల్లకు కష్టాలు తీర్చక, నువ్వూ లోకవిరుద్ధంగా బ్రహ్మచర్యం అవలంబించడం దేశద్రోహకరమన్నమాట. అంతకంటె గొప్పపాపం ఇంకేమీ ఉండదు” అనియెను.

సోమయాజు లిప్పు డొకమాట నైచుటకు సమయ మనుకొనెను. “కృష్ణరావూ, ఆపిల్ల ఇప్పటికీ నిన్ను గాటముగా ప్రేమిస్తూనే ఉన్నదని నాతలంపు. నీమీదిమమతచేత పుట్టింటినించి మీఇంటికి వచ్చిందిగాని మఱొకకారణమువల్ల వచ్చిందని నేననుకోను. ఇతరకారణాలు లేవని నేనుఅనను. కాని, నీమీదిప్రేమే ముఖ్యకారణమని నా అభిప్రాయము. కాకినాడలో మీఇంటినించి బండి కదిలేటప్పుడు నేనాపిల్లముఖంవంక చూచాను. సూర్యుడు అస్తమిస్తూ ఉంటే తామరపువ్వులు ఎలా వాడిపోతయో అలా వాడిపోయింది ఆముఖము. నువ్వు కనపడుతూఉన్నంతసేపూ వాకిట్లోనిలఁబడి నీకేసే చూస్తూ కాలం గడిపింది. అప్పుడు ఆకళ్లల్లో నీళ్లు చూసి నేను భరించలేకపోయినాను. నిన్ను వెనక్కిమళ్ళిద్దామనుకున్నాను. రైలువేళయి పోకపోతే నిశ్చయంగా అప్పుడే మీఇద్దరికీ గాంధర్వవివాహ మయేదే” అనియెను.

కృష్ణరావు చాలసేపు మాటలాడక యూరకుండెను. ఎట్టకేలకాతఁ డిట్లనెను. “హైమను నేనుగూడ ప్రేమిస్తూనే ఉన్నాను. కాని అంతదీనంగా ఆవేళ నేను బతిమాలితే కాదుకూడదని ఈవైధవ్యమనే

కళంకం తెచ్చుకున్నతరువాత నేనెలా పెళ్లిచేసుకుంటాను? నేనాపని చెయ్యలేను. నాకు చాలా కష్టంగా ఉంటుంది."

సోమ—నిన్నే భర్తగా, నిన్నే దేవునిగా, నిన్నే పెన్నిధానముగా ప్రేమిస్తూఉన్న ఆపిల్లకష్టాలు తీర్చడానికి ఒక్కవేళైనా కదపలేవా? ఏమంటే ఆపిల్లకు వేరే దిక్కెవ్వరు?

కృష్ణరావు మాటలాడలేదు.

సత్య—నిన్ను కాదని ఇంకొకరిని చేసుకున్నమాట నిజమే. ఆతణ్ణి ప్రేమించలేదని నీకు తెలుసును. పునర్జన్మంలో నువ్వే భర్తవి కావాలని ప్రార్థిస్తానని శపథం చేసిందని నువ్వే చెప్పితివి. ఆపిల్ల చేసిన తప్పేమిటి? ఆపిల్లను క్షమించలేవా? తల్లిదండ్రులయాజ్ఞను శిరసావహించి చేసినపని—తప్పు అనే అందాము—ఆపిల్లను క్షమించలేవా?

కృష్ణరావు నేలవంకకుఁ జూచుచుండెను.

సోమ—ఆపిల్లే ఇప్పుడు నీకాళ్ళు పట్టుకొని క్షమించమన్నప్పటికీ క్షమించవా?

కృష్ణరావు నేలపై నేమియో గీతలు గీయుచు నాలోచించుచుండెను.

సోమ—అది కాదు. ఆపిల్ల వచ్చి నదురూ బెదురూ లేకుండా 'బావా' అని కౌగలించుకున్నదంటే, నీడంబమంతా ఒక్కముద్దులోకి మారిపోతుంది. ఇక లే, ఇంటికి పోదాం. దీన్నిగురించి నువ్వాలోచించేదేమిటి? నీబదులు మేమే ఆలోచించాం. వేరేజవాబు చెప్పకుండా పెళ్ళిప్రయత్నముమీదనే ఉండు. నీపెళ్లికి శుభలేఖలు పంపించకపోయినా మేము తప్పకుండా వస్తాము.

కృష్ణరావు మందహాసము చేసెను. హైమముఖబింబ మాతని మనస్సులో నాటుకొనెను. వారందఱును భుజించి గదుల కేఁగిరి.



ఆనాఁడు కృష్ణరావు ఏమియాలోచించెనో మన మెఱుంగము. మరునాఁడు ప్రొద్దున్న ఏడుగంటలున్నరకు సత్యనారాయణయును, సోమయాజులును వచ్చునప్పటికి కృష్ణరావింకను పరుపుమీఁదఁ బండుకొని నిద్రించుచుండెను. సత్యనారాయణయును సోమయాజులును చప్పుడు చేయకుండ పరుపువద్ద కూర్చుండిరి. అప్పుడు కృష్ణరావు పెదవులు కొద్దిగ కదలెను. ఆయధరపల్లవమధ్యమునుండి మధురనిస్వనమొక్కటి వినవచ్చెను. "నేను నాహైమను క్షమించలేనా." సత్యనారాయణయు సోమయాజులును నొకరిముఖమునంకనొకరు చూచుకొనిరి; మెల్లఁగలేచి నిలువఁబడిరి. కృష్ణరావుకన్నులు తెఱచెను. ఎదుట స్నేహితులు కనఁబడిరి. "వచ్చి ఎంతసేపైంది?" అనియడిగెను.

సత్య—ఇప్పుడే వచ్చాము.

కృష్ణరావు పరుపుమీఁదినుండి లేచెను. సోమయాజులును సత్యనారాయణయు హైమవతిసంగతి కృష్ణునిహృదయమున నాటెనని తెలిసికొనిరి. ఆసంగతినిగూర్చి ఇఁకమీఁద తమంతట తాము హెచ్చరించుట పొరపాటగునని తీర్మానించుకొనిరి. నాఁటియుదయమున వారిరువురనొకస్నేహితుఁడు భోజనమునకుఁ బిలిచెను. కావున వారు విందారగింప నరిగిరి. కృష్ణరావు తనగదిలోఁ గూర్చుండి హైమతోడి తన వివాహమునుగూర్చి యాలోచించుచుండెను. కృష్ణరావు తల్లిదండ్రుల పాలనక్రింద నున్నవాఁడు. తల్లిదండ్రులమాటను జవదాటి విధవావివాహము చేసికొనుట చాలకష్టమైనపని. చిన్నప్పటినుండియుఁ బెంచి పెద్దవానిని [illegible] విద్యాబుద్ధులం గఱపిన తల్లిదండ్రులను కోపము సంపాదించుట నేర్చినతోడనే యవ్వలకు నెట్టి వారిబ్రదుకును దుఃఖభాజనమొనర్చుట కృష్ణరావునకు మిక్కిలి కష్టముగఁ దోఁచెను. వారియనుమతిమీఁద వివాహము చేసికొనుట బాగుగనుండునని తలంచినను తల్లి

యొప్పుకొన్నను తండ్రి యొప్పుకొనఁడు. పోనీ, కులమైన నిలుచునా? అన్నచో, కులము నిలుచునెడల నేచిక్కును లేనే లేదు. అట్లుకాక తల్లిదండ్రుల కగ్నిసంస్కారాదులను చేయు వేఱుకుమారులును లేరు. ఇట్టిస్థితిలో వృద్ధాప్యము వచ్చునపుడు తల్లిదండ్రులను విడిచి విధవాపునర్వివాహము చేసికొనుట యాతని కతిశోచనీయమగువిషయముగఁ గనఁబడెను. పోనిమ్ము, తల్లిదండ్రులు తన్నేమైనఁ గష్టపెట్టిరా? లేదు. ఎల్లప్పుడును తమసుఖముకంటె ముందు కృష్ణరావు సుఖమునే చూచుచుండిరి. అట్టి తల్లిదండ్రులకు కృష్ణరా వెట్లు కృతఘ్నత చూపగలఁడు? ఒకవంక తల్లిదండ్రులు, కులము, మాతాపితృప్రేమ మఱియొకవంక చిన్ననాఁటనుండియుఁ దన్ను ప్రేమించిన 'కన్యక'—వైధవ్యదుఃఖమునుండియు, నంతకన్న దుష్కరము లగుకష్టపరంపరలనుండియు నొకదిక్కులేనియబలను రక్షించుట, మోహము—ఈ రెండింటిలో నేది రెండవదానికన్న నెక్కువముఖ్యమైనదో కృష్ణున కాలోచన పోలేదు.

మధ్యాహ్నమున పండ్రెండు కొట్టబోవుచుండెను. అప్పుడు పోస్టుబంట్రోతు కృష్ణరావున కొక కవరు నిచ్చెను. దాని నాతఁడు విప్పి చదువుకొనెను. అందు హైమవతి మొదటినుండియు జరిగినసంగతులనెల్ల వ్రాసెను. ఆయుత్తరమునం దొక్కొక్కవాక్యము చదువునప్పటి కొక్కొక్క కన్నీటిబిందు వాయుత్తరమును పావనము చేయుచుండెను. మధ్యమధ్య కృష్ణరా వనేకములగు నిట్టూర్పులను విడిచెను. ఒకవాక్యము చదువునప్పటికి కృష్ణునియొడలు కంపించెను. తనకొఱకు హైమ ఆత్మహత్య చేసికొనఁ బ్రయత్నించిన దని ఈయుత్తరము చూచునంతవఱకును కృష్ణరావునకుఁ దెలియదు. తనపై నింతకూరిమి గలహైమను కష్టములనుండి రక్షింపవలెనని యాతఁడు నిశ్చయించెను. తాను వివాహము చేసికొన్నను చేసికొనకున్నను నామెపోషణభారము తనదని యాతఁడు



శపథము చేసికొనెను. ఆలస్యము చేసినచో నామెకేశఖండనము జరుగును. ఆమెను రక్షించువా రెవ్వరును లేరు. రామయ్యయు దురదృష్టవశమున నప్పుడే మరణించెను. కావున, తానే ఏలూరునకుఁ జని హైమవతిని చెన్నపురమునకు దీసికొనివచ్చి, యొకచో నుంచవలెనని యాతఁడు తీర్మానించెను. కృష్ణరా విట్లాలోచించుకొనుచుండఁగా సత్యనారాయణయును సోమయాజులును లోనఁ బ్రవేశించిరి. కృష్ణరావు వారినిఁ గూర్చుండ నియమించి ఉత్తరమునందలిసంగతులను వారికి విశదీకరించెను. వారును మిగుల సంతసించి "ఇప్పుడైనను క్షమిస్తావా?" అని అడిగిరి.

"నేను క్షమించడ మొకగొప్పకా" దనుచు కృష్ణరావు వేంకటప్పయ్యగారు హైమవతీకృష్ణరావుల వివాహమున కంగీకరించుచు నిచ్చినపత్రమును వారిముందు పడవైచెను. ఆపత్రమును చూచుటతోడనే సత్యనారాయణ "కృష్ణరావూ! నువ్వు అదృష్టవంతుడివోయి. మీమేనమామకూడా తనకూతుర్ని నీకే ఇస్తానని వ్రాశాడు. నిజంగా నీకంటే అదృష్టవంతుడు ఎవడూ ఉండడోయి." అనియెను.

సత్యనారాయణకుఁగాని సోమయాజులకుఁగాని కృష్ణునిహృదయమునందలిమహాసంక్షోభమునుగూర్చి ఇంచుకంతయును దెలియదు. కృష్ణుఁడు వారి కావిషయమునుగూర్చి తెలుపఁదలఁచుకొనలేదు. ఎవని గొడవను వాఁడు తీర్చుకొనవలెను గాని ప్రపంచకమున కంతకును చాటుట బుద్ధితక్కువపని యని కృష్ణరావు నమ్మియుండెను. తనహృదయమునందలి బడబానలము ప్రపంచకమునంతను జయించుప్రళయాగ్ని యగువఱకును ధూమమును లోననేయణఁచియుంచుకొనఁజాలనివాఁడు మూఢుఁడని కృష్ణరావుయొక్క యభిప్రాయము. తనహృదయమును కల్లోలపఱచుచున్నసమస్యను తానే పూర్తిచేయవలెనుగాని యొక రే

క్లనుచేయఁగలరని కృష్ణరావు తలంచెను. ఒకరివిషయమున నింకొకరు సౌ
ఖ్యము కలిగించుకొని తాత్కాలికఫలితములను గలిగించినప్పటికిని
ఈకొత్తబొంత అతుకులమారిబొంత యగునేగాని, నేతగానిసామర్థ్య
ముచే నూతనముగనేయఁబడిన బొంతవలె మనోహరముగా నుండదని
కృష్ణునియభిప్రాయము. ఏది ఎట్లున్నను సత్యనారాయణయును సోమ
యాజులును కృష్ణరావు హైమవతిని వివాహమాడుట తప్పనిసరి యని
యు వివాహము జరిగితీరుననియు సంతోషస్వాంతులై యుండిరి. కృ
ష్ణరావు హైమవతిని తీసికొనివచ్చుటతోడనే ప్రవేశపెట్టుట కొకయింటి
లో భాగమును కుదిర్చి స్నేహితులతోఁ జెప్పి ఏర్పాటులు పదునాలు
గవతేదికి సరియైన చైత్రశుద్ధనవమీమంగళవారమునాఁడు మెయిలు
లో బయలుదేరవలెనని తలంచెను. హైమకు ముందుగనుత్తరము వ్రా
యుట యవసరమా కాదా యని యాతఁడాలోచించెను. కాని ఉత్తర
ము వ్రాసినయెడల నది ఎవరిచేతనైనఁ బడి తనప్రయత్నము విఫల
మగునని తలంచి యుత్తరము వ్రాయలేదు.

మంగళవారమునాఁటిరాత్రి తనయిరువురు స్నేహితులును తన్ను
సాగనంపుటకు రాఁగాఁ గృష్ణుఁడు సెంట్రలుస్టేషనునందు రైలుబండి
నెక్కెను. ఈయిరువురి సరసములతోడను, నర్మగర్భములగు వచనముల
తోడను సెంట్రలుస్టేషను సంతయు మారుమ్రోగుచున్నట్లుండెను.
రైలు కదలఁబోవునప్పుడు సోమయాజులు చేతి నాడించుచు "నేనన్నం
తా అయింది. డంబమంతా ఒక్కముద్దుతో ఫైసలు." అనెను. కృ
ష్ణరావు చిఱునవ్వు నవ్వెను. రైలు కదలెను. కృష్ణుఁడు లోనికిఁ జని
పరుండెను. రైలు బయలుదేరిన తరువాత సత్యనారాయణయును,
సోమయాజులును కృష్ణరావును గూర్చి మాటలాడుకొనుచు తిరువళ్లి
క్కేణికేఁ జనిరి.



సత్య—నాలుగురోజులకిందట లేని ఈఅజావిడంతా చూశా
వా? ఎంతలో మనిషి మారిపోతాఁడు !

సోమ—ఇదే ప్రేమతత్వము. అనూహ్యమైనది.

సత్య—వచ్చేటప్పుడు పెళ్లికూతుర్ని చంకన పెట్టుకు చక్కా వ
స్తాడు. అదృష్టవంతుఁడోయ్.

సోమ—నువ్వు చూశావో లేదో కాని, కృష్ణరావుమనస్సులో
ఏదో బ్రహ్మాండమైన ఆలోచన ఉన్నట్లుంది. ఏదో మనస్సులో పెద్ద
కలవరమున్నట్టుగా నాకు కనపడ్డది.

సత్య—ఏమో నేను చూడలేదు. కలవరానికి కారణ మేము
న్నది? ఆలోచించే ఆపిల్లను తీసుకురావడానికి వెళ్లాడుకదా? ఆలోచిం
చకుండా ఒక్కపనీ చేసేమనిషి కాఁడే కృష్ణరావు?

సోమ—కారణం లేదంటావేమిటి? కులంలోనించి ముందు
వెలి. తల్లిదండ్రులదగ్గిర్నించి ఎడబాటు. రేపు నువ్వు వాణ్ణి నీయిం
టికి భోజనానికి పిలుస్తావా?

సత్యనారాయణరావు మీసమును దువ్వెను. "సైఁ. నేను
పిలవకపోతే ఏబట్టబడితే ఆబట్ట." అనెను.

సోమ—రానుకదా అని తెలుసుకొని పిలుస్తావా ఏమిటి?
ఆమాటకూడా ఇప్పుడే చెప్పు.

సత్య—నీకు ఆపిల్లను చూస్తే జాలిగా లేదూ?

సోమ—నా జాలిమాట ఎందుకయ్యా! చేసుకొనేవాఁడు వాఁడే
ఉండగాను? ప్రపంచకంలో ఆపిల్లా, మనమిద్దరమూ తప్పితే ఇంకెవ్వ
రూ లేరనుకుంటున్నావా ఏమిటి? కృష్ణరావుసంగతికూడా ఆలోచించు.
వాడిభవిష్యత్తుకూడా మన కవసరమే కదా?

సత్య—ఎంతమంది ఇప్పటిరోజుల్లో విధవావివాహాలు చేసు

కుంటున్నారుకారు? వాళ్ళల్లో కృష్ణరావు ఒకడు. చదువుకున్న మన
మే వెనక్కి తిరిగితే, మనమే ముందుకు అడుగుపెట్టడానికి భయపడితే
దేశాన్ని ఎలా ఉద్ధరిస్తాం?

సోమ—నేను విధవావివాహాలు చెడ్డవని చెప్పడంలేదు. ప్ర
స్తుతసందర్భంలోలాగ పిల్లలులేక యౌవనములో ఉన్న వైధవపిల్లలకు
తప్పకుండా పునర్వివాహం చెయ్యడమే నామతము. అలాగయినప్పటికీ
ప్రపంచకమనేది ఒకటి ఉందనీ, అందులో కొన్ని కట్టుబాట్ల ప్రకారం
ప్రజలు నడుస్తూ ఉంటారనీ నీకు తెలియకపోలేదు. ఆకట్టుబాట్ల నను
సరించక వేరేమార్గము తొక్కేవాణ్ణి వెలివెయ్యడం ఇప్పుడు జరుగు
తున్న పద్ధతి. అనుభవైకవేద్యమైన సంగతి. విధవాపునర్వివాహము
మంచిదా చెడ్డదా అని పుస్తకాల్లోనించి శ్లోకాలు చదవవచ్చును.
బల్లమీద కెక్కి ఉపన్యాసాలు ఇయ్యొచ్చును. కాని, మనసంఘము
లో చాలాకాలమునించీ వస్తూన్న కట్టుబాట్లను విరగగొట్టి క్రొత్తపుం
తను పోవడమనేది ఎంతకష్టమో ఆలోచించు. కృష్ణరా విప్పు డీకష్టా
లన్నీ అనుభవించవలసి యున్నది.

సత్య—అయితే, నువ్వనేమాట ఏమిటి? మనసంఘం చాలా
కాలమునించీ చెడ్డదోవన వెళుతూఉంటే ఆదోవను ఎన్నటికీ ధీరులెవ
రూ వచ్చి మార్చకూడదంటావా?

సోమ—అది కాదు. క్రమపరిణామమనీ, హఠాత్పరివర్తనమనీ
రెండున్నాయి. హఠాత్పరివర్తనము ప్రపంచకానికిన్నీ సంఘానికిన్నీ
కీడుతీసుకొస్తుంది. హఠాత్పరివర్తనమంటే, ఆకస్మికంగా ఒకపెద్దమార్పు
తీసుకురావడమన్నమాట. అటువంటిమార్పుకు సంఘము సిద్ధంగా ఉం
డదు. దానివల్ల అనవసరంగా ప్రజాసంక్షోభము కలుగుతుంది. క్ర
మపరిణామము అటువంటిది కాదు. సంఘాన్ని ముందుఅనేకవిధాలుగా



తీసుకురాదల్చుకొన్నమార్పుకు గాను సిద్ధపడి ఉండేటట్టు చేసి ఆతరు
వాత మార్పుతీసుకొస్తే ఎవడికీ తెలియకుండానే సంఘము మంచిదోవన
నడుస్తుంది.

సత్య—అయితే ఇన్నాళ్లు ఉపన్యాసాలు ఇచ్చినా, వీరేశలిం
గంపంతులుప్రభృతులు ఎంతచేసినా ఇంకామనఆంధ్రదేశం వెనకనే
పడిఉన్నదా?

సోమ—వాళ్లు ఆరంభించడం హఠాత్తుగా ఆరంభించారు. అది
వాళ్లతప్పు. అందువల్ల దేశంలో తెగలు ఏర్పడి విధవావివాహాలను
నిరసించడం ఆరంభించారు. కాబట్టి ఇంకా ఇంతవఱకూ గూడా విధ
వావివాహాలంటే బూచుల్లాగ మనవాళ్లు చూస్తూ ఉండడం కలిగింది.

సత్య—అలా అయితే ఇప్పుడు నువ్వూనేనూ కొంతవఱకు
విధవావివాహాలను ఎందుకు అంగీకరిస్తున్నాము?

సోమ—వాటినిగుఱించి మనంతటమనమే బాగోగులు ఆలో
చించాము గనుక.

సత్య—ఈఆలోచించడం ఎందువల్ల కలిగింది? కొన్నివిధవావి
వాహాలు జరిగిఉండడంవల్లనేనా?

సోమ—కాదు. వీరేశలింగంపంతులుమొదలైనవారు విధవా
వివాహాలు మంచివని చెప్పడంవల్ల.

సత్య—నువ్వనేదేమిటంటే. విధవావివాహాలు మంచివని చె
ప్పడం మంచిది. కాని అది విని ఎవరన్నా "అయితే మేము విధవా
వివాహాలు చేసుకుంటామయ్యా" అంటే చెయ్యడం తప్పు. అంతేనా?

సోమ—చాలాబాగా అర్థం తీశావు! చేసుకుంటామని వచ్చిన
వాళ్లతో, "మీరుచేసుకుంటామంటున్నారు. బాగానే ఉంది. కాని
ప్రపంచకంలో ఫలానిఫలానిచిక్కులు వస్తయి. కాబట్టి జాగర్తగా

ఆలోచించండి" అనిచెప్పాలి.

సత్య—"అలాగే ఆలోచించామండి. లోకులు కాకులవంటి వాళ్లు. మేము తెగించాం. వివాహం చేసుకోకతప్పదు. ఆయన మా ఇష్టం" అంటే ఏమిటి జవాబుచెప్పడం ?

సోమ—అలా అన్నవాళ్ళకు పెళ్లి చెయ్యడమే మంచిది.

సత్య—అయితే ఇది హఠాత్పరివర్తనముకాలేదా?

సోమ—అవును, ఇదే నేను కూడదంటాను.

సత్య—ఏమిటోయ్, ఇందాకా ఒకమాటా, ఇప్పుడొకమాటా మాట్లాడుతున్నావు? ఈవిధవావివాహవిషయంలో ప్రపంచకాన్ని క్రమపరిణామప్రకారము ఎలా నడవమంటావు?

సోమ—ఫలానిప్రకారంగా నడవమనడం కష్టము. ఇప్పుడు మనసంఘంలో చదువుకున్నవాళ్లల్లో చాలామందికి విధవాపునర్వివాహాలు (మరీఅసహ్యంకాకపోతే) ఇష్టమే. ఒకసంగతి చెపుతాను. ఇప్పుడు మాదిగవాడూ, మంగలవాడూ తిన్నపింగాణీపళ్లాలలోనే మనం కాఫీహోటలులలో తింటున్నాము. ఇంగ్లీషువాడిఇంటి కెళ్లి, ఏ వెధవ బట్లరో ఏఅపరిశుభ్రంగానో చేసినకాఫీమొదలైనవి గొంతుకలో పోసుకుంటాము. దీన్ని మనఅమ్మలు, నాయనమ్మలు కూడా సహిస్తారు. క్రాపింగులు పెట్టించాం. వీటికి మనకు వెలేమన్నాఉందా? ఇవన్నీ మనసంఘంలోకి ఎలాగైతే వ్యాపించాయో, అలాగే 'చెయ్యతగినది' అని నలుగురనుకోనేది మెల్లిగా సంఘంలో పాకుతుంది. నలుగురు పండితులూ, పూర్వాచారపరాయణులూ కళ్లుతెరచి చూసేటప్పటికి ప్రపంచకం మారి ఉంటుంది. "పోనీలే మనకెందు" కనేవాళ్లు కొంతమంది బయలుదేరుతారు. "కలియుగంలో ఐదువేలసంవత్సరాలయేటప్పటికి అంతా వర్ణసంకర మవుతుందని వ్యాసుడు భారతంలోవ్రాసింది



అబద్ధమౌతుందా?" అని కొందరు సద్దుకుంటారు. ఇలా నలుగురూ నాలుగువిధాలుగా సద్దుకుంటారు.

సత్య—అయితే వీరేశలింగంపంతులుప్రభృతులు చేసిన తప్పేమిటి?

సోమ—సంఘములో ఉండే అనుభవములు మొదలైనవాటిని పాటించక హఠాత్పరివర్తనము తీసుకురావడానికి ప్రయత్నించడం.

సత్య—ఇంతకంటె అర్థమయేలా చెప్పాలి.

సోమ—నువ్వు వీరేశలింగంగారి తప్పునుగూర్చి నన్నుప్రశ్న అడగకపూర్వము నేను చెప్పినదాన్నిబట్టి నువ్వే అర్థంచేసుకోవాలి. ఇంతకంటె నేను చెప్పలేను.

సత్య—వీరేశలింగంగారు మొదలైన గొప్పవారిలో తప్పులు కనిపెట్టడం మనబోటి కుఱ్ఱవాళ్లకు తగదు. ఆయన దేశానికెంతో మహోపకారం చేశాడు.

సోమ—ఈసంగతి తప్పకుండా ఒప్పుకుంటాను. ఏదో నాకు తోచినవి నాలుగుముక్కలు చెప్పినంతమాత్రాన వీరేశలింగంపంతులుగారి ఘనతను ఎవ్వరు తీసెయ్యలేరు. ఇంతా చెప్పినా, నేనే తప్పుగా ఆలోచించి ఉండవచ్చును. కాని, నామనస్సులో ఉన్నది చెప్పానుగాని, అనవసరంగా నీతో వాదించలేదు.

సత్య—కోపపడకు. అయితే కృష్ణరావును ఈపెళ్లిచేసుకోమంటావా? వద్దంటావా?

సోమ—పిల్లకోసం వెళ్లాడుకదా? ఎలాగో తీసుకొచ్చి చెన్నపట్నంలో మనం చూసిన ఇంట్లో ప్రవేశపెడతాడు.

సత్య—పెళ్లిచేసుకోకుండా అంతటితోనే వ్యవహారం కట్టిపెట్టమంటావా?

సోమ—ఇప్పటిస్థితిగతుల్లో ఏమీ చెప్పలేను. కృష్ణరావు ఏపని అయినా ఆలోచించి చేసే మనిషి గనక, వాడి ఊహాలు ఇలా ఉంటాయి అని అనుకోడానికి వీలుగా ఉంటుంది. ఇప్పుడు ఒకవైపు చిన్నప్పటినించీ పెంచి పెద్దచేసి విద్యాబుద్ధులు నేర్పిన తల్లిదండ్రులున్నారు. ఇంకొకవైపున అభాగ్యమైన చిన్నప్పటినించీ ప్రేమించి కృష్ణరావుకోసం ప్రాణాలైనా అర్పించే అనన్యశరణ్యయైనపిల్ల ఉంది. ఈ రెండింటికీ ఎలాగ కుదరడం?

సత్య—ఈలోపుగా మనము ఆపిల్లకు కృష్ణరావుమీద ఉన్న ప్రేమనుగూర్చిన్నీ, ఆపిల్లమీద కృష్ణరావుకున్న ప్రేమనుగురించిన్నీ, కృష్ణరావుశపథాన్నిగురించిన్ని అంతా తల్లిదండ్రులకు వ్రాసి, కృష్ణరావు వారిని అడిగినప్పుడు వారు అనుమతించేలాగ చేస్తే బాగుండదూ?

సోమ—మనము కృష్ణరావు సౌఖ్యమే కోరినవాళ్లమైతే, వాణ్ణి అడగందే, ఈపని చెయ్యకూడదు. ఇప్పుడు మించిపోయిన దేమిటి? వాడొచ్చాక ఈఆలోచన వాడికి చెప్పి, వాడికి మనచేతనైనంత సహాయం చేద్దాము.

ఈ పైమాట లగునప్పటికి వారిరువురును వారిగదిని చేరి నిద్రించిరి.

రైలుబండియందు కృష్ణరావునకు మొదట చాల నిద్రవచ్చెను. గాఢముగ రెండుమూఁడుగంటలు నిద్రించి యాతఁడు మేల్కొనెను. అప్పటినుండియు నాతనిమనస్సునం దెన్నియో యూహాలు తిరుగాడఁజొచ్చెను. మరల నాతనికి నిద్రపట్టలేదు. ఇంతలో నాబండిలోని వారిలో నొకరు "హిందూ" పత్రికను చదువుచుండిరి. అందు ముఖ్యమైనవిషయ మని చెప్పి ఆమనుజుఁ డిట్లు గట్టిగ చదువనారంభించెను.

"కొలనుకొండలో దారుణమరణము.



"మూఁడుదినములక్రితము కొలనుకొండకు సుమారు ఒకమైలు వాయవ్యమూలగా నున్నమఱ్ఱిచెట్టువద్ద అడుగు లోతుగల యొకగుంటలో నొకమనుష్యుని శవము కనఁబడెను. దానిని నక్కలు పీకితినుచుండఁగా తెలిగ్రాఫుబంట్రోతు, పీరుమియాను సాహెబ్బు దానిని చూచి కొలనుకొండలో చెప్పెను. ప్రొద్దున్న ఎనిమిదిగంటలకు ఊరివారందఱును గుమికూడి యచ్చట చూచుటకు వెడలిరి. పందికొక్కులను చంపుట కుద్దేశించిన కత్తెరబోనులో మెడ ఇరికించికొని యాతఁ డాగుంటలో మరణించెను. గుంటమీద మఱ్ఱికొమ్మలును ఆకులును దట్టముగ పడియుండెను. ఆమనుష్యుని కోటుజేబులలో నున్న కాగితములవలన నాతఁ డాత్మహత్య చేసికొనె నని పంచాయతీ చేసిరి. ఇంకను అనేకములగు రహస్యవిషయములు బయల్పడ నున్న వని యూహింపఁబడుచున్నది. ఈఆత్మహత్య చేసికొన్న మనుజుఁడు ఏలూరు వాస్తవ్యుఁడు. పేరు విభూతి కామరాజు."

ఇది చదివిన వెనుక, పైవిషయమునకే సంబంధించిన వేఱొక్క విషయమును ఆహిందూపత్రిక చదువుచున్న పెద్దమనుష్యుఁడే చదివెను.

"కొలనుకొండలో ఆత్మహత్య చేసికొని మరణించిన కామరాజుదగ్గఱ కనపడిన కాగితములో నాతనిమరణకారణమువివరింపఁబడినది. ఆతఁడు ఏలూరునం దొకయువతిపై మక్కువ గలిగియుండి, ఆమెవద్దకు తఱచుగా పోవుచుండువాఁడఁట. ఆయువతి మఱొక యువతిపై నేకారణముననో కోపము గలిగి, ఆమెను బలాత్కరింపు మని కామరాజును కోరెను. కామరా జందుల కియ్యకొనెను గాని యాతని ప్రయత్నము విఫలమయ్యెను. వెంటనే భయదుఃఖముల పోటునకు లోనై కొలనుకొండలో నాతని బంధువుల యింటికి వచ్చి రెండుదినములలో మరణించెను. ఈయుదంత మంతయు, వ్రాసినకాగితమునందే తన

ణాముసకుఁ డానే కారకుఁడ ననియు, భగవంతుఁడు తప్పక పాపులను శిక్షించు ననియు కామరాజుస్వహస్తముతోనే వ్రాయఁబడియుండెను.

కృష్ణరా విది యంతయు వినెను. కామరాజు హైమవతుల మధ్య జరిగినసంగతులు కృష్ణునకు హైమవతి యుత్తరమువలనఁ దెలిసెను. కాని ఆయుదంతమును ఆగంటివా రెట్లు దాఁచిరో అట్లే కృష్ణరావు తనస్నేహితులకుఁగూడ చెప్పకుండ దాఁచెను. ఇప్పు డాకామరాజు మరణించె నని యాతఁడు తెలిసికొని విచారించెను. హైమవతి వ్రాసినయుత్తరము చూచినప్పుడు కామరాజున కెప్పుడైన బుద్ధిచెప్పవలయు నని కృష్ణరావు తలంచియుండెను. కాని, ఇప్పుడు తనకుఁ దానే బుద్ధిచెప్పుకొన్న కామరాజునుగూర్చి మెత్తనిగుండె కలవాఁడగు కృష్ణరావు చింతించెను.

ఈవిషయమునుగూర్చియు ననేకములగు నితరవిషయములను గూర్చియు నంతు పంతు లేని యాలోచనలలో మునిఁగి నిద్దురలేక యాతఁడు బెజవాడలో లేచి, ముఖము కడిగికొని యల్పాహారములను గొన్నింటిని భుజించి మరల మెయిలుబండి నెక్కి ఏలూరులో దిగెను.

---

## పదునాలవ ప్రకరణము.

---

రైలు దిగినవెంటనే మునుపటివలెనే కృష్ణరావు లక్ష్మమ్మ పూటకూటింటికిం జనెను. ఇప్పు డతఁడు కట్టుబట్టలతో వచ్చెను. చేతిలో సూటుకేసైనను లేదు. ఆతఁడు లక్ష్మమ్మపూటకూటియింటికిం జని యొకగది తీసికొనెను. ఇఁక నేమి చేయుద మని యాతఁ డాలోచింపఁ దొడంగెను. హైమవతిని గలిసికొనుటకు నాఁటిసాయంకాలము సరియగుసమయ మని యాతఁ డెఱుంగును. అది సుందరమ్మ పురాణము విను సమయము. కాని నాఁటిరాత్రి రైలునందే చెన్నపురికి వెడలుట మంచిదని యాతనికిఁ దోఁచెను. తాను మఱొకదినము ఏలూరులో నున్నచో తన్నెఱిఁగినవారి కెవరికైనను గనఁబడిపోవుదు నని యాతఁడు భయపడెను. అప్పుడు సెలవు లగుటచే ననేకు లగుస్నేహితులేలూరునం దుండిరి. లక్ష్మమ్మపూటకూటియింటి నాలుగుగోడలనడుమను గూర్చున్నచో యాతఁడు వచ్చినపని కాదు. బైటికిఁ బోయినచోఁ దాను వచ్చినసంగతి నలుగురికిఁ దెలిసిపోవును. ఏది యెట్లైనను నాఁటిరాత్రియే బయలుదేఱవలె నని యాతఁడు తీర్మానించుకొనెను. ఆతఁడు పూటకూటియింటిలోని తనగదికి తాళమువైచికొని హైమాన్వేషణమునకై బయలుదేఱెను.

ఇప్పు డాగంటివారి యింటిస్థితి యెట్లుండెనో విచారింతము. కామరాజుమరణమునుగూర్చి వీరమ్మ విని యుండెను. ఆతఁడు చనిపోవునప్పుడు తా నాత్మహత్య చేసికొనఁబోవుచుంటి ననియు, ఆసంగతి పత్రికలలో వేయఁబడు ననియు, దానినిగూర్చి తనయంతమునుగూర్చి తెలిసికొని దుఃఖింపు మనియు కొలనుకొండనుండి వీరమ్మకుఁ గామరాజొకయుత్తరము వ్రాసెను. ఆయుత్తరమును జూచి వీరమ్మ మిగుల దుఃఖించెను. కాని ఆమెకు రోషముకూడఁ గలిగెను. ఇట్టి పిరికిపంద తాను నియమించిన కార్యములను చేయఁజాలక బుద్ధిహీనుఁ డగుటచే నాపిరికిపందను తా నిన్నిదినములును ప్రేమించినందుల కామెలో నామెకే యసహ్యముగ నుండెను. కామరాజు మరణ మామెకు దుఃఖకారణ మగుటకు బదులు కొంతసేపటివఱకును కోపకారణ మయ్యెను. కొంతసే పగునప్పటి కామె కోపము తగ్గి యథాస్థితికి వచ్చెను. ఈస్థితి మఱికొంతసేపటికి దుఃఖముగఁ బరిణమించెను. వీరమ్మ స్థితి కొన్నము

లో తేలు కుట్టిన దొంగవంటిది. కామరాజునుగూర్చి యామె బైటి
కేమియు ననక దుఃఖార్తయై తనగదియందే యుండినచో దుఃఖోపశమ
నము కాదు. ఇట్లు కుళ్లి కుసుమారుచున్న వీరమ్మ, ఇంటిస్థితిగతులతో
నేమియు సంబంధము కలిగించుకొనలేదు. కాని దీని కంతకును హైమ
వతియే కారకురా లని యామె నిశ్చయించెను. ఆమెను నరకబాధలకు
లోను జేసినఁగాని తనకసి తీఱదని వీరమ్మ తలంచెను.

రామయ్య చనిపోయినప్పటినుండియు హైమవతికి తలదువ్వుకొ
ను నవకాశము గాని, చిఱుతిండ్లుగాని లేకపోయెను. అంతకు మును
పటి ఏకభుక్తాదికష్టములతోపాటు ఇప్పుడు కామరాజు మరణమువలనఁ
గ్రొత్తకష్టములు రానై యుండెను.

కామరాజుమరణమునుగూర్చి హైమవతి ఎఱుఁగదు. వీరమ్మ
హైమవద్దకు వచ్చి భగ్గుభగ్గని మండుహృదయానలమును దాఁచు చి
ఱునవ్వుతో "ఆనాఁడు నిన్ను పట్టుకోవచ్చాడే అతను చనిపోయినాఁ
డు" అని చెప్పెను.

హైమవతి యప్పుడే యంకురించిన సంతోషమును వెలిపుచ్చక,
ఆవిషయమునందుఁ దన కంతగా శ్రద్ధయుండనట్లు "అలాగా!" అని
యూరకుండెను.

వీరమ్మకు హైమవర్తనము ఈసడింపువలెఁ దోచెను. లోపల
మండుచున్న దుఃఖాగ్నికి హైమ యశ్రద్ధాపూర్వకమైన మాట నేయి
పోసిన ట్లయ్యెను. వీరమ్మ యుక్కిరిబిక్కిరియై, ఆవేశపూరితయై హైమ
పైఁబడి చావమోదెను. హైమ గదినుండి బైటికిఁ బోవఁ బ్రయ
త్నించెను. కాని వీరమ్మ గ్రుక్క నీరుగ్రుక్కకొనుచున్న హైమవతిని
గదిలోనికిఁ ద్రోచి బైట గొళ్లెమును తాళమును పెట్టియుంచెను.

సుందరమ్మ కామరాజు మరణము విని విచారించెను. కామ



రాజునకును వీరమ్మకును గలసంబంధబాంధవ్యములనుగూర్చి సుందరమ్మ
కంతగాఁ దెలియదు. కాని మనస్సునందు కామరాజుమరణమునకే
కారణముచేతనో సుందరమ్మ విచారింపసాగెను. వీరమ్మ దుఃఖమును
సుందరమ్మ గుఱుతించెను. అంత దుఃఖముండుట సామాన్యము గా
దని వీరమ్మ తెలిసికొని తత్కారణముగా నేదేని చెప్పవలయు నని త
ల్లితో నిట్లనెను. "అమ్మా కామరాజుతండ్రిన్నీ, నాన్నాను ఒకబళ్లో
నే చదువుకున్నారు కాదూ? వాళ్లిద్దరూ చిన్నప్పటినించీ స్నేహితులు
గారూ? కామరాజు చనిపోయినాఁ డని విని వాళ్లతండ్రి ఏమనుకుంటా
డో? పాపము ?"

ఇట్టిమాటలతో తననిజమైన దుఃఖకారణమును వీరమ్మ దాఁచ
ప్రయత్నించెను. సుందరమ్మ గొంతవఱకది నిజమే యని భావించెను.
ఇంతదుఃఖించు వీరమ్మ చాల మెత్తనిమనస్సు గలది యని సుందరమ్మ
యూహించి కొన్నిదినములపాటు, వీరమ్మదుఃఖము శాంతించువఱకును
వీరమ్మచేతలకుఁ గాని మాటలకుఁగాని యడ్డము చెప్పఁదలంచుకొన
లేదు. ఇట్టిస్థితిలో హైమవతి గదికి తాళమువైచినందులకైనను వీర
మ్మను సుందరమ్మ ఒక్కమాటయైన ననలేదు.

కృష్ణరావు ఏలూరువచ్చునప్పటికి స్థితిగతు లీప్రకారముగ నుం
డెను. కృష్ణరావు లక్ష్మమ్మపూటకూటిఇంటివద్ద బయలుదేఱి త్రోవ
లో నెవ్వరును తన్ను గుర్తింపకుండ శ్రద్ధతీసికొని యాగంటివారింటికి
వచ్చెను. ఇంటితూర్పుభాగమున వంటఇంటివద్ద వీరమ్మయు సుందరమ్మ
యు వంటప్రయత్నముమీఁద నుండిరి. చావడిలో నెవ్వరును లేరు.
రామయ్య వ్రాసికొను బల్లపై కాగితము లిష్టమువచ్చినవిధమున చె
ల్లాచెదరై పడియుండెను.

చావడివాకిటివద్ద నిలిచి క్రొత్తమనుష్యుఁ డెవరో వేంకటప్ప

య్యగారికొఱకో ఇంకనెవరికొఱకో వచ్చినట్లు తొంగిచూచెను. ఎవ్వరును లేరు. నిరాఘాటముగ [illegible] చావడిలోఁ బ్రవేశించి చావడిని దాఁటి పొడుగుగదిలో[illegible]. అచ్చటనుండి హైమగదివంకఁ జూచునప్పటి కది [illegible]. కృష్ణరావు భయవిహ్వలమానసుఁ [illegible]. [illegible] నాతనిహృదయమునఁ బొడచూపనారంభించెను. వెంటనే యచ్చట నిలువక యాతఁడు పెద్దతోఁటలోనికిం జని హైమగదికిటికీ చెంతకుఁ జనెను.

హైమవతి కిటికీవద్ద నిలువఁబడియుండెను. శుష్కించి ఎండిపోయిన శిశిరతరువువలె నక్కడ నిలిచి తన్నుఁ గొట్టుటకుఁగూడ జంకని వీరమ్మనుగూర్చి హైమవతి తలపోయుచుండెను. ఎన్నిదినములు తానట్లు కష్టపడవలెనో హైమకుఁ దెలియదు. కృష్ణునకు వ్రాసినయుత్తరమ్మాతనికి చేరినదా? లేదా? ఉత్తరము చేరినను ఆతఁడే ముందొకప్పుడు వచ్చి బతిమాలినను, ప్రేమాలాపము లాడినను వలదు పొమ్మనిన హైమవతిని క్షమించునా? క్షమించి తల్లిదండ్రులనడుగకుండ తనకు సాహాయ్యము చేయునా? కృష్ణుఁడు తన్ను ప్రేమించునా? వచ్చి ఎప్పటివలె. హైమా యని పిలిచి కరస్పర్శచే తన్ను గారవించునా? గారవించి చెన్నపురి తీసికొనిపోయి తన్ను రక్షించునా? రక్షించి వివాహమాడునా? యని హైమవతి తలపోయుచుండెను. హైమవతి యుత్తరము వ్రాసి నేఁటికి నాలుగుదినము లైనది. ఇంకను కృష్ణుఁడు రాలేదు. పరీక్షలైపోయి శలవు లిచ్చిరన్న సంగతి హైమకుం దెలియును. కృష్ణుఁడు రాకుండుటకుఁ గారణమేమి?

ఈమాట లనుకొనుచు హైమ కాగితమును పెన్సలును తీసికొని,

"కృష్ణుఁడు, బావ, నన్ను క్షమించును. నన్ను ప్రేమించును. నన్ను తప్పక వివాహమాడును. ఇక బావ నాకృష్ణుఁడు, నేను కృష్ణుని



హైమను" అని పెద్దపెద్ద యక్షరములు వ్రాసెను. అది పిచ్చియో మంచియో యామె యాలోచింపలేదు. అది సగముపిచ్చి యని యామెకుం దెలియును. కాని ఏభావవిజృంభణముచేతనో యామె యట్లు వ్రాసితీరవలె నని నిశ్చయించుకొనెను. హైమకిటికీ దగ్గఱకుఁ జని కిటికీపై పుస్తకము పీపుత్రిప్పి యాకాగితమును చదువుకొనెను. అందు 'నాకృష్ణుఁడు' అన్నపదమును కొంచెము గట్టిగ నుచ్చరించుచు ముద్దిడుకొనెను.

కృష్ణుఁడు కిటికీపైటనుండి ఇది యంతయుఁ జూచుచుండెను. సాధారణముగ జాగ్రత్తగ నుండు హైమవతి నేఁడు కృష్ణునెట్లు చూడఁజాలకపోయెనో మన కాశ్చర్యము గలిగింపకమానదు. కృష్ణుఁడు హైమభావోద్రేకతరంగములనుఁ జూచెను. అతనికిని హైమకును నడుమ కిటికీకమ్ములు లేకున్నచో నొక్కనిముషములో హైమ కృష్ణుని సంశ్లేషమునం దుండుననుటకు సందేహము లేదు. కాని, ఆపాడు ఇనుపకమ్ములు ప్రేమప్రవాహమునుగూడ అడ్డుపెట్టుచుండెను.

హైమవతి గదిలోనికిం బోవుట ఎట్లని కృష్ణుఁడు ప్రశ్నించుకొనెను. అచ్చటనే నిలిచి హైమవతితో మాటలాడవలె నని కృష్ణరావు ద్రోశించెను. కాని ఆపెద్దతోఁటలో నటుల నిలిచి హైమతో మాటలాడు తన్నెవ్వరైనఁ జూచినచో ప్రమాదము గలుగు నని యాతఁడు తెలిసికొనెను. సుందరమ్మ గదిలోనుండి హైమవతిగదిలోని కొకద్వారము గల దని కృష్ణరావునకు జ్ఞాపకము వచ్చెను. ఆద్వారముగుండ హైమవతిగదిలోనికి వచ్చుటకు వీలగునా? యని కృష్ణరావాలోచించెను. హైమవతిగదికిటికీగుండ నాతఁడు తొంగిచూచెను. ఆతలుపునకు గొళ్లెము లేదు, తాళములే దని కృష్ణరావు తెలిసికొనెను.

వెంటనే హైమవతిని పలుకరించకుండ కృష్ణరావు పొడుగుగదిలో ప్రవేశించి చావడిలోనికిఁ దొంగిచూచెను. అచ్చట నెవ్వరును

30

లేరు. మెల్లగ నాతఁడు వేంకటప్పయ్యగారి నెవ్వరైన నున్నారేమో యని తొంగిచూచెను. వేంకటప్పయ్యగారు మాత్రము మంచముపైఁ గూర్చొండి యుండిరి. మఱెవ్వరును లేరు. చప్పుడు చేయకుండ కృష్ణరావు వేంకటప్పయ్యగారిగదిలో ప్రవేశించెను. ఆరీతి తనగదిలోనఁ బ్రవేశించిన కృష్ణరావును వేంకటప్పయ్యగారు తేఱిపాఱఁ జూచిరి. "నాయనా, కృష్ణా! వచ్చావుటోయి. నాచేతులో చెయ్యేసి హైమనే చేసుకుంటా నని చెప్పు!"

కృష్ణరా వట్లే యొట్టుపెట్టుకొనియెను. వెంటనే యాతఁడు చేసిన పని కాతఁడే దిగ్భ్రమనందెను. తా నేమి చేయుచున్నదియుఁ దెలియకయే వేంకటప్పయ్యగారి కాతఁ బాదాఘ్రాణము చేసివైచెను. కృష్ణుఁడు విచారింప నారంభించెను గాని, విచారించుట కది సమయము కా దని తెలిసికొని వేంకటప్పయ్యగారి యనుమతి తీసికొని కృష్ణరావు సుందరమ్మగదిలోఁ బ్రవేశించెను. వీరమ్మగదిలోనికిని సుందరమ్మగదిలోనికిని నడుమనుండు ద్వారమున కాతఁడు గొళ్ళెమును వైచెను. అట్లే, చిన్నతోఁటలోనికిఁ బోవు తలుపుగూడ నాతఁడు మూసివైచెను. మెల్లగ హైమవతి గదితలుపుగొళ్ళెమును తీసి తలుపు తెఱచెను.

ఆతలుపు తెఱవఁబడి సుమారు రెండునెలలైన నై యుండును. ఆతలుపు కదలుట చూచి హైమవతి యులిక్కిపడెను. మరల నే కామరాజైనను వచ్చుచుండెనా? ఆమెకు తప్పించుకొని పోవు మార్గము లేదు. "భగవంతుఁడా!" యని యఱచేత ప్రాణములు పెట్టుకొని విభ్రాంతపోయి చూచుచుండెను.

కృష్ణరావును చూచుటతోడనే యామెసంతోషాతిశయమునకు మేరలేదు. కృష్ణరావు హైమవద్దకుఁ జని యామె దేహలతను తన యెడమచేతితో చుట్టివైచెను. ఇరువురిహృదయములును ప్రేమావేగ



ముతో కొట్టుకొని యొకటితో నొకటి దగ్గరచేరి సంభాషించుకొనుచుండెను.

కృష్ణరావు హైమచేతిలోని కాగితమును తీసికొనెను. హైమ మాఱుమాటాడక కాగితము నిచ్చివైచెను. కృష్ణుఁ డాకాగితమును చదువుచుండఁగా హైమ కృష్ణుని ముఖమువంకఁ జూచుచుండెను. ఆతని కన్నులు మూఁతపడుచుండెను. ఆతనిముఖమున నొక్కటే భావము చిత్రింపఁబడియుండెను. ఆభావము గాఢమగు మోహమేయని హైమకుం దెలియును.

ఆకాగితమును చూచిన వెనుక కృష్ణుఁడు హైమముఖమును వీక్షించెను. హైమవతికన్నులు మూఁతలు పడుచుండెను. కృష్ణుని యెడమచేతిపై నామె బరువంతయును మోపెను. కృష్ణుఁడు చేయి తీసివైచినచో నామె క్రిందఁబడియుండును. కృష్ణుఁడు తన తలవంచి హైమ యధరపల్లవమును రెండునిమిషము లొక్కటే ముద్దుతో మూసివైచెను.

కృష్ణుఁడు గదిలో ప్రవేశించినది మొదలింతవఱకును, వారొకరితో నొకరు మాటాడలేదు. ఒక్క యక్షరమైన వారి పెదవులనుండి బైటికి రాలేదు. వారిహృదయములే పదిలక్షలమాటల, వాక్యముల, గ్రంథముల పెట్టుగ నుండెను. వారిభావములు వాక్యాతీతములు, పుస్తకాతీతములు—వేయేల—ప్రపంచాతీతములు, విశ్వాతీతములు!

కృష్ణరావే మొట్టమొదట మాటలాడ నారంభించెను. ఆమెను తనకౌఁగిలినుండిమాత్రము వదలిపెట్టలేదు.

"హైమా! ఇవ్వాళరాత్రి మెయిల్లో వెళ్ళిపోవాలి." అని ఆమె చెక్కిలిదగ్గిర నోరుపెట్టి యాతఁడు రహస్యము చెప్పినట్లనెను.

హైమవతి మాటలాడలేదు. ఆమె మాటలాడఁజాలకపోయెను

కాని, యామెముఖమునందు అంగీకారమును సంతోషమును తాండవ మాడుచుండెను.

వెనుకటియట్లే మరల హైమవతి చెవిలో కృష్ణరావు మెల్లగ చెప్పెను. "హైమా పిచ్చిపిల్లలాగు అలా చూస్తావేమిటి? రాత్రి ఎనిమిది గంటలకు నేనిక్కడికి వస్తాను. మనం బైటికి వెళ్లడానికి సాధనం ఏలాగా?"

హైమవతి మరల కృష్ణునివంకఁ జూచెను. కృష్ణునిచూపు లామెచూపులను కలసికొనెను. ఆచూపుల తీక్ష్ణమున కామె తాళఁజాలక కన్నులను మూసికొని పేఱొకవంకఁ జూచెను.

కృష్ణరావు వారముదినములముందామె నైచుకొన్న జడకొనను కుడిచేతఁ బట్టుకొని దానివంకఁ జూచుచు నిలుఁబడెను. "మీఅమ్మగదిలో రాత్రి ఎవరన్నా పడుకుంటారా?"

హైమవతి ఇప్పుడు మాటలాడక తప్పినది కాదు. ఆమె కృష్ణునిచేతిలోనున్న తనజడకొనవంకఁ జూచుచు కృష్ణుని వామబాహువుచేఁ గల్పింపఁబడిన వలయమునందే యుండెను. "అయితే, బావా, నన్ను క్షమించవా?" అని యామె హాస్యముగా నడిగెను. ఆమె వంచినతల వంచినట్లే యుండెను. కృష్ణునివంకఁ దేఱిపాఱచూడలేదు.

కృష్ణుఁ డామెను మరింత గట్టిగ తనవామబాహువలయమునందు బంధించెను. అతఁడు వారమురోజులక్రిందట దువ్వఁబడిన హైమతలవెండ్రుకలవంకఁ జూచెను. కుడిచేతిలోనున్న జడకొనను వదలివైచి యామెగడ్డమును పట్టుకొని యాసుందరవదనమును తనవంకకుఁ ద్రిప్పుకొని యొక్కముద్దు పెట్టుకొనెను. ఇదియే యామెప్రశ్నకు ప్రత్యుత్తరము. ఒక్కయరనిమిషమైన తరువాత నాతఁడు మరల మునుపటి ప్రశ్నమునే యడిగెను. "హైమా! ప్రక్కగదిలో రాత్రి మీ



అమ్మ పడుకుంటుందా?"

హైమవతి యెవ్వరును ఉండరని సైగచేయుచు "ఊఁహూఁ" అనుచు నాతని చొక్కాకొనను తనవ్రేలికిం జుట్టుకొనుచుండెను.

తా నక్కడకు వచ్చి చాలసేపైన దని యాతనికిఁ దోఁచెను. కాని వ్రేలికి తనచొక్కాను చుట్టుకొనుచుండిన హైమవద్దనుండి చొక్కా లాగివేయుట యతిక్రూరమని యాతనికిఁ దోఁచెను. కొంతసే పామెవ్రేలివంక నాతఁడు చూచెను. "హైమా! మన్ని ఎవరన్నా చూస్తారు. ఇప్పుడు నేను వెళ్లి మళ్లీ రాత్రి ఎనిమిదిగంటలకు వస్తాను.

ఆమె బాష్పపూరితనేత్రయై యాతనివంకఁ జూచెను. అతఁడు తనజేబురుమాలుతో నామెకన్నీటిని తుడుచుచు, ఆమెబాష్పములను జూచి తనకన్నులనుండి ప్రవహించుటకు సిద్ధముగ నున్న బాష్పముల నాపుకొనుచుండెను. "హైమా! ఈకాస్తకే ఇలా. అవుతా వెందుకు? ఇప్పుడు వెళ్లి మళ్లీ రాత్రి వస్తానుగా? నువ్వుకూడా ఇలాగే చేస్తే ఎలా? చదువుకున్నపిల్లవు నువ్వుకూడ కన్నీళ్ళు పెట్టుకోవడమేమిటి? నేను మళ్లీ తప్పకుండా వచ్చి నిన్ను తీసికెడతాను. ఇవ్వాళరాత్రి మెయిల్లో చెన్నపట్నం వెడదాం? చూడు! మొహమంతా కందగడ్డలాగ ఎలా ఎఱ్ఱబడ్డదో!"

ఆమె బాష్పములు చాలించెను. కృష్ణరావు జేబురుమాలుతో తానే కన్నులను ముఖమును తుడుచుకొనెను. అతఁడు తనయొడమచేతి నింకను తీసివేయలేదు. ఆమెవంకఁ జూచుచు నిలువఁబడెను. "నేను మ్మఅత్తకీ, మామకీ ఈసంగతి చెప్పలేదు. నీబట్టలు అవీ ఏమున్నాయో మీఅమ్మని అడిగి పెట్టెలో వేసుకొని ఉంచుకో. మామకు—అంటే మీనాన్నకు నే నొచ్చినసంగతి తెలును. మీఅమ్మకీ వాళ్లకీ ఏమీ తెలియనియ్యకు. నీబట్టలూ అవీ ఇయ్యకపోతే, వాళ్ళను

ఇయ్యవని మళ్లీ అడగొద్దు. ఏది ఎలాఉన్నా ఎనిమిదిగంటలకు మోహన బొట్టుకొని, మంచిచీర వాళ్ళిస్తే కట్టుకుని ఈగదిలోనే సిద్ధంగా ఉండు. ఈగదిఅవతల గొళ్లెము వెయ్యకుండా పెడతాను. ఆరు, ఏడు గంటలకి ఎవ్వరూ లేకుండా చూసి, ఈగది తలుపు తీసుకొని చిన్నతో వీధితలుపు గడియ తీసేసి మళ్లీ ఈతలుపులు వేసుకొని ఈగదిలోనే ఉండు. మధ్యాహ్నమే వీళ్ళైనప్పుడు మీనాన్నకి నమస్కారం చేసి సిద్ధంగా ఉండు... నేను చెప్పినవేవీ మరచిపోవుగద ?”

ఆమె అన్నింటికిని తలయూపెను. అతఁ డాగదిలోనుండి సుందరమ్మగదిలోనికిఁ బోయి తలుపు దగ్గఱగ మూసివైచెను. ఆతరువాత వేంకటప్పయ్యగారి గదిలోని కాతఁడు పోయెను. వేంకటప్పయ్యగారితో రాత్రి మెయిలునకుఁ బోవనిశ్చయించిన వైనము తెలియపఱచెను. వేంకటప్పయ్యగారు ‘ వల్లె ’ యనిరి. కృష్ణరావు మంచముమీఁదినుండి లేచి వెళ్లి వచ్చెద ననెను. వేంకటప్పయ్యగా రాతనివంకఁ జూచి “ ఇక్కడ భోజనముచెయ్యవూ ?” అని యడిగెను. కృష్ణరావు తనరాక ఇంటిలోని వారికిఁ దెలియుట మంచిదికా దనియు, తనప్రయత్నము విఫలమగుట సంభవించు ననియుఁ జెప్పి సెలవు తీసికొనెను. మఱల నేమియో యాలోచించి, వేంకటప్పయ్యగారి పాదములకు వంగి నమస్కరించెను.

వేంకటప్పయ్యగారికి పట్టరానిసంతోషము వచ్చెను. “ దీర్ఘాయురారోగ్యైశ్వర్యసిద్ధిరస్తు. శీఘ్రమేవ వివాహసిద్ధిరస్తు. నాయనా కృష్ణా ! హైమను చేసుకోడానికి నిశ్చయించి నాకు హృదయశాంతి తీసుకొచ్చావు. చెదరిపోయిన నాకుటుంబానికి నువ్వు ఒక్కడివే ఇక పట్టుకొమ్మవు. నాకు అన్నలూ తమ్ములూ ఎవ్వరూ లేరు. నాకు నువ్వే దగ్గిరబంధువివి. నే నెవరినైతే ఈప్రపంచకంలో ప్రేమించానో వాళ్ళిద్దరూ బుద్ధిమంతులై పెద్దవాళ్ళను గౌరవించడం నాకు చాలా సంతోషం. విద్యాబుద్ధులు నేర్చుకొని హైమను జాగ్రత్తగా చూసుకో. నీపెళ్ళిచేసేగీత నామొహాన లేదు. ఇప్పుడే నీకు హైమను అప్పగించేస్తున్నాను. దానికి వేరే దిక్కు లేదు. నిన్నే నమ్ముకుంది. ఎలా చూసుకుంటావో నాయనా ?... మీఅమ్మ దీని కెలాగైనా ఒప్పుకొనేలా చేస్తే తల్లిలాగ దాన్ని చూసుకుంటుంది.” ఇట్టిపలుకులను బలికి వేంకటప్పయ్యగారు కృష్ణరావునకు సెలవొసంగి పంపివైచిరి.



సుమారు పదిగంటలకు వీరమ్మ హైమవతిగదితలుపుతాళము తీసి, ఆమెను స్నానముచేయఁ బొమ్మనెను. హైమవతియు మాఱుమాటాడక స్నానమునకుఁ జని చన్నీళ్ళు పోసికొని భుజించి లేచెను. వీరమ్మకూడ భుజించి లేచి తండ్రికి అన్నముఁబెట్టుచుండెను. ఇదియే సమయ మని సుందరమ్మదగ్గఱకుఁ జని హైమవతి తనబట్టలను ఆభరణములను ఒక్కమాఱైన ధరింప నిమ్మని యతిదీనముగ వేఁడికొనెను. చీఁకటిపడువఱకును తనగదిలోనే యుండు ననియు, తనచీరలు మొదలైనవానిని తనగదిలోఁగాక వేఱొక్కచోఁ బెట్టుట యేల యనియు నామె చాలదీనముగ నడిగెను. వీరమ్మ దగ్గఱ లేకపోవుటచేతను, సుందరమ్మహృదయము తల్లిహృదయ మగుటచేతను కొంత కరఁగెను. హైమయొక్క వైధవ్యమునకుఁ గారకు లెవరు ? అని యామె ప్రశ్నించుకొనెను. తానే కేశవరావుమరణమునకుఁ గారకురాలు. ఆమె కీకష్టమును దెచ్చిపెట్టి యొక్కమాఱైన నామె కావస్త్రాభరణాదు లీయకుండుట యామె కతిక్రూరముగఁ దోఁచెను. అదియునుగాక వైశాఖమాసము వచ్చుటతోడనే యామెశిరోజములు మంగలికత్తి కెరగావలసియుండెను. ఆమె యీసౌందర్యము తెచ్చిపెట్టుకొనినను ఈనాలుగు దినములేకదా ? అని యామె తలపోసెను. ఆతరువాత ఈవస్త్రములకుఁగాని, యాభరణములకుఁగాని యామె ప్రయత్నింపదు.

ఇట్లాలోచించి సుందరమ్మ తనరెండవకుమార్తెకు వంటసామ
గ్రులు పెట్టుకొనుగదిలో నున్న హైమవతిపెట్టెను తీసికొనిపోవ నుత్తరు
విచ్చెను. ఆమెయు మిక్కిలి సంతసించి, మరల వీరమ్మ చూచినచో
నేమనునో యనుభయము ముప్పిరిగొన, చడియుఁ జప్పుడును గాకుండ
తనగదిలోనికిఁ బెట్టెను గొనిపోయెను. వీరమ్మ, తండ్రి కన్నముపెట్టి
సుందరమ్మనగ్గఱకు వచ్చెను. సుందరమ్మ ఆమాటయు నీమాటయుఁ
జెప్పి యొక్కదినముమాత్రము హైమవతి యందముచేసికొనునట్లు వీర
మ్మచేత నొప్పించెను.

నాఁటిదినము సుందరమ్మయే హైమవతిఁ దలదువ్వి జడవైచెను.
ఆజడనిండ మొగలిపువ్వులును, మల్లెపువ్వులును గ్రుచ్చెను. బాగుగ
సాయంతనస్నానము చేయించెను. ముఖమునఁ జిన్న చక్కని సాదు
చుక్క పెట్టెను. ఒకవిలువగల బనారసుపట్టుచీర గట్టికొని హైమవతి
యొకపట్టురవికను దొడిగికొనెను. అప్పటి యామెరూపము చూచి తీర
వలెను గాని వర్ణింప నెవ్వనిశక్యము ?

సుందరమ్మ కేశవరావు మరణకాలమునుగూర్చి తలపోసి దుఃఖిం
ప నారంభించెను. వీరమ్మ కామరాజును తలంచుకొని ఏడువసాగెను.
ఆయిరువురిదుఃఖముతోను హైమవతి సంతోషస్వాంతయై యుండెను.

సుందరమ్మవీరమ్మలను భోజనములచావడిలో విడిచి, హైమ
వతి వేంకటప్పగారివద్దకుం జని నమస్కరించెను. వేంకటప్పయ్యయు
హైమకుఁ గొన్నిబుద్ధులు చెప్పి, భర్తవద్ద నడఁకువతోఁ బ్రవర్తింపు
మని తెలిపి దీవించి పంపివైచెను.

తాను వాగ్దానముచేసినచొప్పున హైమవతి ఇటునటు తిరుగుచు
తనగదిలోనే యుండెను. సాయంకాలము సమీపించినకొలఁదిని హైమ
వతికేదో యొకవిచారము కలుగ నారంభించెను. చిన్ననాఁటినుండి



యు తాను పెరిగిన ఇంటిని, తనతల్లిని, తనతండ్రిని, తనతోనాడుకొను
న్న పిల్లలను విడిచి తానెన్నఁడు నెఱుంగని చోటునకు కామె పోవలసి యుం
డెను. పెద్దతోటలోని చెట్లతోడను, చిన్నతోటలోని చెట్లతోడను
ఆమె పదమూఁడేండ్లు స్నేహముచేసెను. ఆస్నేహితుల నందఱను వద
లి తా నెచ్చటికో పోవలసి యుండెను. మరల తనజీవితకాలమున నేలూ
రికి రాఁగలుగునా? మునుపటియట్లే ఇల్లంతయుఁ దిరిగి తనచిన్ననాఁటి
తరుమిత్రులతో స్నేహభావము గలిగి ప్రవర్తించుటకు వీలగునా ?
యని యామె చింతాసాగరనిమగ్నమానస యయ్యెను.

రాత్రి యామెకు భోజనముచేయువాడుక చాలకాలమునుండి
యు లేదు. నేఁడును ప్రతిదినమువలెనే జరుగు నని హైమవతికిఁ దెలి
యును. పెద్దతోటలోనికిఁ బోవుట కామె తల్లికిఁజేసిన వాగ్దానముప్ర
కారము వీలులేదు. చిన్నతోటలోని కామె పోయి ప్రతిచెట్టును రెం
డునిముషములు తనమృదుకరద్వంద్వముతో నందినంతవఱకు నిమిరెను.
ఆచెట్లును సంతోషాతిశయముచేతలలాడించి చల్లనిగాలిని వీచి యామె
కానందము గలిగించెను. మల్లెతీగె మల్లెపుష్పములను యామెపై రా
ల్చెను. పొగడచెట్టు పొగడపువ్వులను రాల్చెను. పెద్దదొడ్డిలోనుండి
ఇవతలికిఁ గనఁబడు నాఁడుబొప్పాయచెట్టుతో మొగబొప్పాయచెట్టేమి
యో చెప్పుచుండెను. ఆఁడుబొప్పాయచెట్టు నవ్వుచు యామెవంకఁ జూ
చుచుండెను. ఆమెయు వీనిని చూచుచు గడియసేపు నిలుచుండెను.
ఆతరువాత చిన్నదొడ్డితలుపుగడియతీసి తనగదిలోని కామె వచ్చి కూ
ర్చుండెను.

వేంకటప్పయ్యగారి ఇంటినుండి వచ్చుటతోడనే కృష్ణరావు రై
లుస్టేషనునకుఁ బోయెను. హైమవతిని ఎవ్వరును చూడకుండఁ దీసికొని
పోవలసియుండెను. సాధారణముగ మూఁడవతరగతి టిక్కెట్టుకొన్నచో

నెవ్వరైనఁ జూతురని యాతఁడు భయపడెను. కావున రెండవతరగతి రిజర్వుడు బండికై యాతఁడు కోరెను. కాని, అసిస్టంటుస్టేషనుమాస్టరు, రిజర్వు చేయుటకు వేళ చాలదని చెప్పెను. కృష్ణరావంతటితో నూరకుండక ఇద్దఱికిమాత్రము (అనగా, కృష్ణరావుగారు భార్య వీరిద్దరికి మాత్రము) సరిపోవుపెట్టెను రిజర్వుచేయవలసిన దని కొంతవెండి చూపి భ్రమపెట్టెను. వెంటనే స్టేషన్‌మాస్టరు వాల్తేరునకు తంతి నిచ్చి కృష్ణరావునకు నమస్కరించి రెండురెండవతరగతి టిక్కట్లు నిచ్చి పంపివైచెను. కృష్ణరావు నాఁటిమధ్యాహ్నమును సాయంకాలమును ఒక్క కాఫీహోటలుకుఁ బోయినప్పుడుతప్ప, తక్కినకాలమంతయు పూటకూటిలక్ష్మమ్మఇంటిలోని గదియందే కడపెను.

రాత్రిభోజనముచేసి లేచునప్పటికి ఏడుగంటలన్నర యయ్యెను. చెన్నపట్టణముమెయిలు తొమ్మిదిగంటలపదునైదునిముషములకు ఏలూరునకు వచ్చును. కావున, ఎనిమిదిగంటలన్నరకైనను హైమవతి బయలుదేఱకున్నచో నాఁటిరాత్రి మెయిలందదు. కృష్ణరావు జట్కాబండి నొకదానిని మాటలాడి ఆగంటివారింటికి నూరుగజములదూరమున నున్న జంతువులఆసుపత్రివద్ద నుంచి మెల్లగ చిన్నతోట తలుపుతీసికొని లోనఁ బ్రవేశించెను. కాని లోనుండి "ఎవరువారు" అన్నశబ్దము వినవచ్చెను.

కృష్ణరావు నిశ్చాంతపోయెను. అది వీరమ్మకంఠస్వర మని యాతఁడు గుర్తించెను. తా నెవ్వరో తెలిసినచో నాఁటిప్రయత్నము లన్నియు విఫలము లగును. కృష్ణరావు వెంటనే వెనుక కడుగువైచి వాకిటిదోవన చావడిలోనికి వచ్చెను. అచ్చట నెవ్వరును లేరు. వెంటనే యాతఁడు పెద్దతోటలోఁ బ్రవేశించి యొకచెట్టుచాటునకుం బోయెను. ఆచెట్లసందున అతని నెవ్వరును జూడఁజాలరు. పైని బండువెన్నెల కాయుచుండెను. జేబులోనుండి కృష్ణరావు కాగితమును ఫౌంటెన్‌కలమును తీసి, దానిపై నిట్లువ్రాసెను.

"నేను చిన్నతోటలోనికి వచ్చుటతోడనే 'ఎవరువా'రను కేక వచ్చెను. నేను కనఁబడకుండఁ దప్పించుకొంటిని. వీరమ్మ చిన్నదొడ్డి తలుపు వేసియుండును. కావున, నీవు మీఅమ్మగదిలోనుండి మెల్లఁగ వంటఇంటిదగ్గఱ నున్నత్రోవను వీథిలోనికి రమ్మ. వీలు చూచి నీపెట్టెను మీఅమ్మగదిలో తోటతలుపువద్దఁ బెట్టుము. మెయిలుకు వేళ యగుచున్నది. కృష్ణ."

ఈకాగితమును కృష్ణరావు హైమవతిగదికిటికీదగ్గరకుఁ బోయి హైమను మెల్లగ పిలిచి యామెచేతి కిచ్చెను. ఆమె దానిని చూచి మెల్లఁగ తల్లిగదితలుపు కొంచెము తీసి, ఆసందులోనుండి చూచెను. ఒకచిన్నదీపము వెలుగుచుండెను, కాని వీరమ్మ లేదు. మెల్లఁగ నతిభయముతో నామె చప్పుడు కాకుండఁ దలుపుతీయునప్పటికే వైదుని ముఖము లయ్యెను. కాని యామెకుమాత్ర మరగంట యైనట్లుండెను. మెల్లఁగ నామె చిన్నదొడ్డిలోనికిఁ దొంగిచూచెను. అచ్చట గడియవైచి యున్న వీథివాకిలివంకఁ జూచుచు వీరమ్మ కూర్చుండెను. హైమ యేచప్పుడుచేయుటకును జంకెను. తనపెట్టెను ముట్టకొనకుండ నా... చావడిలోనుండి భోజనముల వసారాలోనికిని, అందుండి ... ను జనెను. సుందరమ్మ అన్నము వార్చుచుండెను. త్రోవలో వేంకటప్పయ్యగారు నిద్రించుచుండిరి. ఆమె మెల్లఁగ వీథితలుపుతీసెను. ఆద్వారమువద్దనే కృష్ణరావు నేరేడుచెట్టునీడను నిలువఁబడి యుండెను. హైమ చప్పున నానీడలోనికిఁ బోయెను. కృష్ణరావు తనయుత్తరీయము నామెకు బురకావలె మీఁదఁ గప్పెను.

కృష్ణరావు పెట్టె ఎచ్చటనుంచితి వని యడిగెను. వీరమ్మ చిన్న

తోటలో నున్న తనిల్లును, పైన తనగదిలోనే యున్న దనియు హైమవతి యనెను.

కృష్ణరావు హైమవతి నచ్చటనే యుంచి లోనఁ బ్రవేశించెను. తన జేబురుమాలును ఎలుకపిల్లవలె నుండునట్లు చుట్టి కృష్ణరావు పీరమ్మ వెనుకనున్న తడికలగదిలో వైచెను. ఆతడికలపై నుండి ఆజేబురుమాలు నాతఁడు వీరమ్మపైఁ బడవైచెను. వీరమ్మ యులిక్కిపడి లేచెను. తనపై నేమియో పడినట్లుండెను. వెంటనే యామె లేచి ఆజేబురుమాలువంకఁ జూచెను. అది ఏమో యామెకుఁ దెలియలేదు. చీకటిపడిన వెనుక నచ్చట నుండిన పాములువచ్చు నని యామె భయపడెను. ఆమెకు తడకలలో నెవరో యున్నట్లు తోఁచెను. ఆమెకుఁ గొంచెము భయము తోఁచెను. కాని తడకలలోనికిఁ జూచెను. లోపల నేదో యొకమనుష్యవిగ్రహము గనఁబడెను. వీరమ్మ కొంతధైర్యము తెచ్చుకొన్నను, శీఘ్రముగఁ బోయి తల్లిని పిలుచుట యుత్తమమా యని యాలోచించుకొనెను. సన్నని పుటియొక్క జేబురుమాలును ముఖమునకుఁ గృష్ణరావు వడ్డము కట్టికొనెను. తడకలలోనికిఁ జూచిన వీరమ్మ నాతఁడు హఠాత్తుగ పట్టుకొని, మాటుగొంతుకతో నిట్లనెను.

“ నీ కేమీ భయంలేదు. నేను కామరాజుస్నేహితుణ్ణి. వాఁడు వచ్చిపోతూ, నాకో ఉత్తరం వ్రాశాడు. అందులో నిన్ను అతిజాగర్తగా చూచుకో మని వ్రాశాడు. అవి రేపు తెస్తాను. నిన్నొక్కఁడ కలుసుకోడం?”

వీరమ్మభయ మంతయును పోయెను. “ అయితే మీరు కామరాజు స్నేహితులా?” అనెను. కృష్ణుఁ డెట్లైనను తప్పించుకొనవలెనని యెంచెను. వీరమ్మను చూచిన నాతని కసహ్యముగ నుండెను. కాని తప్పించుకొనుట యెట్లు? వెంటనే యాతఁడు వీరమ్మ నాలింగనము చేసికొని, ముద్దుపెట్టుకొని, “ రేపు వస్తాను. మీ అమ్మ నీకోసం వెతుకుతూ ఉంది, లోపలికి వెళ్లు” అనెను. వీరమ్మ మాఱుమాటాడక లోనికిం జనెను. కృష్ణరావు సంతోషించి హైమవతిపెట్టెను తీసికొని తోఁటపెరటులుపు తీసి యామెను వెంటఁబెట్టుకొని జట్కాబండిపై నెక్కి ఏలూరుస్టేషను చేరుటయే తడవుగ రైలుబండి వచ్చెను. హైమాకృష్ణులు తమకొఱకు రిజర్వుచేయఁబడిన బండినెక్కి మరునాఁడు ఎనిమిదిగంటలకు చెన్నపురిలో దిగిరి.

---

## పదునేడవ ప్రకరణము.

సెంట్రలుస్టేషనువద్దకు కృష్ణరావుస్నేహితులగు సత్యనారాయణయును, సోమయాజులును వచ్చియుండిరి. వారు కృష్ణరావు కూర్చున్న బండిపై నతికించఁబడిన చీటిని చూచిరి. సోమయాజు లిట్లనెను.

“ అప్పుడే మిసెస్ కృష్ణరావును చేశావే! తెలివంటే నీదేనోయ్ తెలివి.”

కృష్ణరావు చిఱునవ్వునవ్వెను.

సెంట్రలుస్టేషన్‌వద్ద జట్కాబండి నెక్కి తిరువళ్ళిక్కేణిలో మాటలాడిన యింటికి వారు నలుగురును వెడలిరి. హోటలునుండి వెంటనే యన్నము తెప్పించి హైమను భుజింపఁజేసి కృష్ణరావును తన స్నేహితులును పూటకూటియింటికిఁ జని భుజించి.

హైమవతికొఱకుఁ దీసికొనఁబడిన ప్రదేశ మొకయింటిలోనిభాగము. అందుక్రింద నొకగదియు నుండెను. ఆమె యాక్రిందగదిలో పూటకూటియింటినుండి తెచ్చిన యన్నమును భుజించి పైగదిలో పండుకొనుటకును గూర్చుండుటకు నుపయోగించుచుండెడిది. పొద్దున్న తొమ్మిదిగంటలకును భోజనము వచ్చెడిది. కృష్ణరావు ప్రతిదినమును

మధ్యాహ్నము మూఁడున్నరకు కాఫీహోటలునుండి తినుబండారము లను తెచ్చి యామె కిచ్చుచుండెడివాఁడు. మరల మఱునాఁడు మూఁడున్నరవఱకును యామెకు కృష్ణరావుదర్శనము లేదు.

ఊరికి వచ్చినదినముననే ఆమెతో నాతఁడు తానామెను వివాహమగువఱకును ఆమెకు బైటికిఁ జనుట మంచిది కాదని చెప్పవలె ననుకొనెను. కాని యామె కట్టిస్థితి బందిఖానావలె నుండు నని తలంచి చెన్నపట్టణమునందలి ముఖ్యమైన దృశ్యములను చూపెను. ఇట్లు నాల్గైదుదినములు గడచెను.

హైమవతి యున్నభాగము కాక తక్కిన యిల్లంతయు నద్దెకు తీసికొన్నవారు వేటపాలెం యజ్ఞనారాయణదీక్షితులుగారు. వారిస్వగ్రామము గుంటూరుజిల్లాలోని వేమవరము గ్రామము. వారికి చిన్నతనములోనే ఒకవివాహము చేసియుండిరి. కాని వారిభార్య పెద్దమనిషి కాకమునుపే చనిపోయెను. అటుతరువాత నాయన యొకవెధవపిల్లను పదునాఱు పదునేడేండ్లయామెను వివాహముచేసికొనెను. వారి కిప్పుడు నాలుగేండ్ల యాఁడుపిల్లయు రెండేఁడుల మగపిల్లవాఁడును పుట్టియుండిరి. ఆయనకు చెన్నపురి రెవిన్యూబోర్డు కచ్చేరీలో గుమాస్తాపని. జీతము మాసమునకు అఱువదినాలుగురూపాయలు. ఆయన యెక్కువ చదువుకొన్నవాఁడు కాఁడు గాని. మెట్రిక్యులేషన్ చదివి తప్పిన మనుష్యుఁడు. భార్యాభర్త లిరువురును చాల మర్యాదస్థులు. పరోపకార బుద్ధి కలవారు. కృష్ణరావు ఇల్లుకొఱకుఁ బోయినప్పుడు వీరియింటికిఁ బోయెను. వీరియింటిలో నిప్పుడు హైమవతియున్నభాగమునకు పది, రూపాయలయద్దె నడిగిరి. కృష్ణరావు తన్ను వివాహమాడ నెంచిన యొకవితంతువును అందు ప్రవేశపెట్టెద నని తెలిపియుండెను. దీక్షితులుగారును అందుల కంగీకరించి యుండిరి. హైమవతి కన్నివిధము



లను ఆయిల్లు సౌఖ్యకరమై యుండెను.

ఇట్లు నాలుగైదుదినములు గడచెను. హైమ చెన్నపురమునకు వచ్చి యైదాఱుదినము లయ్యెను. కృష్ణరావొకనాఁటిరాత్రి తులసింగపెరుమాళ్ళవీథిలోఁ గూర్చుండి యోచింప నారంభించెను. ఎంత యోచించినను ఆతని కాలోచన పోలేదు. తల్లిదండ్రులకు తాను వివాహమాడ నిశ్చయించితి నని వ్రాయవలె నని యొకసారి యాలోచించెను. అప్పుడు తనకు ధనము నిచ్చువారెవ్వరు? బి.ఏ. ప్యాసైనయెడల నెచ్చటనైన నుద్యోగము దొరకవచ్చును. కాని ఇప్పుడు దానికిఁ గూడ కఱవయ్యెను. అంతేగాక ఆతనికి బి. ఎల్. చదువవలెనని యుండెను. హైమవతిని వివాహమాడినచో తనకు ధనమునిచ్చువా రెవ్వరు? ఊరికిఁ బోయి తాను చేసినపనిచెప్పి తల్లిదండ్రుల ననుమతింపఁజేయుట దుర్లభము. హైమవతిని వివాహమాడక తప్పదు. ఆమెయొక్కదిక్కులేనిస్థితియే గాక, వారియన్యోన్యప్రేమయేకాక యాతఁడు వేంకటప్పయ్యగారికి చేసిన వాగ్దానముకూడ నాతనిని వివాహమునకుఁ బురికొల్పుచుండెను. ఇంటికడనుండి తన్ను నమ్మివచ్చిన హైమవతి నాతఁడు అటున్నసూర్యుఁడిటుతిరిగినను వివాహమాడితీరవలెనని నిశ్చయించెను.

ఈద్వంద్వసమస్యకు మందేమి యని యాతఁ డాలోచించుసమయమున సత్యనారాయణయు సోమయాజులును ఆతనివద్దకు వచ్చిరి.

సత్య—ఏమిటోయ్, కృష్ణరావు, చాలాఆలోచిస్తూ ఉన్నట్లున్నావ్. పెళ్ళెప్పుడు నిర్ధారణచేశావు.

కృష్ణ—ఏదీ ఆలోచించలేదు ఇంకాను. ఆలోచన కుదరకుండా ఉంది. ఒకమాటు కాకినాడ వెళ్ళా లనిఉంది.

సోమ—మేము రేపు బయలుదేఱి కాకినాడ వెళుతున్నాము. నువ్వుకూడా మాతో వస్తావా ఏమిటి?

కృష్ణ—ఏమిా అంతతొందర? పరీక్షలైనాక పదిహేనురోజు లిక్కడే ఉంటామంటిరే?

సోమ—సత్యనారాయణ చెల్లెలిపెళ్లట. పంచమినాఁడులగ్నం. నిన్నుకూడా పిలుద్దా మనుకొని, నీకు వీలవుతుందో కాదో అని సంకోచిస్తున్నాఁడు.

కృష్ణ—అయ్యో, నేను రావలసిందేనోయ్. కాని ఇక్కడ ఏమిా తోఁచకుండాఉంది.

స్నేహితులిరువురును ఒకరివంక నొకరు చూచుకొనిరి. కొంత నిదానించిరి. సత్యనారాయణ ఇట్లనెను. "మాకొక ఆలోచన తోఁచింది. మేము కాకినాడ వెళ్లినప్పుడు నువ్విక్కడనే ఉండిపో. అక్కడ మిానాన్నగారితో నిన్నుగుఱించి కొన్నిసంగతులు చెపుతాము—"

కృష్ణ—ఏమి టాసంగతులు?

సత్య—విను. తొందరపడకు. ఆపిల్ల నీకు వ్రాసినఉత్తరం, ఆపిల్ల పడ్డకష్టాలూ, అన్నీ మిానాన్నగారితోనూ అమ్మగారితోనూ చెపుతాము. నువ్వు ఆపిల్లమిాది ప్రేమతో నిద్రాహారాలు పట్టకుండా ఉన్నావని చెపుతాము. నిన్ను బ్రతికించడానికి ఒకటే మార్గం ఉందనీ, అది ఆపిల్లను నీకుపెళ్లిచెయ్యడమే అనీ చెపుతాము. ఏమంటావు.

కృష్ణ—ఇక్కడికి దాన్ని తీసుకొచ్చా నని చెపుతావా ఏమిటి? కొంపదీసి?

సత్య—ఛా, ఛా, ఆమాట చెప్పను.

కృష్ణ—తీరా, ఆమాట విని మానాన్న ఈఊరొచ్చాడంటే గుట్టు కాస్తా తెలిసిపోతుంది.

సోమ—అవును. అదీ ఆలోచించవలసినవిషయమే.



సత్య—కృష్ణరావు గదికి వస్తాడుగాని దీక్షితులుగారి యింటికి వెడతాడా ఏమిటి?

కృష్ణ—కాదు. చెన్నపట్టం వస్తే తెలిసిపోతుంది.

సత్య—అయితే మరి ఏమిటిసాధనం?

కృష్ణరా వాలోచనానిమగ్నుడై రెండుమూఁడునిముసము లుండెను. అటుతరువాత తల పైకెత్తి సత్యనారాయణవంకఁ జూచెను. "మేనెలలో ఇంకా నాలుగైదురోజుల్లో పరీక్షలు తెలుస్తవి అనగా నేను కాకినాడ వెడతాను. అప్పుడు మానాన్నతోను అమ్మతోను మాట్లాడి ఒప్పుకుంటే వివాహం చేసుకుంటాను. చిక్కే లేదు. ఒప్పుకోకపోతే పని చూసుకోడానికనో, బి.ఎల్. చదువుకోడానికనో ఐదారువందలరూపాయలు పట్టుకొస్తాను. వాటితో ఒకపదినెల్లో, ఏడాదో గడుస్తుంది. ఈలోపుగా పని దొరుకుతుందేమో చూస్తాను. తరువాత భగవంతు డున్నాఁడు. నే నేమన్నా సంపాయిస్తే ఈపైకం అప్పుగా భావించి తీర్చేస్తాను.

సోమయాజులును సత్యనారాయణయు "భేషైన ఆలోచనంటే భేషైన ఆలోచన ఇది." అని చప్పటులు కొట్టిరి.

మరునాఁడు వారిరువురను ఊరికిఁ బంపి కృష్ణరావు తనగదికి వచ్చి శయనించెను. ఇంకను మూఁడు వారములు వివాహము జరుగకుండ జరుపఁబడవలెను. ఈలోపుగ హైమకొఱకెవ్వరైన వత్తురేమో యని యాతఁ డనుకొనెను. ఏకామేశ్వరరావో ఆమెను వెదకుచు వచ్చెనేని అంతయు బట్టబయలగును. తనవద్ద వేంకటప్పయ్యగారు వ్రాసిన కాగితము లేకపోలేదు. కాని, తల్లిదండ్రులకుఁ దెలిసిపోవునని యాతఁడు భయపడెను. ఇప్పుడే వివాహము చేసికొన్నచో నింతను బట్టబయలగు నని మఱింత జంకెను.

హైమవతి యొకనాఁడు వివాహవిషయమై కృష్ణరావు నడిగెను. నాఁడొక పెట్టెబండి వద్దకుఁ దీసికొని హైమాకృష్ణు లందు గూర్చుండి బీచివద్ద రోడ్డుపైఁ బోవుచుండిరి. కృష్ణరావు రోడ్డుప్రక్క నున్న కట్టడము లన్నియు నిది ఇది యని చెప్పుచుండెను. త్రోవలో హైమ కృష్ణునితో నిట్లనెను.

"బావా! అవును గాని, మఱి పెళ్ళెప్పుడు ?"

కృష్ణరావు హైమవంకఁ జూచెను. హైమయెడమచేతిని తన యెడమచేతిలో నుంచుకొని, కుడిచేతితో నామెచేతిని మెల్లఁగ తట్టుచుండెను. మరల కృష్ణుఁ డామెవంకఁ జూచెను. ఆతనికన్నులయందు ప్రేమామృత మూరుచుండెను. అప్పెట్టిబండిలో వారేమి చేయుచున్నారో చూచువా రెవ్వరును లేరు. కృష్ణుఁడు హైమను తనయెడమచేతఁ గౌఁగిలించుకొనెను. ఆమెముఖమువద్ద తనముఖమును పెట్టెను. "హైమా! ఇది పెళ్లికాదా ?" అనియెను.

వెంటనే యాతఁడు తనమనస్సులోని యుద్దేశ్యమును పెండ్లివిషయమున నున్నచిక్కులనుగూర్చియుఁ దెలిపి వైశాఖమాసమునందు వివాహము చేసికొనుట నిశ్చయ మని యామెకు వాగ్దానము చేసెను. ఆమెయు నందుల కంగీకరించెను.

ప్రతిదినమును హైమతో మాటలాడు స్నేహితురాండ్రు నలుగురు చేర్పడిరి. దీక్షితులుగారియింటి కెదురుగ నొక పెద్దభవనము గలదు. అది బ్రాహ్మణవితంతువుల గృహము. అందు ఆంధ్రబ్రాహ్మణవితంతువులు నలుగురు గలరు. వారును హైమకు స్నేహితలైరి. ప్రతిదినమును దీక్షితులుగారింటికి వచ్చుచుండెడివారు. ఒకనాఁడు హైమవతి తనకథను వారికిఁజెప్పి వారికథల నడిగెను. అందు మొదటి వితంతు విట్లు చెప్పెను.



"నాపేరు కమల. నాతండ్రి రాజమహేంద్రవరములో ప్లీడరు. నన్ను చిన్నప్పటినుండియు ఆయన అతిగారాబముతోఁ బెంచెను. నాపదునొకండవయేట నన్ను విశాఖపట్టణమునం దొకమహాశయున కిచ్చి వివాహము చేసెను. ఆయనపేరుతో మనకు పనిలేదు గాని, ఆయనవిద్యనుగూర్చియు, ఐశ్వర్యమునుగూర్చియుఁ గొంత చెప్పఁదలఁచుచున్నాను. ఆయన ఇంటర్మీడియేటు సీనియర్ చదువుచుండెను. వారికి ముప్పదియెకరములపొలము గలదు. ఇట్లు కొంతకాలము గడచి నేను వారింటికిఁ గాపురము చేయఁబోయితిని. నాభర్త నన్నేకవిధముల బాధించెను. ఎన్నిమాఱులో బి.ఏ. పరీక్షకుఁ బోయి యాయన తప్పెను. తప్పినప్పుడెల్ల నాపైఁ గోపము ముదిరెడిది. ఇట్లు నన్ను వేపుకొని తిని చివర కాయన ఇన్ఫ్లూయంజా సోకి మరణించెను. అప్పటికి నాకు పదునెనిమిదేండ్లు. నాభర్త చనిపోవుటతోడనే నేను పుట్టినింటికి వచ్చితిని. నాతండ్రి నాకు పునర్వివాహము చేయఁ బ్రయత్నించెను. కాని నాతల్లియు బంధువర్గమును అడ్డము వచ్చుటచే నాప్రయత్నమును మాని చదువునిమిత్త మాయన నన్నిచ్చటికిఁ బంపెను. నేనిప్పుడు స్కూలుఫైనలుతరగతిలో చదువుచున్నాను. బి.ఏ. గాని బి.ఏ.(హానర్సు) గాని చదువుకొని తరువాత పెండ్లిచేసికొనవలె నని నాయభిప్రాయము."

ఆతరువాత రెండవవితంతువు తనకథ నారంభించెను.

"నాపేరు సుబ్బమ్మ. నాతండ్రి కడపజిల్లాయందలి గుంటచెరువునందు భూస్వామి. చాల ధనవంతుఁడు. చిన్నతనమునందే నన్ను మామేనబావ కిచ్చి వివాహము చేసిరి. ఆయన నాకు ఏడవయేట మరణించెను. అప్పటి కాయనకు పదుమూఁడవయేఁడు. నాతండ్రి నాకు తలవెంట్రుకలను తీయించి యుంచెను. నేను పెద్దదాన నగునప్పటికి

వితంతువు నైతినని తెలిసికొంటిని. నాకు వివాహము చేసికొనవలెనని యాపగ నుండెడిది. కాని నాతండ్రి నేనామాట యెత్తినప్పుడెల్ల నన్ను దండించెడివాఁడు. తుద్దతుదకు నాప్రాణము విసిగి మాయూరికి ముప్పదిమైళ్ళదూరమున నున్న రైలుస్టేషనునకు కట్టుబట్టలతో వచ్చితిని. టిక్కట్టు కొనుక్కొనకుండ రైలెక్కితిని. కాని బెసిణాబ్రిడ్జివద్ద నన్ను బట్టికొని కొట్టి బైటికిఁ బంపివైచిరి. నేను ఏడ్చుచు నిటునటు తిరుగుచుండఁగా నొకపుణ్యాత్ముఁడు నన్ను తనయింటికిఁ దీసికొనిపోయి యచ్చటనుండి నన్నిచ్చటికిఁ బంపెను. ఇచ్చటికి వచ్చిన పదిదినములకే నేను పెద్దమనిషి నైతిని. ఆతరువాత కొన్నిదినములనుండియు బడికేఁగ మొదలుపెట్టితిని. ఇప్పుడు నేను నాలుగవఫారమునం దున్నాను. నాయస్సు పదునాలేండ్లు. స్కూలుఫైనలువఱకును జదువుకొని వివాహము చేసికొనవలె నని నాయాస. నాతండ్రి నాకొఱకు వెదకెను గాని, ఇచ్చటి యధికారిణి నాతండ్రిని సమ్మతింపఁజేసి పంపివైచెను."

మూఁడవవితంతు వగు మీనాక్షి తనకథ నిట్లు చెప్ప నారంభించెను. "ఇప్పుడు నావయస్సు ఇరువదియైదుసంవత్సరములు. నాతండ్రి నాకు ఎనిమిదవయేట వివాహముచేసెను. ఆయన జగ్గయ్యపేట వాస్తవ్యుఁడు. కొంచెమో గొప్పయో భూవసతి కలవాఁడు. నాభర్తకు చదువుసంధ్యలు లేవు. భూవసతి యొకకుటుంబమును చక్కఁగా పోషింప వీలైనదియును గాదు. మాకు ఇరువురుకొమార్తెలు పుట్టిరి. కాని యొకకుమార్తె రెండేండ్లును, ఇంకొకకుమార్తె మూఁడేండ్లును పెరిగి మరణించిరి. నాకు వివాహము చేసికొనవలె నని లేదు. ఇరువురుకుమార్తెలు మరణించినవెనుక ఇంకను నాకు వివాహ మెందుకు? కాని మాయధికారిణిమాత్ర మప్పుడప్పుడు నాయుద్దేశముమాఱిన దేమో కనుగొనుచుండును. మూఁడుసంవత్సరములనుండియు నాయుద్దే



శముమాఱలేదు. ఇఁకే ముందుగూడ మాఱకుండిన నే నధికముగ సంతోషింతును. నే నిప్పుడు పూసలతో బుట్టలల్లుట, గుడ్డలు కుట్టుట, సాక్సులు కట్టుట మొదలగు పనులను నేర్చితిని. నాయావజ్జీవమును ఇట్లే యుండఁదలఁచుకొన్నాను. భగవంతుఁడు నాకు పునర్వివాహోద్దేశము కలిగించకుండునుగాక."

నాలుగవవితంతువు పద్మావతమ్మ ఈప్రకారముగఁ జెప్పెను. "నావయస్సు ప్రస్తుతము పదునైదువత్సరములు. నన్ను చిన్నప్పుడు గంజాంజిల్లా పర్లాకిమిడిలో నున్న యొకబాలున కిచ్చి వివాహము చేసిరి. ఆబాలుఁడు రైలుక్రిందఁబడి చనిపోయెను. ఆతరువాత నీసంగతి దాఁచి నాతండ్రి నెల్లూరునకు వచ్చి, అచ్చట నొకని కిచ్చి వివాహము చేసెను. నావివాహమైన పదియవదినమున నొక్కదినము రోగము వచ్చి నారెండవభర్త మరణించెను. ఈసంగతినిగూడ కప్పిపుచ్చి నాతండ్రి నన్ను కుంభకోణమునం దొకయువకుని కిచ్చి వివాహము చేసెను. ఆవివాహమైన కొలదినెలలకే నేను కాపురమునకుఁబోయితిని ఆతరువాత నాయత్తవారికి నాసంగతి తెలిసెను. నన్ను వెలివైచి ఇంట నన్నము పెట్టకుండ మూఁడుదినము లొకగదిలోఁ బడవైచి తాళమువైచిరి. ఇంతలో నాతల్లి మరణించిన దన్న వార్త నాకు తెలియవచ్చెను. నాతండ్రియు నాయవస్థనుగూర్చి తెలిసికొని యత్తవారింటినుండి నాభర్తయనుమతిమీఁద నీవితంతుశరణాలయమునకు తీసికొనివచ్చెను. కొలఁదిదినము లిచ్చట నున్న తరువాత నాభర్త నన్ను చూచుటకు వచ్చుచుఁ బోవుచుండెడివాఁడు. ఒకనాఁడు మాయధికారిణి యీసంగతి తెలిసికొని వారిని రావద్దని యుత్తరువుచేసెను. నాభర్తయు నాఁటిదినమునుండి నాకంటఁ బడలేదు. అటుతరువాత కొన్నిదినములకు నాతండ్రి వచ్చి నాభర్త మరణించినవార్త ఎఱింగించె

ను. ఇప్పుడు నాతండ్రి వృద్ధుఁడు. బీదవాఁడు. ఎచ్చటనో ఎట్లో జీవించుచున్నాఁడు. నే నతిశీఘ్రముగనే వివాహమాడి నాతండ్రిని రక్షించవలె నని యున్నది. ఇది నాయుదంతము."

ఈనాలుగుకథలను హైమవతి వినెను. తనకష్టములను మఱచి వారికష్టములనుగూర్చి విచారించెను. ఈనలుగురువితంతువులవద్దనుండియు కుట్టుపనులను నేర్చుకొనుచు కథలను పాటలను చెప్పుచుండెను. మేనెల మొదటివారమంతయుఁగువఱకును కాలము తేలికయైన ఱెక్కలపైఁ బిట్టలెగురునో యట్టి సంతోషముతోఁ గడచిపోయెను. ఇచ్చట ననుభవించిన యానందము, సౌఖ్యము హైమవతి మున్దెన్నఁడును అనుభవించియుండలేదు.

## పదునెనిమిదవప్రకరణము.

మేనెల మొదటివారము పూర్తి యయ్యెను. బి. ఏ. పరీక్షాఫలితములు తెలియుదినములు దగ్గఱకు వచ్చుచుండెను. విశ్వవిద్యాస్మందిరమున కేఁగి పదునాలుగవతేఁదీని పరీక్షాఫలితములు తప్పక తెలియునని కృష్ణరావు తెలిసికొనెను. ఇఁక చెన్నపట్టణము విడిచి కాకినాడ పోవుటకాతఁడు నిశ్చయించుకొనెను. నాఁటిదినము హైమవతితో నాతఁడు తనప్రయాణమునుగూర్చి చెప్పి, వచ్చినవెంటనే వివాహము జరుగునని చెప్పి ప్రయాణమయ్యెను. తాను వచ్చువఱకును మధ్యాహ్నము భుజించుటకు బిస్కత్తులు, నీమరేగు, అనాస మొదలగుపండ్లు హైమవతికిఁ గృష్ణుఁడు కొనియుంచి పండ్రెండవతారీఖున బయలుదేఱి



పదుమూఁడవతారీఖున ఉదయము తొమ్మిదిన్నరకు కాకినాడ చేరెను. అతఁడు భుజించి స్నేహితుఁడగు సత్యనారాయణయింటికిఁ జనెను. అక్కడ సత్యనారాయణయు సోమయాజులును మఱికొందఱును చీట్ల పేకతో నాటలాడుచుండిరి. కృష్ణరావు వచ్చుటతోడనే వారు ఆట చాలించి కృష్ణునివంకకుఁ దిరిగి రమ్మనిరి.

సత్య—ఏమిటి చెన్నపట్టం కబుర్లు. పరీక్ష లెప్పుడు తెలుస్తాయి?

కృష్ణ—పద్నాలుగుపదిహేనుతారీఖుల్లో తెలుస్తాయి అనుకుంటున్నారు.

ఒకఁడు—ఇంతతొందరగా తెలుస్తాయా ?

కృష్ణ—తొందరేమున్నదీ? మామూలుగా తెలిసేరోజు లివ్వే.

సత్య—మనసంగతు లేమైనా తెలిసినయా? నీకేం లే ! నువ్వు ప్యాసవుతావు. నాసంగతి ఏమన్నా తెలిసిందా?

కృష్ణ—అలా ఏమీ తెలియవు అబ్బాయి. ఎందుకీతిప్పలు ? రెండుమూఁడురోజుల్లో తెలుస్తాయి. ఈయేఁడు చాలామందిని ప్యాసు చేస్తా రని చెన్నపట్టణంలో ఒకబుకారు పుట్టింది.

ఒకఁడు—చాలామంది ప్యాసవుతారా? మారాజమహేంద్రవరం కాలేజీవాళ్లు ఎంతమంది ప్యాసవుతారో?

సత్య—మీవాళ్లంతా ప్యాసవుతారులే. మావాళ్లంతా తప్పుతారు. తృప్తిగా ఉందా?

ఒకఁడు—ఎంతచెన్నపట్టంలో చదువుకున్నా ఇంతగర్వం పనికిరాదోయ్.

సత్య—నీమొహంలాగే ఉంది. మీకు మంచినడవడి తెలుసునా? నలుగురు ఉన్నప్పు డెలా ప్రవర్తించాలో తెలుసునా? సోమయాజులూ కిందటిమాటు మనం కాన్వొకేషన్ చూడ్డానికి వెళ్లినప్పుడు

మన ఆంధ్రస్నాతకులు ఎలా ప్రవర్తించారో చూశావుకావూ?

ఒకఁడు—ఆంధ్రస్నాతకు లున్నచోట చెన్నపట్టంలో చదివిన వాళ్లుకూడా చేరుతారా?

సత్య—వాళ్లకర్మం. ఏం కాల్లేదు నలుగురిచేతా చివాట్లు తిన డానికి. ఎవరిస్థలాల్లో వాళ్లు కూచోక బెంచీలమీద ఎక్కి నిలవబడ్డం. 'వెనక వాళ్లకు కనపడదురా' అన్న ఆలోచనా లేదు, పాలోచనా లేదు. రెండుమూఁడుమాట్లు పోలీసుఇన్స్పెక్టరు వచ్చి "కూచోండోయ్ కూచోండి" అన్నాడు.

ఒకఁడు—ఏమో నాయనా, పట్టాల్లో చదువుకున్నవాళ్లు మీరు, పల్లెటూరివాళ్లం మేము. ఏమో తెలియక మావాళ్లు నిలవబడ్డారు. అయినా, ఇంత ఎకసక్కెమూ, ఇంత నవ్వూనా? క్షౌరము కాబోయేటప్పుడు గర్వము ఎక్కువౌతుందట.

సత్య—అయితే నేను తప్పుతా నంటావా ఏమిటి? ఎంత వేస్తావు పందెం?

ఒకఁడు—లక్షరూపాయలు.

సత్య-ఇచ్చేపద్దుచెప్పు. ఇదుగో నాపందెం అయిదురూపాయలు.

కృష్ణ—పందాలకేం గాని సోమయాజులతోనూ, సీతోనూ మాట్లాడ్డానికి వచ్చాను. అది కొంత రహస్యమైన విషయం. ఇప్పుడు మాఇంటికి ఫలహారానికి రండి మీఇద్దరూను. దోవలోనూ ఫలహారం చేసేచోటా మాట్లాడుకుందాం.

సోమ—అయితే, లేద్దాం పట్టు.

ఒకఁడు-రెండాటలాడి పోదురుగాని కూచోండి కృష్ణరావుగారు.

సోమ—చస్తూంటే సంధ్యమంత్రాలుట. ఇహ చాల్లే, లేవోయ్ సత్యనారాయణా.



ముగ్గురుస్నేహితులును కృష్ణరావుఇంటివైపునకు బోవుచుండిరి. కొంతదూరము పోయినతరువాత కృష్ణరావు ఇట్లనెను. "మీరు నాకొక గొప్పసహాయం చెయ్యాలి."

సత్య—ఏసహాయం చెయ్యమన్నా నమము కట్టుకు సిద్ధంగా ఉన్నాము.

కృష్ణ-ఆసంగతినిగురించి మానాన్న ఒప్పుకొనేలాగు చెయ్యాలి.

సత్య—కొంచెం కష్టమైన పనే. ఆయనతో ఏమనిమాట్లాడడం?

కృష్ణ—నేను నాఉద్దేశాలు మీతో చెప్పినట్లు మానాన్నకు తెలియనియ్యకూడదు. మీరు ఏలూరువెళ్లినట్లూ, అక్కడిసంగతి సందర్భాలు చూసినట్లూ అది నాకు ఉత్తరం వ్రాసినసంగతీ, అదంతా చెప్పాలి.

సోమ—ఇంతే కాక రాత్రీ పగలూ ఆపిల్లకోసం కృష్ణరావు పరితపిస్తున్నా డనీ, ఆపిల్లను చేసుకోకపోతే బతికేలాగు లేదనిచెప్పాలి.

కృష్ణ—దాన్ని నేను చెన్నపట్టం తీసుకొచ్చావని కొంచెము కూడా తెలియకూడదు.

సత్య—ఆసంగతి బ్రహ్మకుకూడా తెలియకుండా దాచిపెడతాము. కాని, మీనాన్నను ఎలా ఒప్పించడమా? అని ఆలోచిస్తున్నాము.

కృష్ణ—ఆయన ఒప్పుకుంటా డని నాకుతోచదుగాని, నేను చాలా పరితపిస్తున్నా నని చెప్పడంవల్ల ఏమన్నా మనస్సు కరుగుతుం దేమో నని ఆశ.

సత్య—సరే, మాచేతనైనంత ప్రయత్నం చేస్తాం. ఇవ్వాళ మీనాన్నగారు, కచ్చేరినించి ఇంటికొచ్చి ఐదున్నరకు ఫలహారంచేశాక ఆయన నేదదీరి ఉంటాడు. అప్పుడు మాట్లాడితే వింటాడనినాఉద్దేశము.

కృష్ణ—ఆఁ అవును. అదే మాట్లాడడానికి మంచిసమయము.

సరిగ్గా మొదలుపెడితే సగంపని అయినట్లు" అది ఇంగ్లీషులో లోకో క్తి ఉన్నది.

ఇంతలో, వారి ఫలహారములు పూర్తి కావచ్చెను. ఫలహారము పూర్తియైనపిదప స్నేహితుల నిరువురను బంపివైచి, అచ్చోటనే బరుండి భాగవతమును చదువుచున్న తల్లివద్దకు కృష్ణుఁడు వచ్చి కూర్చుండెను.

శేష—ఏమిటి, ఇలావచ్చావు ఇవ్వాళ ?

కృష్ణ—ఏమీ లేదు. ఊర్కేనే వచ్చాను.

శేషమ్మ మరల భాగవతమును చదువుచుండెను. కృష్ణునివంక కామె చూడలేదు. చూచియుండినచో కృష్ణునిహృదయమునందు రేఁగుచున్న గాలిదుమార మామెకు దృగ్గోచరమై యుండెడిది. కృష్ణుఁడు ఎట్లు మొదలుపెట్టుదునా యని కొంతవడి యాలోచించెను. అటు తరువాత తనభావములు పైకి గోచరము గాకుండ నణఁచుకొని "అమ్మా ఏలూరునించి ఏమైనా ఉత్తరాలు వస్తున్నయా ?" అనెను.

శేష—ఎవరు వ్రాస్తారు నాయనా, ఏలూరునుండి? అక్కడ అందరికూ మనం సరిపడనివాళ్లమే అయితిమి.

కృష్ణుఁడు హైమకును వేంకటప్పయ్యగారికిని తామ సరిపడుదు మని తలంచెను. "మామకుగూడా సరిపడమా?"

శేష—మామకు సరిపడితే ఎంత? సరిపడకపోతే ఎంత? మామ ప్రభుత్వ మేముంది? లేవలేడు; చెయ్యి కదల్చలేడు; కాలుకదల్చలేడు.

కృష్ణుఁడు కొంచె మాలోచించెను. హైమ నీకప్పు డప్పుడు ఉత్తరాలు వ్రాసేదికాదూ?

శేష—హైమదగ్గిరనించి ఉత్తరాలొచ్చి నెల్లాళ్లైంది. రామయ్య పోయినతరువాత నేను ఉత్తరాలు ఏచిరునామాకు వ్రాయాలో తెలి యక వ్రాయడం మానేశాను. హైమదగ్గిరనించి బొత్తిగా ఉత్తరాలే



లేవు. ఏమవస్థలు పడుతూఉందో, ఏంజేస్తూ ఉందో పాపము.

కృష్ణ—అమ్మా, పాపము హైమ కెవ్వరు దిక్కులేరుకాదూ. వాళ్లెన్నితిప్పలు పెట్టినా, ఎంతచేసినా, అన్నీ అనుభవిస్తూ పడుండాలి కాదూ?

శేష—దానిగ్రహచారం అలాఉంటే మనమేం జేస్తాము. ఆ కష్టాలుపడుతూ అక్కడే ఉండమని బ్రహ్మదేవుడు బాగా మూఁడుపం క్తులూ గీశాఁడు.

కృష్ణ—పాపము, రేపు వైశాఖమాసం రావడంతోటే జుట్టు తీయిస్తారట.

శేషమ్మ లేచి కూర్చుండెను. ఆమెకన్నుల నీరు గ్రమ్మెను. ఎంత చెప్పినను అర్థము చేసికొనఁజాలని మూఢురాలివలె "ఎవరికి, హైమకా?" అని యడిగెను.

కృష్ణరావు ఆప్రశ్నకు జవాబు చెప్పక "ఆఊళ్లో ఎవడో కామరాజని ఒకాయన ఉన్నాట్ట. వాడు హైమను పట్టుకోబోగా అంతా వచ్చి విడిపించారట." అనెను.

శేష—అయ్యో! అయ్యో!! ఎన్నికష్టాలురా తండ్రీ, పరమే శ్వరా! నారాయణా !

కృష్ణ—ఈకష్టాలన్నీ ఎలా పోగొట్టడం?

శేష—ఎలాగ. యావజ్జీవమూ అలా పడుండవలసిందే. దాని మొహాన అలా వ్రాసి ఉంటే ఎవరేం చేస్తారు?

కృష్ణరావు కొంచె మాలోచించెను. "అమ్మా ఇప్పుడు స్త్రీ పునర్వివాహా లంటారు విన్నావా?"

శేష—అదే, వీరేశలింగంపంతులుగారు చేసినవేనా?

కృష్ణ—ఆఁ. అవును. హైమవతికి మళ్లీ అలాగే పెళ్లిచేస్తే బాగుండదూ?

శేష—అది నీచేతులో ఉందా, నాచేతులో ఉందా? వాళ్లు ఒడంబడి చెయ్యాలిగాని.

కృష్ణ—అది సరేలే. అసలు చెయ్యడం మంచిదేనని ఒప్పుకుంటావా?

శేష—పెద్ద ముప్ఫైయేసివాళ్లకీ, బిడ్డలతల్లులకీ చెయ్యడం ఇష్టంలేదు గాని, చిన్నపిల్ల—మొగుడిమొహం చూడలేదు—హైమవతికి మళ్లీ ఎందుకు పెళ్ళిచెయ్యకూడదూ?

కృష్ణ—వాళ్లు దాన్ని ఇన్నికష్టాలు పెడుతూ, మళ్లీ పెళ్లిమాట ఆలోచిస్తారా?

శేష—అదే లేనిది. పాపం జీవానికి ఏడుస్తూ ఎన్నాళ్లో బతకాలో అన్నాళ్లూ వైధవ్యం అనుభవిస్తూ ఉండాలి.

కృష్ణ—ఎవరన్నా చేసుకోనేవాడిని మంచిచదువు చదువుకుని, కొంచెమో గొప్పో ఆస్తి ఉన్నవాణ్ణే చూసి మనమే ఎందుకు చెయ్యకూడదూ? మనం కాకపోతే హైమకెవరు దిక్కు?

శేష—మన కేముంది స్వతంత్రం?

కృష్ణ—మామ మనకు స్వతంత్రం ఇస్తూ వ్రాసి ఇస్తాడనుకో.

శేష—మామ ఎందుకు వ్రాసిస్తాడూ? పిచ్చిమాటలు!

కృష్ణ—అదికాదు. ఒకవేళ వ్రాసిస్తే, అలా పెళ్ళిచేయడం నీకిష్టమేనా?

శేష—ఆఁ. తప్పకుండా ఇష్టమే.

తరువాత కొంతసేపు కృష్ణరా వూరకుండెను. ముందు వేంకటప్పయ్యగారు వ్రాసియిచ్చిన కాగితము చూపి తరువాత హైమ వ్రా



సిన యుత్తరము చూపుదమా, లేక ముందిది చూపి తరువాత నది చూపుదమా యని యాతఁ డాలోచించెను. కొంతసేపటికి ముం దుత్తరమే చూపుద మని తీర్మానించెను.

కృష్ణ—అలాగైతే హైమను నేను చేసుకోడం నీకిష్టమేనా?

శేషమ్మయొడలు కంపించెను. "ఆఁ! ఏమిటీ?" అనినిర్ఘాంతపోయి యాతని యడిగెను.

కృష్ణరావు ఉత్తరమును శేషమ్మముందు పడవైచెను. శేషమ్మ ఆయుత్తరమును చదివెను. "కొంపదీసి హైమను తీసికెళ్లావా ఏమిటి?"

కృష్ణరావు మాటలాడకుండ, వేంకటప్పయ్యగారు వివాహమున కనుమతించుచు వ్రాసి యిచ్చిన కాగితమును శేషమ్మముందు పడవైచెను. శేషమ్మ దానినిగూడఁ జూచెను. ఆశ్చర్యపడెను. ఆమెను మాటలాడనీయకుండ కృష్ణరావు మరల నారంభించెను. తనస్నేహితులు తాను వివాహ మాడినచో సదృష్టవంతుఁ డని చెప్పినమాటలు మొదలైనవాని నన్నింటి నాతఁ డేకరువుపెట్టెను.

శేషమ్మ ఈయుపన్యాసము నతిశాంతభావముతో వినెను. కొంతసేపటివఱకును ఆమె మాటలాడలేదు. కృష్ణుఁ డరచేతిప్రాణములు పెట్టుకొని దీనభావముతోఁ దల్లివంకఁ జూడసాగెను. ఆమెయు నాతని ముఖమువంకఁ జూచెను. "నీకు నిజంగా హైమనే చేసుకోవాలని ఉన్నదా?" అని శేషమ్మ కృష్ణరావు నడిగెను.

కృష్ణుఁడు తలవంచుకొనెను. "ఔను" అని తాను స్పష్టముగ నన్నట్లు తల్లికిం దెలియువిధమున ముఖమునందలి భావప్రతిబింబమును మార్చెను.

శేషమ్మ ఇట్లనెను. "అబ్బాయీ! నాకు ఏమాత్రం అభ్యంతరం లేదు. పునర్వివాహంగాక మామూలు వివాహం చేసుకుంటే

నాకు సంతోషంగా ఉండేది. కాని నీ కెవరిమీద మనస్సుందో ఆపిల్లనే చేసుకోడం మంచిది. హైమవతి కులానికి వన్నెదెచ్చేపిల్ల. ఈ ఒక్కకళంకమూ లేకపోతే బాగుండిపోయేది."

కృష్ణరావు వంచినతల నెత్తలేదు. శేషమ్మ అతనిమీఁదదయతో నాతనివంకఁ జూచుట మానెను. కృష్ణరావు లేచి నిలువఁబడెను. "అమ్మా! నీకు శతకోటినమస్కారాలు. నీమనస్సులోకూడా నా కున్నటువంటి ఊహలే ఉన్నాయని అనుకోలేదు. నాన్నగారు కూడా ఒప్పుకుంటే బాగుండిపోను." అని తల్లిమాటలకు నిరీక్షించకుండ వీథిలోనికిఁ బోయెను.

సాయంకాలము ఐదున్నర, ఆరుగంటలసుమారున సర్వవరపు నాగభూషణముగారిని చూచుటకు సత్యనారాయణ వచ్చెను. ఆతఁడు నాగభూషణముగారివద్దకు వచ్చి బహుయుక్తియుక్తముగ మాటలాడెను. హైమ దురవస్థను వర్ణించెను. ఆమె ఆత్మహత్య చేసికొనఁదలఁచుటను వివరించెను. ఆమె కృష్ణునకు వ్రాసిన యుత్తరమును గూర్చి చెప్పెను. ఈవివాహము చేసికొనకున్నచోఁ గృష్ణరావునకుఁ బ్రాణాపాయము గలుగు నని నొక్కి సిద్ధాంతీకరించెను. కాని, ఏమియును ప్రయోజనములేకపోయెను. నాగభూషణముగారు విధవావివాహములను ఖండించిరి. తనకుమారుని మరణమునకైనను తా ననుమతించునుగాని వితంతూద్వాహమున కనుమతింప నని నాగభూషణముగారనిరి. నాఁడు సత్యనారాయణ చేయఁగలిగిన దేమనఁగా, నాగభూషణముగారి నెక్కువగ మాటలాడనీయక, ఈవిషయమునుగూర్చి నెమ్మదిగ నాలోచించెద నని యాయనచే వాగ్దానము చేయించి ఇంటికిం బోయెను.

అప్పుడు కృష్ణరావతనికొఱకు కనిపెట్టుకొని యుండెను. సత్య



నారాయణ కనఁబడినతోడనే యాతఁడు "కాయా, పండా?" అని యడిగెను. సత్యనారాయణయు జరిగిన యావద్వృత్తాంతమును నుడివెను. కృష్ణుఁడు నిట్టూర్పువుచ్చి యింటికిఁ జనెను.

రాత్రి తొమ్మిదిగంటలకు నాగభూషణముగారును, కృష్ణరావును భోజనమునకుఁ గూర్చుండిరి. శేషమ్మ వడ్డించుచుండెను. ఊరకుండక శేషమ్మ కృష్ణునివివాహమునుగూర్చి భూషణముగారి నడిగెను.

నాగ—కృష్ణుడు ఏదో వెధవవివాహం చేసుకుంటాడని స్నేహితుడట ఎవరో నాతో చెప్పాడు.

శేష—చేసుకున్నా మన హైమనే చేసుకుంటాడు. దానికి విచార మెందుకు?

నాగ—ఎన్నాళ్ళో పెరిగి ఎక్కడో పడి చచ్చాడట. ఇంత చదువూ చదివి, ఇంతా ఏడవడం బుద్ధి గడ్డితినడానికా?

శేషమ్మా కృష్ణరావు లేమియును మాటాడలేదు. నాగభూషణరావుగారే కొంతసేపటికి కృష్ణునివంకఁ జూచి "ఏమిటో, నువ్వు చాలా గడబిడ చేస్తున్నావుట? నీకూ హైమవతికీ, ఏవో ఉత్తరప్రత్యుత్తరాలు జరిగినాయట. ఏమిటీవేషాలన్నీని?"

కృష్ణ—నాకది ఒకఉత్తరం వ్రాసింది. నేనుమాత్రం ఏమీ ఉత్తరాలు వ్రాయలేదు.

నాగ—ఉత్తరాలు వ్రాశావో లేదో. నీమనస్సులో చేసుకోవాలని ఉందా లేదా?

కృష్ణరావు మాటలాడలేదు.

నాగభూషణముగారిట్లనిరి. "నువ్వు వితంతూద్వాహం చేసుకోడం నాకేమాత్రమున్నూ ఇష్టములేదు. నువ్వు చేసుకుంటే నీసంరక్షణాభారం నువ్వు చూసుకోవలసిందే. రేపో ఎల్లుండో బి.ఏ. ప్యాసవు

తావు. సంపాయించుకుంటావు. నీచదువు పూర్తి అయిందికదా అని విర్రవీగి నిన్నింతచేసినవాళ్ళమాట గడ్డిపోచగా భావిస్తున్నావు. నీసుఖానికి నేనేమీ అడ్డం రాదలచుకోలేదు. కాని నువ్వు వైధవవివాహం చేసుకుంటే నేను నీకు ఒక్కపైసా ఇవ్వను. నువ్వు ఈవిషయమై బాగా ఆలోచించుకోవలసింది."

నాగభూషణముగారు మరల కృష్ణునివంకఁజూచిరి. అనిశ్చలత, అనిర్ధారణ, అవినయము—నాగభూషణముగారి కర్థము కాలేదు. ఆయన మరల నారంభించెను. "నువ్వు వివాహం చేసుకొన్నట్లైతే నాఆస్తిలో చిల్లిగవ్వయినా రాదు. నేను మరొకణ్ణి దత్తతచేసుకొంటాను. ఆపైన నువ్వు వగచి కార్యం లేదు."

నాగభూషణముగారు మరలఁ గృష్ణునివంకఁ జూచిరి. కృష్ణుఁడు వంచిన తల నెత్తక యట్లేయుండెను. "నామాటలని నువ్వలక్ష్యం చెయ్యొచ్చు. మాట్లాడవేం? ఏదో వాగుతున్నాడు పోనీమని ఊరుకున్నావా?" అని ఆయనయడిగెను.

కృష్ణరా విప్పుడు మాటలాడవలసినవాఁ డాయెను. "నాన్నగారూ, మీకంత కోపంవద్దు. నేను కొండవిరిగి మీదపడినప్పటికీ మంచిమార్గానికి విరుద్ధమైన కార్య మేదీ చెయ్య నని మీకిప్పుడే ప్రమాణం చేస్తున్నాను. మీరిక ఈవిషయమై ఆలోచించ నక్కఱలేదు."

నాఁటిరాత్రి మఱేమియు మాటలాడక వారు శయనించిరి. తెల్లవాఱఁగనే కాల్యకృత్యములను తీర్చికొని కృష్ణరావు సత్యనారాయణగారి ఇంటికిఁ జనెను. అంత పొద్దున్నే కృష్ణరావు వచ్చుట చూచి సత్యనారాయణ ఆశ్చర్యపడెను. నోటిలోని పలుదోముపుల్లను తీసి యీతఁ డిట్లనెను. "ఇంతపొద్దున్న, ఇంకా నాలుగుమూలలా తెల్లవారక మునుపే వచ్చేశావు ఏమిటి?"



కృష్ణ—ఏమీ లేదు. నిన్నరాత్రి ఆయన అభిప్రాయం చెప్పేశాడు.

"నిన్నసాయంకాలం వెళ్లిమాట్లాడాను." అని సత్యనారాయణ "అన్నట్లు నీతో నిన్ననే చెప్పాను గాదూ" అనెను.

కృష్ణ—మాఅమ్మ కేమో వివాహానికి ఏమీ అభ్యంతరం లేదు. 'ఇంటికి రానిస్తానా? ఇంట్లో ఉండనిస్తానా?' ఇటువంటి చొప్పదంటుప్రశ్నలు వెయ్యలేదు గాని, ఆమె అభిప్రాయంమాత్రము ద్వంద్వార్థం లేకుండా వ్యక్తీకరించింది.

సత్య—అయితే గెల్చా వన్నమాటే.

కృష్ణ—అయితే, మానాన్న మట్టుకు ససేమిరా చేసుకోగూడదు అని పంతం పట్టాడు. నువ్వు చేసుకుంటే నీకు డబ్బు ఇవ్వను. ఇక ఎలాబ్రతుకుతావో బ్రతుకు. నేను ఇంకోణ్ణి పెంచుకుని ఆస్తి వాడికిచ్చేస్తాను.' అన్నాడు.

సత్య—నువ్వేమన్నావు?

కృష్ణ—నేను రెండర్థాలొచ్చేలాగ ఎటూ తేల్చకుండా చెప్పాను.

సత్య—ఏమని?

కృష్ణ—నేను మంచిమార్గానికి విరుద్ధమైన కార్యం ఏదీ చెయ్యనని చెప్పాను.

సత్య—మీతండ్రి అంతటితో తృప్తిపడ్డాడా?

కృష్ణ—ఏమి తృప్తిపడ్డాడో? ఆతరువాత మళ్లీ ఆమాట ఎత్తలేదు.

సత్య—అయితే పెళ్లిచేసుకోవాలనే నిశ్చయించావన్నమాట.

కృష్ణ—ఆసంగతి ఎప్పుడో నిర్ధారణ ఐపోయింది.

సత్య—అయితే ఇప్పుడు నువ్వు చెయ్యదలచుకున్న దేమిటి?

కృష్ణ—ఎల్లుండో ఆవలెల్లుండో బయలుదేరి చెన్నపట్టణ వెడతాను. మానాన్నదగ్గిరనించి ప్యాసయితే బి.యల్. చదువుకోడానికి లేకపోతే ట్యూటోరియలుకాలేజీలో చేరడానికీ ఆరువందలు తీసుకొని బయలుదేరుతాను. వివాహం చేసుకొని పనికోసం ప్రియత్నిస్తాను.

సత—అవును. బాగానే ఉంది నీఆలోచన. ఇవ్వాళో రేపో పరీక్షలు తెలుస్తాయికాబోలు.

ఈమాటలైనతరువాత భోజనసమయ మగువఱకును కృష్ణరావచ్చటనే యుండెను. కొంతసేపటికి సోమయాజులుకూడ వచ్చెను. రైలువచ్చువేళ యయ్యెను. రైలుకూత వారికి వినబడెను. వారు పత్రికకై నిరీక్షించుచుండిరి.

పదిగంటలగునప్పటికి పత్రికవాఁ డరుదెంచెను. వా రాతురతతో పత్రికను తీసిరి. అందు ఏడవపుటయందు ‘ బి.ఏ. పరీక్షాఫలితములు ’ అని యుండెను. వారు ముగ్గురును ఒక్కమారు పత్రికపైఁబడిరి.

ఇంగ్లీషు:— 536 సత్యనారాయణ ప్యాసు, మూఁడవతరగతి.
537 సోమయాజులు ప్యాసు, మూఁడవతరగతి.
509 కృష్ణరావు ప్యాసు, మూఁడవతరగతి.

తీసికొన్నవిషయము:—536 సత్యనారాయణ మూఁడవతరగతి.
537 సోమయాజులు మూఁడవతరగతి.
509 కృష్ణరావు రెండవతరగతి.

కృష్ణరావు భుజించి మరల వచ్చెద నని చెప్పి యింటికిఁ బరుగెత్తెను. తండ్రి భుజించి కచ్చేరికి వెడలఁబోవుచుండెను. కృష్ణునియాతురతను చూచి యాతఁ డాఁగెను. కృష్ణుఁడు రెండవతరగతియందు ప్యాసగుట విని తల్లిదండ్రులు సంతోషించిరి. కృష్ణరావు భుజించి లేచెను.



శేషమ్మయు భోజనము ముగించెను. నాగభూషణముగారు కచ్చేరికిఁ బోయిరి.

కృష్ణరావు భోజనముచేసి కొంతసేపటికి సత్యనారాయణయింటికిఁ జనెను. వారక్కడ కూర్చుండి ఏమో మాటలాడుచుండిరి. కృష్ణరావు రెండవతరగతిలో ప్యాసైనందుల కాతనిని బహూకరించుచుండిరి. సత్యనారాయణయును సోమయాజులును బి.ఎల్. చదువుటకు చెన్నపురికిఁ బోవలయు నని తీర్మానించిరి. వీరిట్లు మాటలాడుచుండఁగ టెలిగ్రాఫ్ బంట్రోతు సత్యనారాయణ కొకతంతిని ఇచ్చెను. ఆతఁడాతంతిని తీసికొని, టెలిగ్రాఫుబంట్రోతునకు నాలుగణా లిచ్చి పంపివేసెను. సత్యనారాయణ దానిని కృష్ణరావున కిచ్చెను. కృష్ణరావాతురతతో దానిని విప్పెను. అందిట్లుండెను.

“ కాకినాడ సూర్యారావుపేటలో నుండు శ్రీయుతులగు చిరువూరి సత్యనారాయణగారు చూచుకొని కృష్ణరావుగారికి ఈయవలెను. హైమవతి మేనమామయగు కామేశ్వరరావు నేటియుదయమున నీయూరికి వచ్చెను. నేటిసాయంకాలము మెయిలుతో హైమవతి నేలూరునకుఁ దీసికొనిపోవునఁట. జాగ్రత్త— దీక్షితులు.”

అప్పుడు సుమారు రెండుగంట లయ్యెను. కృష్ణరావు తనయిరువురు స్నేహితులకును ఆతంతిని చూపి, వారితో నిట్లనెను. నేను నేఁడే ఇటనుండి ప్రయాణము కావలెను. నాపెట్టె మొదలైనవానిని మీయింటఁ బెట్టెదను. నీవును వారము పది పన్నెండుదినములలో చెన్నపురికి నావివాహమునకు వచ్చెదవుగదా? అప్పుడు సామాను నీతో తీసికొని రమ్ము. సత్యనారాయణకుఁగూడ నిదే విజ్ఞాపనము.

తరువాత నాతఁడు తనతండ్రికచ్చేరికిఁ బోయి నాఁటిసాయంకాలమే తాను బయలుదేఱవలసి యున్నదనియు, లేకున్న తనకు

న్యాయకళాశాలయందు చోటు దొరకుట దుర్లభ మనియుఁ జెప్పెను. తండ్రి యందుల కంగీకరించి కచ్చేరినుండి సెలవు తీసికొని కుమారుని తో నింటికి వచ్చెను.

తల్లి కొంత విచారించెను గాని, చోటు స్థిరపరుచుకొని మరల పదిరోజులలో వచ్చెద నని చెప్పి కృష్ణరావు తల్లిని ఓదార్చి తండ్రివద్ద నుండి ఆరువందలరూపాయలను తీసికొని తనవద్ద నుంచుకొనెను. సా యంకాలము నాలుగుగంటలకు తనపెట్టె మొదలగువానిని సత్యనా రాయణగా రింట భద్రపఱచెను. సాయంకాలము కనుచీకటి పడువేళ కట్టుబట్టలతోడను జేబులో నాలుగువందలరూపాయలతోడను రైలుబండి నెక్కి బెజవాడ కొఱకు టిక్కట్టు తీసికొనెను.

---

## పందొమ్మిదవప్రకరణము.

పై ప్రకరణమునందు తంతినిగూర్చియు, కామేశ్వరరావునుగూ ర్చియు హైమవతియవస్థనుగూర్చియుఁ దెలిసికొనుటకు, పై ప్రకరణము లోని విషయములకుఁ గొంత వెనుకకుఁ బోవలయును.

హైమ యనాఁటిరాత్రి ఏలూరును, తనబంధువులను విడిచి ప్రే మప్రవాహమునం దీఁదులాడుచుఁ బోయెనో, ఆనాఁటిరాత్రి హైమవతి యున్నదా లేదా యని యెవ్వరును ప్రశ్నించలేదు. వీరమ్మ కామరాజు స్నేహితుఁ డెవ్వఁడో తనతో సహవాసము చేయ నరుదెంచె నని ఎం తయు సంతసించెను. ఆతనిముఖముమాత్రము జేబురుమాలుతో మూ యఁబడి యుండుటచే నామె చూడలేదు. కృష్ణరావా వాసమయమున



నచ్చటికి వచ్చియుండె నని యామె కలయందైన ననుకొనలేదు. ఆ రాత్రి యామె సంతోషస్వాంతయై యుండెను. ఆసంతోషతరంగము లను ధవళాశ్వములనెక్కి కామరాజును, కామరాజు ఆత్మహత్యను, ఒక్కనిముసములో వీరమ్మ మఱచిపోయెను. దుష్టులప్రేమ లిట్టివేకదా? ఒక్కనిముసమున నింకొక వస్తువుపైఁగాని మనుజునిపైఁ గాని మక్కు వ కుదిరె నేని యంతకుముందు సుస్థిరప్రేమ సామ్రాజ్యసింహాసనారూ ఢుఁడైన యామనుజుఁడు, సుస్థిరప్రేమ శైలసంస్థితమైన యావస్తువు ఒక్క మాటలేక, చూపులేక; ఒక్కకన్నీటిబిందు వైనను లేక నమస్కరించి దుష్టుల హృదయచాంచల్యమును దిట్టుచు కాలము వెడలఁబుచ్చవలసి యుండును. వీరమ్మ నాఁటిరాత్రి పేరుగాని, యూరుగాని, తెలియని మనుజుని, ముఖమునైనఁ జూడనిమనుజునిగూర్చి ధ్యానించుచుండెను.

తెల్లవాఱి పదిగంట లయ్యెను. అప్పుడు వీరమ్మ హైమవతి గదితలుపుతాళము తీసెను. లోపల నెవ్వరును లేరు. హైమవతి మా యమైనది. హైమవతి యెచ్చటి కేఁగినది? ఇల్లంతయు గందరగోళముగ నుండెను. సుందరమ్మ యంగలార్పసాగెను. వీరమ్మ నిశ్చేష్ట యయ్యె ను. వేంకటప్పయ్యగారు పొరలించుచుఁ గూర్చుండిరి. ఇరుగుపొరు గమ్మలక్కలును, అయ్యలును వచ్చి విడ్డూరముచూడనారంభించిరి. ఏలూరునందంతను బుకారుపుట్టెను. ఆగంటి వేంకటప్పయ్యగారికూఁ తురు హైమవతి నిన్నటిదినమున నర్ధరాత్రి యెవనితోనో ఇల్లువిడిచి పో యినదన్న వార్త ఏలూరునం దంతటను వ్యాపించెను. ఈవార్త విని దూరపుబందుగులు దగ్గఱబందుగులు సంగతి తెలిసికొనుట కాగంటి వారియింటికి వచ్చిరి. వారు వచ్చినప్పటి కాగంటివారియింటిలోని వారు హైమ కాకినాడలోని శేషమ్మగారింటికి వెడలెనే కాని మఱేమి యు నాశ్చర్యము లేదని యందఱకుఁ జెప్పుటకు నిశ్చయించిరి. కొంత

నేపటికి పలూరునం దీరెండువార్తలును వ్యాపించెను. ఇది నిజమని నమ్మినవా రిది నిజ మనియు, అది నిజమని నమ్మినవా రది నిజ మనియు, పరిస్థితివిమర్శనలప్రకారము రెండువిధములైన నమ్మకము లున్న ప్పుడు ఆరెండింటికిని మధ్యగా నొకత్రోవ తీయువా రింక నేదో నిజ మనియు పలువురు పలువిధముల ననుకొనఁజొచ్చిరి.

సుందరమ్మయు వీరమ్మయు హైమవతినిగూర్చి విచారించుచు భోజనముల చావడిలోఁ గూర్చుండిరి. కొంతసేపటికి, ‹‹ఇది ఎవరితో వెళ్లి ఉంటుంది చెప్మా" అని విచారముతో సుందరమ్మ యనెను.

వీరమ్మకు వెంటనే కృష్ణరావు మాట జ్ఞాపకమునకువచ్చి, ‹‹హైమవతి ఆత్మహత్య చేసికొన నెంచినది కృష్ణరావుమీఁది ప్రేమవలననే. యావజ్జీవమును హైమవతికి కృష్ణరావుపైనే ప్రేమ యుండెననుట వారికి రహస్యవిషయము కాదు. ఇంతలో వీరమ్మ కొకటి జ్ఞాపకమునకు వచ్చెను. క్రిందటిదినము తాను ‹‹ఎవరువా" రనుటతోడనే వెడలిపోయిన మనుజుఁడు కృష్ణరావే యై యుండవలెను. జేబురుమాలు ముఖమునకుఁ జుట్టుకొని తన్ను కామరాజు స్నేహితుఁడ నని మోసపుచ్చినది కృష్ణుఁడే కావలెను. అవును, కృష్ణుఁడే. అరే, ఎంతమోసపోయి ఎంతమూఢురాల నైతిని?" అని వీరమ్మ తనలో తాను వాపోయెను. ‹‹అమ్మా, మొదటినించీ హైమకు కృష్ణుడిమీఁదే మనసుంది. ఇప్పుడు కూడా కృష్ణుఁడితోనే వెళ్లిందని నాఅనుమానం."

సుందరమ్మ ఆలోచించెను. అవును, వారింటిప్రక్క నున్న సుబ్బరాయునకు వేసంగిసెలవు లిచ్చి పదునైదుదినము లయ్యెను. ఈ సెలవులలోఁ గాకినాడకు వచ్చి కృష్ణరావు హైమవతిని కాకినాడకుఁ దీసికొనిపోయి యుండును. కాకినాడ కిదివఱకు హైమవతి వెడలియుండుటచే నిప్పుడు మఱేయాపదయును రాదని సుందరమ్మ నిశ్చయించెను.



వైశాఖమాసమున కేశఖండన మొనరింప నిశ్చయింపఁబడినందున, హైమ భయపడి కాకినాడ కుత్తరము వ్రాసి వెడలిపోయి యుండునని సుందరమ్మ తలంచెను. ఈతలంపుతో నామెభయము వాసెను. ఇట్లొకవారము గడచెను. చైత్రమాసమున బహుళపక్షము సగముసఁబడెను. వీరమ్మ హైమకు వైశాఖమాసము వచ్చుటతోడనే కేశఖండనము గావింప నువ్విళ్లూరుచుండెను. ఆమె తల్లిని ప్రతిదినమును హైమను తీసికొనిరమ్మని కామేశ్వరరావునకు వ్రాయుమని బలవంత పెట్టసాగెను. ఎట్టకేలకు ఏప్రియల్ ఇరువదినాలుగవతారీఖున సుందరమ్మ కామేశ్వరరావునకుత్తరము వ్రాసెను. అందు హైమవతి కాకినాడయందున్నదనియు వెంటనే కాకినాడకుం జని తీసికొనిరావలయు ననియు, వైశాఖమాసమున కేశఖండనము జరుగవలెననియు వ్రాసెను. మూఁడు నాలుగుదినములలో, కామేశ్వరరావువద్దనుండి యుత్తరము వచ్చెను. అంతచిన్నవయస్సునందే కేశఖండన మొనర్చుట యన్యాయమనియు, పిల్లను తీసికొనివచ్చుట కభ్యంతరము లేదనియు, కాని కేశఖండనము మాత్రము వలదనియు వ్రాసెను.

మే మూఁడవతారీఖు ఆదివారమునాఁడు కామేశ్వరరావు కాకినాడకుఁ జనెను. ఈమూఁడాతఁడు సర్వవరపువారిఇంటికిఁ బోక యొకపూటకూటింట బసచేసెను. మధ్యాహ్న మొకస్నేహితునికుమారుని దీసికొని సర్వవరపువారిఇంటికిఁ బోయి యేకారణముచేతనో ఇంటిలోనికిఁ బోక పిల్లవానిచేతఁ దలుపు కొట్టించి కృష్ణరావున్నాఁడాయని యడిగించెను.

శేష — లేఁడు.

బాలుఁడు — ఊళ్లో ఉన్నాడా? చెన్నపట్టణంనించి రానేలేడా ?

శేష — చెన్నపట్టణంలోనే ఉన్నాఁడు.

బాలుఁడు—మీమేనగోడలు హైమవతి ఈవూరొచ్చిందా?

శేష—రాలేదు. కాని, నువ్వెవరిఅబ్బాయివి. ఈప్రశ్నలన్నీ ఎందుకు వేస్తున్నావు?

బాలుఁ "ఏమీలేదు ఏమీలేదు. ఊర్కేనే" అని తెల్లమొగము వైచి సందుచివరకుం బరుగెత్తెను.

కామేశ్వరరావాశ్చర్యమగ్నమానసుఁడయ్యెను. హైమవతిగాని కృష్ణరావుగాని కాకినాడలో లేరు. సుందరమ్మవ్రాసినయుత్తరమునఁ గూడ నీసంగతి సందేహముగనే యుండెను. కామేశ్వరరావు సందియములన్నియు నిజములయ్యెను. ఆలోచనానిమగ్నుఁడై కామేశ్వరరావు నాఁటిరాత్రి రాజమహేంద్రవరము చేరెను. మరునాఁడు కామేశ్వరరావు హైమవతిగాని కృష్ణరావుగాని కాకినాడలోలేరనియు, కృష్ణరావు చెన్నపట్టణమునుండి కాకినాడకు రాలేదనియు హైమ చెన్నపట్టణమున నున్నదేమోననియు సుందరమ్మ కుత్తరము వ్రాసెను.

వీరమ్మ తాననుకొన్నంతయు జరిగెననియు, నిప్పుడు హైమవతికి కేశఖండనము తప్పిపోయెననియు వాపోవసాగెను. కాని, సమయము వచ్చినప్పుడే యామెదుష్టబుద్ధికి చుఱుకుదన మెక్కువ యగుచుండెను. ఈబుద్ధితోనే యామె కేశవరావునకు మందుపెట్టెను. ఈబుద్ధితోనే ఆమె కామరాజును హైమవతిపై కుసిగొల్పెను. చుఱుకుఁదనముతోనే యిప్పుడు హైమవతి కేశఖండనము చూచితీరవలెనని యామె పన్నుగడ పన్నెను. సుందరమ్మయు వీరమ్మయుఁ గలసి కామేశ్వరరావునకు మఱి యొకయుత్తరము వ్రాసిరి. హైమవర్తనము పూర్తిగా చెడిపోవమును పెళ్లైనను దానిని బట్టితేవలయుననియు, శిరోజములు ఖండింపఁబడిన గాని యామెదుష్ప్రవర్తనము మాఱదనియు నందు వ్రాయఁబడెను. కామేశ్వరరావీసత్యమును నేఁటికి తెలిసికొనెను. వెంటనే కచ్చేరికి



వారముదినముల సెలవునకై దరఖాస్తు పెట్టి పదియవతారీఖునబయలు దేఱి ఏలూరుపోయి, సుందరమ్మవీరమ్మలవలన సంగతిసందర్భములను తెలిసికొనెను.

కామే—ఇంతగా ప్రేమిస్తూఉంటే ఎందుకు పునర్వివాహం చెయ్యరాదూ?

వీరమ్మ ఈమాటల కదరిపడి "ఇంకాఏమన్నా చెప్తావనుకున్నాను. ఇలా మాట్లాడతావనుకోలేదు. ఇహానికీ, పరానికీ దూరమై, మర్యాదకు, పుట్టుకకూ దూరమై, బంధువులకు ప్రపంచానికీ దూరమై పోవాలి మా బ్రతుకని ఆలోచిస్తున్నావా?" అనియెను.

సుందరమ్మయు వీరమ్మమాటలనామోదించెను. కామేశ్వరరావుకూడ, నౌకరిపిల్లపై తనకేమిస్వతంత్రమున్నదని తలంచి చెన్నపురికిఁ బోయి హైమవతిని ఏలూరునకుఁ దీసికొనివచ్చుటకు నిశ్చయించి మే నెల పదునొకొండవతారీఖున ఏలూరులో బయలుదేఱి పన్నెండవతారీఖున చెన్నపురిచేరెను. చెన్నపురి మహాపట్టణము. అందు హైమవతి యెచ్చట నున్నదని యాతఁడు కనుగొనఁగలఁడు? ఎవరైనను దాఁగికొన వలెనన్నచో చెన్నపురియే యందుల కనువగుప్రదేశము. ఏమూల నెవరున్నారో యింకొకరికిఁ దెలియదు. ప్రక్కయింట నెవ్వరున్నారో ఎదుటింట నెవ్వరున్నారో, ఎవ్వరికినిఁ దెలియదు. అచ్చట నొకసంవత్సరము, రెండేండ్లు, ఐదేండ్లు, పదిపండ్రెండేండ్లుకూడ దాగికొనవచ్చును. అట్టిమహాపట్టణమున కామేశ్వరరావు ఒకపిల్లనెట్లు పట్టుకొనఁగలుగును? విధవావివాహములు చేసికొనువా రెచ్చటనుందురని యాతఁడు పలువురి నడిగెను. ఎవ్వరును ఆతనికిఁ జెప్పఁజాలరైరి. కొంతమంది యరవవారికాతఁడడిగినప్రశ్న యర్థము కాలేదు. కొంతమంది కావలయునని తప్పుత్రోవలు చెప్పిరి. చెన్నపురమునందు చదువుసంధ్యల్లు

లేక, నాగరకతలేక, దయలేక దుర్మార్గమే వృత్తిగాఁగలయరప లసంఖ్యాకులు. ఒకరెని కష్టపెట్టుటయే వారివృత్తి. త్రోవయడిగినచోఁ దూర్పుననున్నదానికి పడమరమార్గమును చూపుదురు. మానయాంధ్రులు కొందఱు ఈవిధముగఁ గష్టపడి ‘‘మనమడిగింది వాడికర్థంకాలేదు. భాష వేఱాయెను—’’ అని తృప్తిపడుచుందురు. సత్యసంధతయు పరోపకారబుద్ధియుఁ గల మనయాంధ్రులొకరి కట్టిగుణము లేదనుట తెలిసికొనఁజాలక ఏదోచెప్పికొని తృప్తిపడుచుందురు.

కామేశ్వరరావు వీరిచే మోసగింపఁబడి త్రోవతప్పి యగచాట్లు పడి పలువురిసాహాయ్యమున సరియగుత్రోవకు వచ్చెను. తిరువల్లిక్కేణిలో బ్రాహ్మణవితంతువుల కొకగృహము గలదని యాతఁడు తెలిసికొని యాంధ్రులసాహాయ్యమున నాగృహము కనుఁగొనగలిగెను. ఈ యగచాట్లకు రెండుదినములు వినియోగింపఁబడెను. ఈరెండుదినములును సర్దారుభవనమునం దాతఁడు బసచేసెను. పదునాలుగవతారీఖున ఉదయము తొమ్మిదిన్నరగంటలకు వితంతుశరణాలయమున కెదురుగనున్న దీక్షితులుగారింటికి కామేశ్వరరావు వచ్చి హైమవతిని కనుఁగొనెను. అతనిని చూచుటతోడనే హైమవతికి ప్రాణములు పైనే ఎగిరిపోయెను. కామేశ్వరరావామెను బుజ్జగించెను. కృష్ణరావూరలేనిసంగతి తెలిసికొనెను. ఆలస్యము చేసినచో కృష్ణరావు మరలివచ్చును. హైమవతిని తీసికొనిపోవుట దుర్లభమగును. కావున నచ్చికబుచ్చికపుమాటలనుచెప్పి హైమను మోసగించి ఏలూరునకుఁ దీసికొనిపోయి కేశఖండన మొనరింపవలెనని యాతఁడు తలపోసెను.

కామే—హైమా ఎంతచోరవచేసి వచ్చావు?

హైమ మాటలాడలేదు. ‘‘నైటవేలెయిడ్‌లా’’ వారి కంపెనీయందలి బొమ్మవలె చలింపక నిలువఁబడెను. కామేశ్వరరావు మరల



‘‘నీకు పెళ్లిచేసుకోనే ఉద్దేశం ఉందని నాకు తెలియలేదు. తెలిస్తే శుభ్రంగా అలాగే చేస్తును. మీఅమ్మకూడా అలాగే అన్నది. ఈ దొంగపెళ్లి ఏంకర్మం వచ్చింది? శుభ్రంగా రాణిలాగ నీతల్లిదండ్రులు పీటలమీద కూర్చోనిపెళ్లిచేస్తారు’’ అనెను.

హైమకృష్ణరావుయొక్క అనుమతిలేనిదే రానని చెప్పెను. ‘‘నువ్వు రాకపోతే బండిలో వేసుకు లాక్కెళ్లడానికి నాకు అధికారముంది. ఈయింట్లో నన్నాపేమొగవాళ్లెవరూ లేరు. దీక్షితులుగారు కూడా కచ్చేరికి వెళ్లారు’’ అనెను.

హైమ సత్యమును గ్రహించెను. రానని చెప్పిన, లాభము లేదని గ్రహించి ‘‘అయితే, ఎప్పుడు ప్రయాణం?’’ అని అడిగెను.

కామే—ఎప్పుడో ఎందుకు? ఇవ్వాళ సాయంత్రం మెయిలుకు వెడదాం.

హైమ యనుమతించెను. తరువాత మెల్లఁగ దీక్షితులుగారి భార్యవద్దకుం జని జరిగినయుదంతమును చెప్పి ఎవరిచేతనైనను కృష్ణరావునకు తంతి నిప్పించుమని కోరెను. దీక్షితులుగారిభార్యయు ఎదురుగనున్నవితంతుభవనమునకుం జని టెలిఫోనులో కచేరిలోనున్నదీక్షితులతో మాటలాడించెను. దీక్షితులుగారును, అట్లే తంతి నిచ్చెదనని చెప్పిరి. ఈమాట హైమవతికి మరలదీక్షితులుగారిభార్య చెప్పెను. హైమ సంతసించెను. మధ్యాహ్నమగునప్పటికి హైమవతియును కామేశ్వరరావును బయలుదేఱిరి. హైమవతి పెట్టెవిషయమై కొంతఘర్షణ జరిగెను. కాని దీక్షితులుగారిభార్యయు హైమవతికోరికపై పెట్టె నొకగదిలో పెట్టి తాళము వైచుటచే కామేశ్వరరావు దానిని తీసికొఁజాలకపోయెను. కామేశ్వరరావు మధ్యాహ్నము పోవుబండిలో హైమతోఁగూడ నెక్కి నెల్లూరిలో దిగెను. ఇట్లాతఁ డెందులకు జేసెనో అరయుదము.

సాయంకాలము దీక్షితులుగా రింటికివచ్చిరి. హైమవతిని కామేశ్వరరావు తీసికునిపోకుండ నాపవలయునని యాతఁడు తలంచెను. కాని, ఈసంగతి నిదివఱకే కనిపెట్టినకామేశ్వరరా వాతనికన్నులలో కారము జల్లెను. మెయిలువద్దకుఁ జని హైమవతి పోకుండ నాపుదమని దీక్షితులుగారనుకొనిరి. కాని అందుకూడ కామేశ్వరరావు దీక్షితులుగారినోటిలో కరక్కాయను బడవైచెను. దీక్షితులుగారు తలపై గుడ్డవైచికొని గృహోన్ముఖులైరి. ఇంటికిఁబోయినవెనుక దీక్షితులుగారు భార్యతో నిట్లనిరి. ‘‘ఎందుకు పోనిచ్చావు? వాళ్లని?’’

భార్య—పోనియ్యక నేనేంచెయ్యగలను?

దీక్షి—నలుగురిని సాయంచెయ్యమని అరవలేకపోయావా?

భార్య—హైమవతే ‘‘వద్దు, భగవంతుఁడే నాకుసాయంచేస్తాడు. మాబావ నన్నేలాగో తప్పిస్తాడు’’ అంది.

దీక్షి—ఏదో తెలివితక్కువపని చేశావు. మళ్లి కృష్ణరావు మన్ని వచ్చి అడిగితే ఏంజేస్తాము?

భార్య మాటలాడలేదు. కొంతసేపటికి ‘‘ఆడదాన్ని నేనేం చెయ్యగలను?’’ అనెను.

దీక్షితులుగారి కేమియును దోఁచలేదు. ‘‘సామానుతో గూడా వెళ్లారా?’’

భార్య—సామానేముంది? ఒకపెట్టె. అది హైమవతి మనయింటో పెట్టమంటే పెట్టి తాళము వేసేశాను.

దీక్షి—ఆపెట్టె యిమ్మని అడగలేదా?

భార్య—హైమవతి ఇయ్యొద్దని చెప్పింది. ఆయన ఇమ్మన్నాఁ నేను ఇవ్వను అన్నాను.

దీక్షి—పోనీ, ఒకటన్నా తెలివిగలపని చేశావు.



ఎంత యాలోచించిన నేమిఫలము? ఆసమయమున నామె నెల్లూరులో నున్నదని యెవ్వరికిని దెలియదు. రాత్రి పదునొక్కగంట యగునప్పటికి నెల్లూరుస్టేషనకు మెయిలు వచ్చెను. కామేశ్వరరావును హైమవతియు ఏలూరునకు టిక్కట్టు కొని అందెక్కిరి. కామేశ్వరరావు పైబల్లపై కెక్కి పరుండెను. హైమవతియు క్రిందిబల్లపై గూటివద్ద గూర్చుండి భగవంతుని బ్రార్థించుచుండెను. ఈలోపుగఁ దన కేవిధమైనసాహాయ్యమును రాకున్నచో, బెజవాడలో దిగి ఎచ్చటికైనఁ బారిపోవలె నని తలంచెను. ఆమెచేత ముప్పదిరూపాయ లుండెను. వాని నామె తనచీరకొంగునఁ గట్టికొని నడుముచెంత దోపుకొనియుండెను. కామేశ్వరరావుబారినుండి తప్పించుకొని బందరునకో గుంటూరునకో పోయి కృష్ణరావునకు తంతి నీయవలె నని యామె తలంచెను. తెల్లవాఱువఱకును ఆమె యిట్లే యాలోచించుచుఁ గూర్చుండెను. కామేశ్వరరావుమాత్రము మనస్సున నేమియు విచారము పెట్టక హైమవతి తన్ను నమ్మి పునరుద్వాహము చేయుదు ననునాసతో వచ్చుచున్నదని నమ్మియుండియు నదియైన చింతింపక గురకలువెట్టి నిద్దుర పోవుచుండెను.

రైలు ఆగినప్రతిస్టేషను వద్దను ఆమె కృష్ణరావుకొఱకు నిరీక్షించుచుండెను. తెనాలిస్టేషనుకూడ వచ్చెను. కాని కృష్ణరావు రాలేదు. బెజవాడయొక్కటే మిగిలియుండెను. ఆమె యాతురతతో కనిపెట్టుకొని యుండెను.

## ఇరువదియవ ప్రకరణము.

కాకినాడనుండి ఆఱువందలరూపాయలతో బయలుదేఱి కృష్ణరావు కష్టుబట్టలతో బెజవాడ చేరెను. నాఁటిరాత్రి యనేకములగు నాలోచనలతో నాతఁ డటునిటు తిరుగుచుండెను. అచ్చట నాతనికి నిద్దురపట్టలేదు. ఒకచోట నుత్తరీయమును వైచికొని పరుండెను. కాని ఆలోచనాసముద్రమున మునిఁగిపోయిన కృష్ణరావునకు విశ్రాంతి యెక్కడ? నడుమనడుమ కృష్ణరావు లేచి యెన్నిగంటలు కొట్టినవో చూచుటకు గడియారమువంక కరుగుచుండెను. ఎన్నిమార్లు చూచినను నాలుగుగంటలైనఁ గాలేదు. బెజవాడ ప్లాటుఫారముపై బండలు పఱచినభాగముమాత్రము ఈవైపునుండి యావైపునకును మరల నటునుండి యిటువైపునకును తిరుగుటకైదునిమిషములు పట్టుచుండెను. ఏవియో కూఁతలు వినఁబడుచుండెను. గూడ్సుబండ్లును, ఇంజనులును ఇటునటు తిరుగుచుండెను. పండ్రెండుగంటలకు హైదరాబాదునైజాముబండి వెడలిపోయెను. నాలుగుగంటల ఇరువది యెనిమిది నిముసములకు మరల నైజామువారిబండి వచ్చును. ఈలోపుగ ప్రయాణీకులు పోవు బండ్లేవియు లేవు. కృష్ణరావునకు కాలమును గడపుట కష్టముగ నుండెను. బెజవాడస్టేషనులో ప్లాట్‌ఫారములపై నున్న రైళ్ళు వచ్చు కాలములను తెలుపుపట్టీల నన్నింటిని చూచెను. ఆకాలములను మార్చుటనుగూర్చి యాలోచించెను. స్టేషనులోని ఇతరబల్లలపై నున్న యక్షరములను చదివెను. ప్రతిదీపమునుగుఱించిన సంగతులను తెలిసికొనెను. ఒకదీపములో నీళ్ళుపడెను. ఇంకొక దీపమునకుఁ గాగిత మంటించఁబడెను. ఇంకొక దీపములో దోమలు వేనవేలుగఁబడి చచ్చెను. ఒకదీపముక్రింద చాలచమురు కారి యుండెను. ఒక



దీపము తక్కినవానికంటె నెక్కువ వేఁడి యావిరుల నూఁదుచుండెను. కాని, ఎన్ని చూచినను నాలుగుగంటలే కాలేదు. ఒకకుర్చీమీఁద స్టేషన్‌మాస్టరు కూర్చుండి కునికిపాట్లు పడుచుండెను. ఇఁక స్టేషనునకు సంబంధించిన కచ్చేరీలందు పెద్దపెద్ద దీపముల వెలుఁగులోఁ గొందఱు గుమాస్తాలు నిద్రయను మాట లేక పనిచేయుచుండిరి. కృష్ణరావునకు మాత్ర మేమియుఁ దోఁచలేదు. మూఁడుగంటల ఇరువది నిముసములయ్యెను. కృష్ణరావు ఒంటరిగ తనలో తానే మాటలాడుకొనుచు నెంతకాల ముండఁగలఁడు? ఆతఁడు టిక్కెట్లమ్ముచోటికిఁ బోయెను. అచ్చట నందఱును లెక్కలు వేసికొనుచుండిరి. కృష్ణరావు గుంటకల్లువైపునకుఁ బోవుబండ్లకు రెండవతరగతి టిక్కెట్లనమ్ముచోటివద్దఁ గూర్చున్న యొకనిం జూచుచు కొంతసేపు నిలువఁబడెను. ఆతఁడును కృష్ణునివంకఁ జూచెను. చూచి తనపని చూచుకొనుటలో నిమగ్నుఁడై యుండెను. కొంతసేపైనతరువాత కృష్ణరావాతనితో నీమాటయు నామాటయు మాటలాడసాగెను. ఆతఁడును అలసి యుండుటచేతను లెక్కలు పూర్తియగుటచేతను కృష్ణరావుతో మాటలాడుచుండెను. కృష్ణరావాతనితో తనకు గుంటూరునకు తొందరగ రెండుటిక్కెట్లు కావలెనని కోరెను. రెండురూపాయల నాతని కిచ్చి టిక్కెట్లకు పోగా మిగిలినది తీసుకొమ్మని చెప్పెను. ఆతఁడును సంతసించి కృష్ణరావునకు రెండుటిక్కెట్లు నిచ్చి పంపివైచెను. గుంటూరువఱకును రెండవతరగతిపెట్టె యిరువురే కూర్చుండఁదగినది—రిజర్వుచేయఁబడెను. ఆరెండుటిక్కెట్లను జేబులో వైచికొని రైలుస్టేషనుతంతికచేరీవద్ద కాతఁడు వచ్చెను. అచ్చటి గడియారమునందు నాలుగుగంటల ముప్పదియైదునిముసములై యుండెను. అప్పుడే రెండు రైలుగంటలు కొట్టఁబడెను. మూఁడవగంట కొట్టునప్పటికి హైదరాబాదుబండి వచ్చెను. స్టేషనులో కూ

లివాంఛ్రి లేచి ఇటునటుఁ బరుగు లెత్తుచు నడుచుచుండిరి. మరల బెజవాడస్టేషను నిద్రనుండి లేచి కొంత జీవకళను సంపాదించిన ట్లుండెను. కలకత్తాకుఁ బోవు మెయిలు వచ్చుట కింకను నలువదియైదునిమిషములనే యుండెను. ఈనలువదియైదు నిమిషములలోఁ గృష్ణరావు ముఖము కడిగికొని సిద్ధముగ నుండెను. కొంతసేపటికి రైలుగంటలు కొట్టఁబడెను. కలకత్తామెయిలు వచ్చుచున్నదని కూలివా రందఱును ఒకరి నొకరు త్రోసికొనుచు నిలువఁబడిరి. కృష్ణరావుకూడ త్వరగా ప్లాట్ఫారము చివరకుఁ బోయి నిలువఁబడెను. రైలు బెజవాడస్టేషను సమీపించుచుండెను. కామేశ్వరరావు లేచి పైనున్న పరుపును చుట్టుచుండెను. అర్ధచంద్రాకారముగ వంగి తీగెలతో కట్టఁబడి సామాను పడవేయుట కనుకూలించు తొట్టిలో కామేశ్వరరావు పండుకొనుటకు సౌఖ్యముగనే యుండెను గాని, ఇప్పుడు పరుపుచుట్టుట మాత్రము మతి కష్టముగా నుండెను. ఆతఁడు పరుపుచుట్టు నవస్థలో పడియుండఁగా బెజవాడస్టేషనులోనికి మెయిలు వచ్చి ఆగెను. హైమవతి కృష్ణరావుకొఱకు చూచుచుండెను. కృష్ణరా వామెను చూచెను. వెంటనే దిగుమని యామెకు సైఁగచేసెను. ఆమె గుమ్మమువద్దకు వచ్చెను. కృష్ణరా వామెను దింపెను. వారిరువురును తొందరతొందరగ గుంటూరు బండికిఁ బోయి రెండవతరగతిబండి నెక్కిరి.

కామేశ్వరరావు పరుపుచుట్ట చుట్టి చూచునప్పటికి హైమవతి లేదు. ఇచ్చటిపిల్ల యేదని కొంతమంది నాతఁడడిగెను. ఎవ్వరును చెప్పలేదు. అంతమందిలో వా రెవ్వరు నెఱుఁగని యొకపిల్ల యెచ్చట దిగెనో చూచినవా రెవ్వరు? హైమవతి కనఁబడకపోవుట చూచి కామేశ్వరరావు భయమును నందెను. త్రోవలో నెచ్చటనైన రైలులోనుండి యామె దూఁకెనా యని యాతఁడు ప్రశ్నించుకొనెను. కాని, ఇంతటి



లో నెవరో పుణ్యాత్ముఁడు "ఇక్కడి కెవరో ఒకాయన వచ్చాఁడు. ఇందాఁకటినించీ ఇక్కడ కూచున్న అమ్మాయి ఆయనతో వెళ్ళింది" అని చెప్పెను. కామేశ్వరరావు 'లబలబ' మొత్తుకొనెను. వెంటనే పెట్టెను పరుపును ఆపుణ్యాత్ముని జూచుచుండుమని చెప్పి యాతఁడు బెజవాడస్టేషను సంతటను వెదుక నారంభించెను. మెయిలుబండిలోని పుణ్యాత్ముఁడు చెప్పిన దిక్కు ననుసరించి యాతఁ డరిగెను. ఆత్రోవ గుంటూరుబండివద్దకుఁ బోయెను. మూఁడవతరగతి బండ్లన్నియు వెదకెను. ఎచ్చటను హైమవతి కనఁబడలేదు.

హైమవతి యేమియు భుజింపలే దనియు, ముఖమైనఁ గడిగికొనలే దనియు, కృష్ణరావునకుఁ దెలియును. కాని, ఆమెను వదలిపెట్టిన యెడల నేమగునో యని యాతఁడు భయపడి ఆమెవద్దనే కూర్చుండెను. "హైమా! నిన్ను ఎలాతీసుకొచ్చాడు మీమామ? నువ్వెలా వచ్చావు?"

"నన్ను బలవంతపెట్టి రాకపోతే బలవంతంగా తీసికెడతానని చెప్పాడు." అని చెప్పి యామె తనకథ నంతను చెప్పెను.

కృష్ణరా విట్లనియెను. "ఎంతధైర్యమైనపని చేశావు? అక్కడ ఏలూరులో ఇవ్వాళ కేశఖండనానికి ప్రయత్న మంతా జరుగుతూ ఉంది. నిన్న మీమామ తంతి ఇచ్చాడట నిన్ను తీసుకొస్తున్నా నని. నువ్వు రైలు దిగడంతోటే నిన్ను ఎంతఅందవికారం చేసేవాళ్ళు! నేను అదృష్టవంతుణ్ణి హైమా! నువ్వు తప్పించుకున్నందుకు !!

హైమ—అయితే అత్తా మామా ఒప్పుకున్నారా?

కృష్ణ—ఆసంగతి మనం బెజవాడనించి కదిలాక చెప్తాను. ఏలాగైనా చెన్నపట్నం రేపు వెడతాము. వెళ్ళిన నాలుగైదురోజుల్లో పెళ్ళి జరిగితీరుతుంది.

హైమ—ఇప్పుడు మామ వస్తే మీరు ఏంజేస్తారు?

కృష్ణరావామెవంకఁ జూచెను. ‘మీరు’ ఎవరు?

ఆమె చిఱునవ్వు నవ్వుచు తలవంచుకొనెను.

కృష్ణ—ఇన్నాళ్లూ ‘బావా’ ‘నువ్వు’ అంటూ మరి చటుక్కున మార్చేశావేం? ‘మీరు’ అంటే ఏవిఁటో కొత్తగా ఉంది. మీమామ ఏమన్నా ఇలా అనమన్నాఁడా ఏమిటి?

ఆపెట్టె ఇరువురు కూర్చుండుటకును ఒకరు పరుండుటకునుమాత్రమే సరిపోయినది. కృష్ణరావు బండిని బుక్కుచేయించుకొన్నప్పుడల్లే తీసికొనెను. అతఁడు బండినెక్కుటతోడనే గార్డును పిలిచి ప్లాట్‌ఫారమువైపు తాళము వేయించెను. అటువైపుకిటికీ మూసివైచెను.

కృష్ణరావిట్లనెను. “హైమా! నిన్నటిరాత్రి నిద్ర లేదుకాబోలు పడుకుంటావా ఏమిటి?”

ఆమె పండుకోనననిచెప్పెను. కృష్ణరావామెను దగ్గఱకు తీసికొని, తలను చేతితో దువ్వుచుండెను. ఆమెయు బరువంతయు నాతనిమీఁదమోపి యాతనిముఖమువంక చూచుచుండెను. “బావా! నన్ను చూస్తే సిగ్గేమైనా?”

ఈపిచ్చిప్రశ్న కేమి ప్రత్యుత్తర మీయవలెనో ఆతనికిఁ దెలియలేదు. “నువ్వేమనుకుంటావు?” అని యాతఁడామె నడిగెను.

“కాకినాడనించి నాకోసం ఇంతదూరం వచ్చావు. నామీద ఇష్టముండే వచ్చావన్నమాట.”

“నువ్వు ఏలూరునించి చెన్నపట్టణం రాలేదూ? ఇప్పుడు మళ్లీ నాతో రావడంలేదూ?”

ఈప్రశ్న వేయునప్పటి కామె యాతని యొడిలో కూర్చుండియుండెను. “బావా! ఔను. నిజంగా ఏలూరు వెళ్ళి వాళ్లనుకున్నం



తో చేస్తే, అందవికారంగా ఉండేదాన్నిగదా? అప్పుడు నువ్వు నన్ను చెన్నపట్టం తీసికెళ్లేవాడివేనా?” అనియెను.

కృష్ణుఁడామెవంకఁ జూచెను. ఆచెదరిపోయిన తలతో, కడిగికొనని ముఖముతో, నలిగిపోయిన చీరతో, నామె, పిల్లతనపుమాటలతో నాతని చలింపఁజేసెను. ఆతనికి నోట వాక్కు లేదు. ఆమెను గట్టిగ కౌఁగిలించుకొని ముద్దుపెట్టుకొనెను.

ఆసమయమున ఇండ్లపైనుండి సూర్యకిరణములు వారియరలోనికి తొంగిచూచెను. ప్లాట్‌ఫారమువైపున నున్న కిటికీ తెఱవఁబడెను. కామేశ్వరరావచ్చుటఁ బ్రత్యక్ష మయ్యెను. వెంటనే హైమవతి కృష్ణునియొడిలో నుండి లేచెను. కృష్ణరావు “హైమా! జాగ్రత.” అని యఱచెను. ఆమె యాతనియెడమచేతిని గట్టిగ పట్టుకొనెను. తనంతట తానే నిలువఁజాలక దగ్గఱనున్న చెట్టున కల్లికొని జీవించు లతానికుంజమువలె కృష్ణుని విడువక పట్టుకొన్న హైమవతిని కామేశ్వరరావు చూచెను. ఇంత యన్యోన్యముగఁ బ్రేమించు ‘దంపతు’లను వేఱు చేయఁదలఁచుట యాతని కసహ్యముగఁ గనుపింపఁజొచ్చెను. కాని ఇట్టివర్తనము కులమునకును మర్యాదకునుగూడ దూరమని యాతఁడు భావించెను. ఆతనిపరువును, పెట్టెయున్న కలకత్తాబండి కదలుటకింకను పదినిముసము లుండెను. ఈపదినిమిషములలోను అతఁడామెను తీసికొనిపోవలెను. లేకున్నచో తానిన్నిదినములును పడిన శ్రమ బూడిదలోఁ బోసిన పన్నీరగును. కామేశ్వరరావు తలుపు తెఱచుటకుఁ బ్రయత్నించెను. కాని తాళమువైచియుండుటచే తలుపురాలేదు. కృష్ణరావు కామేశ్వరరావువంకఁ జూచెను. “అయ్యా! కష్టాలుపెట్టి ఇంట్లో ఉండనీయక బ్రతికిబైటపడ్డ పిల్లను మళ్లీ కష్టాలపాలు చెయ్యడానికి ప్రయత్నిస్తున్నారా? హైమ తనయిష్టంమీద నన్ను పెళ్లిచేసు

మంటూ ఉన్నది. నేను సాయిస్టంమీద చేసుకోడానికి అభ్యంతరం చెప్పలేము. ఇటువంటిసమయంలో మమ్మల్ని వేరుచెయ్యడం పాపం. మీరు మర్యాదస్థులనీ, సంగతిసందర్భాలు చక్కగా ఆలోచించగల సమర్థులనీ, పుణ్యబుద్ధికలవారనీ, ఇంతవఱకు చెప్పాను."

కామేశ్వరరావు మాటాడక తల వంచుకొని నిలువఁబడెను. ఆతనిహృదయమున కృష్ణరావు చెప్పినదే నిజమను నభిప్రాయము జనించుచుండెను. కాని ఇంతలో తనచెల్లెలు నొక్కవ్రాసిన యుత్తరము లాతనికి జ్ఞాపకమునకు వచ్చెను. హైమ నెట్లైన తీసికొనిపోవలె నని యాతఁడు తలంచెను.

కృష్ణుఁడు కామేశ్వరరావుముఖమువంకఁ జూచుచు నిమాఱ్పుల నన్నింటిని గుర్తించుచుండెను. చివరిమాఱ్పు వచ్చునప్పటికి కృష్ణుఁడు వస్తాదువలె కుడిచేతిచొక్కాను పైకిఁ దీసి పిడికిలిపట్టుచుండెను.

కామేశ్వరరా వాతనిఁ జూచెను. తానొక్క యెముగిడినచో ప్రాణములకైనను జంకక తనకు కాయశుద్ధి యొనర్చువాఁడున్న కృష్ణరావును చూచి నిశ్చింతపోయెను. తెప్పిఱిలెను. "కృష్ణరావూ! నువ్వు చిన్నవాడివి. నీకు ప్రపంచక మంటే ఏమిటో ఇంకా తెలియదు. నువ్విలా నిల్చున్నంతమాత్రాన నేను భయపడతా ననుకున్నావు కాబోలు." అనియెను.

కృష్ణ——నాకృతజ్ఞతనొన్ని మీరేమీ అభినందించనక్కరలేదు. నేను ఏంచేస్తున్నానో, ఆసంగతి రెండుసంవత్సరాలబట్టీ ఆలోచించాను. మీరు నామీద దయయుంచి నాకృతజ్ఞతనవుచేష్టలు నాకు తెలియపరచినందుకు మీ కనేకవందనాలు. ఇక తమరు దయచేస్తే సంతోషిస్తాను.

కామేశ్వరరావు కృష్ణరావున కేజవాబును ఈయలేదు. హైమవతివంకఁ జూచి "హైమా, వస్తావా వెడదాం."



హైమవతి కృష్ణునిఎడమచేతిని మరింత గట్టిగ కౌఁగిలించుకొనెను. కామేశ్వరరావువంక చూచెను. "నేను రాను" అనుమాట లప్రయత్నముగ నామెనోటినుండి వెడలివచ్చెను.

కృష్ణ——కామేశ్వరరావుగారూ, మీరు పెద్దమనుష్యులు. మా అన్యోన్యప్రేమను పాడుచెయ్యడం మీకు ధర్మంకాదు. మీకిది పాపము. నేనైనా హైమను వివాహంచేసుకోబోతున్నాను గాని మఱొకటి కాదు. ఇప్పుడు నేను మీపెద్దమనిషితనం చూసి బ్రతిమాలుతున్నాను. ఇది మీకిష్టం లేక హైమను తీసికెళ్లాలనే పట్టుపడితే, నేను ఏమాత్రముమ్నా మీతో డీకోడానికి జంకను. నాప్రాణాలు పోయిన తరువాత హైమను తీసికెళ్లాలిసిందే గాని ఈలోపుగా మీకు సాధ్యం కాదు.

ఇంతలో కలకత్తాబండికి గంటకొట్టబడెను. కామేశ్వరరావు వెడలిపోవుటకు వేళ యయ్యెను. కృష్ణరావుమాట లాతనికి నచ్చినట్లు కనఁబడెను. హైమవతి ఇష్టపడినచో తీసికొని పోవలె నని యాతఁడనుకొనెను. మరల నాతఁడొకప్రయత్నము చేసెను, "హైమా, ఆఖరిమాటు అడుగుతున్నాను. ఈఅమర్యాదపని వదలిపెట్టి ఇంటికివస్తావా? రావా?"

హైమవతి కృష్ణునివంకఁ జూచెను. కృష్ణునకు మఱింతదగ్గఱ వచ్చెను. కృష్ణుఁడు తనఎడమచేతిలో నున్న యా[illegible]చేతిని గట్టిగ పట్టుకొనెను. హైమవతి తలవంచి "నేనురాను" అనెను.

కామేశ్వరరావు కృష్ణునివంకఁ జూచెను. "కృష్ణరావూ, నువ్వే గెల్చావు. ఇంత ప్రేమిస్తూఉన్న మిమ్మల్ని వేఱుచెయ్యదల్చుకోడం నాపొరబాటు. నాతప్పు క్షమించి హైమవతిని జాగ్రత్తగా చూసుకో."

కృష్ణరావు తనకుడిచేతిని కామేశ్వరరావున కిచ్చెను. ఆతఁడు ఆ

చేతిని తీసికొని ఆడించెను. తనవ్రేలియుంగరము నొకదానిని తీసి కృష్ణునిచేతిలో పడవైచెను. "ఇది మీవివాహానికి నేనిచ్చే కానుక" అనియాతఁడు "హైమవతీ! కృష్ణరావు చాలమంచివాఁడు. యావజ్జీవము న్నూ, అతని కేకష్టంవచ్చినా నువ్వే దాన్ని తీర్చాలి" అని చెప్పి వెనుకకైనను తిరిగి చూడక కామేశ్వరరావు కలకత్తాబండి నెక్కి వెడలిపోయెను.

కలకత్తాబండి వెడలిపోవువఱకును హైమాకృష్ణులు తమ్ము తామే మఱచి కిటికీలోనుండి కామేశ్వరరావు వెడలినవైపునకుఁ జూచుచుండిరి. కలకత్తాబండి కదలెను. కృష్ణరావు ప్లాట్ఫారంవైపు కిటికీని మూసివైచి "నేను రాను" అనుచు హైమవతి నాలింగనము చేసికొనెను. కామేశ్వరరా విచ్చిన యుంగరము నామెవ్రేలికిఁ దొడిగెను.

కొంతసేపటికి గుంటూరుబండి కదలెను. హైమ నిట్టూర్పువిడిచ్చి ఇట్లనెను. "మానాన్న వ్రాసినకాగితము ఎందుకు చూపించలేదూ. చూపిస్తే, మొటమొదటే వదలిపోయేది కాదూ?"

కృష్ణ—ఆఉత్తరం చూపిస్తే మీనాన్న కిక బ్రతకడానికి తెరున్నందా? మీనాన్నే కాగితం వ్రాసి ఇచ్చాడని, మీమామ ఏలూరికెళ్లి చెప్పాడంటే మీనాన్నపని ఏమౌతుందో, ఆలోచించావా?

హైమవతి చిఱునవ్వు నవ్వెను. "మొగవాళ్లలాగనా తెలివిగలవాళ్లు."

కృష్ణ—టెలిగ్రామిచ్చి తప్పించుకున్న ఆడవాళ్లో?

హైమ—మీరు......రాకపోతే తప్పించుకొనే దాన్నేనా?

కృష్ణ—ఇప్పుడు తప్పించుకో చూద్దాం" అనుచు నామెను దగ్గఱకు లాగికొనెను.

హైమ—మిమ్మల్ని తప్పించుకోడానికి మళ్లీ మీకే టెలిగ్రాం ఇవ్వాలి.



ఇట్లనుకొనుచు వారు గుంటూరుస్టేషనులో దిగిరి. మరల నెవరైన హైమవతిని పుట్టింటికిఁ గొనిపోవ సమకట్టుదురేమో యను భయమువలన కృష్ణరావు చాల జాగరూకతలో నుండెను.

గుంటూరునందు రైలుదిగుటతోడనే రైలుస్టేషనులోనున్న యొక్క కొళాయివద్ద ముఖముకడిగికొని రైలుపేటలోని యొకపూటకూటిఇంటికిఁ జని భుజించి, మరల తెనాలిపోవు బండినెక్కి వారు తెనాలికిఁ జనిరి. గుంటూరియందున్నచో మరలనెవరైనను వచ్చి కామేశ్వరరావుచేసిన ప్రయత్నమునే చేయవచ్చునని ఆతఁడు తలంచెను.

తెనాలిలో కృష్ణరావుస్నేహితుఁ డొకఁడుండెను. క్రిందటిదినమున నాతనికి బహుశః తాను గుంటూరునుండి తెనాలికి పదునొకండుగంటలబండిలో నాఁడువారితో వచ్చెదననియు, రైలుదగ్గఱ నుండవలె ననియు టెలిగ్రాము నిచ్చియుండెను.

తెనాలిలో వారు దిగుటతోడనే, ఆస్నేహితుఁడు వారిని తనయింటికిఁ దీసికొనిపోయెను. క్రిందటిరాత్రినుండియు నలసియుండుటచే నాలస్యము చేయక భుజించవలసివచ్చెనని కృష్ణరావు స్నేహితునకు క్షమార్పణ చెప్పికొనెను. ఆస్నేహితునకు హైమవతి యెవ్వరో తెలియదు. కృష్ణరావునడుగగా, తన మేనమామకుమార్తె యని చెప్పెను. స్నేహితుఁ డతనిఁ జూచి నవ్వెను. కృష్ణరావానవ్వుయొక్క అర్థమును గ్రహించెను.

స్నేహి—మీరెక్కడికి వెళుతున్నారు.

కృష్ణ—చెన్నపట్టణం.

స్నేహి—చెన్నపట్టణములో ఎవరింటికి?

కృష్ణ—మాయింటికే.

ఇంటిలోనివా రందఱకు హైమవతి కృష్ణరావునకు భార్య య

నియు, మేనమామకుమార్తె యనియుఁ దెలియవచ్చెను. ఆనాఁడు పగ లంతయు నచ్చటనే యుండి, రాత్రిభుజించి పన్నెండుగంటలకు కలక త్తామెయిలులో ఇంటరుమీడియేటు తరగతిబండిలో వారు ప్రయాణ ము సాగించి, ఉదయ మగునప్పటికి చెన్నపురి చేరిరి.

వీరిద్దరును దీక్షితులుగారియిల్లు చేరునప్పటికి తొమ్మిదిగంట లయ్యెను. ఇల్లు ప్రవేశించుటతోడనే దీక్షితులుగారు కృష్ణు నభినం దించిరి. కృష్ణుఁడు జరిగినసంగతు లన్నియును జెప్పి, వివాహ మగు వఱకును హైమను విడిచి యుండఁగూడ దని నిశ్చయించి దినమున కై దాఱుమార్లు వచ్చి చూచిపోవుచుండెను.

## ఇరువదియొకటవ ప్రకరణము.

నాలుగైదుదినములలో పెండ్లిప్రయత్నము లన్నియును జరిగె ను. కృష్ణరావు తనస్నేహితులగు సత్యనారాయణ సోమయాజులు మున్నగువారికి శుభలేఖలను పంపెను. వారందఱును హైమాకృష్ణుల వివాహమున కరుదెంచిరి. వితంతువ్వాలయమునందలి నలుగు రాంధ్ర వితంతువులే గాక తక్కిన బ్రాహ్మణవితంతువులుకూడ నరుదెంచిరి. దీక్షితులుగారి గృహమే పెండ్లి జరుగుగృహము. కన్యాదానము చే యుటకు దీక్షితులుగారినే నియమించిరి. ఎచ్చటినుండియో, ఎక్కువ ధన మిచ్చెద మని యాసపెట్టి యొక పురోహితునిఁ దీసికొనివచ్చిరి. ఒక్కదినము వివాహము. వైశాఖబహుళ చవుతి తెల్లవాఱుజామున ఐదుగంటలకు వివాహము జరిగెను. వచ్చినవా రందఱును వధూవరుల



నాశీర్వదించిరి. వివాహము ముగిసెను. వివాహముతో శోభనము గూడ జరిగెను. ఇఁక హైమాకృష్ణులను విడఁదీయువా రెవ్వరు?

నాఁటిదినమునుండియుఁ గృష్ణునకు నూతనశక్తియు, నూతనా నందమును గలిగిన ట్లుండెను. ఇప్పు డతఁడు క్రొత్తమనుష్యుఁడైన ట్లుండెను. అతనిజీవితమీసాగరమునఁ బ్రవేశించుటకుముందే ధీరులు కూడ చేయఁజాలనిపనుల నాతఁడు చేసియుండెను. హైమవతిని తల్లి దండ్రులు పెట్టుచున్న కష్టపరంపరలనుండి రక్షించుట, కామేశ్వరరా వును గ్రుడ్డివానిఁ జేసి హైమవతిని చేఁజిక్కించుకొని చెన్నపట్టణమున కు వచ్చుట, ఎవ్వరికిని వెఱవక వితంతూద్వాహము చేసికొనుట—ఇవి యన్నియు కృష్ణరావు నితరులకన్న నున్నతాసనమున కర్హునిగఁ జేసివై చెను. ఇప్పు డతఁడు చెన్నపురియందలి విద్యావంతుల తలమానికమై ప్రకాశించు చుండెను. ఆతఁడు మున్ను ప్రేమించి వాంఛించిన హై మవతి యాతనికి సహధర్మిణి యయ్యెను. ఆతనియాశాస్వప్నము లన్నియును హైమవతియందు మూర్తీభవించిన ట్లుండెను. ఆమెసుగు ణములగని, కృష్ణునిపై నామెకున్న ప్రేమ కంతులేదు. ఇట్టియన్యోన్య ప్రేమాన్వితులగు దంపతులను చూచి సంతోషించని వా రెవ్వ రుం దురు? వివాహము జరిగిన రెండుమూఁడుదినములకు కృష్ణరావుకు స్నేహితుఁ డొకఁడు కనఁబడెను. కృష్ణునకు వివాహము జరిగినసంగతి యాతనికిఁ దెలియదు. సత్యనారాయణ కృష్ణరావువద్దనే కూర్చుండి యుండెను. ఆక్రొత్తస్నేహితుఁడు వచ్చుటతోడనే సత్యనారాయణ ఇట్లనెను.

సత్య—ఏమోయి, రా. నీ కొక క్రొత్తసంగతి చెప్పాలి.

స్నేహి—ఏమిటి? పత్రికల్లో వేయించతగిందేనా?

సత్య—ఆసంగతి నాకు తెలియదు గాని, అసలుసంగతి చెప్ప

మంటే చెపుతాను. కృష్ణరావుకు కొన్నిరోజులక్రిందట వివాహమైంది.

స్నేహి—"ఇంకా చెప్పవు. ఏమోయి కృష్ణరావు నన్నుపిలువ లేదేం? నన్ను అభినందిస్తున్నాను." అని ఇంగ్లీషుతో నాతఁడనెను. "పిల్ల ఎవరిపిల్ల?"

సత్య—వాళ్ల మేనమామకూతురే. ఏలూరులో ఆగంటి వేంకటప్పయ్యగారని—

స్నేహి—ఏమిటి? ఆపిల్ల మాచారపువారికోడలుకాదూ?

సత్య—అది పూర్వము. ఇప్పుడు సర్పవరపువారికోడలు?

స్నేహి—అయితే వితంతూద్వాహ మన్నమాట. మఱి పత్రికలలో వేయించవలసినవిషయమే.

సత్య—ఎలా అయినా కృష్ణుఁ డదృష్టవంతుఁడంటావా, కాదంటావా?

స్నేహి—ముమ్మాటికీ అదృష్టవంతుఁడే. వేంకటప్పయ్యగారికి ఇద్దరే కూతుళ్లు. ఆయన కొక లక్షరూపాయల ఆస్తిఉందట. మనకృష్ణరావుకు అందులో మూడువంతులన్నా వస్తుంది.

సత్య—డబ్బు చూసి చేసుకోలేదు. ప్రేమను చూసి చేసుకున్నాడు.

చెన్నపురియందలి విద్యార్థిబృందములో నీవార్త వ్యాపించెను. కృష్ణరావు గొప్పఘనునివిధమునఁ జూడఁబడుచుండెను. అతఁడు మనుష్యాతీతుఁడైనట్లు పరిగణించబడెను. అతనిఁ జూచి ఇదివఱ కసూయఁ జెందినవారుకూడ అతఁడాకసమునుండి యూడిపడినట్లు భావింపఁదొడఁగిరి. అతఁ డెన్నిసాహసకృత్యములు చేసి వివాహము చేసికొనఁగలిగెనో అందఱకును దెలిసెను. అతఁడు వారందఱచేతను నమస్కరింపఁబడుచుండెను. స్నేహితు లాతనిసలహాలకై వచ్చుచుండిరి. అతఁడు



చెప్పినట్లు చేసినచో ప్రతికార్యమును సఫలీకృత మగు నని ఎల్లరును విశ్వసించుచుండిరి.

ఈవివాహవిషయము శీఘ్రముననే పత్రికలందు ముద్రింపఁబడెను. పత్రికలందు ఈవిషయమును చూచి కృష్ణరావున [illegible]ను సహాయము చేయవలె నని క్రొత్త పద్ధతులవారి నాయకులు తలంపసాగిరి. వెంటనే కృష్ణరావునకు పర్లాకిమిడిరాజావారొక "స్కాలరుషిప్పు" రెండేండ్ల కిచ్చిరి. ఆయుత్తరమును విప్పి చూచునప్పటికి కృష్ణరావ దాఁనందసాగరనిమగ్నుఁడై పోయెను. ఆనందమను మకరందమును గ్రోలు తేనెటీఁగవలె కృష్ణరావు సంతోషస్వాంతుఁ డయ్యెను. ఇఁక నాతఁడు రెండేండ్ల కాలము బి. యల్. చదువుకొన వచ్చును. పర్లాకిమిడిరాజావారు కృష్ణారావునకు రెండేండ్లకును వలయుధనమును 'ఇంపీరియల్ బాంకు'నందు కృష్ణరావున కిచ్చునట్లు కట్టియుండిరి. ముక్తసరిగఁ గడపుకొన్నచో హైమాకృష్ణులు సుఖముగా రెండేండ్లపాటు కాలమును వెడలఁబుచ్చవచ్చును.

కృష్ణరావు నాఁటిదినమే శ్రీరాజావారికి వందనము లర్పించుచు నొకయుత్తరము వ్రాసెను. సత్యనారాయణయును సోమయాజులును కృష్ణరావు నభినందించిరి. తక్కిన విద్యార్థి ప్రపంచకమున కాతఁడు పూజనీయుఁ డయ్యెను. మునుపటికన్నఁ గృష్ణరావున కిప్పుడు గౌరవ మధిక మయ్యెను.

మేనెల ఇరువదినాలుగవ తారీఖున హైమవతియును కృష్ణరావును కాకినాడకు బయలుదేఱిరి. సుమారు పదిగంటలకు వారు ఇల్లు చేరిరి. నాగభూషణముగారు చావడిలో వ్రాసికొనుచుండిరి. కృష్ణరావు వచ్చుటకిఁ బోలేదు. ఇంతలో శేషమ్మ కచేరిచావడిప్రక్కనున్న చావడిలోనికి వచ్చెను. హైమాకృష్ణుల నామె చూచెను. వారివివాహ

ఘునుగూర్చి యామె వినియుండెను. ఇప్పుడు తనకుమారుని కోడలిని చూచి యొక్కమాటయైనను మాటాడక నిలువఁబడెను.

హైమాకృష్ణులొకరిమొగ మొకరు చూచుకొనుచు నిలువఁబడిరి. కొంతసేపటికి కృష్ణరావే "అమ్మా! కోడలిని చూచితివా!" అనెను.

హైమవతి యత్తగారికి నమస్కరించెను. శేషమ్మ ఇఁక మౌనము ధరింపఁజాలకపోయెను. హైమ నొక్కవిసురున లేవనెత్తి మెల్లగ కౌఁగిలించుకొనెను. "హైమా మాయింటి కోడలివైనావా?" అనెను.

అటువెనుక కృష్ణరావుతల్లికి నమస్కరించెను. వారిరువురను శేషమ్మ దీవించెను. "నాయనా నీతోటిదే లోకమని నమ్ముకొన్న హైమను సరిగా చూచుకో" అనెను.

ఆతరువాత వారిరువురును కాలుసేతులు కడిగికొనిరి. శేషమ్మ వంటయంతయు నగుటచే వారితో మాటలాడఁజొచ్చెను.

శేష—ఈపెళ్ళి నాచేతిమీదుగా చెయ్యకపోయినా, చేతిమీదుగా చేసినంత సంతోషంగా ఉంది.

తలుపుమొత్తన నిలువఁబడిన హైమ తలవంచుకొని యేమియును మాటలాడలేదు. చావడిలో పడకకుర్చీమీద కూర్చున్న కృష్ణరావు కూడ తలవంచుకొని యేమియును మాటలాడలేదు.

శేషమ్మ వారిరువురివంకను కరుణాశీకరములను వెదచల్లెను. వారిరువురి మనములందును ఒకవిధమగు భయమున్నట్లు లామెకు గోచరమయ్యెను. ఆభయకారణముగూడ నామె యిట్టిదని గ్రహింపఁగలిగెను. వివాహమున కేయభ్యంతరమును లేదని శేషమ్మ యిదివఱకే చెప్పియుండెను. వివాహమైన వధూవరులను శేషమ్మ కరుణాకటాక్షములతో లోనికిఁ దీసికొనిపోయెను. వారిని దీవించెను. కాని, నాగ



భూషణముగారు కచ్చేరిచావడిలో కూర్చుండిరి. హైమాకృష్ణులు వచ్చుట యాయన చూచెను. వారివివాహముసంగతి కృష్ణుఁడు వివాహదినమున వ్రాసిన యుత్తరమువలనను, పత్రికలవలనను నాగభూషణముగారికిఁ దెలిసియే యుండెను. అట్లయ్యును ఆయన యేల వచ్చి తనకుమారుని కోడలినిఁ జూడనాసింపలేదు? వారు తనయింటనుండుట నాగభూషణముగారి కిష్టమగునో కాదో? భుజించకుండనే వారు ఇల్లు వెడలి పోవలసివచ్చునేమో?

ఈభయమువలననే హైమాకృష్ణులు తా[illegible]ము తెచ్చికొన్న యొక్కపెట్టెను తాళముతీయకుండ నట్లేయుంచిరి. వారు స్నానము చేయకుండ నెవ్వరిస్థానముల వారు నిలిచియుండిరి. ఇంత యాశీర్వదించి, వివాహమున కభ్యంతరములేదని నొక్కిచెప్పిన శేషమ్మకూడ వారిని స్నానము చేయుఁడని కాని భోజనము చేయుఁడనిగాని యనలేదు. పదునొక్కగంట కాఁజొచ్చెను. నాగభూషణముగారివలని భయమా? లేక తనకే యిష్టము లేకనా?

నాగభూషణముగారింకను భోజనము చేయలేదు. కచ్చేరికి వేళ యగుచుండెను. అతిశీఘ్రముగ నాగభూషణముగారు భోజనమునకు రావలయును. ఈసంగతి నెఱింగిన కృష్ణరావు కొంచె మోపికపట్టియుండెను.

ఇంతలో నాగభూషణముగారు పడకకుర్చీమీఁద నుండి లేచి కచ్చేరికిఁ బోవు దుస్తులను ధరించిరి. గొడుగుచేతఁ బట్టికొనిరి. "ఇదుగో ఓసే తలుపేసుకో" అని మెల్లఁగ మెట్లు దిగ నారంభించిరి.

శేషమ్మ తొందరగ వీధివాకిలివద్దకుఁ బరుగెత్తెను. "ఇదేమిటి భోంచెయ్యకుండా వెళ్ళిపోతున్నారు?" అనెను.

"ఇప్పుడు నాకు వేళలేదు. వాళ్ళకు అన్నంపెట్టు" అనుచు

మాఱుమాటాడక నాగభూషణముగారు గొడుగు పైచుకొని నడచి పోయిరి.

వేసవికాలము. ఎండ మండిపోవుచుండెను. ఆగ్రీష్మమాసమున గాడ్పులు ప్రబలముగ వీచుచుండెను. ఆఎండలో నాగాడ్పులో పదు నాలుగంటలకుఁ బూర్వము భుజింపఁబడి, జీర్ణమైన భోజనముమాత్రమే యాధారముగ నాగభూషణముగారు బయలుదేఱిరి. శేషమ్మ యేమియు ననుటకు వేళ చాలదాయెను. అప్పుడే నాగభూషణముగారు సందు తిరిగిరి. కృష్ణరావు నతనివెనుకఁ బంపి పిలుచువమా? యని యామె యనుకొనెను. వితంతూద్వాహము చేసికొన్న కృష్ణరావు వచ్చుటచే తనే నాగభూషణముగారు వెడలిపోయిరి. అదియునుగాక కచ్చేరివే ళయు నతిక్రమించినది. ఇఁక నాగభూషణముగారిని వెనుకకుఁ బిలిచి ప్రయోజనములే దని శేషమ్మ నిర్ధారణ చేసికొనెను. నాగభూషణము గారు కొంచెముదానిని బ్రహ్మాంతి చేయుచున్నారని యామె తలంచెను. కచ్చేరిచావడి వీధివాకిలి మూసి, శేషమ్మ కృష్ణరావుకూర్చున్న చావిడిలోనికి వచ్చెను.

శేష—మీనాన్న భోజనం చెయ్యకుండానే కచ్చేరి వెళ్ళారు.

కృష్ణ—అదేమిటమ్మా మేం రావడం ఇష్ట లేదా ఏమిటి?

నాగ—ఇష్టం లేకనేం? ఇష్టంలేకపోతే అప్పుడే తెలిసేది? ఆయనకేం చెయ్యడానికీ తోచక భోజనం చెయ్యడం మానేసి కచ్చేరి వేళైందని వెళ్ళిపోయారు. మీరు స్నానాలు చెయ్యండి.

కృష్ణ—అయితే నాన్నతోనే భోజనానికి వస్తాను నేనుగూడాను.

శేషమ్మ నిర్ఘాంతపోయెను. "నిన్నరాత్రి ప్రయాణంచేత అలసిపోయి ఉన్నారు. మీరిద్దరూ స్నానాలు చేసి భోజనం చెయ్యండి. ఆయనకోసం మీరు కనిపెట్టుకొని ఉండడం ఎందుకు? ఆయనెప్పుడో



రాత్రికివస్తారు. హైమా లే. దొడ్లో కాగులో వేణ్ణీళ్ళున్నాయి వెళ్ళి పోసుకో."

హైమ కృష్ణునివంకఁ జూచెను. ఆతని యుద్దేశముప్రకారమే నడువవలసినవిధి అతని భార్య యగు తన పనియని నిశ్చయించెను.

కృష్ణరావు ప్రశ్నార్థకములగు నామెదృక్కులను, తాను భోజనము చేయకున్నను నామెమాత్రి మాఁకలితో రాత్రివఱకును ఉండుట కృష్ణునకు సమ్మతముకాదు. అతఁ డామెవంకఁ జూచి "స్నానం చేసి నువ్వు భోంచెయ్యి. నేను మానాన్నతో భోజనం చేస్తాను."

ఆమె తురల నాతనివంకఁ జూచెను. ఈదృక్కులయర్థమును ఆతఁడు గ్రహించెను. ఆతనినిగూడ నప్పుడే భోజనముచేయు మని హేమ యతిదీనముగ బతిమాలుచున్నట్లు కృష్ణునకుఁ దెలిసెను.

శేషమ్మకూడ నాయర్థమును గ్రహించెను. అది శ్రవణవక్త్ర సంభాషణ కాదు. హృదయ లోచన సంభాషణ. హైమవతియుద్దేశమునే శేషమ్మ మాటలతో బలపఱచెను. ఈరెండు బలవత్తరములగు శక్తులమధ్యను కృష్ణరావు తనయిష్టమును కొనసాగించుకొనలేకపోయెను. హైమ యాతనికి వేఁడినీళ్లను తోడి యిచ్చెను. ఆతనిస్నానమైన తరువాత హైమవతికూడ స్నానము చేసెను. ఇరువురకును వంటయింటనే శేషమ్మ భోజనముపెట్టెను. అట్లు జరుగదని యాతఁడు భయపడియుండెను. ఇప్పు డాభయము సంపూర్ణముగఁ దొలఁగిపోయెను. వారు చేసికొనినది వితంతూద్వాహము గాక సాధారణవివాహమైనట్లే శేషమ్మ ప్రవర్తించుచుండెను. ఆమె వారిని కులమునకును వంటయింటికిని భ్రాతృప్రేమకును వెలిగాఁ జూడలేదు. ఇఁక నాగభూషణము గారు కూడ వారిపై నిట్టిదయాకిరణములనే ప్రసరింపఁజేసినచో వారు ధన్యులు. కృష్ణరావును హైమవతియు సంతోషముతో నామధ్యా

హ్నిమును గడపివైచిరి.

హైమవతి మునుపటివలెనే శేషమ్మగారికి సాహాయ్యము చేయు సాగెను. ఏవిషయమునందును ఆమె వెలిగా పరిగణింపఁబడలేదు. నాగభూషణముగారి యభిప్రాయము లెట్లుండునో?

సాయంకాలము ఐదుగంటలకు ఆఁకలితో నాగభూషణముగారు ఇంటికి వచ్చిరి. ఆఁకలి గొన్నవానికి కోప మెక్కువగ నుండునను లోకోక్తి ననుసరించి నాగభూషణముగారు వచ్చుటతోడనే హైమను జాగ్రత్తగఁ బ్రవర్తింపుమని చెప్పి తనగదిలోనుండి నాగభూషణముగారు చూడకుండ కృష్ణరావు మెల్లఁగ నవతలకు జారెను.

ఫలాహారము సిద్ధము చేయఁబడెను. హైమవతి కృష్ణునియాజ్ఞానుసారముగఁ శేషమ్మ యనుమతిమీఁద నాగభూషణముగారికిఁ గనఁబడకుండఁ గూర్చుండెను. శేషమ్మ నాగభూషణముగారికి ఫలాహారము నతిశ్రద్ధాభక్తులతో నాయన కెచ్చటలోపమున్నఁ గోపమువచ్చునో యని జాగ్రత్తగఁ బెట్టుచుండెను.

నాగభూషణముగారి యాఁకలి కొంత యుపశమించెను. రెండు మూఁడులోటాలనీళ్లు త్రాగి గట్టిగ తేనిచి "అబ్బాయీ, హైమవతీ ఏరీ, ఎక్కడ కనపడ రేమిటి?" అని అడిగెను.

నాగభూషణముగారి తేనుపునుబట్టి యాఁకలియుపశమించినదని శేషమ్మ తెలిసికొనెను. కాని కృష్ణుఁడెచ్చటికో వెడలినాఁ డనియు హైమ ఇంటనే యున్న దనియుఁ జెప్పఁ[illegible] కూడదా? యని యామె సందేహించెను. భర్త ప్రశ్నకు ప్రత్యుత్తరము నీయక యామె యిట్లనెను. "అబ్బాయి చేసినపనికి మీ రేమనుకుంటారో అని కించపడుతూఉన్నాడు. రాత్రికి మీతోనే గాని భోజనం చెయ్యనని పట్టుపట్టాడు, అతిబలవంతంమీద—



"అబ్బాయి ఇంకా భోంచెయ్యలేదూ? అబ్బాయి తినకుండా నాకు పెట్టావా? హైమవతైనా భోంచేసిందా?" అని గబగబమాటమీఁద మాటగా నాగభూషణముగారు ప్రశ్నించిరి.

"అతిబలవంతంమీద భోంచేశారు. వాళ్లేమన్నా కించపడతారేమో నని ఏవిధమైన మార్పూ చూపించకుండా అంతా మునుపటిలాగే జరిపాను" అని నాగభూషణముగారికి వినఁబడునట్లు శేషమ్మ చెప్పెను.

"చాలా బాగా చేశావు. వాళ్లు చేసిన తప్పేమిటి? లోకంలో ఒక్కొక్కళ్ల దగ్గిరా కావలసినన్ని పాపాలున్నై. వాడు చేసిన గొప్పతప్పేమిటి? వాసవిదానిని చిన్నప్పటినుంచీ మనస్సు పెట్టుకున్నది వితంతు ఎలా అయిందీ?.........అయ్యో, పిచ్చివెధవాడు! నేనేమన్నా అనుకుంటా నని నాకు కనపడకుండా వెళ్లాడూ? ఇంటికి రావడంతోటే నా దగ్గిరకు పంపించు. రాత్రి వాడి కిష్టమైన కూరలూ అవీ చెయ్యి. ఏదీ హైమవతి?" అని మాటమీఁద మాటగా నాగభూషణముగా రనిరి.

హైమవతి మెల్లగ మామగారిదగ్గిరకు వచ్చెను. ఆయన పాదములకు నమస్కరించెను. నాగభూషణముగారి యానందమునకు మేర లేకపోయెను. తనకు వచ్చిన మంచిమాటల నన్నిటిని ఉపయోగించి యామె నాశీర్వదించెను.

రాత్రి [illegible] కృష్ణరా వింటికి వచ్చెను. శేషమ్మ వంటచేయుచుండెను. [illegible]వసారాలోని [illegible] కెమెరుగ హైమవతి కూర్చుండి శేషమ్మతో కబుర్లు చెప్పుచుండెను. కృష్ణరావు మెల్లఁగ నడుగులో నడుగిడుచు లోనఁ బ్రవేశించెను. తండ్రియభిప్రాయమాతని కింకను దెలియలేదు.

కృష్ణరావు వచ్చుచున్నాఁడని హైమవతి శేషమ్మకుఁ జెప్పెను. శేషమ్మ వంటయింటిగుమ్మమువద్దకు వచ్చెను.

"నాన్న వచ్చారా? ఏమన్నారు?" అని కృష్ణరావు మెల్లగ తల్లిని ప్రశ్నించెను.

"చాలా అభినందించారు, హైమను దీవించారు. 'అందరిళ్లల్లోనూ లక్షలొంబై ఉన్నాయి. వాటిఅన్నిటితోను పోలిస్తే ఇదెంత?' అన్నారు" అని శేషమ్మ కొంచెము గట్టిగానే యనెను.

"ఏమిటి? అబ్బాయి వచ్చాడా?" అనుచు నాగభూషణము గారు పరుగెత్తికొనివచ్చిరి.

కృష్ణరావు కొంచెము వెనుకకుఁ దగ్గెను.

నాయనా! నేను పెద్దపులినా, సింహాన్నా. అలా వెనక్కి తగ్గుతావేం? రా.

కృష్ణరావు తండ్రిపాదములకు నమస్కరించెను.

రాత్రి పదిగంట లయ్యెను. అప్పుడొక యౌవనుఁడును యౌవనవతియు నేమియో మాటలాడుకొనుచుండిరి. వారెవ్వరు? ప్రథమ ప్రకరణమున మనము చూచిన బాలుఁడును బాలికయును వీరే. మన [illegible] సుఖములం దింతవఱకును పాల్గొనియుంటిమో, ఎవ్వరిజీవి[illegible]మున నతిముఖ్యములైన రెండువత్సరములు మన కాప్తమిత్రు[illegible] హైమాకృష్ణులే వారు. అప్పటికిని ఇప్పటికిని వారిచర[illegible]నది?

ఆవాత్సల్యములో, ఆ [illegible], [illegible] ప్రపంచమంతయుఁ [illegible]నెను. అప్పుడే మేఘములనడుమనుండి వెలు[illegible] చంద్రుఁడు ప్రపంచమునంతను వెన్నెలమయము చేసివెచె.

# అనుబంధము.

(ఆగంటివారియొక్కయు నితరులయొక్కయు తరువాతి చారిత్రము.)

హైమాకృష్ణులవివాహము జరిగిన రెండునెలలలో వేంకటప్పయ్యగారు మరణించిరి. మరణించుటకు ముందు తనయాస్తినంతను హైమాకృష్ణుల కిచ్చునట్లుగ నాయన వ్రాసియిచ్చెను. సుందరమ్మ బ్రదికియున్నంతకాలమును కృష్ణరావుప్రక్కనుండి భరణమున కర్హురాలై యుండెను.

వీరమ్మకు భర్తయాస్తి ఐదెకరములపరిభూమి యుండెను. ఆ రా[illegible]సుతోడను భరణముతోడను వీరమ్మ సుందరమ్మలు ఏలూరునందే కాపురము చేయుచుండిరి.

కొన్నిమాసములకు సుందరమ్మకును వీరమ్మకును మనస్పర్థలు [illegible] హైమవతియు వేంకటప్పయ్యగారును ఉన్నప్పుడు [illegible] తమశక్తి నుపయోగించిన దుష్టబుద్ధులిప్పుడా శక్తి[illegible] మసల్చుటకును శక్యముగాక నొకరిపై నొకరు మసల్చుకొనిరి. [illegible] శీఘ్రకాలములోనే వీరమ్మమందులపటుత్వమునకు సుంద[illegible] ప్రకరణమునకుఁ గారణమయ్యెను.

వీరమ్మయు కొన్నిదినములు దుష్ప్రవర్తనలందే మునిగి తుదకొ[illegible] రంగూనుకుఁబోయి యచ్చట మరణించెను.

కామేశ్వరరావు కుటుంబముతో రాజమహేంద్రవరమునందు[illegible] యుండెను.

సత్యనారాయణయును సోమయాజులును (కృష్ణరావువలెనే) బి. [illegible] పరీక్షను చెన్నపురిన్యాయశాస్త్రకళాశాలయందు జదువుచుండిరి. [illegible] రామయ్యకుమారుఁడు విద్య నేర్చి బుద్ధిమంతుడై [illegible] చుండిరి.

కథకంచికిఁ బోయినది, మనమింటికి వచ్చితిమి.

తూర్పుదిక్కునుండి చల్లనిసూక్ష్మవాతూలములు వీచ నారంభించెను. సృష్టియంతయు సర్వవరపువారిపేరిమమాధుర్యములో లీనమైపోయెను.

ఆప్రశాంతమగు ప్రకృతిమధ్యమునుండి, ఆధవళకౌముదీ ప్రవాహమునడుమనుండి, ఆనిర్మలవాతూలమాలికలలోనుండి, అప్పుడే తఱచి తీసిన యమృతబిందువులకన్న మధురతరములైన నాలుగుమాటలు వినవచ్చెను.

" బావా! ఇప్పుడైన నన్ను క్షమించితివా?"

సంపూర్ణము.

# ఆంధ్రప్రచారిణీగ్రంథనిలయము,

(1911 వ సంవత్సరములో స్థాపింపఁబడినది.)

## పిఠాపురము.

నవలలు—నవరసభరితములగు నవలలు—పుణ్యచరిత్రములు. 200-250 పుటలకు మించకుండ—రెండుమాసముల కొక్కటిగా వెలువడును.

చందాదారులసౌకర్యముకొఱకై నవలలవెలలు చౌకచేసి పోస్టేజి మేమేభరించి పూర్వపునిబంధన లీక్రిందివిధముగా మార్చినాము.

—◆ నిబంధనలు. ◆—

1. ఇందుఁ జందాదారుగఁ జేరువారు ప్రవేశరుసుముక్రింద ముందుగా 0—4—0 చెల్లింపవలయును.

2. ఇందు రెండేసిమాసములకొక్కటిగ వెలువడుచుండు మంచి రేపరుబైండుగల ప్రతిగ్రంథమును పోస్టేజి మనీఆర్డరు కమీషన్లు మేమేభరించి రు1-0-0కి మాత్రమే చందాదారులకుఁ బంపుచుందుము.

3. చందాదారు లగువారు వెనుకటిగ్రంథములన్నియుఁ గొనవలయునను నియమములేదు. కాని, వారు కోరినచో వెనుకటిపుస్తకములుకూడఁ జందాదారుల వెలలకే పంపుచుందుము. క్రొత్తగ వెలువడుచుండు గ్రంథములు మాత్రము చందాదారులు తప్పక పుచ్చుకొనుచుండవలెను.

4. ఇందుఁ బ్రకటింపఁబడు ననుబంధములు చందాదారులు తప్పక పుచ్చుకొనవలయునను నియమములేదు. కోరినవారికే పంపుచుందుము.

5. సంవత్సరముచందా అనఁగా ముందుప్రకటింపఁబడు అనుబంధపుస్తకములకు రు 5—4—0 లు ముందుగఁ బంపువారికి [illegible] కములవఱకు ప్రతిపుస్తకమును అన్‌రిజిష్టర్డుపార్సిలుగా [illegible]

N. B.—నైజామిలాకా చందాదారులకు మాఏజంటు మహారా[illegible] గౌరీశంకరశర్మగారు నెం 566 రెసిడెన్సీబజారు, [illegible] యొద్ద మా పుస్తకములు దొరకును.

పువ్వులడోలిక! బోధలకేలిక!! పున్నెపుఁదూలిక!!!

# పురాణగ్రంథమాలిక,

## పిఠాపురము.

ఇహపర సాధకంబులగు పురాణములు మొదలగునవి ఆంధ్రవచనశైలిని డెమ్మీసైజున 250 పుటలకు మించని సంపుటములుగ రెండునెలల కొకటి వంతున సంపుటము 1 కి పోస్టేజి మేమే భరించి చందాదారులకు రు 1-0-0 కు మాత్రమే పంపుచుందుము. ప్రవేశరుసుము రు 0-4-0 లు. ఆగస్టు నెలాఖరునాటికి బ్రహ్మపురాణము మొదటి సంపుటము తప్పక వెలువడును.

కోరువారికి శివపురాణము 1, 2, 3, 4 సంపుటములు గూడఁ బంపుదుము. నెల పోస్టేజితో రు 4-0-0 లు మాత్రమే.

చందాదారులు గానివారికి ఇందలి ప్రతిసంపుటమును పోస్టేజి కాక రు 1-8-0 లు.

పురాణగ్రంథమాలిక, పిఠాపురము. } నడకుదుటి వీరరాజు పంతులు: సంపాదకుఁడు.

రాఁబోవునవల.

# రామాశ్రమము.

(చక్కనినవల.)

శ్రీమతి చి. రమణమ్మగారిచే

రచింపఁబడినది.

(నవరసభరితమైన యీనవల అచ్చులోనున్నది.)

ఆంధ్రప్రచారిణీగ్రంథనిలయము,

పిఠాపురము.

